# శ్రీ రామతీర్థ
# వేదాన్త దర్శనము

శ్రీ రామతీర్థ స్వామివారు
పాశ్చాత్యఖండ మందిచ్చిన మహోపన్యాసములు
అను:
శ్రీ కె. సచ్చిదానందమూర్తి, యం. ఏ.
తత్వశాస్త్రోపన్యాసకులు

ప్రచురణ కర్తలు:
శ్రీ రామతీర్థ సేవాశ్రమము
పిడుగురాల (P.O.) గుంటూరు (Dt.)

# "రామతీర్థ జీవితం"



రచయిత: పురాణసింగు మహాశయుడు



పురాణసింగు మహాకవి, పంజాబు జన్మభూమి

జపానులో స్వామిని కలసికొన్నాడు

స్వామి ప్రేమ హృదయానికి

పరవశుడై శిష్యుడైనాడు

ఇంగ్లీషులో 'రామకథ' అనే స్వామి జీవితం

మహా రసావేశంతో రచించాడు

ఇది ఆయన వ్రాసిన ఒక పత్రికా రచనకు

అనువాదం




ఒకప్పుడు విశ్వకల్యాణానికి, సుస్థిర శాంతికి భారతీయులు తమ పవిత్రహృదయాలు విప్పి ప్రార్థనలు చేశారు. అమృత గీతాలు ఆలాపించారు. యుద్ధాలతో, జయాపజయాలతో యోధులు స్వగృహాలకు తిరిగివచ్చినప్పుడు వారికి తాము అమ్ముడుపోయి, తమ ఆత్మలనూ, సర్వశక్తులనూ బలిపెట్టింది, బుద్బుదప్రాయమైన ఐహికసుఖానికన్న విషయం అవగతమైంది. తాము జయించిన ప్రతియుద్ధం తమ "ఓటమి" చిహ్నప్రాయంగా ఉందన్న అంతర్గర్భిత సత్యాన్ని ఆర్య హృదయాలు గుర్తించినవి. అఖండమైన పరిత్యాగదీప్తి, వారిలోని విజయతృష్ణను అదృశ్యంచేసింది. శాంతి ప్రేమలు దశదిశాక్రాంతములై, దేశదేశాలకు పుణ్యక్షేత్ర మైంది భారతవర్షం. ఆ నాటినుంచి, త్యాగమయంగాని ఘట్టాలకు హిందూదేశచరిత్రలో స్థానంలేకుండా పోయింది. భారతదేశంలో ఒకని ఆదర్శోన్నతి వాని భౌతికసామ్రాజ్య విజయాలు చూచిగాని, పాండిత్యప్రకర్షలు చూచిగాని, కులాధిక్యతా విశేషాలు చూచిగాని పరిగణించరు. అతని బ్రహ్మజ్ఞాన ప్రతిభను చూచి, బ్రహ్మవిద్యను చూచి మాత్రమే పరిగణిస్తారు. మానవునిలో మనం చూడవలసింది అతని బాహ్యపరిస్థితులు గాదు – అంతరానుభూతులను చూడవలసి ఉంది. ఆ అంతర్జ్ఞానవునే మనం అర్చించవలసి వుంది.

మహానగంభీరమైన మహర్షుల అంతర్జీవనం బాహ్యానికి గూరస గాహానమైంది. కానీ ఆ మహాత్ముల మందహాసరోచిస్సులలో నుంచి, దయార్ద్రవీక్షణాల్లోనుంచి, ఉదారహృదయంలోనుంచి, ప్రసన్నచిత్తములోనుంచి వారి బ్రహ్మమయ జీవితాలను అర్థంచేసికోవాలి. అలాంటి జీవితాలను అర్థంచేసికోవాలంటే, వారి వాక్యాలు, సందేశాలు, ఆ ప్రసన్నవదన సౌందర్యాన్ని అన్వేషించాలి. శ్రీరామతీర్థస్వామి జీవితము ఆయన అంతః సౌందర్యాన్ని, అభ్యున్నతిని చిత్రిస్తుంది. ఆ మహర్షి జీవితం స్థూలజగత్తు నతిక్రమించి, ప్రశాంతబ్రహ్మజ్ఞానపథము బట్టి ఆత్మ సామ్రాజ్యానికి అనుగమించిన ఒక మహాన మనోపరిణామమే.

రామతీర్థస్వామి జీవితం, అనన్యాకేదారాల్లో శృతిగల్పి విశ్వశాంతి ప్రేమల వర్షిస్తూ సాగిన ఒక జానపదగీతం. ఒక ప్రాచు దివ్యోపనిషన్ముఖమునుండి ఉద్గతమైన గానమే యిది. ఇది క్రొత్తదిగాదు; సనాతనమైందే. కాని రామతీర్థ పరమ హంస తిరిగి ఇంకొకసారి తన హృదయమూలంలోనుంచి వెలికిదీసి ఆ గానమధువును వర్షించాడు. ఆ బ్రహ్మర్షి శ్రేష్ఠుని గాంధర్వగానం వైవిధ్యంలోనుంచి ఏకత్వానికి; విభిన్నతలో నుండి ఏకశృతికి, ఆత్మలోనుంచి పరమాత్మకు మానవ లోకాన్ని తీసుకపోతున్నది. అసూయలోనుంచి ప్రేమపథానికి, యుద్ధమునుంచి శాంతికి రమ్మని మానవులను ఆహ్వానిస్తున్నది. ఆ దివ్యనిలోనుంచి పరమప్రేమ, శాంతి పరవశత్వాలు వాహినులై ప్రవహిస్తున్నవి; ఆ మహర్షికి మానవులందరూ పవిత్రులే. సర్వసృష్టి పవిత్రమైందే. ఆయన అంతర్ముఖుడైన

మహాకవి. "తత్త్వమసీ", "ఏకమేవాద్వితీయంబ్రహ్మ"—అనే ఈ రెండుమంత్రాలనే బంగారు రెక్కలతో, ఈ పరమహంస ఎగిరి ఎగిరి నిత్యనీలాకాశంలో కలిసిపోయింది.

పంజాబు దేశంలో గుజర్వాలాజిల్లాలోని మురళీవాలా గ్రామంలో 1873లో ఒక నిరుపేద బ్రాహ్మణ కుటుంబంలో శ్రీ రామతీర్థస్వామివారు జన్మించారు. ప్రసిద్ధమైన రామాయణ కావ్యాన్ని హిందీలో రచించిన గోస్వామి తులసీదాసు వీరి వంశవృద్ధుడే. వీరి తండ్రి గోస్వామి హీరానందుడు. సరిహద్దురాష్ట్రంలో పెషావరు, స్వాట్ మొదలైన ప్రదేశాలకు యాత్రార్థం వెళ్ళి శిష్యులనుచూచి వస్తూవుండేవాడు. శిష్యులిచ్చే తృణమో, పణమో ఆయన సంపాదన. రాముడు జన్మించిన కొద్దిరోజులకే తల్లి పరమపదించింది. ఆవుపాలతో బాలరాముని పెంచారు. రాము ఎప్పుడూ పాలూ, అన్నం తీసుకొనేవాడు. పాలంటే ఆయనకు పరమప్రేమ. ఒక్కొక్క సారి అయిదుసేర్ల పాలు త్రాగేవాడు.

అయిదోయేట విద్యాభ్యాసం. ఆయన బాల్యమంతా నిరంతర విద్యాకృషిలో గడచిపోయింది. పెద్దపెద్ద తరగతులు చదవ వచ్చేసే నగకల్ల, తగినంత డబ్బులేక తండ్రి సహాయం చెయ్యలేక పోయినాడు. అందుచేత రాముని విద్యార్థిజీవితం కటికి దారిద్ర్యంలో గడిచింది. ఒక చొక్కా, రెండులాగులూ, ఒక చిన్న తలపాగా యివీ ఆయన దుస్తులు. అన్నీ కలిపినా మూడురూపాయలు కావు. కళాశాలలో చదువు కొనే రోజుల్లో, లాంతరుసూనె కని ఒక్కొక్కసారి అన్నం

మానేవాడు. ఎన్నోవారాలకువారాలే పస్తులుండవలసివచ్చేది. ఆయన ఎంత పస్తులున్నప్పటికీ, ఆయన ముఖంలో బాధా విచారాలు లేశమాత్రంకూడా కనిపించేవికావని తోటి విద్యార్థులు చెప్పేవారు. అంత క్లిష్టపరిస్థితుల్లోకూడా ప్రశాంతితో ఓర్పుతో, గంటలు గంటలు చదువుతో, కళాశాలలో కాలం గడిపేవాడు.

తేజోవంతమైన ఆర్యసౌందర్యంతో ఉద్దీపిస్తున్న ప్రసన్నవదనుడు రామతీర్థుడు. నల్లగా విల్లులవలె వంపులు తిరిగిన ఆయన కనుబొమలు, మిలమిల మెఱసే ఆయన తేజోనేత్రాలు, ఆయన గాఢహృదయమును, అపారమైన ఆయన ప్రేమను స్ఫురింపజేస్తుంటవి. ఆ విశాల ఫాలభాగం, గణనీయమైన ఆయన ధీశక్తికి చిహ్నంగా ఉండేది. ఆయన అధరాలు నవకోమల కన్యాధరాలవలె ఉండేవి. తీవ్రంగా ఉన్నప్పుడు బిగించినట్లున్న ఆ పెదవులు, ఆయన అప్రతిహత మనోబలమును జ్ఞాపకానికి తెస్తుండేవి. కళాశాలా దినములలో ఆయన ఇంతటి మహాత్ముడని స్ఫురింపకపోయినా, ఆయన నెఱిగినవారు, ఆయన నిరాడంబర పవిత్రశీలాన్ని గుర్తించినవాండ్లు ఇలాంటి వ్యక్తి మరొకడు లేడని యెంతో ఆశ్చర్యపడేవారు. అమాయక కన్యమాదిరి గుప్తంగా ఉండేవాడు. ప్రేమదీప్తులలో నిరంతరం జీవిస్తున్న ఆ మహనీయుడు సన్నగా అంత పొట్టిగాకుండా, పొడగరికాకుండా, తేజోదేహంతో సౌందర్యమును విరజిమ్ముతుండేవాడు. అజ్ఞాతజీవితం గడుపుతున్న బాలరామునిలో, ఉన్నతాశయాలతో, మహత్తర

లక్ష్యంతో నిరంతర కృషిచేస్తున్న ఇంకొక రాముడున్నాడు. ఆ బ్రాహ్మణ బాలుడు తన అంతఃపవిత్రాశయాలను ఎప్పుడూ వ్యక్తీకరించేవాడు కాడు. కండ్లల్లో తొణికిసలాడే ఆనంద భాష్పాలతో, భక్తునిలో ప్రదీపించే వినమ్రతతో, కన్యకకుండే ముగ్ధత్వంతో, వీరునికుండే విజయ సంకల్పంతో ఈ దివ్య విద్యార్థి అహోరాత్రాలు విద్యాలయంలో కృషిచేస్తున్నాడు. తోటి విద్యార్థు లందరిలో ఈయనే అగ్రగామి. ఈయన విద్యాకృషి అనంతమైంది. రామతీర్థులకున్న వివిధ విషయ సర్వజ్ఞత్వం, సాహిత్య తార్కిక వైదాంతిక విషయ పాండిత్యం అనన్య సామాన్యమైంది. భావ ప్రపంచ మంతటకి ఈయనదే నేతృత్వం.

ఇరవయ్యోయేడు వచ్చేసరికి గణితశాస్త్రంలో ఎం. ఏ పట్టం పొందాడు. తరువాత కళాశాలలో నాలుగు సంవత్సరాలు అధ్యాపకుడుగా, గణితశాస్త్ర ప్రధానాధ్యాపకుడుగా పనిచేశాడు. 1899వ సంవత్సరాంతంలో లాహోరు విడిచిపెట్టి వెళ్ళిన ఒక సంవత్సరానికి, అరణ్యవాసంచేస్తూ రామతీర్థుల వారు సన్యసించారు.

ఇరవై ఆరు సంవత్సరాల స్వల్పకాలంలో మహత్తర విజ్ఞాన సముద్రాన్ని రాముడు ఆపోశించాడు. ప్రతి నిమిషమూ రామునకు ఏదో యొక కానుక చెల్లింపవలసిందే.

విశ్వవిద్యాలయంలో ఉన్నత పరీక్షల్లో ఉత్తీర్ణుడు కావడమే కాకుండా, హాఫీజుమూలానా, రుమీమహార్బీ, ఉమర్

ఖయ్యాం మొదలైన ప్రసిద్ధ పారశీక తాత్త్విక కవులరచన లన్నీ ఆయన జీర్ణించుకున్నాడు. ప్రాచ్య, పశ్చాత్య వైదాంతిక సాహిత్యమంతా ఆయన ఉత్తరించాడు. హిందీ, ఉరుదూ, పంజాబీ కావ్యాల్లోని సౌందర్యాన్ని సంపూర్ణంగా దర్శించాడు.

తీవ్రపరిస్థితులవల్ల, నిరంతర శ్రమలవల్ల తీర్థారాముని ఆరోగ్యం చెడిపోయింది. ఆయన ఎం. ఏ. ప్యాసై వచ్చే వరకల్లా ఎముకలపోగైన ఆయన్ని చూచి ప్రజలు, ఈ ఆస్థి పంజరములో ప్రాణం ఎలా కొట్టుకులాడుతున్నదా అనిఆశ్చర్య పోయేవారు. ఎముకమీద కాస్త కండైనాలేదు. మెడ కొంగ మెడలాగా సాగింది. కంఠం రుద్ధమైంది. సుఖంగా మాట్లాడ లేకపోయేవాడు. అంత బలహీనుడై పోయినాడు. అయితే ఆయన దృఢంగా ఉండాలని, ఆరోగ్యాన్ని అభివృద్ధిచేసుకో వాలని నిశ్చయించుకొన్నాడు. నిత్యం సక్రమవ్యాయామంతో, క్రమాహారతతో ఆరోగ్యంపొందాడు. నూతన వ్యాయామ రీతులనుకూడా కనిపెట్టగలిగాడు. నాటినుంచి ఎన్నడూ వ్యాయామం మానలేదు. ఇంకొక నిమిషానికి శరీర పరిత్యాగంచేస్తాడనగా వ్యాయామం చేశాడుకూడా. ఆ బక్క పలచని మనిషే ఇంతటి మహాత్కార్యాలు, నిరంతరకృషి చేయగలిగాడు. ఆయన అతి తొందరగా నడిచేవాడు. హిమవత్పర్వతాలమీల సన్యాసిగా నున్నప్పుడు రోజుకు నలభై మైళ్ళకు పైగా నడిచేవాడు. ఒకసారి అమెరికాలో వినోదార్థం నలభై మైళ్ళ పందెములో పరుగెత్తి పోటీచేసిన

సై నికులకంటె రెండుగంటలుముందె గమ్యస్థానంజేరి గెలిచాడు. ఒకసారి స్వామి శాన్ ఫ్రాన్సిస్కో వీధిలో చరచర నడచి పోతున్నప్పుడు ఒక అమెరికన్ 'ఈ భూమి తనదే నన్నట్లు నడచిపోతున్నాడే' అని అన్నాడు. 'అవును' అని రామతీర్థుల వారు నవ్వుతూ నడచివెళ్లారు. కౌపీనమాత్ర పరిధానుడై ఒక గొంగడిమాత్రం కప్పుకొని స్వామి గంగోత్రి, యమునోత్రి, బదరీనాధ శిఖరాల నధిరోహించాడు. యమునోత్రి నుంచి గంగోత్రికి హిమవాహినులలో నడచిపోయినాడు. వ్రేళ్ళు కొంకర్లుపోయే మంచుగడ్డల్లో నివసించాడు. చీకటి కొండగుహల్లో నిద్రించాడు. అరణ్యగర్భాల్లో నివసించాడు. ఈ రచయిత ఒకసారి పర్వతవాసులను కలుసుకొన్నప్పుడు వారిలా అన్నారు, "రామతీర్థులవారు నిజంగా దేవుడే. కాక పోతే వర్షాకాలంలో తీవ్రవేగంతో సుళ్ళు తిరుగుతూ ప్రవహించే నదిలోనుంచి మా గొర్రెలను ఎలా దాటించుకొని వచ్చేవారో!"

అర్ధరాత్రులందు స్వామి ఆసనం మీదనుంచి లేచి కాటుకలాంటి చీకటిలో, చొరరాని కీకారణ్యాలలో నిర్భయంగా మృత్యువుతో పోరాడడానికా అన్నట్లు నిర్గమించేవాడు.

చదువుకొనే దినాల్లో ఉపవాసాలవల్ల కృశించి పాలిపోయిన ఆయన సూర్యవదనంలో, భయంకర దుర్గమారణ్యాలనుసైతం అతిక్రమించగలిగిన శౌర్య ధైర్య సాహసాలను లాహోరు ప్రజలు గుర్తించలేకపోయినారు. ఎంతో మేరుధీరుడు స్వామి. ఇప్పటి ఆయనవదనం ఎంతో వికసిం

చింది. సుందరమైంది. దివ్యపారవశ్య మధువుల నాస్వాదించిన ఆ మహర్షి నేత్రా లిప్పుడు అర్ధనిమీలితాలు. ఈ ధైర్యా, ఈ బాహ్యాంతర మహత్తరశక్తితో స్వామి తన జీవితో ద్గ్రంథాన్ని అంటే తన వ్యక్తిత్వాన్ని లోకానికి ప్రసాదించాడు.

రాముని వ్యక్తిత్వం ఒక ప్రచండమైన అగ్నిపర్వతం లాంటిది. కొన్ని నెలలు పర్యంతం ఇంకేమి చెప్పటానికి లేనట్లు మహామౌనంలో మునిగివుండేవాడు. నిరంతరం బ్రహ్మానందమగ్నుడై ఉండేవాడు. హఠాత్తుగా ఒక్కసారి పర్వతం బద్దలైనట్లు, తన దివ్యభావాలను మహాపారవశ్యంలో వ్యక్తంచేసేవాడు. స్వామి ఏది వ్రాసినా, ఏది మాట్లాడినా అది నిత్యనూతనంగా వుంటుంది. ఒక్కొక్క పలుకు అనాఘ్రాతపుష్పంలాంటిది. ఆయన నిరంతర ఏకాంతాభిలాషి. బహిర్జన సంకులతనుంచి విడివడటానికి కాబోలు స్వామి పర్వతాగ్ర విజనభూములకు నిర్గమించేవాడు. జలజలమని నృత్యం చేసే ఆ కొండవాగులనూ, అనంతనీలాకాశమునూ చూస్తూ కొండరాళ్ళమీద సంధ్యారాగంలో పండుకొని నిమీలిత నేత్రుడై, శాంతిమగ్నుడై ఉండేవాడు.

ఆ మహావ్యక్తిలోని ఒక విశిష్టత, అర్ణవమై పొంగే పారవశ్యం, గాఢమైన అప్రమత్తత ఆయన నేత్రపద్మాలలో నుంచి అపారంగా వర్షించేది. స్వామివారి మాధుర్యం అనివార్యమైంది. హిందూ, మహమ్మదీయు లా మహనీయుని సమానంగా ప్రేమించారు. ఏ మతస్థులైనా, ఏ కులస్థులైనా,

ఏ జాతివారైనా రామతీర్థమహర్షిని ఆత్మబాంధవునిగా చూచుకొనేవారు. అమెరికా వాం డ్లాయనను అమెరికాదేశీయుడన్నారు. జపానువారు జపానీయు డన్నారు. పారశీకులు మావాడే నన్నారు.

రాముని దర్శించడమంటే నూత్నాదర్శాలతో, నూత్న దర్శనాలతో, నూత్నశక్తులతో, నవనవోద్వేగాలతో చెలరేగిన పరవశానందానుభూతి పొందడమే.

ఆయన మనోజ్ఞ సందర్శనంలో ఉన్న ఇంకొక గొప్ప విషయం గంభీరమైన భావనాస్వాతంత్ర్యం. ఆయనది మహోన్నతమైనధీశక్తి. స్వామి ఏదిచెప్పినా ఊహించిచెప్పడు. ప్రతి వాక్యం ఆయన జీవితానుభవంలోనుంచి వస్తుంది; అనుష్ఠాన మతాన్ని తాను విశ్వసించానని ఆయన తరచుగా ప్రవచించాడు. స్వామి దృక్పథంలో, జీవనకళ ఉజ్జ్వలవిశ్వాసానికి ఉన్నది. బాహ్యమతానికి, అప్రమత్తుడైన మానవుని అంతరంగిక మతానికి సంబంధంలేదు. నీవు సజీవమానవుడ వైతే, నీ జీవితాన్ని సత్యానికి అంకితంచేసి పరిశోధించు! ప్రతివ్యక్తి తన జయాపజయాలద్వారా, తన జీవితానుభూతులద్వారా, మాత్రమే దైవసాన్నిధ్యం పొందవలసి ఉన్నది. జీవితమే సర్వోత్కృష్టమైన నిరూపణము.

రెండు సంవత్సరాలు హిమవత్పర్వతాల్లో గడిపి, స్వామి తనలోతాను కనుగొన్న బ్రహ్మానందాన్ని ప్రపంచానికి పంచిపెట్టాలనే దివ్యాశయంతో, ప్రజ్వల ఆచార్యసామ

ర్థ్యంతో ప్రజలసుధ్యకు వచ్చాడు. 1903 లో కలకత్తానుంచి జపానుకు ఓడలో ప్రయాణం చేశాడు. అక్కడ స్వామి ఒక పక్షంమాత్రం ఉన్నాడు. రెండుసార్లు అక్కడ ఉపన్యాసం ఇమ్మని ప్రార్థించారు. టోకియోలోని ఒక క్రైస్తవ పత్రిక రామతీర్థస్వామివారిని ప్రశంసిస్తూ, "పరవశ వేదాంత ప్రవక్త" అని పేర్కొన్నది. ఈ రచయితను, జపాను విశ్వవిద్యాలయం లోని ప్రాచ్యవేదాన్త సంస్కృతాధ్యాపకుడైన 'తాగకుత్స' మహాశయుడు కలుసుకున్నాడు. ఆయన తాను అనేక భారతీయ సాధుపుంగవులను, పండితులను ఇంగ్లండులో మాక్సు ముల్లర్ వద్ద – జర్మనీలో చూచినప్పటికీ, రామతీర్థస్వామివంటి మరొక వ్యక్తిని చూడలేదన్నాడు. ఆయన మూర్తీభవించిన వేదాన్తమే. టోకియోలో ఆచార్యుడు, బౌద్ధవాఙ్మయనిష్ణాత 'కంజహిరే' ఒకసారి ఇలా చెప్పాడు.

"భారతదేశ చరిత్రలో బౌద్ధవాఙ్మయాన్ని గురించి సింహళ, జపాను గ్రంథాలలో నేను చదివిన వర్ణనలన్నీ శ్రీరామతీర్థులను సందర్శించినప్పుడు కండ్లకు కట్టినట్లున్నవి."

రామతీర్థులవారు జపానువిడచి, అమెరికా వెళ్ళినప్పటికి ఆనందపరవశోద్విగ్నమైన రామతీర్థ స్వరూపం హిరే మహాశయుని దృష్టిలోనుంచి పోలేదు. 1903 నవంబరులో రామతీర్థులు జపానువిడిచి శాన్‌ఫ్రాన్సిస్‌కోకు వెళ్లారు. అమెరికాలో రెండు సంవత్సరాలున్నారు. ఆ రెండు సంవత్సరాల్లోనూ, చాలాకాలం ఏకాంతంలో ఉన్నారు. ఎంతో నిరాడంబరంగా జీవించేవారు. అమెరికాలో అడవినుంచి స్వయంగా కట్టెలు

గొట్టుకొని నెత్తినబెట్టుకొని తెచ్చుకొనేవారు. అక్కడ అమెరికను పత్రికలలో స్వామి దివ్యోపన్యాసాలను అభినందిస్తూ వ్రాసిన రచనలుచూచి వాటిని నిర్లక్ష్యంచేవారు. ఒకసారి ఆ అభినందన పత్రికలన్నీ కట్టకట్టి శాక్రమెంటో నదిలో విసరి పారవేశాడు స్వామి. ఆ మహాత్ముని అమెరికా జనులు ఏనాటికి మరచిపోరు. స్థలాభావంవల్ల శ్రీ స్వామివారి అమెరికా జీవితాన్ని సంపూర్ణంగా వర్ణించడంలేదు.

భారతదేశానికి తిరిగివస్తూ ఈజిప్టులో ఒక పెద్ద మశీదు వద్ద పర్షియను భాషలో మహమ్మదీయులకు ప్రత్యేకంగా ఉపన్యసించారు

మాతృదేశానికి తిరిగి రాగానే 1905 లో ఆ మహర్షి రెండు లక్ష్యాలు పెట్టుకొని వచ్చాడు. ఒకటి జీవిత విధానాలన్నింటిలో నిర్మాణాత్మకంగా కృషిచేయడం; రెండు ఐక్యకార్యాచరణ. వారిసంయుక్త రాష్ట్ర ఉపన్యాసాలన్నిటిలో ఈ ఆదర్శాన్నే ఉద్ఘాటించారు.

1906 అక్టోబరు దీపావళి పుణ్యదినంనాడు స్నానం చేస్తూ, పొంగులుపారుతూ వున్న గంగానదిలో మునిగిపోయినారు; వారు వ్రాసిన చరమగీతం ఉరుదుభాషలో ఉంది. అది ఇలా ఉంది:

"ఓ మృత్యుదేవతా! కావలెనేని
తీసుకపొమ్ము యీ దేహంబు నీవు,
ఎన్నియో దేహముల్ కలవు నే దాల్ప.

చంద్రుఁడు నేసిన నెన్నెన వలువ
లానందముగ దాల్చి విహరింతు నేను
సూర్యు డొసంగు కాషాయవస్త్రముల
కట్టి మహాహ్లాదమయతతో నుందు
జలజల బారెడి సెలయేటి రొదల
నే గాన మొనరింతు గళము పైకెత్తి
వీచికాహస్తముల్ పైకెత్తి ఆడు
వనధిలో నే నహా తాండవించెదను
స్వేచ్ఛగా మారుతంబుల విహరింతు
ఇవి యెల్ల నేను ధరించు రూపములె
ఉన్నత శిఖరాగ్రభాగాల నుంచి
క్రిందికి ప్రేమతో దిగివచ్చినాడ
మీ కవాటద్వారముల దట్టినాడ
గాఢ సుషుప్తిలోనుంచి మిమ్ములను
మేలుకొల్పితి నిద్ర కంపించిపోవ
ఒకరి నోదార్చితి, ఒకరి కన్నీళ్లు
చల్లని చేతులతో నొత్తినాడ
చలిలోన గడగడలాడు వారలకు
హాయిగా ధరియింప వస్త్రమ్ము లిత్తు
కొందరి ముసుగుల తీసివేసెదను
సర్వంబు ధరియింతు, భరియింతు నేను.

తెలవిదే! తెలవిదే! నా కేమివలదు.
నే నేది దాచుకో నిసుమంతయైన
నే నెవ్వరికి గోచరింప, న న్నెవరు
తెలుసుకోలేరిదే తెల వింక తెలవు!"

స్వామి తన నిర్గమనాన్ని యీవిధంగా ఊహించారు. గంగానది ముప్పైఏమూడేండ్లయినా నిండని యీ మహాప్రభా సంపన్నుని తన గర్భంలో దాచుకున్నది. శ్రీవారు రచింప దలచుకున్న 'వేద సారస్వత సౌందర్యం' 'మనోగతులు' అనే ఉద్గ్రంథాలు రెండూ వారి హృదయపేటికలో గుప్తపడిన రెండు రత్నాలు.

---

ఓం

# శ్రీ రామతీర్థ సంపూర్ణ వేదాంత సారస్వతము

## ఆధ్యాత్మ భౌతికవాదముల సమన్వయము

(గోల్డెన్ గేట్ హాల్‌లో 1903 జనవరి 13 వ తేదీన చెప్పబడిన ఉపన్యాసం)

నేటి ప్రసంగవిషయము ఎంతయో కఠినమైనది, ఎంతయో గహనమైనది. తత్త్వశాస్త్రముతో కొంచెము పరిచయ మున్నవారుమాత్రమే దానిని పూర్తిగ అర్థము చేసికొనగలేదరు. మీ రందఱు వినుటకు కష్టముగ పోయినను, లేక ప్రపంచమంతయుకూడ వినుటకొచ్చినను రాముని కొకటియే. నలుగురిచేత మంచి అనిపించుకోవలె ననుకోరిక కతీతమైనది సత్యము. ప్రజలకు తెలిసినను, తెలియకపోయినను, అందరికి అర్థమైనను కాకపోయినను, అనివార్యములైన నియమములు కొన్ని ఈ ప్రపంచమును నడిపించుచుండెను, నడిపించుచున్నవి, నడిపించగలవు. ఐజాక్ న్యూటన్ కనుగొనక ముందు కూడ గురుత్వాకర్షణ సూత్రము (Law of Gravitation) గురుత్వాకర్షణ సూత్రమేకదా! నరులు కనుగొనని సూత్రములుకూడ కొన్ని యున్నవి. అవికూడ ప్రపంచమును నడిపించుచునే యున్నవి. అద్భుతమైన రత్న మొకటి గనిలో పడియుండవచ్చును. దాని నెవరు పోయిచూచి తీసికొనక పోవచ్చును; అయినను రత్నము వైభవోపేతముగ ప్రకా

శించుచునే యుండునుగదా! ప్రజలు దాని నేరుకొని తలపై పెట్టుకొన్నను, దానివంక చూడకపోయినప్పటికిని రత్నమున కొకటియు.

విషయము కష్టమైనదికాని, శ్రద్ధతో వినిన మీకర్థమగును. తత్త్వశాస్త్రసంబంధములైన, గహనములైన ఊహా సంబంధములైన విషయములనుగూర్చి మాటలాడుటవలన ప్రయోజనమేమున్నది? మీరు కావలసినదడుగవచ్చు. ఇహలోకమునను సంబంధించినది అని మీరనుగనక్కరలేదు. ఏ విషయము కూడ సరైన సూత్రము లేనిదే బోధపరచుకొనలేము; మీరు చేయుపని యంతయు » కర్మగా పరిణమించిన మీ శక్తియే యని మీరు తెలుసుకదా! మీరేమైన వ్రాయవలెనని కొనినప్పుడు మీ కలము సాగుటకు ముందుగా విషయమంతయు మీ మనస్సున సూత్రరూపముగా స్ఫురించవలెనుగదా! కార్యమునకు ముందెప్పుడు ఆలోచన అవసరము. మీరే చోటికైన పోవలసినపుడు, అలవాటుచొప్పున నడిచెదరు. కాని మీ కండరములను కదలికను పురిగొల్పుటకు ఆలోచన లేనిదే అడుగువేయలేరు. మనస్సులో ముందుగా విశ్వవిద్యాలయమనిన నేమో, అచట ఎటువంటిశిక్షణ ఈయబడునో తెలిసికోకుండా ఏ విద్యార్థియు కళాశాలకుపోడు. ఒక పొరుగింటివాని సిరిసంపదలనుగూర్చి తరచు వినుచుండిన యొక దొంగకు తాను వినిన ఆ వినికిడి దానిని గూర్చిన తరచు ఆలోచన క్రియారూపముగా పరిణమించును. ఆపై దొంగ

» Energy transformed into activity.

ధైర్యము తెచ్చుకొని ఆ భాగ్యవంతుని ఇంటికి కన్నము వేయును. ఏదోయొక విధమైన మానసికాలోచన లేనిదే చేయవలసియున్న పనినిగూర్చి యెంతయో ఒకింత తెలియనిదే ఏ పనియు చేయ లేము.

అందుచే రాముడు మీ చెవులలోపలే, హృదయముల లోనికి దిగునట్లు మీ ఆత్మ యొక్క * దివ్యత్వమును గూర్చి చెప్ప ప్రయత్నించుచున్నాడు. ఈ జ్ఞానము దినదినము మీ హృదయములలోనికి దిగనిండు. గంటగంటకు దీనిని మీ మనస్సులలోనికి [illegible]. అటుల చేసిన శాస్త్రీయ సిద్ధాంతము ప్రకారము కేవలము ఊహారూపముగనున్న ఈ మానసికశక్తి మీలో ఎంతో చక్కని కార్యరూపముగ మారును. ఈ జ్ఞానము మీలో సంతోషముగను, ఆనందముగను పరిణమించును.

వేదాంతమందు ఆదర్శ యథార్థవాదముల సమన్వయము - అనునది నేటి ప్రసంగ విషయము. అనగా వేదాంతమందు ప్రత్యక్ష ప్రమాణము అనునది తత్త్వశాస్త్రజ్ఞులకు ముఖ్యమగు విషయము.

ఆదర్శయథార్థవాదము లనిన నేమో మీకు కొంచెము చెప్పవలసియున్నది. లోతుగా ఈ విషయముల చర్చించుటకు మనకు వ్యవధి చాలదు. విశ్వము మనకు ప్రత్యక్షమగుచున్న

* Divinity of the Self.

టుల కేవలము [1] జగత్తు (ప్రపంచము) - అను వాదమును లేక విశ్వాసమును యథార్థవాద మందురు. ఆదర్శవాద ప్రకారము విశ్వముయొక్క వాస్తవిక స్వరూపము మనకు కన పడుచున్న చందమున లేదు, విశ్వమున్నది. కాని, మనకు కన్పడునదే విశ్వము కాదు. యథార్థవాదుల అభిప్రాయము ప్రకారము వస్తుజాలమంతయు మనకు కనపడినవి కనపడినట్లే వాస్తవము. ఆదర్శవాదమందు అంతశ్శాఖ లెన్నో యున్నవి. బార్క్లే ఫిక్టేలు ప్రవచించిన [2] మానసికాదర్శవాద మున్నది; ప్లేటో కాంట్ల [3] యథార్థాదర్శవాదమున్నది; హెగెల్ షెల్లీల [4] నిర్విశేష ఆదర్శవాదమున్నది, ఇట్లే ఇంకెన్నో యున్నవి. బెయిన్ మిల్ మొదలగు తత్త్వశాస్త్రజ్ఞులు ఎంతోమంది యథార్థవాదులు. యథార్థాదర్శవాదముల ఈ అంతశ్శాఖలను ఇప్పుడు పరిశీలించము. బార్క్లేయొక్క మానసికాదర్శవాద మునుగాని, ప్లేటో కాంట్ల యథార్థాదర్శవాదమునుగాని, హెగెల్ షెల్లీల నిర్విశేష ఆదర్శవాదమునుగాని నేటిరాత్రి విమర్శింపము. ఈ విషయమునుగూర్చిన వైదాంతిక వాదము అర్థమగుటకు కావలసినంతవరకే ఈనావాదములను గూర్చి ఉటంకింతుము.

విషయములోనికి దిగుటకు ముందు "ద్రష్ట", "దృశ్యము" అను రెండు మాటలను బోధపఱచుకోవలెను.

---

1 జగత్తు = చలించునది. ప్రపంచము = కల్లది. (phenomenon)

3 Subjective Idealism. 2 Absolute Idealism.

4 Objective Idealism.

ద్రష్టయనగా తెలిసికొనువాడు, దృశ్యమనగా తెలిసికొనబడు నది. నీవీ పెన్సిల్‌ను చూచునప్పుడు పెన్సిల్ దృశ్యము, చూచునట్టి నీవు ద్రష్టవు. చూచునది (గ్రహించునది) ద్రష్ట చూడబడునది (గ్రహింపబడునది) దృశ్యము! మామూలుగా చూచినది లేక గ్రహించునది మనస్సు లేక బుద్ధి అనుకొనె దము కాని వేదాంతమందు ఈ తెలివిని, బుద్ధిని, మనస్సును కూడ ద్రష్టయనరాదు; అదియు దృశ్యమే. గ్రహింపబడుటకు సాధ్యమైనదెల్ల దృశ్యమే అగు నని నీకు తెలుసుకదా! నీవు మనస్సున్నదని గ్రహింపగలెదవుకదా! దానినిగూర్చి ఆలో చింపగల్గుచున్నావుకదా; విచారింపగల్గుచున్నావుగదా; దానికి సంబంధించిన సూత్రములను కనుగొనగల్గుచున్నావుకదా! ఎంతవఱకు నీవు మనస్సునుగూర్చి విచారింపగల్గుచున్నావో, దానిని గ్రహింపగల్గుచున్నావో అంతదనుక అది దృశ్యమే - ద్రష్టకాదు. నిజమైన ద్రష్టను చూచుటకు వీలులేదు. గ్రహిం చుటకుకూడ వలనుపడదు. ద్రష్టను దర్శించున దెవరు? ద్రష్ట తెలిసికొనబడునదో, తెలిసికొనునదో కావలె నని నీకు తెలుసుకదా! కాబట్టి యే క్షణమున ద్రష్ట తెలిసికొనబడు చున్నదో, ఆ క్షణముననే అది ద్రష్ట యగుట మాని దృశ్య మగుచున్నది. కాని మామూలుపరిభాషలో చూచునది లేక గ్రహించునది యనగా బుద్ధి యనియో, మనస్సు అనియో, తల తుము. వేదాంతము ప్రకారము నిజమైన ద్రష్ట సమస్తశరీ రములందు ఉన్నటువంటి ఒకే ఆత్మ, ఒకే అనంతము **(Infinity)**. ఇంగ్లీషులో ఆత్మను శోపెన్‌హార్ నుడివిన

'ఇచ్ఛ' (Will) అనవచ్చును. లేదా హెగెలు చెప్పిన నిర్విశేష మనస్తత్వ (Absolute inntellect) మనవచ్చును. హెగెల్ శోపెన్ హవర్‌లు, పరస్పరభిన్న వాదముల నవలంబించినవారని మీకు తెలుసుకదా! శోపెన్ హవర్ అనిన నిర్విశేష ఇచ్ఛయే హెగెల్ వర్ణించిన నిర్విశేష మనస్తత్వమని వేదాంతము చెప్పుచున్నది. ఈ నిర్విశేషమగు ఆత్మనే (Absolute self) మేము బ్రహ్మము అందుము. బ్రహ్మమనగా నిర్విశేష ఇచ్ఛాశక్తి, నిర్విశేషమగు మనస్తత్వము, నిర్విశేషమగు సత్త, నిర్విశేషమగు ఆనందము.

కాన ఆత్మయే నిజమైనద్రష్ట. కాని వ్యావహారిక భాష యందు మనస్సులోను, బుద్ధిలోను ప్రకాశించు ఆత్మయే ద్రష్ట కాన అంతఃకరణావభాసితమైన ఆత్మయే ద్రష్ట.

యథార్థవాదులు చూపు ప్రమాణము లెయ్యవి? ఆదర్శవాదులు చెప్పు బలమైన కారణము లేవి? ఇది పెద్దవిషయము. మనము క్లుప్తముగా దానిని విచారించెదము. మీ బార్క్లేను విమర్శించుటకు మాకు వ్యవధిలేదు. బార్క్లే ఆదర్శవాదులలో ముఖ్యుడు. తత్త్వవివేచనయందు దాతడు అసమాన్యతీవ్రతను చూపించుచు వేదాంతములతో నైకమత్యమున్నంతసేపు ఎంతో పైకిపోయి విహరించి, వేదాంతమునకు భిన్నమతుడగునంతనే, ఒక్కపరి దారి తెన్నులేని ముళ్ళలో పడినాడు. అదంతయు ఆకర్షణీయమైన సమాలోచన. విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుల ముందటో, విద్యార్థులముందటో అవకాశము చిక్కినేని రాము డా విషయమును ప్రస్తావించును.

ఆతని తత్త్వవివేచనలోని ప్రథమభాగము అంతిమభాగమునకు ఎంతటి వ్యత్యాసము! ఎన్నియో ప్రత్యగాత్మ (Spirits) లున్నవని ఏమి, విశ్వము ననుశాసించుటకు సాకారుడగు దైవము ఉన్నాడని ఏమి, ప్రత్యాగాత్మ మొక్కటి ప్రక్కనే లేకుండ ఏవస్తువయు లోకమునందుండజాలదని ఏమి ఇట్లెన్నియో వెర్రుల నాతడు తెచ్చిపెట్టికొనినాడు. ఆ విషయములోనికి మనము నేటిరాత్రి పోవలదు. ఆదర్శవాదులు చూపు ప్రమాణములందు క్రింది రెండుమూడు అతిముఖ్యములు. మొదటిది నీ వ్యాపారములేనిదే (Without your activity) నీ వే వస్తువును చూడజాలవు. ఈ లోకమందలి ఏ వస్తువునైన నీవు చూచునట్లో, అనుభవించునట్లో (Sense) చేయునది ద్రష్టయొక్క వ్యాపారమే. నీ వేదో వ్రాయుచున్నా వనుకొనుము; నీ మనస్సు కలములోడనే సంలగ్నమైయుండును; నీ ముందుగా అప్పుడొక పాము పోయినదనుకొనుము; నీకు పాము కనపడదు. నీకు పాము పాముకాదు, నీకు పాములేదు. ఇక ఆదర్శవాదులనునదేమన, నీ మనోవ్యాపారము లేదేని - అనగా ద్రష్టయొక్క వ్యాపారము లేదేని - అచట దృశ్యముకూడా లేదు. నీవు నిదురించునప్పుడు ద్రష్ట వ్యాపార రహితుడు; అప్పట్టున చుట్టూ చేయబడు ధ్వను లేవియు వినరావు. కొన్నిసారులు కొందరు మనుష్యులు నిదురించునప్పుడు కండ్లను మూసికోరు; కాక కొందరి కండ్లు నిదురపోవునపుడుకూడా మూతపడవు. అట్టివారి కండ్లయెదుట వస్తువులన్నియు ఉన్నవికదా! వస్తువుల కాంతి వారి కండ్ల పాపలపై పడుచునే యుండునుకదా! అయి

నను వా రావస్తువుల జూడరు, నీ మనస్సు వ్యాపారరహిత ముగ నున్నది. ద్రష్ట తన వ్యాపారమును తాను చేయుటలేదు. అందుచే నీవు వస్తువులను చూచుటలేదు అని ఆదర్శవాదులు అందురు. మనోవ్యాపారములేనిదే, నీ వే వస్తువునైన ఈలోక మందు చూడగలవా ? లేదు. ఈ మనో వ్యాపారము లేకుండ ఈ బల్లనో, ఆ గోడనో చూచుటకు ప్రయత్నించుము. లేదా రాముని మాటలు విని యత్నించుము. లేక మరేదైన చూడ ప్రయత్నింపుము. నీ వది చేయగల్గుదువా ? నీ వేదైనా భావన లేకుండ, నీ మనస్సు యోచించకుండ చూడగల్గెదవా ? నీ కది అసాధ్యము. అందుచే ఆదర్శవాదు లనునదియే మన - ఈ ప్రపంచమంతయు ఒక భావమే (Thought). ఈ లోక మంతయు నీ మనోభావముయొక్క పొడిగింపే (Projection). ఈ ప్రపంచమున్నదని నీ కెట్లెఱుక ? నీఇంద్రియములద్వారా. కాని, ఇంద్రియములు వాటంతటఅవి చూడగల్గునా. *మనస్సు ఇంద్రియములతో సంబంధిత మైనప్పుడే ఇంద్రియములు చూడ గల్గునది. అనగా ఇంద్రియము లసలు చూడవన్నమాట. మనస్సే ఇంద్రియములద్వారా చూచునన్నమాట. ఈ మనస్సు లేక బుద్ధియే ద్రష్ట అని జ్ఞాపకముంచుకొనుడు. మనోవ్యాపారము లేనిదే నీ వేదియు వినలేవు; చూడలేవు. చేయలేవు. మనో వ్యాపారము లేనిదే నీ వేదియు అనుభవించలేవు. అందుచేత ఆదర్శవాదు లనునదేమన, ఓ జనులారా ! మీ ప్రపంచమును

---

* వైదాంతిక పరిభాషలో "అంతఃకరణము" అనుమాటను దీనికి మారు ఉపయోగింతురు.

సత్యమనుచు, ఇందలి వస్తువులను వాస్తవ మనుకొనుచున్నారు. మిమ్ములను మీరు మరచిపోవద్దు, పొరపాటు పడవద్దు. ఈ వస్తువుల నన్నిటిని సృష్టించినది మీరే. మీ ఆలోచనలే ఇటుల పొడగింపబడినవి (Projected). ఇటుల ఘనీభవించినవి. మీరే ఈ వస్తువులను చేయునది." ఇది ఆదర్శవాదులు చెప్పునది. ఆదర్శవాదులు వేదాంతులను పోలియుండునట్లు కనపడెదరు. కాని రాముడుచెప్పిన దేమన బార్క్‌లే, ప్లేటో, హెగెల్, కాంట్, ఫిక్టె, షెల్లి, శోపెన్ హార్ మున్నగుఆదర్శవాదు లందరియందు వేదాంత సూత్రము (Principals) లున్నవి. కాని ప్రత్యక్షప్రమాణమునుగూర్చిన వేదాంతము యొక్క అభిప్రాయము ఈ వాదములన్నిటికంటె భిన్న. ఈ తాత్త్వికు లందరికి పారస్పరికవిభేదములు, వ్యత్యాసములు ఉన్నవి. కాని వేదాంతము వీరినందరిని సమన్వయము చేయుచున్నది. వీరందరు దేహస్థ(ఆత్మనే(ప్రత్యగాత్మనే)-(Subjective self) సర్వస్వముగ నెంచి దానిని ఎంతగానో ఎక్కువజేసికొనెదరు. వేదాంత మటుల జేయదు. సత్యమును మనము ఉన్నంతవటుకే గ్రహించవలెను.

జనులు సత్యమనుకొను ప్రపంచమును కల్లయనుటకు ఆదర్శవాదులు చూపు మరొక కారణ మేమన: ప్రపంచం ఉన్నటుల మనకు ఇంద్రియములద్వారా గోచరించు చున్నది. వాస్తవముగా ప్రపంచము సత్యమని చెప్పుటకు మనఇంద్రియములే ఆధారము. ఇంద్రియములు సరియగు సాక్ష్యము నీయలేవు. అవి నమ్మదగు సాధనములు కావు. ఉదాహరణకు

కంటిని తీసికొనును. చీమకండ్లకు ఒకవిధముగా కన్పడు వస్తువు, మనుష్యునికంటికి మరొకవిధముగా కన్పడును. మనిషి కంటికి కనబడిన దానికంటె ఎంతోపెద్దవిగా వస్తువులు ఏనుగ కంటికి కన్పడును. కప్పకండ్లకు నీటిలోని వస్తువులు తేటగా కన్పడును. గాలిలో చూచినప్పుడు మసకగాను, పొగకప్పి నట్లుగను కన్పబడును చీమ కన్నులా, మనుష్యుని కన్నులా– ఎవరి కన్నులు మన వాదన కాధారములు? ఎక్కువ మందికి కన్పడు విధమే సరైనదయినచో, చీమలు తక్కువ లేవే, అవే ఎక్కువి ఉన్నవే. సూక్ష్మదర్శినిని నిర్మించు విధానముగ నీ కన్ను చేయబడు నేని, పాపకు గుడ్డుకు ఉండు సంబంధమును మరొకవిధమున పెట్టితిమేని, ప్రపంచము పూర్తిగా మరొక విధముగా నుండును. దూరదర్శినిని నిర్మించు విధానమున కన్ను నిర్మించబడెనేని, ప్రపంచము ఇంకొక విధముగా నుండును. ఉబ్బెత్తుగానుండు రెండు చిన్నఅద్దములు (Convex glasses) తో చేయబడిన ఒక ఆటవస్తువును మీరెరిగి యుండవచ్చును. దానిలో నుండి చూచితిమేని, ప్రపంచములోని వస్తువులన్నియు విపరీతముగను, అసహ్యముగను కన్పడును. ఎంతో సుందర ముగా నుండు ముఖము దానిలోనుండి చూచిన కోలగాకన్పడి గడ్డము నేల కంటునట్లును, తల చుక్కలను తాకు నట్లును కన్పడును. దానిలోనుండి వేరొకమూలగా చూచిన ముఖము పొడుగు అల్లే యుండునుగాని, ఒక చెవి తూర్పు ఇండియాను తాకునట్లును, మరొక చెవి చైనాను తాకుచున్నట్లును కన్ప డును. మన కండ్లనే గనుక ఆ సూత్రముపై నిర్మాణముజేసితి

మేని, ప్రపంచ మంతయు మారిపోవును. చెవులు తదితర జ్ఞానేంద్రియముల స్థితియు నంతే. నరములు, కండరములు కూడ మరొకతీరున అమర్చబడె నేని, ప్రపంచ మంతయు మరొక విధముగ నగును. ప్రపంచమంతయు మారిపోవును. అప్పుడు నీ నిక నరములు, కండరములు, జ్ఞానేంద్రియములు ఆ మాదిరిగానే యుండవలెనని యందువు. అటుల మాత్రము కాదు; ఉత్క్రాంతివాదము (The law of evolution) ఇవి యన్నియు క్రమికపరిణామము చెందుచున్న వని యనును. ఇటుల ఆదర్శవాదులనునదేమన మనకు కన్పడు ప్రపంచము సత్యముకాదు. ఈ కన్పడునది (As it appears) అలీకము. మనకు కన్పడుచున్నటు లున్న ప్రపంచము అవాస్తవికము, స్వప్నతుల్యము, ఎండమావి.

ఇటుల వారి కెన్నో ప్రమాణములు గలవు. వాని వివరములలోనికి పోతిమేని ఎన్నోరాత్రులు ఆదర్శవాదమునుగూర్చే ముచ్చటించవలసి వచ్చును.

ఇక యథార్థవాదమున కొత్తము. యథార్థవాదులనునదేమన "ఓ ఆదర్శవాదులారా! మీరు చెప్పునదంతయు సాంతము తప్పు. మనము చూచునదంతయు మన »తలపోతలు చేసిన సృష్టియే యని మీరు చెప్పునది నిజమాయనేని ఏదీ? ఈ గోడ ఉన్నచోట ఒక గుర్రమును సృష్టించుము! ఆ గోడ గుర్రముగా కన్పడనిండు. ఓ ఆదర్శవాదులారా! ప్రపంచ

» Imagination A' small Subject.

తయు *చిన్నద్రష్ట (ప్రత్యగాత్మ లేక జీవాత్మ) యొక్క మాన
సిక సృష్టియే అయ్యోనేని, ఏదీ ఈ జేబుగుడ్డను సింహాముగా
మార్చుము. లేదా ఈ పెన్సిల్‌ను పెద్దయిల్లుగా చేయుము."
యథార్థవాదు లిట్లందురు: "ఓ ఆదర్శవాదులారా! మీరు చెప్పు
నది నిజము కాజాలదు; ప్రపంచము సత్యమే. గోడ గోడే.
ఆ కారణముచేతనే నీ యింద్రియముల కది గోడగా కానవచ్చు
చున్నది. నీవు కేపైనను అది గుఱ్ఱముగా కానరాదు."

యథార్థవాదుల ఈ వాదనలకు ఆదర్శవాదుల ప్రత్యుత్త
రము లున్నవి. కాని ఈ సమస్యల నన్నిటిని ఇక ఇప్పుడు
మనము వివేచింపవద్దు. కాలము జరుగునేగాని, ఏ భావనచే
నీ వేమైనను సృష్టిచేయగలవని ఆదర్శవాదు లందురు. నీవు
*భూతములను (Spirits)గూర్చి తలంచుట ప్రారంభించినంతనే
భూతములు కనుపడును. దేనినిగూర్చిగాని ఊహించుట ప్రారం
భించగానే, ఆ ఊహాలు మనకు పొడచూపును. స్వప్నము
లందు మనము వస్తువులను సృష్టించుటలేదా ? యని వా రం
దురు. మన తలపులు ఈ వస్తువుల అనుభూతిని పొందుచున్నవి.
ఇటుల వారి సమాధానము లున్నవి. వీరి సమాధానములపై
యథార్థవాదుల సంశయము లున్నవి. ఈ ప్రశ్నోత్తరముల
వివరములలోకి మనము పోవద్దు.

వేదాంతముగూడ ప్రపంచమును నాభావము, నాసృష్టి
అనును. కాని వేదాంతము ప్రపంచమును నా భావము నా

---

* భూ = To be

సృష్టిగా చూచినప్పటికి వేదాంతమును ఆదర్శవాద మనుటకు వీలులేదు. రాముని నోటిలోనుండి ఇది వినవచ్చినంగులకు మీా కాశ్చర్యము కలుగవచ్చును. ఈ అభిప్రాయము పునశ్చరణ చేయబడును. యూరప్ అమెరికాలలోని జనులు వేదాంతము ఒక విధమగు ఆదర్శవాదమని తలతురు. రాముని చేతిలో బడిన యూరోపియన్లు వ్రాసిన పుస్తకములన్నియు వేదాంతమును ఆదర్శవాదముగానే చిత్రించినవి. కాని వీరందరు వేదాంతము సర్థము చేసికోలేదని రాముడు మీాకు చెప్పుచున్నాడు. బార్క్లే, ప్లేటోల వాదములనుగూర్చి ఏ అర్థముతో మనము ఆదర్శవాదమను శబ్దము నుపయోగించుచున్నామో, ఆ అర్థముతో మనము వేదాంతమును ఆదర్శవాద మనలేము. అది వానికంటె ఎంతో ఉన్నతమైనది. శ్రేష్ఠమైనది.

ఆదర్శవాదులు ప్రపంచమును చిన్నద్రష్టపై, (ప్రత్యగాత్మపై,) వైయక్తికబుద్ధిపై, ప్రత్యక్ మనస్సుపై ఆధారపడునట్లు చేయుచున్నారు. కాని వేదాంతము "ప్రపంచము నా భావము" అనునప్పుడు ప్రపంచము చిన్న ద్రష్టయొక్క, వైయక్తిక బుద్ధియొక్క, ప్రత్యక్ మనస్సుయొక్క భావన (కల్పన) అని అర్థముకాదు. ఇది ఒకానొక పరిణామోపేతమైనది. దానంతట అదియే యొకసృష్టి; స్వప్నములు ద్రష్టయొక్క సృష్టి అనిచెప్పి బార్క్లే పెద్ద పొరపాటు పడినాడు. ఆతడుచేసిన తప్పే మన స్వప్నావస్థలోని ద్రష్టయు, జాగ్రదవస్థయొక్క ద్రష్టయు, ఒకటే నని తలచినాడు; స్వప్నావస్థలోని ద్రష్ట జాగ్రదవస్థలోని ద్రష్టకు భిన్నము అని మీాకు

నిన్నటిరాత్రి చూపినాను కదా! స్వప్నజగత్‌లోని ద్రష్ట స్వప్నజగత్‌లోని వస్తువుల వంటిదే. నీవు మేల్కొంచినంతనే జాగ్రదవస్థలోని ద్రష్ట జాగ్రదవస్థలోని వస్తువులవంటిదే, జాగ్రదవస్థలోని ద్రష్టయు, స్వప్నావస్థలోని ద్రష్టయు ఒకటేనని బాక్కలే పొరపడినాడు. ప్రపంచము జాగ్రదవస్థలోని ద్రష్ట యొక్కగాని, స్వప్నావస్థలోని ద్రష్ట యొక్కగాని సృష్టి కాదు; ప్రపంచము నా ఆత్మయొక్క, నిజమైన దేవునియొక్క, నిజమైన ఆత్మయొక్క సృష్టి.

ఇక అసలు విషయమునకు వచ్చి ప్రత్యక్షజ్ఞానమును గూర్చిన వేదాంతపు అభిప్రాయ మేమో చూచెదము.

వేదాంతము ఆదర్శవాదుల కిట్లు చెప్పును. "ఓ ఆదర్శ వాదులారా! ఈ ప్రపంచపు నామరూపములు, వస్తువుల స్వభావగుణములు ద్రష్టయొక్క వ్యాపారములేనిదే ఉండ జాలవు." విషయము కష్టమైనది. మీరు శ్రద్ధతో వినవలసి నది అని మరొక్కమారు చెప్పెదను. వేదాంతము ఆదర్శ వాదులతో నిట్లనును. ద్రష్టయొక్క వ్యాపారము లేనిదే ఈ ప్రపంచము నామరూపముల అస్తిత్వము లేదని మీ రనునది నిజమే. వస్తువుల గుణములు, స్వభావములు, విశేషములు ఇవ న్నియు బుద్ధియొక్క (అంతఃకరణముయొక్క) లేదా మనస్సు యొక్క లేదా ద్రష్టయొక్క వ్యాపారముపై, క్రియపై ఆధారపడి యుండునననునది నిజము. అంతవరకు మీ రనునది నిజము; కాని ఈ నీ చిన్న ద్రష్టగాక, ఈనీ ప్రత్యక్ మనస్సుగాక వేరుగా బయట మరొకటి లేదని మీ రనునది నిజముకాదు." వేదాంతము

యథార్థవాదులతో నిట్లనును. "ఈ నశ్వరజగత్తు కేవలము ఏదో బయటిపదార్థముయొక్క వ్యాపారమువలన మాత్రమే కాన రాదు అని మీరనునది నిజము." మన ఇంద్రియములపై బయటనుండి పడు ప్రభావమువలననే ఈ నశ్వరజగత్తు ఉంటు న్నది అని యథార్థవాదు లనుచున్నారని మీకు తెలుసుకదా! వస్తువులు మన ఇంద్రియములపై తమ ప్రభావమును చూపిం చుటచేతనే మన కవి ప్రత్యక్ష మగుచున్నవి. వేదాంత మనున దేమన "అవును, బయటనుండి ఏదో కొంత క్రియ జరుగనిదే మనము వస్తువులను జూడలేము." అంతవరకు యథార్థవాదము చెప్పునది నిజమే, కాని మన ప్రత్యక్షజ్ఞానమంతయు కేవలము బయటనుండి వచ్చు ప్రభావము (Action from outside) పైననే ఆధారపడియున్నది. ద్రష్టయొక్క వ్యాపారముపై ఆధారపడియుండలేదు అని యథార్థవాదు లనునది తప్పు. దీనిని ఇంక బాగా అర్థమగునట్లు చేసెదము. ప్రపంచమందు ఏ ద్రష్ట నైన తీసికొందము. ఏ దృశ్యమునైన తీసికొందము. ఉదాహరణకు ఈ పెన్సిల్‌ను తీసికొనుడు. ఈ పెన్సిల్ రంగు దేనివలన వచ్చు చున్నది; అది ద్రష్టయొక్క వ్యాపారము. బయటనుండి వచ్చె ప్రతి వ్యాపారమువలన వచ్చుచున్నది అని నీ వనవచ్చును. నీ కండ్లు ఏదైన రోగముతో బాధపడుచుండెనేని, ఈ పెన్సిల్ లోని రంగు నీకు కన్పడదు. పెన్సిల్ రంగు ఒక గుణము. తర్వాత పెన్సిల్ బరువును తీసికొనుము. అదియు రంగువలెనే పరిణామశీలము. కండ్లకు కామెర్లు కమ్మెనేని పెన్సిల్ వేరొక రంగు కలిగియున్నట్లుగా కన్పడును. అటులనే దాని నిక్కడ

తూచక చాల ఎత్తుపై తూచితిమేని లేక చంద్రునివద్దకు తీసుకపోయియో, లేక లోతైన గనిలోనికి తీసుకపోయియో తూచితిమేని దాని బరువు వేరుగా నుండును. ప్రతి వస్తువు బరువును లండన్ నందు తూచిన దానికిని, ఇండియాలో తూచిన దానికిని భిన్నముగా నుండును. బరువు పరిణామశీలము, రంగు కూడ పరిణామశీలమే.

ఒకేనీరు చలికాలమందు అంటుకొనిన వేడిగాను, వేసవి యందు అంటుకొనిన చల్లగాను నుండు నని నీవెఱుగుదువు కదా! ఎందుచేత? చూచువాడు నీటిని అంటుకొనునప్పుడు ఒకే ఉష్ణత్వమును కలిగియుండడు కాబట్టిన్ని, నీరు దాదాపు ఒకే ఉష్ణత్వమును కలియుండును కాబట్టిన్ని ఇట్లు జరుగును. దాని ఉష్ణత (Temperature) లో మార్పునట్లు కన్పడుటకు కారణము మన చేతుల ఉష్ణత్వములో మార్పే. కాన ద్రష్టలోని భేదములనుబట్టి దృశ్యములోని గుణములలోకూడ భేదములు గన్పడును.

ఇక ఈ పెన్సిల్ ఏమిపెట్టి చేయబడినది? బార్క్లే తదితరుల అభిప్రాయము ప్రకారము అది గుణముల కలయిక (కట్ట) గాక మరేమీలేదు. ఈ గుణముల తీసివేసిన అచట ఏమియు మిగులదు. కాని కాంట్ మత మేమన ఈ గుణముల నన్నిటిని తీసివేసినను వానివెనుక సద్వస్తువు యొకటియుండును; ప్లేటో అభిప్రాయముకూడ వానివెనుక అసలు వస్తువు యొకటి యుండుననియే. దానినే ఆతడు భావము (కల్పన)అనును. తేలిన దేమన? ఇచట గుణము లున్నవి. ఈ గుణములన్నియు ద్రష్ట

యొక్క వ్యాపారమువలననే వచ్చినవి. లేదా మనోవ్యాపారము వలననే వచ్చినవి. కాని మేము చెప్పిన దేమన, ఈ ప్రతి వ్యాపారమువలన ఈ గుణము లన్నియు పెన్సిల్‌లోవచ్చి కూడకముందే అచట ఒకానొక అస్తిత్వ (సద్వస్తువ) (Reality) మున్నదని. ఇది ఇంకను తెలియునట్లు చేయబడును; రాముని మీరు కోరినచో తిరిగి చెప్పబడును. పెన్సిల్‌లోని ఈ గుణముల కన్నిటికి కారణము ద్రష్టయొక్క వ్యాపారమే నని వేదాంత మనును. కావచ్చును; అయితే ద్రష్టయొక్క వ్యాపారము ఎందుకు రేకెత్తించబడినది. ద్రష్టయొక్క వ్యాపారమును రేపినది ఏమిటి? ఇదీ ప్రశ్న. బయట ఏదో వస్తువ యుండవలె. అదే ద్రష్టపై తన ప్రభావమునుచూపి (acted upon) ద్రష్టలో ఒక వ్యాపారమునో ప్రతివ్యాపా మునో కలుగజేసి యుండవలె. ఆ ప్రతివ్యాపారము ద్రష్టలో రేగినంతనే అచట ఈ గుణములు కూడబెట్టబడినవి, ఉంచ బడినవి. (ద్రష్టనుండే) పొడిగింపబడినవి, ద్రష్టవ్యాపారమును సాగించకముందే ఈ గుణములు అవి యచ్చోట అవే మనస్సుపై పనిచేసి మనస్సుయొక్క వ్యాపారమునో, ప్రతివ్యాపారమునో రేకెత్తించినవని చెప్పలేము. అట్లని ఎందుకు చెప్పలేమ మన మనస్సుయొక్క వ్యాపారమో ప్రతివ్యాపారమో, జరిగిన పిమ్మటే ఈ గుణములు కానవచ్చుచున్నవి; అందు చేత ఏదోవస్తువ బయటవుండి యుండవలె. నీ కండ్లపై పనిచేసిన పెన్సిల్‌లో ఏదో సద్వస్తువ యుండియుండవలె. ధ్వని వినిన నప్పుడు నీ చెవులపై పనిచేసినది, నాలుకతో తాకినప్పుడు

నీ రసనేంద్రియముపై పనిచేసినది, తాకినప్పుడు నీ స్పర్శేంద్రియముపై పనిచేసినది, ఏదో వస్తువు ఉండియుండవలెను. కండ్లపై, చెవులపై, ముక్కుపై తన ప్రభావము చూపిన వస్తువకటి బయటవుండి యుండవలె. ఈ పెన్సిల్‌ను తిని చూడుము. నీ ఆరోగ్యమునకు భంగమొచ్చును. అట్టిచో బయట నిజమైన వస్తువ ఏదియు లేదని ఎట్లందువు? బయట కూడ సద్వస్తువ యొకటున్నది. ఇది నరుని ఇంద్రియములపై పనిచేసినప్పుడు, అవి వాని మనస్సునకు తెలుపును. మనస్సు ప్రతి వ్యాపారము సాగించును. అప్పుడు దృశ్యముయొక్క గుణములు రంగముపైకి వచ్చును. సరిగా ఇట్లే జరుగును. ఇదిగో ఇక్కడ ఒక చేయి ఉన్నది; ఇది రెండవది; ఒక చేయి మాత్రమే శబ్దము చేయజాలదు. ఇట్లు చేతులను కలిపికొట్టితి మేని ధ్వని వచ్చును. ఇచ్చట ఒకవైపున వ్యాపారము; రెండవ వైపున ప్రతి వ్యాపారము; ఫలితముగ శబ్దము వచ్చినది. ఇది ఫిడేల్ తీగ, దానిని నీవు తాకెదవు. దానిని వ్రేలితో మీటెదవు. అప్పుడు ధ్వని బయల్పడును. అటులనే ఇటునుండి ఒక తరంగము వచ్చినది. అటునుండి ఇంకొకటి వచ్చినది. రెండు తరంగములు రాసుకొనినవి; నురుగు వచ్చినది రెండు వైపులనుండి వ్యాపారము, ప్రతివ్యాపారములు కలసి నురుగును పుట్టించినవి. ఇది నిప్పుపుల్ల. ఇది ఇసుక కాగితము (sand - paper). ఇసుక కాగితముపై నిప్పుపుల్లను గీచితిమేని మంట వెలువడును. రెండువైపులనుండి వ్యాపారము, ప్రతి వ్యాపారము. ఇచ్చట విద్యుచ్ఛక్తియొక్క ధనధృవము.

ఇచ్చట ఋణధ్రువము - అవి రెండును కలసిన విద్యుత్ కాంతిని చూచెదము. లేదా ధ్వనిని వినెదము. ఇటుల రెండు వైపులనుండి వ్యాపారము, ప్రతి వ్యాపారము కలిసి క్రియను (Phenomenon) సృష్టించును.

(నీ తెలివిలో) నీ మనస్సులో అసలు వస్తువ యున్నది; అదే ఆత్మ అని అందుము - అని వేదాంతము చెప్పుచున్నది. నిజమైన ఆత్మ నీ అంతఃకరణలోనే యున్నది. అసలు వస్తువ (సత్పదార్థము) ప్రపంచములోని ప్రతి దృశ్యమందును ఉన్నది. ఈ పెన్సిల్‌లో సత్పదార్థ మున్నది. అన్ని గుణములకు లక్షణములకు అతీతమైన ఏదో ఒకటి దానిని నీవు అసలు వస్తువ అనవచ్చును. తెలిసికోబడటానికి వీలులేనిది ఉన్నది. ఆ అసలు వస్తువే సత్పార్థమే నీ యంతఃకరణమందుగూడ నున్నది. బయటనున్న సత్పదార్థము అనగా పెన్సిల్‌లో ఉన్న దివ్యత్వము (బ్రహ్మము), అంతఃకరణస్థమైన బ్రహ్మము రెండు చేతులవలె నున్నవి. అవి కలుసుకొని తాసికొనినంతనే పెన్సిల్ యొక్క గుణములు కూడుకొనుచున్నవి. ఒకవైపు నుండి ఒక తరంగము, రెండోవైపునుండి రెండవ తరంగము కలసికొనినంతనే ఏర్పడు నురుగువలె కూడుకొనుచున్నవి; అనగా ఇట్లే ఈ గుణములు పుట్టుచున్నవి. ధనధ్రువము అంతఃకరణములోను, పెన్సిల్‌లో ఋణధ్రువము ఉన్నవని చెప్పవచ్చును; ధ్రువములు రెండు కలసుకొనినంతనే ఈ ప్రపంచము యొక్క గుణములు, లక్షణములు, క్రియలు అన్నియు కన్పడుచున్నవి. వైదాంతిక పరిభాషలో చెప్పవలెనన్న, ద్రష్టా

దృశ్యము లేకత్వమొందినంతనే మనము వస్తువులను చూడ గలైదము. ద్రష్టాదృశ్యము లున్నవి. పెన్సిల్ లో ఆత్మయున్నది. అంతఃకరణములోనూ ఆత్మ యున్నది; రెండింటి వ్యాపార ప్రతి వ్యాపారములు *జగత్తును పుట్టించుచున్నవి.

ద్రష్టయొక్క వ్యాపారము లేనిదే ఏదియు చూడవల్ల కాదు, అని ఆదర్శవాదు లనునది నిజమే; కాని ద్రష్ట యొక్క ఈ వ్యాపారము యొక్కటియే జగత్తును పుట్టించు నని వారు చెప్పునది తప్పు. ఎందుకన? అట్లనుటలో వారు, "సమాన మైనట్టి ఎదురైన ప్రతివ్యాపారము (Reaction) లేనిదే వ్యాపార ముండజాలదు" అను సైన్సుయొక్క అపవాద రహితమైన సూత్రమును ప్రతిఘటించుచున్నారు. ప్రపంచము ద్రష్టయొక్క వ్యాపారమువలననే సృష్టించబడుచున్నది అని అనుచూ ఆదర్శవాదులు ఈ వ్యాపారము ఎక్కడనుండినైన ప్రతివ్యాపార మొకటి లేనిదే జరుగదు అను సత్యమును త్రోసి పుచ్చుచున్నారు. అందుచేత ఈ ప్రపంచము దానిలోనే ఒకానొక సత్యత్వమును కల్గియున్నది. ప్రపంచము కేవలము ద్రష్టపైననే వ్రేలాడుచుండుట లేదు అని యథార్థవాదులనునది వాస్తవమే. ఈ ప్రపంచ మందొక సత్యత్వము అంతర్నిహితమై యున్నది. అంతవఱకు వా రనునది నిజము. కాని ఈ జగత్తు లోని వస్తువులు స్వయముగా సత్పదార్థములు. వాటిపైన అవియే ఆధారపడి యున్నవి అని వారనునది తప్పు ! ఎందు చేత నన, ఈ ప్రపంచములోని వివిధక్రియలు, విభేధములు,

---

* జగత్తు = కదలునది (Phenomena)

వస్తువుల గుణములు - ఇవన్నియు ద్రష్టయొక్క వ్యాపారము పైనను, దృశ్యమందు నిహితమైయున్న సద్వస్తువయొక్క ప్రతి వ్యాపారముపైనను ఆధారపడి యున్నవి.

ఇచట యొక పెద్ద ఆక్షేప మొచ్చును. నీవువ్యాపారము ప్రతి వ్యాపారముల గూర్చి మాట్లాడుచున్నావు. అనంతత్వ మందు వ్యాపార ప్రతివ్యాపారము లెట్లుండును? ఇతర జను లుపయోగించు భాషనే వాడి అర్థమగునట్లు చేయుటకే మేము వ్యాపార ప్రతివ్యాపారములగూర్చి మాట్లాడితిమి. అఖండ ఇచ్ఛ, అఖండశక్తి ఇవి బుద్ధితోడనో, ఏదైన దృశ్యము తోడనో కూడుకొని యుండునప్పుడే వాని విషయములో వ్యాపార ప్రతివ్యాపారములను శబ్దములుపయోగించవీలగును. ఈ దృశ్యముతో (వస్తువుతో) కూడిన « పరమపదార్థము ఈ ఉపాధితో అనగా ఈతల, బుద్ధి లేక అంతఃకరణముతో కూడిన పరమపదార్థముతో వ్యాపారమునో, ప్రతివ్యాపార మునో సాగించును. ఈ ఉదాహరణ చూడుము. ఈ ఘట మందు ఆకాశము కలదు. ఆ ఘటమందును కలదు. వాస్తవ ముగా ఆకాశమొక్కటియే అవిభాజ్యమగు వస్తువ. అయినను ఆ ఘటమందు కానవచ్చు ఆకాశమే ఈ ఘటమందు కాన వచ్చు ఆకాశము అని నీవు చెప్పవచ్చును; నిజముగా ఆకాశ మును ముక్కలుగా-చీల్చలేము, విభజింపలేము; అదిఅఖండము. ఈ జేబుగుడ్డను చేసినట్లుగా చేయుటకు వీలగు వస్తువ కాదు గదా ఆకాశము! ఆకాశము (Space) ఒక్కటీ అవిభాజ్యము.

» Absolute Entity

ఆకాశమునుగూర్చి విభజించుట అను భావమును తలపెట్ట లేము. కాంట్ మతము ప్రకారము ఆకాశము ద్రష్టపై ఆధార పడియుండును. స్వతంత్రముగగూడ నుండును.

అది విభజింప వీలుపడనిది. కోయుటకుగూడ వీలు కానిది. అట్టి నిజమైన ఆత్మ లేక సత్పదార్థము - బ్రహ్మము- విభజింప వీలుకానిది. కోయుటకు వీలుకానిది. కాని ప్రాపంచిక వస్తువులతో దాని ప్రస్తావన వచ్చినప్పుడు, అది బుద్ధితోడనో, ఏదైన వస్తువతోడనో ఉపేతమై యున్నట్లు మాట్లాడుట సమంజసమే; అదే సత్పదార్థము. ఈ దృశ్యముతోడనో, ఆ దృశ్యముతోడనో కలసి వ్యాపారముగానో, ప్రతివ్యాపారం గానో ఉండును. ఇదిగో ఉదాహరణకు, ఈ చేతిని గనుక మనము ఈ ఘటనమునకు దగ్గరగా తీసి కొచ్చితిమేని, ఈ చేతిలోని ఆకాశము ఈ ఘటములోని ఆకాశము దగ్గరకు వచ్చును. ఇచ్చట రెండూ ఏకమగును. ఇప్పుడిక చేతిలోని ఆకాశము ఈ ఘటమందలి ఆకాశముతో ఒకటి యగును. మొదటగూడ నది యొకటియే. కాని ఇప్పుడు నీ కండ్లకుగూడ చేతిలోని ఆకాశము ఘటములోని ఆకాశము ఒకటియే యగును.

ద్రష్ట కధిష్ఠానముగ నుండు పరమ సత్పదార్థము ఎప్పుడు దృశ్యమున కధిష్ఠానముగనుండుపరమ సత్పదార్థముతో ఏకమగునో, అప్పుడు ద్రష్టాదృశ్యములుగూడ ఏకమగునని వేదాంతము చెప్పును.

వ్యాపార ప్రతివ్యాపారములు సత్పదార్థమందు లేక ఆత్మయందు జరుగవు. అవి *(ఘటాది లేక అంతఃకరణ) అవిచ్ఛిన్న ఆత్మయందు జరుగును. ఇటు చూడుము. ఇటునుండి నీటితరంగ మొకటి వచ్చుచున్నది. అటునుండి మరొక నీటి తరంగ మొచ్చుచున్నది. ఈ తరంగమూ ఆ తరంగమువలెనే నీరే; తరంగములు రెండూ ఢీకొనినప్పుడుకూడా అవి నీరే. అవి మార్పేమీ పొందవు. అయినను తరంగములమధ్య వ్యాపార ప్రతివ్యాపారములు సాగుటలేదా? తరంగావచ్ఛిన్న మైన ఈనీరు, మరొక తరంగావచ్ఛిన్నమైన ఆ నీటితో కలసి ఢీకొని, ఈ ఢీకొనుటవలన నురుగు అను ప్రక్రియ పుట్టుచు న్నది. అట్లే అంతఃకరణావచ్ఛిన్నమగు ఆత్మ, విషయావచ్ఛి న్నమగు ఆత్మతో కలసి ఢీకొనినప్పుడు గుణములు విశేష ములు, స్వభావములు మున్నగు ప్రపంచమందలి ప్రక్రియలు (phenomena) కానవచ్చును. రెండవ చేతిలో నున్నంత బలమే కలసియుండిన ఈ చేయిని మరొక చేతితో కలిపి చరచి నప్పుడు, ధ్వనిని పుట్టించినట్లు ఇదియు జరుగును.

విషయమందును (దృశ్యమందును), అంతఃకరణమందును గూడ ఉన్న పరమార్థ మొకటియే; కాని అంతఃకరణము లేదా ద్రష్ట విషయ (దృశ్య) సాన్నిధ్యమున కొచ్చినప్పుడు, ఆ పరమపదార్థమే - ఆత్మయే - వాని కధిష్ఠానముగ నున్న

---

* అవచ్ఛిన్న = Limited

బాగుగా అర్థము కావలెనన్న వేదాంత పరిభాష, ప్రథమపరిచ్ఛేదము 16, 17, 18 చూడుము - అను.

యది. ప్రపంచమందలి వస్తువుల కన్నిటికి అధిష్ఠానము ఒకే పరమపదార్థ మను విషయము పూర్తిగా తెలియునట్లు చేయబడ లేదు. ఇదిగో ఇది ఒక కలము. ఈ కలమందు కొన్ని గుణములు, వాని కధిష్ఠానభూతమగు పరమపదార్థము ఉన్నవి. అధిష్ఠానభూతమగు సత్పదార్థమున్నదని మన మనుకొనుట సమంజసమే. ఏలయన, అంతఃకరణముపై ఏదో వ్యాపారము పనిజేయనిదే, దానికొక ప్రతివ్యాపారము జరుగనిదే, దానివలన ఈ గుణములు పుట్టినవిగాని లేకున్న ఇవి ఎక్కడివి? ఇది ఒక కలము. దీనిలో కొన్ని గుణములున్నవి. వానిని మనము 'గ' అనుదము. వాని కధిష్ఠానముగ సత్పదార్థ మొకటున్నది. దానిని 'స' యందుము. కలము = దానిని కలమునుగా జేయు గుణములు. అచట బల్ల యున్నది. బల్లలో బల్లను బల్లగా జేయు గుణములు 'గ్బ' పై పెచ్చు సత్పదార్థము 'స' యున్నవి. ఈ 'స' యు, లోగడ 'స' యు ఒకటేనని తలచుటకు నీకుగల హేతువేమి అని నీ వడగవచ్చును. ఈ కలములో గల గుణములకు అధిష్ఠానముగ నుండు సత్పదార్థము, బల్లలో గల గుణములకు అధిష్ఠానముగ నుండు సత్పదార్థమునకు భిన్నమని ఎవరేని చెప్పవచ్చును. కలముయొక్క గుణములు పొడిగింపబడక (projected) ముందే, మన ఇంద్రియములపై ఏదో సత్పదార్థము పనిచేసినదని అనవచ్చును. అట్లే బల్లను బల్లగా చేయు గుణములు మన ద్రష్టచే పొడిగింపబడకముందే, వేరే ఒక సత్పదార్థము - దానిని 'స' అందుము — మన ఇంద్రియములపై పనిచేసియుండవచ్చును. ఈ 'స' ను క్రిందటి 'స'ను ఒకటేనని

తలచుటకు మన కధికారములేదు. ఇచట పియానో ఉన్నది. దానిని "$స_1$" అనెదము. అప్పుడు దానిని క్రిందటి 'స' లనుండి వేరుగా గురితించినామన్నమాట. బల్లకు, కలమునకు అధిష్ఠానముగ నున్నదానికంటె ఇది భిన్నము కావచ్చును. ఇదిగో ఇది మనుష్యుడు. దీనిని "$స_2$" అనవలసివచ్చును.

సరిగా చూడుడు. ఇదే ప్లేటో చేసినతప్పు. (భిన్నవస్తువుల) కధిష్ఠానముగనుండు సత్పదార్థముల నాతడు భిన్నములుగ ఎంచినాడు. పైకట్లే కానవచ్చును కాబట్టి; నీవును భిన్నములనియే తలచినావు. కాని ఈ వాదనను విశ్లేషణ చేసితిమేని చివరకు పరిహాసనుపాలై పోవును. ఈ తలపు పొరపాటు అని చూపవచ్చును. ఈ కలముయొక్క నామరూపములు–దాని రంగు, బరువు, మెత్తదనము ఎగైరాలు – నీ అంతఃకరణముయొక్క, మనస్సుయొక్క ప్రతివ్యాపారఫలితములు కాన, ఇచటి గుణములన్నియు నీ బుద్ధియొక్క ప్రతివ్యాపారమునకు ఫలితములు. ఈ గుణములన్నియు ప్రతివ్యాపారము జరిగిన తరువాత వచ్చినవి; ఈ పెన్సిల్‌లోని సత్పదార్థము మాత్రము ఈ గుణములు పొడిగింపబడకముందే యున్నదని మనము తలచినాము. కాని పరమసత్పదార్థము ఈ గుణరూపముల కన్నిటికి అతీతము. ఈ "$స_1$" యు గుణముల కతీతము. "$స_2$"కూడ గుణముల కతీతము.

అయినచో భేదములకు గల కారణ మేమి? కొంచెము ఆలోచింపుడు. ఈ ప్రపంచమందుగల భేదము లన్నిటికి కారణము గుణములే. ఈ సీమసున్నపు ముక్కకును, ఆ పెన్సిల్

కును గల భేదమును వాటి గుణముల జోలికిపోకనే గుర్తించ గలవా? ఈ సీసుసున్నముముక్క ఆ పెన్సిల్ కంటే భిన్నమని నీ కెట్లు తెలియును. గుణములనుబట్టియే. ఈ సున్నపుముక్క తెల్లగా నున్నది - అదొక గుణము. అది విరిచిన విరుగును. అదొక గుణము. భేదము లన్నిటికి గుణములే కారణము. ఈ 'స' కును, ఆ 'స కును భేదము నెంచితివేని, నీవు విభేదమును తెచ్చిపెట్టుచున్నావు. నీవు భేదములను కల్పించి సత్పదార్థమును గుణములకు లొంగుదానిగా చేయుచున్నా వన్నమాట. విభే దములను లోనై యుండుటబట్టి, ఒకదానికొకటి వేరై యుండు టనుబట్టి, అవన్నియు గుణములకు లోనైన వన్నమాట - ఇదీ తప్పు. అవి గుణముల కతీతమైన వనుచూ, ప్రారంభించి అవి గుణములకు లోనైయున్న వనుచూ ముగించుచున్నావు; ఒకదానికొకటి వేరుగాను భిన్నములైన వానిగా ఎంచితివేని అదితప్పు. నీ వవి గుణములకు రూపములకు అతీతములైనవిగా ఎంచి ప్రారంభించి నీ మాటలను నీవే ఖండించుకొనుచు వానిని తిరిగి గుణముల పరిధిలోనికి తెచ్చుచున్నావు. అదీతప్పు.

ఈ పెన్సిల్‌కు అధిష్ఠానముగ నున్న సత్పదార్థము ఈ సీమసున్నమున కధిష్ఠానముగనున్న సత్పదార్థమునకు భిన్న మని చెప్పుటకు నీ కధికారములేదు, మనస్సుకు, ద్రష్టకు, బుద్ధికి అధిష్ఠానముగా నుండు సత్పదార్థము ఒకఆవులోనో, ఎద్దులోనో ఉన్న సత్పదార్థమునకు భిన్నమని చెప్పుటకు నీ కధికారము లేదు; ఈ బల్ల కధిష్ఠానముగ నుండు ఆత్మ ఆ బల్ల కధిష్ఠాన

ముగ నుండు ఆత్మకు భిన్నమని చెప్పుటకు నీకధికారము లేదు. అది ఏకము, అఖండము, పరిణామరహితము, సద్వస్తువు.

ఉదాహరణతో దాని నింకా అగమగునట్లు చేయ వచ్చును; ఇచట యొక తెల్లని అందమైన గోడ యున్నదను కొనుడు. మీరందరు ఇచట కూర్చొని యున్నారు మీలో ఒకరు ఆగోడపై అందమైన త్రికోణములను, చతురస్రములను, వర్తులములను చుట్టుచున్నారు. మరొకరు ఆ గోడపైననే ఒక పెద్ద యుద్ధమునకు సంబంధించిన చిత్రమును గీయుచున్నారు. ఇంకొకరు దానిపైననే తన భార్యాబిడ్డలయొక్క, బంధుమిత్రుల యొక్క బొమ్మలను వేయుచున్నారు. మరొకరు ఇంకొకటి గీయుచున్నారు. ఈ బొమ్మల కన్నిటికి వెనుక ఒకే సత్పదార్థ మున్నది, అట్లే నీ వీ ప్రపంచమున చూచు అన్ని వస్తువుల వెనుకనున్నది ఒకే సత్పదార్థము. ఇచట నీ వొక గుఱ్ఱమును చూచుచున్నావనుకొనుము. అచటనొక ఏనుగును, అచటనొక మనుష్యుని ఈ బొమ్మలన్నియు ఆ ఒకే పరమ పదార్థముపై- "స" పై - వేయబడినవి. అదే ఆ తెల్లగోడ. ఇట్లు ఒకేఆత్మ, ఒకే అఖండుడైన రాముడు అందరియందు ప్రతి ఒక్కరియందు. అంతర్నిహితుడై యున్నాడు. నీ స్వప్నములందు నీవు ఒక ఎద్దును చూచెదవు. తరువాత నొకకుక్కను, ఆపై ఒక నరుని అటుతర్వాత ఒక స్త్రీని. అయినను నీ స్వప్నములందు చూచు ఆ ఎద్దు, కుక్క, నరుడు, సమస్తము ఒకే పరమ సత్పదార్థ ముపై - ఆత్మపై - వేయబడిన బొమ్మలని నీ వెఱుగుదువు.

నీవు మేల్కాంచినంతనే నీ స్వప్నములో చూచిన గుఱ్ఱము, కొండ, నది ఎచటను లేవని నీ వెఱుగుదువు.

ఈ ప్రపంచమును ఏర్పరచిన ఈ గుణముల సంగతి ఏమి, నైమిత్తికమైన ఈ జగత్తు ఈ గుణములపైననే ఆధారపడియున్నది; ఆ గుణములు పరమపదార్థముపై ఆధారపడియున్నవి. ఇచటనొక సూక్ష్మ విషయమున్నది; దానినిప్పుడే మీరర్థము చేసికోలేరు. అయినను వినండి. రాబోవు ఉపన్యాసములలో అది బాగుగా అర్థమగును. ఈ గుణములన్నియు పరమపదార్థముపై ఆధారపడి యున్నవి; ఇవియన్నియు పరమపదార్థముపై వ్రేలాడుచున్నవి. ఈ గుణములనుబట్టి పరమపదార్థమునకుకూడ ఒక గుణమున్నది. అది ఏమన గుణముల కాధారభూతముగ నుండు గుణము; వానిని నిలిపి పెట్టుకొను గుణము పరమపదార్థ మీ గుణముల నన్నిటిని నిలుపుచున్నది. అయితే పరమపదార్థము పరమ మెట్లయినది? ఎందుకన ఈ గుణముల కాధారముగ నుండు గుణము దానికున్నదికదా! అట్టి పదార్థము పరమ మని ఎట్లనగలెదము? మే మిది సాక్షాదనుభూతివలన చెప్పగల్గుచున్నాము. మీ స్వంత అనుభవముపై మీ రెట్లు ఈ ప్రపంచము సత్య మని చెప్పుచున్నారో అట్లే ఇంతకంటే ఉచ్చమైన స్వంత అనుభవముపై, స్వాంతమగు పరమానుభూతిపై పరమసత్పదార్థము అనుభూతిలోని కొచ్చినపుడు ఈ గుణములు, ఈ దిక్కాలములు, అన్నియు లేకుండపోవు నని చెప్పుచున్నాము. పరమపదార్థానుభూతి దృష్టితో చూచిన ఈ గుణము లెన్నడూ

ఉండనేలేగు, కాని గుణముల దృక్కోణముతో చూచిన ఇవి అన్నియు అధిష్ఠానముపై, పరమపదార్థముపై ఆధారపడి యున్నవి. ఇచట నొకవిరోధాభాస మున్నది; ఇది పెద్ద సమస్య. దానినే మాయ యందురు. నిజముగా పరమసత్పదార్థము పరమమే (Absolute) అది గుణములకతీతము. అయితే ఈ గుణములు వాటిదృష్ట్యా పరమసత్పదార్థముపైననే ఆధారపడి యున్నవి, ఇది ముఖ్యమైన సమస్య. దీనిని పరిష్కరించిన తక్కినకష్టములన్నియు లన్నియు తొలగిపోవును.

ఇవి కేవలము ఊహించుటకు వీలగు విషయములు కావు. ఇవి కేవలము సంభాషించుటకు వీలైన విషయములు కావు. యూరోపియన్ దార్శనికులు ఈ విషయములను కేవలము గాలిమేడల గట్టుట కుపయోగింతురు. ఇండియన్ దార్శనికు లట్లుకాదు. వారి దృష్టిలో ఏ విషయమేని అనుభవములోనికి రాక కేవలము సిద్ధాంతీకరింపబడెనేని, అది సగము బుజువైనట్లే. మానసికముగా విన్నప్పుడు ఇది ఎంత మధురమయిన విషయము? ఆహా! దాని ననుభవించినప్పుడు అది మధురత్వమునకు ఆనందమున పరమావస్థే. దాని ననుభవింపదగును. ఈ విశ్వమందలి శరీరముల కన్నిటికీ అంతర్నిహితమగు ఒకే అఖండమగు "స" నీవేనను భావమును నీ వుజ్జీవింప గలైదవేని, నీవు మనశ్శరీరముల కతీతుడవయ్యెదవు. ఈ శరీరము ద్రష్టకాదు. ఒక తరంగము మరొక తరంగముతో ఢీకొనుటవలన వచ్చిన కేవలదృశ్యము. నీవీ శరీర మను బుద్బుదముకాదు. నీవు పరమసత్పదార్థమవు. అందులో ఈ

ప్రపంచము, ఈ విశ్వముయొక్క ప్రక్రియలన్ని కేవలము తరంగములు, వాకలు. అది గుర్తించి స్వతంత్రుడవు కమ్ము, పూర్ణ స్వతంత్రుడవుకమ్ము. నిజమైన సత్యత్వము, వాస్తవమైన అధిష్ఠానమునైన నీవు ఇవి గుర్తించకపోవుట వింతలలో వింతకాదా? ఆహా! అదికమ్ము. ఎంతటి మంచి సువార్త? ఎంతటి మంగళ సందేశము? నీవా పరమపదార్థమువు. నీ వా నిజమైన "స" వు. దానిని అనుభవించుము, స్వతంత్రుడవు కమ్ము.

*నీ స్థితి యిట్లుండగావలె నెపుడు
తనువు నాశనమై, అదృశ్యమై చనిన
నే ననంతుండనై ప్రజ్వలించెదను
అందరికర్ణముల్ నాకు కర్ణములు
అందరి హస్తముల్ నాదు హస్తములు,
అందరి మనములు నాదు మనస్సు!
మృత్యుంజయుడ నేను కాలకాలుడను,
మ్రింగి వైచితి భేదభావ విషంబు
ఎంత మాధుర్యము, ఎంత సుస్థిరత,
ఎంత శుభప్రద మీ స్థితి యోహూ!

* ద్విపద అనువాదము శ్రీ కేశవతీర్థులది.

# యదార్థవాదము, ఆదర్శవాదము

సోమవారము, 1904 ఏప్రిల్ 4 వ తేదీనాటి ఉపన్యాసము

ప్రపంచ మున్నదని మన మెట్లు చూచుచున్నాము? ఇంద్రియముల ద్వారా, వాటి మీద ఆధారపడి యుండ వచ్చునా? ఉదాహరణకు ప్రపంచము ఇట్టులున్నది, ఇటులున్న దని, మనము చూచు విధమును వర్ణించినా మనుకొనుడు. ఏనుగ దాని నెట్లు చూచును? దానికిని కండ్లున్నవి కదా! చేపకు, చీమకుకూడ కండ్లున్నవికదా! అవి ఎట్లు చూచును? చీమకు సమస్తము దుమ్ముక్రమ్మినట్లుగా కనపడును. ఏనుగునకు ప్రతివస్తువ చాలా విపరీతముగ నున్నట్లు కానవచ్చుచు. మనిషికి మరో విధముగ కానవచ్చును. అసలిది ఇట్లేయున్నదని మన కెట్లు తెలియును? అట్లే ఈకండ్ల కేదేని క్రమ్మిన వానికి మరో విధముగ కనపడును. చిన్న పిల్ల లాడుకొను ఒక విపరీతమైన అద్దములోనుండి చూచిన ఎట్లుండునో చూడుము. అందొక దానిగుండ జూచిన ముఖ మెంతయో పొడుగుగా నున్నట్లును, గడ్డము ఎక్కడో క్రింద పాతాళమును తాకునట్లును, తల మరెక్కడో పైన నున్నట్లును, చెవులు ఎప్పటి మాదిరిగానే నున్నట్లును కనపడును. ఇది వింతగా కన్పడి, నవ్వు వచ్చునట్లు చేయును. అట్లే ఇటువంటిదే ఇంకో రకపు అద్దముగుండ జూచితిమేని ముఖము పొడుగు మామూలుగానే నుండి, ఒక చెవ్వు ఒకమూలకు, మరొక చెవ్వు మరొక మూలకును పోయినట్లు కానవచ్చును. కాన ఇంద్రియము లాధారపడదగినవి

కావని తేలును. దృగింద్రియ మెట్లో తదితర ఇంద్రియములు నట్లే.

పసిబిడ్డలకు కళ్ళు ముక్కు చెవి మొదలగునవి ఉన్నను, అది ఏమియు చూడలేదు. దానికి గోడలున్నది గొబ్బెలున్నది, తెలియదు. ఎన్నోసారులు తల్లి తరచుగా ఇది గోడ, ఇది పుస్తకము అని నొక్కి చెప్పి వానిని హిప్నొటైజ్ చేసినప్పుడే బిడ్డకు వస్తువు లెట్లున్నవో బోధపడును.

పంచభూతము లున్నవి. మనకు పంచేంద్రియము లున్నంతవఱకు పంచభూతము లుండును. ఆ యా ఇంద్రియము లకు సరిపోవు భూతము లేవన

| | | |
|---|---|---|
| అగ్ని | ... | దృగింద్రియము |
| ఆకాశము | ... | శబ్దేంద్రియము |
| జలము | ... | రసనేంద్రియము |
| భూమి | ... | ఘ్రాణేంద్రియము |
| వాయువు | ... | స్పర్శేంద్రియము |

తలంపులు (Thoughts) సత్యము లని నమ్మువారు ఆదర్శవాదము నిజ మని నమ్మెదరు; వా రిట్లు నమ్ముటకు మంచికారణములుకూడ నున్నవి. ఉదాహరణకు: చూచు వాడు లేనిదే గోడ ఎటుల చూడబడును? వానను దేమన, గోడలో సత్యత్వమేమియులేదు. తలంపే గోడను సృష్టించినది. ఒక మనుష్యుని గనుక హిప్నాసిస్ ద్వారా మంత్రము పెట్టితి మేని, దానిని వాడు వేరుగా చూచును. మరొక మాదిరిగా

మంత్రించితిమేని ఇంకా వేరుగా జూచును. హిప్నొటైజ్ చేసి ఒక మనుష్యునికి నేను ఈ నేల చెరువు అని చెప్పితినేని, వాడు వెంటనే చేపలుపట్ట ప్రారంభించును. ఇచ్చో యదార్థవాది బయలుదేరి ఏమనునన, గోడతప్పక వాస్తవమైనదే; నీతలంపున్నను, అది గోడయే. నీవు దానిని చూడవచ్చును. అంటుకొనవచ్చును, వినవచ్చును, నీ ఘ్రాణేంద్రియము తీక్ష్ణముగనుండెనేని వాసనగూడ చూడవచ్చును. నీవు దానిని తింటివేని, అది వాస్తవమైనదేనని నీ పొట్టయే నీకు చెప్పగలదు. కాన యదార్థవాదికి కూడ హేతువులు తగినన్ని గలవు. కాని నేను మీకు చెప్పగోరినదేమన, వస్తువును చేయునది విషయము, తలంపు రెండూ కలసియే నని. హిప్నొసిస్‌కు లోనైన నరుని కది వేరుగానుండుమాట నిజమేనని యొప్పుకొనినను, వానికి ఏదో ఒకటి తోయునట్లు చేయుటకు అచట విషయ మొకటియుండవలెకదా; అది ఉన్నతరువాతకదా, దానిని నేను గుఱ్ఱమనియో, చెరువనియో, లేక ఇంకేమైన అనియో పిలువ గల్గునది: ద్రష్టాదృశ్యములు రెండూ కలియవలె.

ఒకసారి ఇండియాలో ఇద్దరు కొట్లాడుకొనుచుండిరి. ఒకడి పేరు మొద్దయ్య. రెండవవానిపేరు గొడ్డలయ్య. గొడ్డలయ్య మండిపడి మొద్దయ్యతో ఇట్లనెను. "నిన్ను నేను ముక్కలుచేసి వేసెదను." మొద్దయ్య ఇట్లు జవాబిచ్చెను. "కాని, బాబూ! నేను నీ వెనకనే ఉండవలె. లేకపోతే నీపని సున్నే." గొడ్డలిపిడి మొద్దుతోనేకదా చేసెడిది. అట్లే యదార్థ

వాదము, ఆదర్శవాదము రెండునూ అన్నదమ్ములవలె మెలగ వలె. అవి పరస్పరము ఒకదానిమీద ఒకటి ఆధారపడి యుండ వలసినదే.

ఇసుక కాగితముపై నిప్పుపుల్లను గీసితిమేని, అగ్ని వచ్చును. ఈ అగ్ని నిప్పుపుల్లలో ఉండినదా? లేక ఇసుక కాగితములో నుండినదా? రెంటి కలయికయే అగ్నిని పుట్టించి నది. నేను రెండు చేతులను చరిచినచో ధ్వనివచ్చును. ధ్వని కుడిచేతిలోనూ లేదు, ఎడమచేతిలోనూ లేదు. రెండూ కల యుటచేత వచ్చినది. రెండు చేతులలోనూ ఉన్న ఆత్మ ఒక టియే. ఇక్కడ మీకు కాకినిగురించి కొంత చెప్పదలచినాను. కాకికి కనుగుంటలు రెండుండును గాని, గ్రుడ్డు ఒకటే. కుడి వైపుకు తిరిగినప్పుడు కంటి నది కుడిగుంటవైపుకు త్రిప్పును: ఎడమవైపు చూచునప్పుడు అది కంటిని ఎడమవైపుకు త్రిప్పును. కన్ను ఒకటే అయినను, అది భిన్నస్థానములకు త్రిప్పబడుచున్నది. రెండు పెద్దతరంగములు కలసికొని నప్పుడు, తెల్లని » కిరీట మొకటి ఏర్పడును. కుడివైపు తరంగములోనిదీ, ఎడమవైపు తరంగములోనిదీ ఒకటే నీరు; అవి రెండు కలసి కొనినంతనే తెల్లని కిరీట మొకటి ఏర్పడును. బిడ్డ ఒక్కరికే పుట్టదు. తల్లిదండ్రులకు పుట్టును. వారినే దేవుడు, పవిత్రాత్మ అనండి.

అనుభవించు దానిని (subjectixe) చూచునదనియు, అనుభవింపబడుదానిని (objective) చూపబడున దనియు

---

» crest

అనినా మనుకొనుడు; ఇవి రెండూ పరస్పరము ఒకదానిపై నొకటి ఆధారపడి యున్నవి; అవి రెండు సన్నివేశమైనపుడే మనము చూచు ప్రక్రియలు ఏర్పడుచున్నవి. ఏదియు ఒక్కటిగా ప్రక్రియను పుట్టింపలేదు. కాన ఆదర్శవాది యథార్థవాది ఇరువురూ కలసియే ప్రక్రియకు గల కారణము చెప్పగలరు. ఒంటిగా చేయలేరు.

ఇండియాలో కొన్ని ఇండ్లలో ఎన్నో అద్దము లుండును. కొన్నిచోట్ల గోడలు కప్పుకూడ అద్దములతో పఱచివేయబడును. ఒకసారి అట్టి యింటిలోనికి కుక్క ఒకటి ప్రవేశించి, తనకుచుట్టూ అన్నివైపుల వందలకొలది కుక్కలను చూచెను. పైకిచూడగా తనపైనగూడ ఎన్నో కుక్క లుండెను. భయము పుట్టి అది గంతులు వేయసాగెను. వెంటనే ఆ వందలకొలది కుక్కలుకూడ గంతులు వేయసాగెను; అది మొరగటము, గీకటము ప్రారంభించెను. అవికూడ మొరగటము, గీకటము ప్రారంభించెను. అలుపొచ్చినవఱకు ఇట్లు చేసి అది క్రింద పడుకొని వేటాడుట మానెను. చివరకు చచ్చెను; ఇంటి యజమాని తరువాత లోనికి ప్రవేశించి కుక్క శవమును బయటి కీడ్చి వేసెను. తరువాత ఒకసారి చక్కని రాకుమారు డొకడు ఆ గదిలోనికి ప్రవేశించి, అన్ని అద్దములలోను తనను తాను చూచుకొని మెచ్చుకొనెను. మొదట వెండ్రుకలు, తరువాత నోటిని, ఆపై తదితర అవయవములను, దుస్తులను మెచ్చుకొనెను. ఈ బొమ్మలన్నీ చూచి ఆతడు ఎంతయో సంబరపడెను; ఈ వందలమంది అందరు తానే యని ఎఱిగెను.

ఒకే ఆత్మ ఉన్న దనియు, వివిధ నామరూపములుగా మనము చూచినదంతయు నిజముగా మన ఆత్మయే ననియు తెలిసికొని నపుడే మనకు విశ్రాంతి దొఱకును. లేకపోయిన కథలోని కుక్కవలెనే అగును. వీడు మోసముచేయునేమో నని భయ పడెదము. వాడు హానిచేయు నేమో నని భయపడెదము. మఱొకడు మనదేదో తీసికొనునేమోనని భయపడెదము. ఇట్లు మనము భిన్నము లని తలచు రూపములతో సతతపోరాటము జరుపుచునే యుండెదము; కాని ఎప్పుడు సత్యానుభూతి నొంది రాకుమారునివలె నిస్తబ్ధుల మయ్యెదమో, అప్పుడు ఆత్మ నేదియు మోసగింపజాలదని తెలిసికొనెదము. ఎందుచేత నన, ఆత్మ పరిణామరహితము. స్వతంత్రము. కుక్కవలె కుప్పిగంతులు వేయుచునే యుండినంతసేపు మనము పైపైననే బ్రతికెదము. కాని ఆత్మానుభూతి పొందినంతనే లోనికి చొచ్చుకొనిపోయి పరమసత్య సామ్రాజ్యములోనికి వెళ్లెదము.

ద్రష్ట స్వప్నములో కొండల నెక్కి అచట నొక సింహము ఆతని ముక్కలుగా చీల్చునట్లో, లేక కొండపై నుండి తప్పించుకోలేని గోతులలోనో, గంగలోనో పడి నట్లో అయ్యె ననుకొనుడు. ద్రష్ట యథార్థము, సత్యము అయ్యె నేని, స్వప్నమందలి పదార్థము అయ్యె నేని, స్వప్నమందలి పదార్థము లస్థిత్వరహితములని తెలిసికొని బాధపడడు. ఆత దేద్వడు. బాధతో సింహము చీల్చినప్పు డేద్వడు. గోతుల

లోతుకు భయపడడు. కాని మన మది కేవలము తలంపే నని, సత్యము కాదని చూచుచున్నాము. ఈ స్వాప్నికవిషయము లోకవేళ నిజమనుకొందము. అట్టిచో ద్రష్ట పండుకొని యుండు ప్రక్కపై నీళ్ళు నిజముగనే ప్రవహించును. లేదా సింహము నిజముగానే ద్రష్టను చీల్చివేయును. కాని ఇది జరుగదు కదా! ద్రష్టనిజము కానట్లే, విషయములూ నిజముకావు. రెండూ కలసి స్వప్న మగుచున్నవి. రెండూ నిజమైనవి కావు.

బల్ల = x్బ + స

చెక్క = xచె + స

గులాబి = x్గు + స

బల్లయొక్క గుణములు అజ్ఞాతమైన మరొకటి కలసి బల్ల అయినవి.

చెక్క గుణములు అజ్ఞాతమైన మరొకటి కలసి చెక్క అయినవి.

గులాబి గుణములు అజ్ఞాతమైన మరొకటికలసి గులాబి అయినది.

గులాబి ఎర్రగా నుండును. దానికి రెక్క లుండును; ఇవియు అజ్ఞాతము కలసి గులాబిగ నైనవి. అజ్ఞాతము అన్నిటి లోనూ ఒకటియే. వానిలోని సత్యము ఆత్మయే.

ఇచ్చట రెండు ద్విసమ భుజ త్రికోణములు, ఒక చతు రస్రము కలవు.







వీటిని కూడబెట్టుటచే, వీటిలో దీని వంటిది కానట్టి యొక షడ్భుజపటము (Hexagon) వచ్చును. ద్విసమభుజ త్రికోణమందు చతురస్రమందు, అన్ని వైపులు సరిసమానములు కావు; కాని 'షడ్భుజపటమం దన్ని వైపులు సరిసమానములు. ద్విసమభుజ త్రికోణమందు (Acute) కోణములు తేవచ్చును. కాని షడ్భుజపటమం దట్లు తేలేము.'

ప్రతిదానియందు క్రొత్తదనమును కలిగిన యొక్క చిత్రమును నిర్మించినాము, ఈ చిత్రములను కూడ గలిపి.

అట్లే నీళ్లున్నవి. ఆమ్లజనిని, ఉదజనిని పుట్టించుట తేలిక. కాని రెండు కలిపిన నీరగును. అది పూర్తిగా వేరు పదార్థము కదా! ఆమ్లజని ఉదజని మందును, కాని నీ రట్లుకాదు గదా!

ఈ ఉపమానములు ప్రక్రియ లెందుకు నిజమైనట్లు కానవచ్చునో, తథాపి ద్రష్టాదృశ్యములు ఎందుకు సత్యములు కావో తెలియపఱుచును.

ఇదంతయు కేవలము శబ్దఘురి, వాగ్వినోదము అని వేదాంత మనును. మాటలకోసము కొట్లాట లెందుకు? నిజముగా ఆత్మయొక టే గలదు, అదే మనము; అదికాక మరొకటి లేదు; ఆత్మకాక మరొక టేమియు లేదుగాన నీ వొక భాగము (అంశము)నని చెప్పుకోలేవు. కాబట్టి నీవే అఖండమైన, అనంతమైన ఆత్మవు. సత్యమందు విభజన లుండజాలవు. నీవే ఇప్పుడు సత్యము.

ఓమ్! ఓమ్! ఓమ్!

## వేదాంతమును గూర్చిన కొన్ని ప్రశ్నలకు సమాధానము.

### 1902 డిశెంబరు 23 తేదీన సైన్సు ఎకాడెమివద్ద

నేడు ఏ ప్రత్యేక విషయముపైనకూడ ఉపన్యాస ముండదు. అనేకులు రామునివద్దకు వివిధ ప్రశ్నలతో వచ్చుచున్నారు. కొన్నిమారు లవి వింతగా నుండును. అందు కొన్ని ప్రశ్నల తీసికొని సంక్షిప్తసమాధానము లీయబడును. మీలో ఎవరైనగాని, అమెరికాలో ఏ ప్రాంతములోవారు గాని ఈ విషయముపై ఏమైన ప్రశ్న అడుగదలచిన చిన్న కాగితముపై ఆ ప్రశ్న వ్రాసి రామునకు పంపవచ్చును. ఆ ప్రశ్న ఈ హాలు లోనికో, మరొక చోటికో తేబడి వివరముగ ప్రత్యుత్తర మీయబడును.

ఈ ప్రశ్నల ప్రారంభింపకముందు, జనుల మనస్సుల యందుండు అన్ని ప్రశ్నలనుగూర్చి ఒక విషయము చెప్పవలెను. భారతీయదార్శనికుల పద్ధతి, యూరోపియన్ అమెరికన్ దార్శనికుల పద్ధతికి భిన్న మని మీకు తెలుసుకదా! భారతీయ దార్శనికు లొక విషయము తీసికొనినప్పుడు, దానిని గూర్చి ముందు ప్రస్తావించెదరు. ఆపై వీలైనట్టి, వేయుటకు సాధ్యపడునట్టి ప్రశ్నలన్ని తీసికొనబడును. రాముడుకూడ స్వయముగ ఈ అవస్థల నన్నిటిని దాటవలసివచ్చెను. ఎవరికైన తట్టుటకు వీలైన ప్రశ్నలన్నీ రామునియెదుట ఉండెను; అవి యొక సముద్రము. అందు కొన్ని రాముడు అయిదేండ్లవాడుగ నున్నప్పటి ప్రశ్నలు. మీరు వేయు కొన్ని ప్రశ్నలు

ఆతడు పదునైదేండ్లవాడుగానున్నప్పుడు బాధించిన ప్రశ్నలు. తక్కినవి కొన్ని రాముడు ఇరువది అయిదేండ్ల వాడుగా నున్నప్పుడు తట్టినవి.

ఈ ప్రశ్నలను గూర్చిన మరొక్కమాట. అందు కొన్ని దార్శనిక దృష్టియొక్క ప్రథమ సోపానమందలివి, కొన్ని రెండవ మెట్టువి, మరికొన్ని ఇంకొక మెట్టువి. యూక్లిడ్ మొదటి పుస్తకములోని 47వ సూత్రమును బోధింపమని ఒకడు వచ్చును. నీవు వెంటనే ఆ సూత్రమును తీసికొని బోధింప ప్రారంభించినచో, ఆ మనుష్యుడు 45, 46 సూత్రములగాని మొదటి సూత్రమునుగాని, అదికాక యూక్లిడ్‌లోని ప్రారంభిక నిర్వచనములు, నిలయములనుగాని ఎఱుగనిచో, ఆతనికి తృప్తి యగునట్లు 47 వ సూత్రము నెట్లు బోధింతువు? నీవు వెంటనే పని నారంభించి బోధింప సమకట్టిన, మొదటిలోనే నీకు 46 వ సూత్రము నుపయోగింపవలసిన పనివచ్చును; చదర మన నేమో వర్ణించవలసి వచ్చును. వచ్చినవాని కది ఏమో తెలియకపోవును. ఆపై నీకు 32 వ సూత్రము నుపయోగింపవలసిన అవసరమొచ్చును. వాని కదియు తెలియదు. అప్పుడిక వానికి 46, 32 సూత్రముల బోధింప ప్రారంభింతువు. వానిని ఋజువు చేయుటకు నీవు 16, 22 మొదలగు సూత్రములపై ఆధారపడవలసి వచ్చును ఇది పోయిపోయి చివరకు మొదటి సూత్రమందు పర్యవసించును. ఆపైన ప్రారంభిక నిర్వచనములు, నియమములు తెలియునట్లు చేయవలసి వచ్చును. ప్రతిది గందరగోళముగ నుండును. ఏదియు ఋజువుకాదు.

శాస్త్రమును దేనిని గందరగోళముతో చూడరాదు. పద్ధతిగా, దాని మార్గముగా దానిలో ప్రవేలుపెట్టవలెను. ఈ వేదాంతము, మతము, శాస్త్రము యూరోప్‌నందు శాస్త్రము (సైన్సు) నకును, మతమునకును వైరుధ్యము గలదు. కాని రాముడు మీకు చెప్పుబోధ రెంటికి సమన్వయము చేయును. అది తత్త్వశాస్త్రమును, సైన్సును, మతమును సమన్వయించును.

ఇది శాస్త్రములలోకెల్ల శాస్త్రముగావున, దీనిని ప్రారంభించునప్పుడు పద్ధతితోను, నియమము ప్రకారమును ప్రారంభింపవలెను. మీరు విన్న ఉపన్యాసములు ఇంతవరకు యీ దర్శన శాస్త్రములోనికి ప్రవేశించనేలేదు. ప్రత్యేకముగా వేదాంతదర్శనముపై ఒక్క ఉపన్యాస మేని యీయబడలేదు. కేవలము దాని అంతశ్శాఖల తడవుట అయినది; ప్రారంభిక ఉపన్యాసముల కొన్నిటి నిచ్చితిమి. ఈ ఆశ్చర్యకరమైన మతమును, శాస్త్రమును మీకు బాగా తెలియునట్లుచేయు అవకాశము రామునికి లభించునేని, మీ సంశయము లన్నియు ప్రశ్న లన్నియు సమసిపోవును.

కొంతమందికి ఓర్పులేదు. వారికి తమ ప్రశ్నలకు సమాధానము కావలెనని త్వరయుండును. సరే, అందులో కొన్ని ప్రశ్నలను తీసికొందుము. అవి వింతప్రశ్నలు.

నిన్నరాత్రో, మొన్నటిరాత్రో ఒక మనుష్యుడీ ప్రశ్న వేసెను. "అయ్యా! మీరు బోధించున దేమిటి?"

"మీ కాత్మ యున్నదా? మీ రాత్మయొక్క అస్తిత్వమును బోధింతురా? మీకు ఆత్మ యున్నదని విశ్వాసమున్నదా?" "లేదు; నా కాత్మ లేదు" అని రాముడు జవా బిచ్చెను. ఆయన కాశ్చర్యము వేసెను.

"ఆహా! ఇదేమి పైశాచికమతము; ఆయన కాత్మ లేదట." "నా కాత్మ లేదు" అను రాముని జవాబున కర్థమేమి? అమెరికా యూరోపులలో మత మన నేమి? కూర్చుండు సావసులను అలంకరించు పదార్థమది. ఇదిగో నాకు పెండ్లామున్నది. పిల్లలున్నారు. పెద్దయిల్లు, వాకిలిఉన్నవి. ఇదిగో నాకీ ఆస్తిఉన్నది. బ్యాంకులో ఇన్ని లక్షల డాలర్లున్నవి. ఇవి యన్ని యున్నవి; కాని నా కింకను కావలెను. ఈ కూడ బెట్టవలెనను ఆశకు లోనై ప్రోగుచేయవలె, జమకట్టవలె, నింపి వేయవలె, గుప్పిళ్లు నింపుకోవలె, ఇంకో వస్తువుకావలె, ఇంకొకటి కావలె నను ఆశకు లోనగుచున్నారు. బంధువుల చిత్రవులు లేనిదే గదిగోడ లందముగా నుండనట్లు, కొంచెము మతము లేనిదే నా కాస్తి యున్నను తృప్తి యుండదు. ఇతర వస్తువులతోపాటు నాకు ఆస్తికూడా యుండవలె. అయితే తది తర వస్తువులు ముందు కావలె. ఇది చిట్టచివరకు కావలె.

ఇచట కొందరి కింపుగాలేని ఇటువంటి మాటలు రాముని నోటినుండి జారెనేని, మీ రాతని క్షమింపవలె. రాము నికి వ్యక్తులకంటె సత్య మనిన గౌరవము; సత్యమును గౌర వించుటలో ఆతడు మీకు నిజమైన గౌరవము నిచ్చుచున్నాడు. ఎందుకన? ఆతని అభిప్రాయ ప్రకారము మీరే సత్యము. మీకీ

అనాత్మగాని, దేహము గాని కారు. సత్యము రాముని ఇటు వంటి మాటలాడుటకు బలవంత పెట్టుచున్నది. మామూలుగా ఈ దేశమందు చేయబడు ప్రార్థనలలో దేవు డే విధముగా నుపయోగింపబడుచున్నాడు? దేవుని చేరువకు నరు లే విధమున పోవుచున్నారు? బిడ్డకు రోగము వచ్చినపుడు, ఆస్తికి నష్టము సంప్రాప్తించినప్పుడు వాళ్లు దేవునివద్ద కొచ్చి, కండ్లను పైకెత్తి, చేతులనెత్తి "ఓ స్వర్గమందున్న దేవా! ఓమబ్బులం దున్న దేవా!" అని రంకెల వేయుదురు. మబ్బులలో కూర్చున్న దేవునికి పడిసెము పట్టునేమో యనిగూడా వారికి దయలేదు. అచటనున్న "ఓ దేవా! నా మీద దయగలిగి యుండుము; నా ఆస్తిని రక్షింపుము. నా శరీరమున కారోగ్య మిమ్ము; నా బిడ్డ కారోగ్య మిమ్ము." ఆహా! ఇదియా మతము? ఇదియా? ఇంటిలో ఏదేని సరిగా లేనినాడు, ఇల్లు కొంచెము మురికైన నాడు, ఇల్లుమరమ్మతులు చేయవలసిననాడు పాపమా దౌర్భాగ్యుడు రావలె. మాయిల్లు ఊడువవలె. ఈ ఉద్దేశ్యముతో నేగా దేవుని నమ్ముట. ఇదేగదా దేవుని ఉపయోగించుచున్న పద్ధతి. కేవలము నీచాదర్శములకేగా, యిచట మతము నుపయోగించునది. ఇదేనా మతము? ఇచట ముఖ్యవస్తువ శరీరము, అహంకారము, పెండ్లాము, బిడ్డలు; ఇక దేవుడినో, గదుల తుడుచుటకు, రుద్దుటకు తెచ్చెదరు. ఇంతేగదా నిజము?

ఇండియా యంతయు, కాకపోయినా, నిజముగా మతము గలవారి పరిస్థితులలో నైనా, వేదాంతబోధల వెలుగువలన పరిస్థితి భిన్నముగ నున్నది. "ఓయీ! మొదట స్వర్గసామ్రాజ్య

మును వెదకికొండు. ఆపై ప్రతిది మీాకు కట్టిపెట్టబడును" అన్న క్రీస్తుబోధ ఇచట చెవుల దూరకపోయినను, ఇండియాలో అది తీవ్రముగా అమలుపెట్టబడుచున్నది. శరీరము, మనస్సు, బంధువులు, ఆస్తి, లోకము ఇవన్నియు ప్రియతముని పాదములవద్ద సన్న్యసింపబడుచున్నవని దీని అర్థము. విశాల ప్రపంచమే గృహము. మంచిచేయుటయే మతము అగుచున్నది. అవసరమైనట్టి, ఆవశ్యకమైనట్టి ఒక్కవస్తువే సర్వస్వముగా చేయబడుచున్నది; తదితర వస్తువులన్నియు అప్రధానములుగాను, విదేశపు విషయములుగాను ఎంచబడుచున్నవి. అచట దేవునియందే గృహము (వసతి) అనుభవింపబడుచున్నది. ఈబహిర్గృహములు కేవలము సత్రమును, హోటళ్లువంటివి. వీరికిగూడ భార్యాబిడ్డల అవసరములతీర్చు పనియున్నది; కాని భార్యాబిడ్డలకు వారు తగిన విలువయే ఇచ్చెదరు. "నీ కాత్మ యున్నదా" యన్న ప్రశ్నకు జవాబుమాడుడు. అది అర్థములేని ప్రశ్న. నాకు శరీరమున్నది. ఇక ఆతడడుగునదో "నీ కాత్మ యున్నదా" యని. "నేనే ఆత్మను. నేనే అది" అని రాము డనునది. నేను శరీరము నైనట్లు ఆత్మ నా ఆస్థి అయినట్లు, "నీ కాత్మయున్నదా" యని యడుగుట ఎంత పిచ్చి? నేను ఆత్మను. నా కొక శరీరమున్నది. నాకు ప్రపంచమంతయు యున్నది.

మరొకడు రాము నీ ప్రశ్న వేసెను. "నీకు దేవునియందు నమ్మకమున్నదా ?" "నేను దేవుని ఎఱుగుదును" అని రాముడు చెప్పుచున్నాడు. మనము ఎఱుగని వస్తువును మనం నమ్ముటకద్దు. మనకు బలవంతముగా పరిచయము చేయు

వస్తువును మనము నమ్మెదము. మన తెలుకలేని వస్తువును మనము నమ్మెదము. దేవునియందు నమ్మిక ముండుట—అంటే అసలర్థ మేమిటి! దేవునిగూర్చి నీకేమి తెలుసు? "దేవుని నేనెఱుగుదును. నేనే వాడిని. నేనే వాడిని" ఆతడనున దేమన, "దేవుడు నీలో ఉన్నాడు" అని. రాముడు చెప్పునదేమన శరీరము, ప్రపంచము, దేవుని యందున్నవి అని. నేనే దేవుడను అందులో ఉన్నది ఎంతో భేదము. మనుష్యు డొకడు చచ్చి నప్పుడు, వాడు జీవుని విడినాడని (Gave up the ghost) ఇచట జనులందురు; శరీరమును విడినాడని భారతీయులందురు. రెండు దృక్కోణములోని భేదమును ఇది మే తెలియజేయును. వాడు జీవుని విడె ననుటకు శరీరమేనా, వాడి అసలాత్మ, దానికి కలుపబడ్డ కొసరా జీవుడు? శరీర మాతని ఆత్మయు, జీవుడు ఏదో వేరు పదార్థ మనియు అభిప్రాయమా? నేనే ఆత్మను, నేను శరీరమును విడెదను అని భారతీయు లందురు. నేను దుస్తులను మార్చుకొనినట్లు, శరీరమును వదలివేయు చుందును.

ఇచట మరొక ప్రశ్న యున్నది. "క్రిందా, మీదా అంతా దేవుడే అయినచో, ఇంతటిబాధ, దుఃఖము ప్రపంచంలో ఎందుకున్నవి?" దేవు డీ సర్వము, క్రిందా మీదా అంతా దేవుడే; నీవూ దేవుడే, నేనూ దేవుడే—అని వేదాంతము చెప్పునని మీకు తెలుసుకదా! నీవు దేవుని యందొక భాగమా (అంశమా) అని జనులడిగెదరు. కాదు కాదు; దేవుని విభజింప లేము; దేవుని కోయలేము; దేవుని వేరుగాచీల్చలేము. దేవుని

కర్తిరించుటకు వీలులేదు. నీవు దేవునియొక్క ఒక భాగము కాదు. దేవు డనంతుడయ్యే నేని, దేవుడనంత మేని, నీవు పూర్తి దేవుడవే. దేవుని భాగముకాదు.

క్రిందామీద అంతయు దేవుడే అయ్యేనేని, ఆతడు తన నొక దేహమందు బాధలోను, మరొక దేహమందు దారిద్ర్య మందు ఎందుకు ఉంచుకోవలెను? ఇండియాలో ఆతడు మహామారిని, దారిద్ర్యమునూ ఎందుకు తేవలె? అమెరికా యందు రాజకీయస్వాతంత్ర్య మెందుకు తేవలే, దేవుడొక శరీర మును నాలైదుకోట్ల రూపాయల కాసామీగా ఎందుకు చేయ వలె? మరొకశరీరమును దరిద్రదుర్బలస్థితియందు ఎందు కుంచ వలె? అత డ ట్లెందుకు చేయవలె? ఎంతటి అర్థహీనుడు!

ఈ ప్రశ్న వేయువానిని తృప్తిపరచుటకు యీ దేశ మందు ఇండియాయందుగూడ ప్రయత్నములు చేయబడు చుండును. ఎక్కువమంది కర్మసిద్ధాంతము నూతగా గొందురు. కార్యకారణ సిద్ధాంతమే కర్మసిద్ధాంతము; ప్రతివాడు తన విధికి తానే కర్త. ప్రతివాడు తన పరిసరములను, పరిస్థితులను తానంతట తానే సృష్టించుకొనునను సిద్ధాంతమే కర్మసిద్ధాం తము; అప్పుడు దేవుడు నిష్పక్షపాతి. జనులు తమ అదృష్టమును, తమ వైభవమును తామే సృష్టించుకొందురు. రాముడు కర్మసిద్ధాంతములో దిగవలసిన అవసరము లేదు. ఈ కార్యాచరణ సిద్ధాంతము ఇండియానుండి వచ్చుచున్నది; వేదాంతము దానిని అంగీకరించుచున్నది. అయితే అది **కేవలము ఇంద్రియ జగత్తుకుమాత్రమే వర్తించును. ప్రక్రియ**

(Phenomena) కు మాత్రమే వర్తించును. అది ప్రశ్నయొక్క మొదటికి వెళ్ళదు. పునర్జన్మ మున్నగువాని నన్నిటిని విశదము చేయు కర్మసిద్ధాంతము ప్రకారము నీ ప్రస్తుత పరిస్థితులు నీ పూర్వవాసనలయొక్క, కర్మలయొక్క ఫలితములు. కాన నీకున్న పరిస్థితులుగాని, పరిసరములుగాని, అదృష్టముగాని వైభవముగాని, నీ పూర్వవాసనల పూర్వ ఇచ్ఛల, పూర్వ కోర్కెల, పూర్వకర్మలవలన వచ్చినవి. గట్టిగా పరికించితి మేని, ఈ సిద్ధాంతము కేవలము సమస్యను ప్రక్కకు తీయు చున్నది. ప్రశ్నకు సరైన సమాధాన మీయుటలేదు. రాముడీ సిద్ధాంతమును కూలద్రోయబోవుటలేదు. రాముడు దాని నంగీకరించును. దాని నొప్పుకొనును. కాని యాతడు యీ ప్రశ్నయొక్క మరొక ఫలకమును వెలుతురులోనికి తెచ్చును. దానిని అమెరికాలోని జనులు లెక్కలో నుంచుకొనరు. లేదా వెనకవైపున ఉంచెదరు.

కర్మసిద్ధాంతము ప్రకారము పూర్వకర్మలు నీ ప్రస్తుత పరిస్థితులలోని భేదములకు కారణము. దీనినిబట్టి నీ పూర్వ జన్మలలోగూడ, నీ వెనుకటి జీవితములలోగూడ, నీ కర్మ లలో, వాంఛలలో, ఇచ్ఛలలో భేదముండిన దని తేలును. అప్పుడును కొందరు రోగులు, కొందరు దరిద్రులు, కొందరు శ్రీమంతులు. నీ వెనుకటి జన్మలోని భేదము లే కారణమున వచ్చినవి? నీ వెనుకటి జన్మలోని పరిస్థితులలోని భేదములకు కారణము ఆ వెనుకటి జన్మలోని భేదములు. ఈ మూడవ జన్మలోని భేదములకు కారణమేమి? ఇంకా అంతకు క్రిందటి

జన్మములలోని భేదముతే దానికి కారణము. ఇట్టి సిద్ధాంతము సమస్యను లక్షరెట్లు ఎక్కువ కష్టముగా చేయుచున్నది; ఎందు కనగా ఈ సిద్ధాంతముప్రకారము నీ పూర్వజన్మలు, క్రిందటి బ్రతుకులు, అన్నియు ప్రారంభమునుండి, ఆదినుండి (అన లాది అనున దున్నచో) భేదములుగలవియే; ఎల్లవ్వాటను భేదము, వైరుధ్యము ఉండనే ఉండినవి. ఇక ప్రశ్నకు సమాధాన మెట్లొచ్చినట్లు? అది ఇంకను క్లిష్టతరమైనది. మఱెంత బలము కూడుకొని ఇప్పుడీ ప్రశ్న ఇటుల బయల్వెడలును. "దేవుడు ప్రారంభమునుండి ఈ భేదముల నుండనిచ్చినా డేమి? అనాది నుండి దేవుడు తనను ఒకచోట భాగ్యవంతుడుగాను, మరొక చోట దరిద్రుడుగాను చేసుకొనినా డేమి? తనను తాను ఒకచోట రోగినిగాను, మరొకచోట పూర్ణారోగ్యవంతుడు గాను చేసికొనినాడేమి? ఎంత అర్థహీనముగా నున్న దిది! ఈ భేదము లుండు టేమిన్యాయము?" ఈ ప్రశ్న తాను నీకు వేయవలసినదిగాని, నీవు వేదాంతమును వేయవలసిన ప్రశ్నగా దని వేదాంత మనుచున్నది. ఇది నీవు జవాబు చెప్ప వలసిన ప్రశ్న. వేదాంతముమీద ఆ భారము లేదు. అది ఏకత్వమందు, సామరస్యమందు నమ్ముచున్నది; అయినను ఈ కనపడు నానాత్వ మెందులనో తెలియపరచుచున్నది.

ఉదాహరణకు ఒక నిరంకుశు డుండునేని, అతని యెదుట అతనికి భిన్నులైన అయిదుగురు వేర్వేరువ్యక్తు లుండిరేని, అతడు దేవునిస్థానమం దున్నా డనుకొంటిమేని, ఆ మనుష్యు లాతని సేవకులు, దాసులు, బానిస లాయెరేని, అతడు

వీరిలో ఒకనిని చీకటికొట్టులోను, రెండవవానిని అంద మైన తోటలోను, మూడవవానిని వైభవోపేత మైన భవనమందును, నాల్గవవానిని స్నానాంతరము అలంకరించు కొను గదిలోను ఉంచి, ఐదవ వానిపై హిమాలయ మంతటి పెద్ద బరువు రొమ్ముమీద పెట్టనేని, ఒకే పరి వీరందరిని తన పొట్టపై ఉంచుకొననేని, అటువంటి యజమానిని గురించి నీ వేమనుకొందువు? క్రూరుడు, అన్యాయి! దేవుడు ప్రాణులకు భిన్నుడై ఒకజాతిని సౌఖ్యముగాను, మరొకజాతిని దరిద్రులు గాను ఉంచెనేని, అట్టి యజమానినిగూర్చి నీవే మనుకొందువు? క్రూరుడు, క్రూరుడు, అన్యాయి, అన్యాయి! దేవుడు మానవు లకు భిన్నుడు అని తలచువారు జవాబు చెప్పవలసిన ప్రశ్న ఇది.

వేదాంతము దేవు డెక్కడో దూరముగ నున్నాడని నమ్మదు; కండ్లుమూసికొనిచూచిన అతడు లోననే ఉన్నాడు.

చూడుము. ఒక ప్రభువున్నా డనుకొనుము. అత డొక సారి తోటలోనికి, మరొకసారి భవనములోనికి, ఒకసారి చీకటి కొట్టులోనికి, మరొకసారి అలంకారపు గదిలోనికి, ఒక సారి వంటగదిలోనికి పోవు ననుకొనుము. అతనే పెద్ద బరువు క్రింద మరొకసారి యుండు ననుకొనుము. అతని నీ వే మందువు? అన్యాయి యుందువా? లేదు, లేదు. అతడు చీకటికొట్టు లోనికి, తోటలోనికి, భవనములోకి, అలంకారపు గదిలోనికి పంపిన మనుష్యులు అతనికన్న అన్యులై రేని, అతడు అన్యాయి యగును. కాని అలంకారము చేసికొనునది, ఇతరచోట్లకు

పోవునది ఈ అన్నిపనులు చేయునది అంతయూ ఆతడేకాబట్టి ఆతడు అన్యాయికాడు. దోష మంతయు ఆతనికి లేకుండ పోవును.

దేవుడు దుఃఖితులగు వారికిని, భాగ్యవంతులకును, దరిద్రులకును, భిన్నుడగునేని ఈ కానవచ్చు నానాత్వము, ఈ కానవచ్చు వైరుధ్యము, అతని ముఖముపై మచ్చ యగును. ఆతనికి దోషమగును. కాని, ఒకచోట భాగ్యవంతుడుగ నున్నది స్వయముగ దేవుడే, స్వయముగ రాముడే, స్వయముగ నేనే, ఒకచోట చీకటికొట్టులో నుండునది నేనే, అందముగ నున్నది నేనే, అసహ్యముగా నున్నది నేనే, తోటలో నున్నది నేనే, పాడుపడిన భవనములో నున్నది నేనే, నీవు తిట్టున దెవరిని, తిట్టువాడుకూడ నేనే. ఈ సంబంధములో చెప్పవలసినది మరొక టున్నది.

"నేను" అను శబ్దమును శరీరము లేక మనస్సు అను అర్థములో నుపయోగించు ఈ దేశములో వేదాంతమును బోధించుట కష్టము. ఈ దేశస్థులకు "నా కాత్మయున్న"దని చెప్పుట యలవాటు. "నేను" అనుదానికి వారు శరీరము, మనస్సు, బుద్ధి, జన్మించిన జీవుడు అని అర్థము చేసికొందురు. వేదాంతము నర్థముచేసికొనిన మనుష్యు డెప్పుడును "నేను" అనగా శరీర మనిగాని, మనస్సనిగాని, లేదా, జన్మగ్రస్థమగు శరీర మనిగాని, అర్థముచేసికొనడు. నే నిదికాదు; నే నేదైన అయితే నేని నేను దేవుడను.

ఈ వాక్యముల జూడుడు - నేనొక రాజును; నేనొక గుర్రమునకు యజమానిని; నేనొక స్వామిని, నేనొక అమెరికన్; నేనొక హిందువుడను ఈ వాక్యములు "నేను దేవుడను" అన్న వాక్యమునకంటె వేరు రకమైనవి. భేదమును చూడుము. "నే నొక రాజును" అనువాక్యములో "రాజు" అను శబ్దము బిరుదువలె నున్నది; నే నొక గుర్రమునకు యజమానిని" అను దానిలో "గుర్రమునకు యజమాని" అనునది పైన తొడుగు కొనిన చొక్కావలె నున్నది "నేను బీదవాడను" అని మన మని నప్పుడు బీదతనము ఒకటి; నేను మరొకటి; బీదతనముపైన తొడుగుకొనిన ఒకచొక్కావలె నున్నది. హిందువులు "నేను దేవుడను" అందురు. కాని చూడండి ఆకొద్ది అహంకారమునే నీ కట్టిపెట్టుకొని పైన దేవత్వమును చొక్కావలె తొడిగి కొనుటకు, దేవుడను శబ్దము బిరుదు కాదు, చొక్కా కాదు, గుణముకాదు. "నేను దేవుడను" అని నప్పుడు భారతీయుని అభిప్రాయ మది కాదు. అతని వాక్య మీ తీరున నుండును. ఈ పాముత్రాడు. చీకటిలో త్రాడును పాముగా భావించిన వాడొక డున్నా డనుకొనుడు. చుట్ట జుట్టిన త్రాడొకటి నేలపై యుండినది; వాడది జూచి పామను కొని భయపడి నేలపై పడెను. ఎవరో వచ్చి ఇట్లనును. "నాయనా, నాయనా, నీ పాము త్రాడే." దీని అర్థమేమి? నీవు పామని పొరపడినది పాముకాదు, త్రాడు, అని దీని అర్థము. ఈ వాక్యము నేనొక రాజును వంటి వాక్యము కాదు. ఇచట "పాము" అనుమాట విశేషణముకాదు.

"కాదు" అను శబ్దముకూడ విశేషణము (గుణము) కాదు; "ఈపాము నల్లనిది" అను వాక్యమని యుంటివేని అప్పుడు "నల్లని" అనుమాట "పాము" అనుమాటకు విశేషణమగును. కాని నీవు పా మొకట్ కాదు, అనినప్పుడు కాదు విశేషణము కాదు. అది గుర్తుంచుకొనండి కొంచెము కష్టముగా కన పడును, కాని ఒకసారి అర్థముచేసికొనండి; అపైన అభ్యంతర ములను తెచ్చుటకు మీ కధికారము లేదు; బాగా అర్థముచేసి కొనండి. "ఈపాము నల్లనిది" అనునది యొక రకపు వాక్యము, "ఈపా మొకట్ కాదు" అనునదొక రకపు వాక్యము.

అటులనే, "నేను దివ్యుడను (Godly)", "నేనొక దేవతను", అనున దొకరకపు వాక్యము; హిందువు "నేను దేవుడను" అనినప్పు డది మరియొకరకపు వాక్యము. అతడు 'నేను దేవుడను' అనినప్పుడు నేను శరీరమును కాను; అని అర్థము, నీవు నేను ఏమియని తలచు చున్నావో అది నేను కాను. నీవు నన్ను రక్తమాంసములుగా, అస్థికండరములుగా, పొరపడుచున్నావు; కాని అటులకాదు. నేను ఎముకలను గాదు, కండరములుకాదు. ఈ మూడున్నర క్యూబిట్లు కూడ కాదు, నేను మనస్సు కాదు, బుద్ధికాదు. నేను వేరుపుట్టును, నేను నిజమైన శక్తిని, అసలువస్తువను, సత్యదేవుడను; వాస్తవ మైన శక్తిని. నే నదిమాత్రమే, ఇతరము కాదు.

మరి కొందరు జనులు దేవుడు తమవలెనే సామాన్యు డయినట్లు తమ ముందరకు తెచ్చుటకు వీలైనట్లు, మామూలు వానిని శిక్షించినట్లు, దేవుని శిక్షించుటకు వీలైనట్లు తలచి,

దేవుని తమముందు బోనెక్కించి, "దేవు డది చేసినాడు" అని
అన గోరెదరు.

ఈ సంశయములకు, అభ్యంతరములకు కారణము ఒక
కథద్వారా తెలియ జెప్పవచ్చును.

ఇండియాలో పూర్వమొక తైలవర్తకు డుండెనువాడు
అతడు తనఇంట ఒక అందమైన చిలుకను పెంచుచుండెను.
ఒకనా డా తైలవర్తకుడు తన దుకాణము నొదిలి ఎచటికో
వెళ్ళెను. అతని సేవకుడుకూడ ఏదోపనిమీద వెళ్లెను. చిలుక
అచటనే దుకాణములో నుండెను. తైలవర్తకుడు లేనప్పుడు,
ఒకపెద్దపిల్లి వచ్చెను పిల్లినిచూడగనే చిలుక భయపడి
పోవును. అదిబోనులోనుండినను, భయపడిపోయి క్రిందకు
మీదకు ఎగురసాగెను. రెక్కల కొట్టుకొన సాగెను. ఇటునటు
ఎగురసాగెను, ఈ ఎగురుటలో గోడపై వ్రేలాడుచున్న
పంజరము జారి, క్రిందనున్న మిక్కిలి వెలగల తైలపుకుండపై
పడెను. కుండ బ్రద్దలై నూనె అంతయు కారిపోయెను. కొంత
తడ వున్నపిదప, తైలవర్తకు డొచ్చెను, వెలగల తైలము
పోవుటచే చాలకోపము వచ్చి మతిపోగొట్టుకొనెను. చిలుకపై
కోపమువచ్చి, అ దేదో కొంటెపని చేసినదని తలచి, చిలుక
పంజరమును కుండపై పడవేసి, తనకు 50 డాలర్ల నష్టము
కలుగచేసినదన్న కోపముతో అతడు వల్లుమాలిచెను. పంజరము
తలుపుతీసి, చిలుక నెత్తిపైనున్న జుట్టంతయు పీకివేసెను.
చిలుక బట్టతల దాయెను; దానితలపై ఈకయేలే దాయెను.
చిలుకతల నెత్తురుకారుచుండెను. చిలుక యజమానితో రెండు

వారముల వఱకు మాటాడలేదు. సంతోషపెట్టలేదు. యజమాని తాను చేసిన దానికెంతయో వగచెను. రెండువారముల తరువాత తెల్లవర్తకుని దుకాణమునకు కొనుట కెవఁడో వచ్చెను. వచ్చినవాడిది బట్టతల. చిలుక కడుపార నవ్వెను; తనవంటి వానినే మఱొకనిని చూచి ఎంతయో సంతసించెను. ఈ ఆనందమునకు కారణమేమని యజమాని దాని నడుగ చిలుక ఇట్లనెను. "తెల్లవర్తకునికి దాసుడుగా నుండవలసిన కర్మము నా కొక్కనికే పట్టనందుకు దేవునికి కృతజ్ఞుడను. ఈమనిషి కూడ ఎవరో తెల్లవర్తకునికి సేవకుడై యుండవలె. లేదేని అతని తలవెండ్రుకలు ఎట్లు పోగొట్టుకొనెను. తెల్లవర్తకుని సేవకుడు కానిదే బట్టతలవాఁ డెట్లాయెను?"

ఇటువంటి హేతువులనే కొందరుపయోగింతురు. వారు తాము చేయు పనులన్నియు, కర్తవ్యములన్నియు, చేయు ప్రతిదియు, ఏదోఒక ఉద్దేశ్యముతోనే నని తలచెదరు. వారు ప్రతిది ఏదోఒక స్వార్థపు కోరికతోడనో, ముందాలోచన తోడనో చేయుదురు. దేవుడు లోకమును సృష్టించినాడు: ఆయనకూడ ఏదోఒక ఉద్దేశ్యముతోడనే, ఏదోఒక కోరిక తోడనే, లేక ఏదో ఒకరకపు ముందాలోచనతోడనే సృష్టించి యుండును – అని వారందురు. ఇది పొరపాటువాదన. ఇది దేవుని సాంతునిగాచేయుట యన్నమాట. అతని అనంతుడని (అప్రమేయుడని) అనుటఎందుకు, మామూలు మనుష్యుని స్థితికి తీసుకువచ్చుట ఎందుకు? అది పనికిరాదు.

"దేవుడు ఖేదమునెందుకు కలిగించెను?" అను ప్రశ్నయే మరొకమనుష్యుడు రాముని ఇంకోవిధముగ నడిగెను. "సర్వము నేనే అయినచో నేనెందుకు బాధపడవలెను?" రాముడు మిమ్ముల నిది యడుగును. "నీ స్వప్నములలో, నీచుట్టునున్న దంతయు నీవుకాదా?" అంతయు నీవే. నీ స్వప్నములలో కొండలు, నదులు, అడవులు, ఇసుకఎడారులు అన్నియు నీచేతలే, నీపనులే, నీక్రియమే, నీపనితనమే, అయినప్పటికి — నీ స్వప్నములందు సింహమొకటి వచ్చును. నిన్ను తిన నారంభించును పామొకటివచ్చును. నిన్ను కరుచును, భూతమువంటి దేదో వచ్చును. నిన్ను భయపెట్టును. ఇటుల జరుగుటలేదా? అయినప్పటికిని నీవే ఆసింహము, నీవే ఆపెద్దపులివి, నీవే ఆపాము.

"నేను దేవుడనయినచో నాకు సమస్తము తెలియ దెందుకు?" అని మరొకప్రశ్న వేయబడెను.

రాముడు నీవు దేవుడవేనని బోధించు నని మీ రెఱుగుదురు. రాముడడుగునదేమన, "నాయనా, నీవు దేవుడవు కాక పోయినచో మరెవడవు? మాకు చెప్పుము" "నేను శరీరము" అని ఆతడనెను. సరే నీవు కేవలము ఈ అనాత్మవైన, నీవీ శరీరమైన నీ తలపై ఎన్ని వెంట్రుక లున్నవో మాకు చెప్పుము. తల నీదికాదా? ఆతడవు ననెను. తల నీదైనచో నీ తలపై నున్న వెంట్రుకల సంఖ్య ఎంతో చెప్పుము. నీ కెన్ని ఎముకలో చెప్పుము. (ఈ మనుష్యునికి శరీర నిర్మాణ శాస్త్రమే మాత్రము తెలియదాయెను) నీ కెన్ని కండరము లున్నవో

చెప్పుము. నీ వీ ఉదయము భోజనము చేయలేదా? అయితే నీ వీ ప్రొద్దు తినిన తిండి ఎచట నున్నదో మాకు తెలుపుము. అది పేగులలో నున్నదా, ఉలవకాయలలో నున్నదా, పొట్టలో నున్నదా, ఊపిరితిత్తులలో నున్నదా ఎక్కడనున్నది? అతడు జవా బియ్యలేకపోయెను. రాము డనున దేమన నీ తలపై నున్న వెంట్రుక లెన్నియో నీవు చెప్పలేకపోయితివి. అయినప్పటికి వెంట్రుకలు నీవేకదా, నీకున్న ఎముకలు కండరములు ఎన్నో నీవు చెప్పగలిగియున్నను, లేకపోయినను ఎముకలు కండరములు నీవే. నీ వీ ఉదయము తినిన తిండి ఎచట నున్నదో నీవు చెప్పగలిగినను, లేకపోయినను శరీరము నీదే, తినినది నీవే మరొకరెవ్వరు కాదు. అటులనే నీ బుద్ధి ఆకాశమందున్న నక్షత్రము లెన్నియో చెప్పగలిగినను, లేకపోయినను నక్షత్రము లన్నియు నీవే. ఇంగ్లండులో ఇప్పుడేమి జరుగుచున్నదో నీ బుద్ధి చెప్పగల్గినను చెప్పలేకపోయినను ఇంగ్లండు నీదే. మెర్క్యురీ గ్రహమందేమి జరుగుచున్నదో నీవు చెప్పగలిగినను చెప్ప లేక పోయినను, మెర్క్యురీ గ్రహము నీదే. నీ వీవిషయములు చెప్పలేకపోయినంత మాత్రమున అవి నీవి కా వని తేలదు. ఈ విషయముల చెప్పిన దెవరు? ఈ విషయముల చెప్పుట అంతము కలదాని (Finite) పని. (గోడపై నున్న చిత్రము నొకదానిని చూపించుచు) ఆ చిత్ర మెక్కడ నున్నదో మీరు చెప్పగల్గెదరు. ఎందుకన ఆ చిత్ర మిచట నున్న దని నీకు తెలుసును. నీవు చిత్రముకావు; ద్రష్టాదృశ్యములు భిన్నములు "నీవు" అనుమాట అపార్థము చేసికొనబడు చున్నందు

వలన, ఆ చిత్రము నీ కంటే అన్యము గావున ఆ చిత్ర మేమో నీవు చెప్పగలుగుచున్నావు. కాని నీ వా చిత్రమే అయినచో, సమస్తము నీవే అయినచో, నీవుతప్ప అన్యమేమియు లేక పోయినచో, నీ వప్రమేయుడ (అనంతుడవు) వయినచో, నిన్ను పరిమితునిగా చేయుటకు మ రేమియు లేకపోయినచో, నిన్ను గూర్చి ఎవరు చెప్పగలైదరు? ఇటుల చెప్పుట చూచుట అచట ఆగిపోవును. అది అచటికి పోలేదు. మాట లచ్చటికి చేరలేవు. నతత్రవాగ్ గచ్ఛతి.

మరొకడీ ప్రశ్న వేసెను. "నీ వే సాంప్రదాయమునకు చెందియున్నావు? నీవు హిందువుడవా? బ్రాహ్మణుడవా?" "కాదు" అని రాముడు చెప్పెను. "నీవు క్రైస్తవుడవా? యూహుదీ వా? నీ వెవరు? నీవే సాంప్రదాయమునకు, ఏమతమునకు, ఏ సమాజమునకు చెందియున్నావు?" ఒకవస్తువ ఒకనికి చెందియుండినచో, అదియాతనిసొత్తు; చైతన్యము లేని వస్తువో, జంతువో, ఎవరికైన చెందియుండును. ఈ వస్తువులు ఎవరి కేని ఆస్తిఅయి యుండును ఎవరి కేని చెందియుండును. కాని రాముడు చైతన్యము లేని వస్తువ కాదు; రాముడు ఒకరికి చెందియుండుటకు ఆస్తి కాదు. పశువు కాదు. అత నెవరికైన ఎందుకు చెందియుండవలె? విశాలప్రపంచ మంతయు అతనికి చెందియున్నది. అమెరికా రామునిది, రాముడు నీ స్వంత ఆత్మ. మీరందరు నాకు చెందియున్నారు. ఇండియాకూడ నాకు చెందియున్నది. క్రైస్తవ మతము, మహామ్మదీయ

మతము, యూహుదీమతము, హిందూమతము, వేదాంతము అన్నియు నాకు చెందియున్నవి.

కొందరు తమ స్వాతంత్ర్యము నమ్మి కొందరు గాక; కాని మీ రెన్నడు అటుల వలదు.

ఈ దేశమందు జనులు స్వాతంత్ర్యముగ నున్నా మని చెప్పుదురు. వారికి బహుశా రాజకీయస్వాతంత్ర మున్న దేమో, కాని యావత్! అమెరికాలో నున్న మత బానిసత్వము, సాంఘికబానిసత్వము రాముడు మీకు స్వాధీనతను, స్వాతంత్ర్యమును, మానసిక స్వాతంత్ర్యమును, కర్మ స్వాతంత్ర్యమును తీసికొని వచ్చినాడు. రాముడు తీసికొచ్చిన మతమును కొందరు వేదాంత మని పేరు పెట్టినారు. కాని దానికి పేరు వర్తించదు. నిజమైన వేదాంతము వేదములలో మాత్రమే లేదు. అది మీ హృదయములో నున్నది కాబట్టి రాముడు భారతీయుడుమాత్రమే కాదని మీకు నొక్కి చెప్పుచున్నాడు. రాముడు అమెరికన్ కూడ; రాముని హిందువుగా మాత్రమే తలపకుడు. రాముడు క్రైస్తవుడుకూడ; ఈ సాంప్రదాయము యొక్కగాని, ఆ సిద్ధాంతముయొక్కగాని దాసునిగా రాముని భావింపవద్దు; రాముడు మీ ఆత్మయే, స్వయముగ స్వాతంత్ర్యమే.

మరొక మనుష్యుడొచ్చి ఇటు లనెను "నరే నీవు దేవుడ వయినచో, నీవు క్రైస్తువలె నయినచో క్రైస్టు ఇది చేసినాడు; అదిచేసినాడు. క్రైస్టు ఈఆశ్చర్యమును(Miracle)చేసెను. దయ

చేసి మాకీ ఆశ్చర్యమును చేసి చూపుము; అప్పుడు మేము నిన్ను నమ్మెదము." రాము డనున దేమన "నాయనా! నాయనా, క్రైస్టు ఎన్నో ఆశ్చర్యములు జేసెను. అతని నమ్మక పోయిరి. అతనిని వేటాడిరి. శిలువకు మేకులు కొట్టిరి. ఆశ్చర్యములు మిమ్ములను నమ్మునట్లు చేయగల్గునా? తప్పక చేయ లేవు."

కాక ఆశ్చర్యముల చేయుట యనిన నేమి? ఏమి టది? ఈ శరీరము లోకమం దున్న ఆశ్చర్యముల నన్నిటిని చేసినను, అది నా దేవత్వమునకు కొంచమేని కొసరును కలుపదు. నే నీ శరీరమును కాదు; నేను నీ ఆత్మనే. ఈ శరీరము ఆశ్చర్యముల జేసిన అదేమి? ఆ శరీరము ఆశ్చర్యముల జేయుట లేదుగా! అదికూడ నేనేగా; ఈ శరీరము ఆశ్చర్యముల జేసిన నీ వీ శరీరమునే దేవునిగా జేయుదువు, అది పెద్దచిక్కు, నీ వటుల చేయ రాదు. రాముడు మీ ఆత్మనే దేవుడుగా చేసికొమని కోరుచున్నాడు. ఈ శరీరమును దేవునిగా చేయకుము. ఆశ్చర్యముల జేసి ఈ ప్రత్యేకవ్యక్తిత్వమును మీపై బలవంతముగా పెట్టి రాముడు మీ స్వాతంత్ర్యమును తీసివేయగోరుటలేదు. పూర్వపు ప్రవక్తలు చేసినట్లు రాముడు మిమ్ములను బానిసలనుగ జేసి మీ స్వాతంత్ర్యమును తీసివేయరాడు.

మీ రీ శరీరము ఆశ్చర్యములను చేయవలె నని కోరుచున్నారు. కాని నే నీ శరీరమును గాను; ఈ లోకమను ఆశ్చర్యమును ఈవలకే తయారుచేసిన దేవుడను నేనే. ఈ

విశాల ప్రపంచమును నేను చేసిన యాశ్చర్యము; ఈ ప్రపంచ మంతయు ఎవరి పనితనమో ఆ దేవుడను నేనే.

ఇండియాలో ఈ శరీరముంటుండిన ఇంటిలో ఒక కుర్ర వాడు పనిచేయుచుండే వాడు. ఎల్లప్పుడు రాముని సహవాస మున నుండుటవలన ఆ కుర్రవాడొకనాడు ఒక పెద్ద భవంతిపై నడచుచు "నేను దేవుడను, నేను దేవుడను, నేను దేవుడను" అని కేకలు వేయుచుండెను. ఆ యింటి పొరిగిండ్లలో కొందరు జను లుండిరి. వా రతనితో ని ట్లనిరి. "ఏమిటి నీ రంకెలు? ఏమిటి నీ వనునది? నీవు దేవుడ వనా చెప్పునది? నీవు దేవుడవైనచో కప్పుపై నుండి క్రిందకు దూకి దెబ్బ తగలకుండనో లేదో మాకు చూపింపుము. నీ కేమియు గాయము తగిలినచో నీవు దేవుడ వని నమ్మెదము. నీకు దెబ్బ తగలనిచో నిన్ను చంపివేసెదము; నిన్ను వేటాడెదము. నీవ ట్లేల ప్రేలుచున్నావు. ? ఈ పాడు మాట లనుటకు నీ కధికారము లేదు."

దివ్యోన్మాదముతో నిండియున్న ఆ కుర్రడు ఇట్లనెను. "ఓ నా ఆత్మా! నేను క్రిందికి దూకుటకు సిద్ధముగ నున్నాను. నీవు చూపిన ఏ గోతిలోకైన దూకుటకు సిద్ధముగా నున్నాను; నీవు సైగ చేసిన ఏ సముద్రములో దూకుటకైన సంసిద్ధుడను; కాని దయతో న నీవలకే లేనిచో టేదో చూపించుము; ఎందు కన క్రిందకు దూకవలె నన్ను దూకుటకు ఈ వలకు మనము లేనట్టి చో టొకటి యుండవలెకదా! నేను లేనట్టి, నేను వినా యున్నట్టి చో టేదో నాకు చూపుడు. నేనే దేవాదిదేవుడను. నేను లేనట్టిచోటు నాకు చూపించుడు. నేను దూకెదను. అంత

పైన్నుకు విరుద్ధములు కావు; మీ నేటి ఆవిష్కారములు, కనుగొన్న విషయములు శృతిరాణి పాదముల కడుగుచున్నవి. అవి వేదాంతమునకు మరింత మరింత ఊతనిచ్చు చున్నవి.

వేదములను పక్షపాతరహితముగ చదివిన వారందఱు వానిని ప్రశంసించినారు. ఇతరుల దర్శనము నెన్నడు ప్రశంసింపని, దార్శనికుడగు శోఫెన్‌హోర్ తనది కాని దర్శనములపై నన్నిటిమీద తిట్లను నూరిపోసినాడు: ఆ శోఫెన్‌హోర్ వేదముల గూర్చి మాట్లాడునప్పు డిట్లన్నాడు. "ప్రపంచమందు ఉపనిషత్తులవంటి ఉదారమైన, ఉపకారకమైన అధ్యయనగ్రంథము మరొకటి లేదు. అది నా జీవితమునకు మేలుబంతి అయినది. నా మరణమునకుకూడ అది మేలుబంతి కాగలదు."

శోఫెన్‌హోర్ మాటల ననువదించుచు మేక్సుముల్లర్ ఇట్లనినాడు. "అంతటి స్వతంత్రుడగు దార్శనికుని మాటలగూడ సమర్థింపవలసిన అగత్య మున్నదేని, ఈ ప్రపంచమందుగల మతము లన్నిటిని యూరోప్ దర్శనముల నన్నిటిని చదివిన బలముతో నేను సవినయముగ శోఫెన్‌హోర్ అనుభవమును బలపఱచు చున్నాను."

దర్శనశాస్త్రము ఆనందకరమైన మరణమునకు తయారు చేయున దైనచో, వేదాంతముకంటె ఉత్కృష్టమగు దర్శనము నాకు కానరాదు.

మరొక డీప్రశ్న వేసెను. "చూడండి! మీ వేదాంతము ఇండియా నాల్గుగోడలమధ్యమాత్రమే బంధింపబడి యున్నది."

ఇప్పుడు ఆలోచన చేయబడుచున్న ప్రశ్నలు చాలాముఖ్యమైనవి. ఆకర్షణీయమైనవి. ఆత ననున దేమన క్రైస్తవమతము ప్రపంచ మంతటా వ్యాపించినది. లోక మంతటా క్రైస్తవమతమే రాజ్యము చేయుచున్నది; కాని మీా వేదాంతము ఇండియా సరిహద్దులలోపలనే కృశించుచున్నది. అచటను అది చదువు కొన్న కొలదిమంది మతమే; జన సామాన్యపుమతము కాదు. రాముడు చెప్పిన దేమన క్రైస్తవమతమే జాతులను పరిపాలించు దైనచో ఎంతయో బాగుండెడిది; క్రైస్తవమతము యూరోప్‌లో నిజముగా అమలులో నుండినచో రాముని కది యెంతయో ఆనందకరమయ్యెడిది. కాని యూరోప్ అమెరికాలలో అమలునందున్నది క్రైస్తవమతము కాదు; చర్చిమతము. అది చర్చి మతము - క్రైస్తవమతము కాదు.

కాక వాస్తవమైన క్రైస్తవమతము జనసామాన్యమందు వ్యాపించినదని తలతువేని, అట్లు వ్యాపించుట దాని బలమును సూచించుచున్న దని తలతువేని సాయినా పొరపడకుము. క్రైస్తవమతమునకంటే సైతానుమతమున కనుచరులు మెండు. దుర్మార్గము, దురిచ్ఛలు, విరోధము, అసూయ, కామము, విషయ లిప్స — ఇది సైతానుమతమునిన; క్రైస్తవ మతమున కంటే ఈ సైతానుమతమే ఎక్కువగా వ్యాపించియున్నది.

లండనులో పార్లమెంటులో ఒక గొప్పవక్త నొకసారి గేలిచేసిరి. తరువాత ఆతని నేమనెనో మీాకు తెలుసా? "మీా వైపున అధికసంఖ్యాకులున్నచో దానివలన అయిన దేమిటి?" ఎదుట పార్టీతో ఆత డిట్లనెను, "అభిప్రాయములను తూచ

వలెను. వాటిని లెక్కపెట్టరాదు." జనబాహుళ్యము సత్యమును ఋజువుచేయజాలదు.

కోపర్నికస్ సిద్ధాంతమును గెలిలియో నిలబెట్టిన రోజులున్నవి; భూమి తిరుగుచున్నది. సూర్యుడు కాదు అని అతడనెను. అప్పు డాతడు ఒక్కడే అటు లనునది. ప్రపంచమంతయు అతనికి వ్యతిరిక్తముగ నుండెను; జనబాహుళ్య మాతనికి వ్యతిరిక్తముగ నుండెను కాని నే డేది సత్యము? సత్యము జనబాహుళ్యమువైపున నున్నదా? కొలదిమందివైపునా? జనబాహుళ్యము, కొలది జనముండుట రెండును లెక్కలోని కావు. ఒకప్పుడు రోమన్ కేథోలిక్ మతము వైపునే జనబాహుళ్య ముండెను. నేడది ఎదురు తిరిగినది. పదనొకండుమంది శిష్యులకు మాత్రమే చెందియుండినది ఒకప్పుడు క్రైస్తవ మతము. ఈ క్రైస్తవమతమునకే, ఈ చర్చి మతమునకే చూచుటకెంతో జనబాహుళ్యముండు సమయ మొచ్చినది. జనబాహుళ్యము, జనుల బలములేకుండుట ఇవి లెక్కలోనివికావు. మేము స్థిరమగు శిలపై నిల్చొని యున్నాము. మేము సత్యముపై నిలబడినాము, సత్యమే బయటికి రావలయును.

ఇంకొకడు ఇటు లడిగెను. "చూడుము, ప్రపంచమందు అభ్యుదయ మంతయు క్రైస్తవ జాతులపాలే అగుచున్నదేల? ప్రగతి నాగరికత యున్నది క్రైస్తవ జాతులకేగదా! రాముడు చెప్పిన దేమన, "అన్నా! యూరప్ అమెరికాలు" ఇండియా చైనా జపానులకంటే రాజకీయ సాంఘిక విషయములలో ముందడుగు వేసియున్నచో దానికి కారణము క్రైస్తవ

మతము కాదు. తప్పుడు తర్కము నుపయోగించకుము నాగరికత నైన్యుయందలి ప్రగతి మున్నగున దంతయు క్రైస్తవ మతమువలననే అయినచో గెలిలియో ఆ చిన్న క్రొత్తవిషయమును కనిపెట్టినప్పుడు క్రైస్తవు లాతనిపట్లఎటుల ప్రవర్తించిరో, ఆతని నేమి జేసిరో దయచేసి చెప్పుము. బ్రూనోను తగులబెట్టిరి. ఎవ రాతనిని తగులబెట్టినది ? క్రైస్తవమతము—క్రైస్తవమతము. హక్స్లీ స్పెన్సర్ డార్విను లు మీా క్రైస్తవ మతమును కోరివిలోనే కదా బ్రతికినది. వారి విజ్ఞానము అభ్యుదయము, స్వాతంత్ర్యము, వీటిని ప్రోత్సాహించినది పెంపొందించినది క్రైస్తవమతము కాదు. క్రైస్తవమతము యొక్క అనేక దౌర్జన్యములక్రిందనుండియే వారటుల పైకి రాగలిగిరి. శోపెన్‌హోర్ కు ఏగతి పట్టెను ? ఆత డెటుల బ్రతికెనో మీాకు తెలుసా ? క్రైస్తు ఎంతటి త్యాగము చేసెనో శోపెన్‌హోర్ కూడ అంతటి త్యాగము చేసెను. క్రైస్తు తన అభిప్రాయములకొఱకు చచ్చెను. శోపెన్‌హోర్ తన యభిప్రాయములకొఱకు బ్రతికెను. అభిప్రాయములకొఱకు బ్రతుకుటకంటే చచ్చుట సులభమని మీాకు తెలుసునుకదా! శోపెన్‌హోర్ యొక్క స్వాతంత్ర్యమున కడ్డుపడిన దేదో మీాకు తెలుసా ? అతని అంతిమ గ్రంథములలో మొదటి వ్రాతలలో నున్న బలము, చేవ లేకుండ పోయెను. హెగెల్ కాంటుల దర్శనములలో నున్న బలహీనత దబ్బరకము క్రైస్తవమతము వలన వచ్చినవే. ఫిక్టే తన ఆచార్యపదవి నెందుకు వదులుకొని వ్రలసివచ్చినను దేశమునుండి ఎందుకు తరిమివేయబడెను ? అదీ క్రైస్తవమతము. మొదటినుండియు ప్రగతియంతయు క్రైస్తవ

మతమున్నను ఎటులనో సాగుచునే వచ్చినది. అంతేగాని క్రైస్త
వమత ముండుటవలన సాగినదికాదు. వస్తుస్థితిని తారుమారు
చేయకుడు.

ఇండియాలో కొంతకాలముండిన యాంగ్లోఇండియను ఒకడు ఇంగ్లాండునకు తిరిగివచ్చిన పిదప ఒకనాడు పెండ్లాముతో తన ధైర్యసాహసములగూర్చి ప్రస్తుతించుచుండెను. వారు తమ పల్లెటూరిఇంటిలో ఉంటుండిరి. అప్పుడు అక్కడికి ఒక ఎలుగుగొడ్డు వచ్చెను. ఈ యాంగ్లోఇండియన్ వెంటనే ప్రక్కనున్న చెట్టుపై కెగబాకెను ఆతని భార్య ఏదో ఆయుధమును తీసుకొని ఆ ఎలుగుగొడ్డును చంపెను. ఆ పై వాడు చెట్టుదిగెను. వారున్న చోటికి మరికొందరువచ్చి ఎలుగుగొడ్డును చంపిన దెవరని యడిగిరి. వాడు "నేను నా భార్య కలసి చంపితి" మని చెప్పెను. కాని అసలట్లు కాదుగా. అటులనే ఏదేని విషయము నెవరైన చేసినప్పుడు ఆ పని నా వలననే అయినదనియో లేక అది క్రైస్తవమతముద్వారా ఆయినదనియో యనుట అసత్యము.

సైన్సునందలి, ప్రగతి యూరప్ అమెరికాల తత్వశాస్త్ర మందలి అభ్యుదయము ఈ క్రొత్త విషయములను కనుగొనుట. ఈ ఆవిష్కారములు ఇవన్నియు వేదాంత సూక్తుల నమలలో పెట్టుటవలన వచ్చినవే. వేదాంతమనగా స్వేచ్ఛ,స్వాతంత్ర్యము. ఇవన్నియు స్వాతంత్ర్యపు స్వేచ్ఛయొక్క స్వాధీనతయొక్క శారీరక వాంఛల నతిక్రమించు ధైర్యము యొక్క ఫలితములే. ఈ ప్రగతియంతయు దానివలన వచ్చినదే? అనగా వేదాంత మును తమకు తెలియకుండగనే అమలులో బెట్టుటవలన వచ్చి

నదే; దానిని మీరు నిజమైన క్రైస్తవమత మనవచ్చును. మీరు సరిగా అర్థముచేసికొనిన నిజమైన క్రైస్తవమతము వేదాంతమునకు భిన్నము కాదు. భూమిమీద బానిసత్వమును లేకుండచేసినామనియు, ఎన్నో క్రొత్తలను దెచ్చినామనియు వారందురు. రాము దనున దేమన "సోదరులారా! సోదరులారా! బానిసత్వము తీసివేయబడినది; బానిసత్వము తీసివేయబడినచో రామునికెంత ఇష్టము." బానిసత్వము తీసివేయబడినదను మాట నొప్పికొంటిమేని, అది క్రైస్తవమతమువలన జరిగిన పని కాదు. బానిసత్వమును నిర్మూలముచేయున దేదైన క్రైస్తవ మతమునందున్నచో పోయిన 1700 ఏండ్లలో క్రైస్తవ మతము బానిసత్వము నేల తీసివేయలేదు ? మరొకటున్నది. జను లమెరికాకు వచ్చిరి. యూరపియన్ జాతులు ఒకచోటి నుండి మరొకచోటికి పోవుచుండిరి. ఇతరజాతులతో పరిచయము లేర్పరచుకొనుచుండిరి. ఆ మూలముగా వారికి బుద్ధి వికసించుచుండెను. ఇదే అనుభవవేదాంతము. అది బానిసత్వ నిర్మూలనమునకు కారణము; క్రైస్తవమతము కాదు రాజకీయ సాంఘిక పరిస్థితులు మనుష్యుల హృదయ మస్తిష్క ములకదల్చివేసెను. మంచి పను లన్నియు క్రైస్తవమతము వనే అయినచో ఘోరయాతనలు మంత్రగత్తెలను కాల్చుట, ఉరికంబము ఇవన్నియు దేనివలన? *ఘోరయాతన లన నేమో మీకు తెలుసా ? అదొకప్పుడు శాన్ ఫ్రాన్‌సిస్కోలో కూడ

---

* Inquisition (సరైన తెలుగుమాటలు దొరకలేదు) పోప్ క్రింద యుండి మతద్వేషులని తలపబడిన వారిని హింసించుట కేర్పడిన సంస్థ.

నుండినది. ఘోరము! ఘోరము! గుండెలనుండి నెత్తురు లాగుట మున్నగునవి. రాముడు వీని నన్నిటిగూర్చి చెప్పదలచ లేదు.

రాముడు చాల ప్రశ్నోత్తరముల దాటవేయ బోవు చున్నాడు. వాటిని మరొకసారి తీసికొందము.

మరొక ప్రశ్న—"ఇండియా రాజకీయముగా అంతటి అథః పాతాళమున నెందుకున్నది?" ఇండియా పతనమునకు వారు వేదాంతమే కారణమందురు. కాదు కాదు ఇండియా పతన మునకు కారణము వేదాంతరాహిత్యమే. తాను ప్రతిదేశమునకు చెందియున్నానని రాముడు మీకు చెప్పియున్నాడని మీ రెఱుగుదురుగదా! రాముడు మీ వద్దకు భారతీయుడుగా గాని హిందువుగా గాక, వేదాంతిగా గాని రాలేదు. రాముడు రాముడుగానే వచ్చుచున్నాడు. అనగా సర్వవ్యాపకుడుగానే వచ్చుచున్నాడు. రాముడు మిమ్ములగాని, భారతీయులనుగాని ప్రశంసింపగోరడు. రాముడు ఇండియాయనిగాని, అమెరికా యని గాని, మరొక యే మొండిపట్టుదలపై గాని నిల్వాడు: రాముడు సత్యముపై, పూర్ణసత్యముపై నిల్చును. సత్యము కానిదానిపై గాదు; ఇక ఆ బలముపైననే ఆ దృక్కోణము. తోడనే చెప్పునదంతయు రాముడు చెప్పును. రాము డిండి యానుగాని, అమెరికానుగాని ప్రశంసింపగోరడు వాస్తవ మే మన వేదాంతము ఇండియా జనసామాన్యములో ప్రచా రములో నున్నంతకాలము ఇండియా వైభవ శిఖరములపై నుండెను. ఏకచ్ఛత్రముగ నుండెను. శ్రీమంతముగా నుండెను

ఈ వేదాంతము ఒక ప్రత్యేకవర్గమువారి చేతులలో బడిన కాలము దాపురించెను; అప్పుడు దానిని జనసామాన్యము వద్దకు పోనీయక అరికట్టిరి నాటినుండి ఇండియాపతన మారంభించెను. వేదాంతము ప్రజాసామాన్యము నంటనీయలేదు; ఇండియా ప్రజలు — నేను బానిసను, నేను బానిసను. ఓ దేవుడా! నేను నీ బానిసను — అను నొక మతములో విశ్వసింప సాగిరి. ఈ మతము యూరోపునుండి ఇండియాలోనికి దిగుమతి కాయెను. ఐతిహాసికులు, తార్కికులు అనబడువారిని మాట ఆశ్చర్యపెట్టవచ్చును యూరోపియన్ల నిది ఆశ్చర్యపెట్టవచ్చును. కాని ఈమాటను రాము డాలోచన లేకుండ అనలేదు. ఈ మాటను గణిత శాస్త్రమునందలి సిద్ధాంతములను ఋజువు చేసినంతటి స్పష్టముగా ఋజువు చేయవచ్చును. సిద్ధాంతీకరించ వచ్చును. ఆత్మను తక్కువగా చూచుకొని ఆత్మను అణచుకొని మనలను మనము, పురుగులుగాను, నల్లులుగాను, దెయ్యములు, బానిసలుగాను, పాపులుగను పిలుచుకొమ్మను మతము ఇండియాలోనికి దిగుమతి చేయబడెను. అది జనసామాన్యపుమతము కాగానే ఇండియాపతనము ప్రారంభమాయెను. యూరోపియన్ల అమెరికన్ల సంగతి ఏమి? యూరోపియన్లు కూడ 'దేవుడా మేము నీబానిసలము; అను బానిసత్వములో విశ్వసించు చున్నారు. రాజకీయ నాయకుల దృష్ట్యా ఇండియన్లు పడిన పాటును వీ రేల పడలేదు? ఉత్క్రాంతి వాదులు (Evolutionists) ప్రకృతి శాస్త్రజ్ఞులు తరచుగా చెప్పుకథ ఒకటి ఈ విషయమును స్పష్టము చేయును. కొన్నిసార్లు బలహీనతయే బ్రతుకుదెరువు (Survirval) నకు కారణ మని

వా రందురు; ఎల్లప్పుడు తగిన వారే(బలశాలులే)గెలచి కొచ్చెద రనునది లేదు అని వారి అభిప్రాయము. ఓమ్.

ఒక మిడుతల దండొకసారి ఒకదిక్కుకు పోవుచుండెను. అందుకొన్ని రెక్కల పోగొట్టుకొని దారిలో క్రిందపడి పోయెను. ఆరోగ్యముగ నున్న మిగిలిన మిడుతలు సాగిపోయెను. చివరకు అవి ఒక కొండదగ్గరికి పోగా ఆకొండకు నిప్పంటుకొని రాజుచుండుటచే అవియన్నియు నశించెను. ఇచట ఇటుల బలహీన మైనవి బ్రతికెను. బలము గలవి నశించెను.

భారతీయు లేమైన యని నప్పుడు అది హృదయ పూర్వకముగా నందురు. వారు నిష్కపటులు. వారు మతముచే సర్వస్వముగ చేసికొనిరి "ఓ దేవుడా! ఓ దేవుడా! నేను నీ బానిసను. ఓ దేవుడా! నేను నీ దరిద్ర బానిసను. ఓ దేవుడా! నేను పాపిని" అని ప్రార్థించినప్పుడు వారు లోపల నొకటి బయట నొకటి అనుకో లేదు. ఇండియాలోని జన సామాన్యము అటుల ప్రార్థించుట ప్రారంభించి నపుడు వారు నిష్కపటులు అనివార్య మైన కర్మ సిద్ధాంతము ప్రకారము వారికోర్కెలు, వాంఛలు ఈడేరక తప్పినది కాదు. వారి కోర్కెలు వాంఛలు ఫలించెను. వారు బానిసలుగా చేయబడిరి, ఎవరిచే? వారు దేవునిచే బానిసలుగా చేయబడిన రని మీ రందురు. దేవుని కేమైన ఆకారమున్నదా? అతనికి స్వరూపమున్నదా? తన స్వరూప రహితాకారములో దేవుడిచ్చి వారిని పాలించలేడు. దేవుడొచ్చెను. ఏ దేవుడు? వెలుగులలో వెలుగు, తెల్ల వెలుగు. ఇంగ్లీషువారి తెల్ల తోలులో ఆ తెల్లది (తెల్ల వెలుగు) వచ్చి వారిని బానిసలుగా

చేసెను. అటుల అది జరిగినది. ఇండియా పతనము తీసికొచ్చి నది, సరిగా అర్థముచేసుకొబడని క్రైస్తవమతము, చర్చి మతము.

ఇండియాలోనికి పోయి పరిస్థితుల జూడుడు. రాముడు చెప్పినది మీరు నమ్మెదరు. మీరు కేవలము ఇండియారొక్క ఇతర సాధువులు, స్వాములు చెప్పునదే నమ్మి నెడల మీరు మోసపోయెదరు. ఇండియా పతనమునకు కారణ మొక్క వేదాంతరాహిత్యమే. ఇక ఆ బానిస మానసతత్వమే యూరోపియన్లను బానిసలుగా ఏల చేయ లేదు? యూరో పియన్లకు మతమునకంటె సంపద లనిన ఎంతో అభిమానము. మీ కిదవరకు చూపబడినట్లు, వారి ప్రార్థనలలో, వారి మత విషయములలో దేవుడొక కొసరు. ఆతను వారి గదులను నూడువవలె; శుభము చేయువలె. మత మనగా వారికి కూర్చుండు గదిలో అలంకారార్థము తగిలించుకొను చిత్రమో బొమ్మో వంటిది హృదయమునుండి, అంతస్థలమునుండి వచ్చిన ప్రార్థనలు బానిసత్వము నీయుమని కాదు, సంపదల నీయుమని, ఐశ్వర్యము నీయుమని, లౌకికలాభముల నిమ్మని వారు చేసిరి. అందుచే వారు పైకొచ్చిరి. కర్మ సిద్ధాంతము ప్రకారము జరుగున దింతే. ఇండియా జనసామాన్యములో వేదాంతము ప్రచారములో నున్నంత కాలము అది వైభవో పేతముగ నుండెను.

ఒకప్పుడు ఫొయినీషియన్లు చాల బలాఢ్యులుగ నుండిరి. కాని ఇండియాపై వారు దాడి సలువలేకపోయిరి. ఈజిప్టియను

లెంతో ఉచ్ఛదశలో నుండిరి. కాని ఇండియాను తమ వశము చేసికో లేకపోయిరి. ఒకప్పుడు పర్షియా సర్వతంత్ర స్వతంత్ర ముగ నుండెను. కాని ఇండియాపై కన్ను వేయలేకపోయెను. ప్రపంచమంతటా తమ *రామబందుల నెగిరించిన రోమనులు ఎరుకలోనున్న భూఖండమునంతయు జయించిన రోమనులు కూడ ఇండియాను తమ అధికారములోనికి తెచ్చుటకు ధైర్యము చేయలేకపోయిరి.

శక్తిలోనికి వచ్చిన తదుపరిగూడ గ్రీకులు ఎన్నో శతాబ్దములవరకు ఇండియాపై చెడుకన్ను వేయలేకపోయిరి. ఆపై గొప్పవాడని అక్రమముగా పేరుపడ్డ అలెగ్జాండరు బయల్వెడను. వీడు ఇండియాకు వెళ్లెను. ఆ రోజులలో వేదాంతము ఇంకా కొంచెముగా జనసామాన్యమందు వ్యాపించి యుండెను. వారినుండి అది తీసివేయబడలేదాయెను. ఇండియాకు పోవుటకు ముందుగా వీడు తనకు తెలిసిన లోకము నంతయు జయించెను. తన కూతనిచ్చుటకు పర్షియన్ బలము లన్నియుగల అలెగ్జాండరు, ఈజిప్షియన్ సేనల నన్నిటి తన వైపున నుంచుకొనిన అలెగ్జాండరు, ఆ బలశాలియగు అలెగ్జాండరు, ఇండియాకు పోగా అచట యుద్ధములో ప్రతిఘటించబడి పోరస్ అను పేరుగల చిన్న భారతీయ రాజకుమారునిచే భయ పెట్టబడెను. ఈ భారతీయ రాజకుమారుడు ఈ గొప్ప అలెగ్జాండరును చిన్నబుచ్చి అతని సైన్యముల తరిమివేసెను. సైన్యము లన్నియు చితికివేయబడగా గొప్ప అలెగ్జాండరుగారు

* రోమనుల జెండాపై రామబందు (Eagle) ఉండును.

వెనుదిరిగెను. అదెటుల సంభవించెను. అవి వేదాంతము ఇండియా ప్రజాసామాన్యము నందములలో నున్న రోజులు. దానికి మీకు తార్కాణము కావలెనా? కావలసినచో నాటి గ్రీకులు ఇండియానుగూర్చి వ్రాసిన వ్రాతలు చదువుడు; ఇతి హాసపు పుటలలో అలెగ్జాండర్ సహచరు లేమని ఇండియాని గూర్చి వ్రాసిరో చదువుడు. దానినిబట్టి అనుభవ వేదాంతము జనులలో వ్యాపించియుండెనని, ప్రజలు సత్తువగల్గియుండి రని తెలిసికొనగల్గుదురు. గొప్ప అలెగ్జాండరు వెనుదిరగవలసి వచ్చెను.

తరువాత మహమూద్ ఘజ్‌నవీ యనబడు మామూలు బందిపోటుదొంగ పదిహేడుసారులు ఇండియాను దోచు కొనిన రోజు లొచ్చెను. పదిహేడుసారులు వాడు ఇండి యాలో చేజిక్కిన ధనమంతయు దోచికొనిపోయెను. నాటి జనులనుగురించి చదువుడు. ప్రజాసామాన్యపు మతము వేదాంతమునకు కేవలము ఎదురుతిరిగి యుండెను. వేదాంతము కొలదిమందిలోనే వ్యాపించియుండెను. ప్రజాసామాన్యము దానిని వదలి వేసిరి. ఇటుల ఇండియా పడిపోయెను.

నీవు సన్న్యాసమును బోధింతువు. సన్న్యాసము మమ్ము దరిద్రులనుగా జేయును అని వారందురు. కాదు, దానికి వ్యతి రేకమే. వేదాంతము నేర్చుకొనుటకు మీరు అరణ్యముల బట్ట వలయును. హిమాలయ వనముల లోనికి బోవలయును. కాని వేదాంత మెప్పుడును మీరు బైరాగి జీవితమును గడుపవలెనని చెప్పదు. ఎప్పుడూ చెప్పదు. అరణ్యములోనికి బోవుటయనగా

విద్యార్థులు కాలేజీలోనికి బోవుట వలెనే ఏ శాస్త్రమునుగాని దర్శనమునుగాని నేర్చికొనుటకు, నీ వేకాంతముగను, క్లిష్టమైన పరిస్థితులు లేకుండగను ఉండుట అవసరము కాదా ? శాంతిగా నిశ్శబ్దముగా నీ అధ్యయనము సాగించుకొనగల ప్రదేశములో నీ వుండవలెను. కావున భారతీయుడు అరణ్యములోనికి బోయిన అతడు వనములోనికి బోయిన, అది కేవలము శాస్త్రములలో కెల్ల శాస్త్రమయిన వేదాంతమును బాగుగా అధ్యయనముచేసి దాని తాత్పర్యము నవగాహనము చేసుకొనుటయే. రసాయన శాస్త్రము వలెనే వేదాంతముకూడ అనుభవశాస్త్రమని మీరెఱుగుదురుకదా! దానికి తగిన ప్రయోగముల జేసినగాని మీరు రసాయన శాస్త్రములో ముందుకు సాగలేరు. అటులనే తాను పొందుచున్న మానసిక తర్ఫీదుతోపాటు ఆధ్యాత్మిక ప్రయోగముల చేయని మనుష్యుడు వేదాంతమునుగూర్చి ఏమి తెలుసుకో గల్గును ? ఈ ఆధ్యాత్మిక ప్రయోగముల చేసి చూచుటకు, మానసిక జ్ఞానమును పొందుటకు జనులు అరణ్యములోనికి బోవలసియున్నది. అరణ్యములు విశ్వవిద్యాలయములు, కాలేజీలు వంటివి. ఈ విజ్ఞానమును పొంది, వారు ప్రపంచములోనికి వచ్చి దానినే బోధించెదరు. దానిని అనుదిన జీవితములో అమలు పెట్టెదరు; ఆమూలముగా ఇతరులు ఈ రకపు దర్శనము నెట్లమలు పరచవలెనో చూపెదరు. వారు దీనిని బోధించుటకే వత్తురు; ప్రతి బ్రాహ్మణుడు లేక ప్రతిహిందువు తా నరణ్యములో గడుప వలసిన అయిదేండ్లలో ఈ జ్ఞానమును సంపాదించెడివాడు.

సంపాదించి ప్రపంచములోనికి తిరిగివచ్చి అచట పనుల చేసెడి వాడు. కొందరు మామూలు లౌకిక విధులనే నిర్వహించు చుండిరి. వేదాంతపు జ్ఞానమును పూర్తిగా సంపాదించిన తరు వాత ప్రతివాడు యత్యాశ్రమము తీసుకోవలసిన పనిలేదు. ఎం. ఏ. పరీక్షలో ప్యాసయిన వారందరు, లేక డి. యస్. సి. బిరుదు పొందినవారందరు పంతుళ్లవుచున్నారా ? కొందరు న్యాయాధిపతులగుదురు, కొందరు పెద్దవర్తకులగుదురు, మరి కొందరు పంతుళ్లుగగూడ నయ్యెదరు.

అటులే వేదాంతము నార్జించి పూర్తిగా అనుభవించుట యనగా, లోకమంతయు నీకొక స్వర్గముగా, నందనోద్యానము గాను విశ్వమంతయు నీకొక బ్రహ్మలోకముగాను, నీ జీవిత మంతయు జీవింపదగినదిగాను, చేయు స్థితిలో పెట్టుట యని అర్థము. వేదాంతము ప్రతివారిని బైరాగులచేయు ననువారు అపార్థము చేయుచున్నారు. కాదు కాదు. డి. యస్. సి. పరీక్ష తరువాత ఉపాధ్యాయ వృత్తిని గ్రహించుట వంటిది ఈబహి రంగ యత్యాశ్రమము.

లౌకిక జీవితములో బాగుగా మునిగి తేలిన వారిచేతనే ఈ వేదాంతము బోధింపబడినదని గూడ మనము చూచు చున్నాము. నాయనా, వేదాంతము నిరాశావాదముకాదు. ఈమతము నిరాశావాద మనువారు అపార్థము చేయుచున్నారు. అసలు సంగతదికాదు. అది ఆశావాదము యొక్క చరమ శిఖరము.

నీవు నీ శరీరమును ప్రపంచ మహాసముద్రములోనికి చుక్కాని లేకుండనే, దిక్సూచి లేకుండగనే, తెప్ప తెర చాపలు లేకుండగనే, ఆవిరి లేక విద్యుచ్ఛక్తి లేకుండగనే దింపితివేని బ్రతుకునుతప్పక బండలు చేసి కొందువు, అని వేదాంత మనును. అప్పుడు నీవు అన్ని రకముల గాలులకు, గాలి వానలకు తట్టుకోలేవు. ప్రపంచము దుఃఖమయము. కష్టమయము. దీనికి కారణ మజ్ఞానము (అవిద్య) అని వేదాంత మనును. అజ్ఞానమే పాపము; అజ్ఞానమే నీ దుర్గతికి కారణము. నీ వజ్ఞానివిగా నున్నంత కాలము నీవు దౌర్భాగ్యుడవే; ఈ అజ్ఞానమును నిర్మూలించుకొని పూర్ణజ్ఞానము నొందితివేని, నిజమైన ఆత్మను తెలిసికొంటివేని, ఈ చీకటి కొట్లన్నియు స్వర్గలోకమే అగును అని వేదాంతమనును. అప్పుడు, ఎప్పుడు దేనినిగూర్చియు చింతనొందక, దిగులొందక, ఎప్పుడు స్థయిర్యమును పోగొట్టుకొనక, శాంతిని కోల్పోక, దిగులు ముఖమునో, పాలిపోయిన ముఖమునో, చిన్నబోయిన ముఖమునో వేసికొనక — జీవితమును జీవింపదగినదిగా నగును. అది వాంఛనీయము కాదా? అదే అసలు సత్యము కాదా? వేదాంతము నిరాశావాదముకాదు. "ఓ ప్రపంచమందలి జనులారా! మీరీ లోకమునొక నరకముగా చేయుచున్నారు. జ్ఞాన మార్జింపుడు, జ్ఞానమార్జింపుడు" అని వేదాంత మనును. అది వేదాంతము పరిస్థితి. నిరాశా వాద మనునది లేనే లేదు.

ఈ ప్రపంచమందుండి, బైరాగులుగాని, వారిచేతనే ఈ వేదాంతము బోధింపబడినది; అయినప్పటికి వారు సన్యాసులే.

ఒకసారి ఒక గొప్ప భారతీయ మహారాజు తన లౌకిక కర్తవ్యముల నొదిలివేసి, అరణ్యములోనికి పోబోవుచుండెను. ఈ శరీరమునకు పూర్వాజుడైన అతని గురువు అతని కీ వేదాంతమును బోధించెను, సన్న్యాసముయొక్క రహస్యమును అర్జించి, నిజమైన సన్న్యాసియై, అతడీ లోకముల పరాక్రమవంతుడైన చక్రవర్తిగా బ్రతికెను.

కురుక్షేత్ర సంగ్రామమువు మహావీరుడైన పరాక్రమశాలి యగు అర్జునుడు తన ప్రాపంచక కర్మను త్యజింపబోవుచుండెను, అతని ధర్మ మాతని యుద్ధముచేయ మని కోరుచుండెను; కాని అతడు దానిని వదలివేయబోవుచుండెను. అతడు వైరాగి కాబోవుచుండెను అతడిందుల కుపక్రమించుచుండగనే, కృష్ణుడు తయారయ్యెను. కృష్ణుడు అర్జునునికి వేదాంతము బోధించెను. సరిగా అర్థము చేసికొబడుటచే ఆ వేదాంతము అర్జునిలో శక్తిని ఉత్సాహమును నింపెను. అతని లోనికి తేజస్సును, కార్యశూరత్వమును నింపెను. అతడు పెద్ద సింహమువలె లేచి నిలబడెను, మహావీరుడయ్యెను.

వేదాంతము మిమ్ము బలశక్తులతో నింపును. దౌర్బల్యముతో కాదు. ఈ ఆత్మ, ఈ సత్యము బలహీనునిచే ఎన్నటికి పొందబడదు అని వేదములలో నొకచోట గలదు. అది దుర్బలులకు గాదు. శరీరములోగాని, హృదయములోని, మనస్సులోగాని శక్తి చాలనివారు దానిని పొందలేరు.

ఒక పెద్దరాజు రాజ్యము నొదిలి, అడవిలోనికి వెళ్ళి నిజమైన జ్ఞానము నార్జించి, తిరిగి వెళ్ళి సింహాసనము నధిష్టిం

చెను. అంతకు ముందువలెగాక, పూర్ణజ్ఞానవంతుడగు ఆతనిచే ఆ సింహాసన మలంకరింపబడెను.

సన్న్యాసమనగా వైరాగితనముకాకపోయిన, సన్న్యాస మన నేమి ? అది యొక పెద్ద విషయము. అది మరొకసారి తీసికొందము.

ఇచట హిందూశాస్త్రములోని యొక శ్లోకము నుదహరించుచున్నాను. దేవుడు సర్వత్ర ఉన్నాడని తలచెదరు. గాన హిందువులు మాంసము తినరని కొందరు జను లందురు. నిజమే, హిందువులు మాంసము తినరు వేదాంతులు మాంసము తినరు. కాని దానికి కారణ మదికాదు. దానికి కారణము మరొకటి. అది చెప్పుటకిప్పుడు కాలము లేదు.

కఠోపనిషత్తులో నొక శ్లోక మున్నది. దాని నిట్లనువదింపవచ్చును:—

గీ॥ *"చంపువా డాత్మలో "నేను చంపి" తనియు
చంపఁబడువాడు మదిని "నే చంపఁబడితి"
నని తలంచిన నుభయులు నజ్ఞమతులె!
సర్వులందున గల జీవశక్తి యెవుడు
చంపఁగాఁబడజాలదు, చంపలేదు"

---

* పద్యానువాదము కేశవతీర్థస్వామిది.

## మాయ - లేక జగత్తుయొక్క పుట్టుపూర్వములు

శాన్ ఫ్రాన్సిస్కోలో గోల్డెన్ గేట్ హాల్‌లో 1903 జాన్యువరిలో చెప్పబడిన ఉపన్యాసము.

స్త్రీ పురుషుల రూపమం దున్న మాయయొక్క ఈశ్వరుడా! అధిష్ఠాతా! నియామకుడా!

నేటిరాత్రి ప్రస్తావించబోవు విషయము మాయ. పైపైననే విమర్శించెడివారు ఇది వేదాంతములో కెల్ల పుష్టి లేని (ప్రమాణరహితమైన) విషయ మందురు. నేటిరాత్రి మన మీ పుష్టిలేని విషయమునే తీసికొందము. వేదాంతము నధ్యయనముచేసిన తాత్త్వికులు, సమాలోచకులు ఏకగ్రీవముగా ఈ మాయావాదము స్పష్టీకరింపబడెనేని, వేదాంతములో నున్నట్టి తదితరమైన దంతయు అంగీకారయోగ్యము, స్వాభావికము, స్పష్టము, తేటతెల్లము, ఉపయోగకరము నగునని అందురు. వేదాంత విద్యార్థుల కిది యొక పెగడ్డు. దాటికడ్డము. ఇది బృహద్విషయము. దీనిని సాంగోపాంగముగ చర్చించవలెనేని, ఈ ఒక్కదానిపైననే ఏబది ఉపన్యాసముల నీయవలయును. అప్పుడిది విస్పష్టము తేటతెల్లము అగును; ఇక నప్పుడు ప్రపంచమం దెవరును సంశయమునుగాని ప్రశ్నలుగాని వేయలేరు; ప్రతిది విశదమగును, కాని కాలముపట్టును. తొందరపడు చదువరులుగాని వినువారుగాని దానిని పూర్తిగా అర్థము చేసికోలేరు.

ఈ ప్రపంచ మెందులకు? ఎచటినుండి అనునది ప్రశ్న. దానినే వైదాంతిక పరిభాషలో పెట్టితిమేని, ఈ అవిద్య

ఎచటినుండి వచ్చినది? వేదాంతము ఈ జగత్తు అసత్యమని, నైమిత్తికమని బోధించుచునని మీరెఱుంగుదురు కదా! అవిద్య సనాతనముకాదు. ఈ ప్రక్రియ (Phenomena) లన్నియు సత్యములు కావు; శాశ్వతములూ కావు. అయితే ఈ అవిద్య ఎందుకుండవలసి వచ్చినది అని ప్రశ్నవచ్చును. ఈ ప్రక్రియల కన్నిటికి కారణమైన ఈ అవిద్య, మే - తుమ్ లను విభేదములకు విభజించుటకు వేరైన ఈమాయ ఆత్మ నెందుకు త్రొక్కిపట్టినది? దేవునికన్న ఈ మాయ లేక అవిద్య ఎక్కువ బలము కలదిగా నున్నదేమి? అదీ ప్రశ్న.

మామూలు భాషలో, ఇతర తాత్త్వికుల దైవజ్ఞుల భాషలో ఈ ప్రశ్నయే. "ఈ ప్రపంచమెందు కుండవలసి వచ్చినది" అని యుండును. "దేవుడు ఈ లోకము నెందుకు సృజించెను?" వేదాంత మిట్లనును. "నాయనా, నీకా ప్రశ్న వేయుట కధికారము లేదు. ఆ ప్రశ్నకు సమాధానములేదు." ఈ ప్రశ్నకు సమాధానము లేదని వేదాంతము స్పష్టముగ చెప్పును. నీకు మేము అనుభవపూర్వకముగా తిన్నగా, నీవు చూచుచున్న ఈ లోకము నిజముగా దేవుడుగాక మరొండు కాదు అని ఋజువు చేయగలైదము. సత్యానుభూతిలో పైకి పోయినకొలది ఈ ప్రపంచ మదృశ్యమగునని మేము ఖచ్చితముగా నీ కనుభవముద్వారా చూపగలము, అని వేదాంత మనును. కాని అసలీప్రశ్న ఎందుకున్నది? ఆ ప్రశ్నకు సమాధానము మేము చెప్పము. నీకా ప్రశ్న వేయుట కధికారము లేదు. ఈ ప్రశ్నకు జవాబిచ్చుటకు తనవద్ద శక్తిలేదని

వేదాంతము స్పష్టముగ చెప్పుచున్నది. ఇచటనే వైజ్ఞులు, మొండివాదన చేయువారు, ఆరితేరవి తార్కికులు ముందుకు వచ్చి ఇటులనెదరు. "ఓహో, వేదాంతమసంపూర్ణము, అసంపూర్ణము, అది ప్రపంచ మెందులకో ఎచటనుండియో చెప్ప లేదు," వేదాంత మిట్లనును, "ప్రపంచ మెందులకో ఎచట నుండియో యనుప్రశ్నకు మీ రిచ్చు సమాధానములనే జాగ్రత్తగా పరీక్షింపుడు. మీ సమాధాన మసలు సమాధానములు కావని చూడగల్గెదరు. ఈ ప్రశ్నగూర్చి యోచించుట కేవలము కాలమును బలమును వృథాపుచ్చుటయే, సందేహము లేదు. చేతిలోనున్న పిట్టను పోగొట్టుకొని, కొమ్మపైనున్న రెండింటినిబట్టుకోబోవుట వంటిది. వాటి నందుకోకముందే అవి ఎగిరిపోవును. నీ చేతిలోనిదికూడ పోగొట్టుకొందువు. అదియు ఎగిరిపోవును. దర్శనముగాని, శాస్త్రముగాని జ్ఞాతమునుండి అజ్ఞాతమునకు పోవలెను అని వేదాంత మనును. సూక్ష్మమునకు ముందువైపున బండినుంచకుడు; తెలియవిదానితో ప్రారంభించి తెలిసినదానికి రాకుడు.

పారుచున్న యొకనది యొద్దున నిలుచుండి, కొందరు జనులు దానిపుట్టుకనుగూర్చి సమాలోచించుచుండిరి. ఒక డిట్లనెను, "ఈనది బండలనుండి, రాళ్ళనుండి, కొండలనుండి వచ్చుచున్నది. కొండలనుండి నీ ళ్ళూటగా వెలికి వచ్చును, అదియే ఈ నదికి కారణము" మరొక డిటులనెను, "కాదు. అసంభవము రాళ్లు కఠినమైనవి. కఠోరముగ మొద్దుగ నుండును. నీళ్లు ద్రవము, మృదువైనవి. మృదువైన జలము కఠోరమైన బండల నుండి ఎటులవచ్చును. అసంభవము; అసంభవము. కఠోరమైన

బండలు మృదువైన జలము నిచ్చుచున్నవని బుద్ధి నమ్మలేదు, బండలు నీటి నియ్యగలుగునేని, ఏదీ ఈ రాతిముక్కను తీసుకొని పిసికి చూచెదను. దీనినుండి నీరు రాదే కాన ఆ పర్వతములనుండి ఈ నది ప్రవహించుచున్న దనునది అసత్యము. నాకొక మంచి యూహ తట్టుచున్నది. ఎక్కడనో యున్న ఒక పెద్దరాక్షసుని చెమటనుండి ఈ నది పుట్టుచున్నది, ఒకమనిషికి చెమట బట్టినప్పుడు, ఆతని శరీరమునుండి నీరుగారుట మనము ప్రతిరోజు చూచుటలేదా. ఇక్కడ నీరు పారుచున్నది; అది చెమట బట్టిన ఎవరిదేహమునుండియో పారుచున్నదన్నమాట! అది సబబుగా నున్నది; మన బుద్ధి దాని నంగీకరించును. అది బాగుగా నున్నది. అందుచే అది సరిగానే ఉన్నది." మరొక మనుష్యుడిట్లనెను." "కాదు. కాదు. ఎక్కడనో నుండిన ఎవడో ఉమ్మివేయుచున్నాడు, వాని ఉమ్మి ఇటుల పారుచున్నది." మరొక డిట్లనెను "కాదు కాదు. ఎవడో ఉచ్చ బోయుచున్నాడు. అదియే ఈ నదికి కారణము"

అప్పుడు వీ రందరు ఇటులను కొనిరి, "చూడండి, మన సిద్ధాంతము లన్నియు సబబుగానే యున్నవి, నీరెక్కడ పుట్టును అను ప్రశ్నకు ప్రతిదినానుభవమును బట్టి చెప్పిన జవాబులివి. ప్రతిరోజు మనమీ విషయముల జూచుటలేదా. నది పుట్టుకను గూర్చి మనముచేసిన సిద్ధాంతములు సబబుగా నున్నవి, చక్కగ నున్నవి, బ్రహ్మాండముగ నున్నవి. కాని నీరు రాళ్ళనుండే ప్రవహించుచున్నదను వాదము, నీరు రాళ్ళనుండి ప్రవహించుచుండగా చూడాలి. మానవబుద్ధి అంగీకరించలేదు

కొండలపైకి పోయి చూడని వా డది ఆమోదించలేదు; అయి నప్పటికి అదే నిజము" ఈ వాదపు సత్యము దేనిపై ఆధారపడి యున్నది? అనుభవముపైన, ప్రయోగముపై ననే, కండ్లతో జూచుట పైన.

అటులనే ఈ ప్రపంచముయొక్క పుట్టుకను, ఈ ప్రపంచ మొందులకు ఎటుల వచ్చిన దనుదానిని, ఈ విశ్వమ నునది యొక్క ఉత్పత్తిని, ఈ లోక మనునది యొక్క పుట్టుకను పలు వురు పలువిధములుగా చెప్పెదరు. ప్రపంచముయొక్క పుట్టుక కూడ ప్రతిదినము చూచుచున్న విషయముల పుట్టుకవలెనే ఉండు ననుకొనివారి తెలివి, నదియొక్క ఉత్పత్తి ఉమ్మివలననో చెమటవలననో జరిగినదనియనుకొనువారి తెలివి వంటిది. వారిట్లందురు, "ఇదిగో పీను చెప్పుల గుట్టువాడు", ఆ ఉద్దేశ్యము అటుల చేయు భావము ఉన్న వాడొక డుండనిదే చెప్పులెటుల చేయబడును? ఇదిగో గడియారముల చేయువాడు, దానిచేయు ఉద్దేశ్యమున్నవాడు పద్ధతి తెలిసినవాడు లేనిదే గడియారము తయారైనది? ఇచట ఇల్లు ఉన్నది. ఇల్లునేయు ఉద్దేశ్యము గలవాడు, దాని ప్లాను తెలిసినవాడు లేనిదే ఇల్లెటుల నిర్మించ బడినది? వారీ విషయములను నిత్యముచూచి ఇటు లందురు. ఇదిగో ప్రపంచము. చెప్పులు కుట్టువాడు, గడియారములు చేయువాడు, ఇల్లు గట్టువాడు లేనిదే ఆ యా వస్తువు లెట్లు తయారు కావో, అటులనే ఒకానొక వ్యక్తి లేనిది ఈ ప్రపంచ ముండజాలదు. వాడే ఈ ప్రపంచమును చేసి యుండవలెను. కాన ఎక్కడో మబ్బులపై నిలుచుండు సాకారదేవు డొక

డున్నాడని వారందురు. మబ్బులపై నిల్చొనినవానికి పడిసెము చేయునేమో నని కూడ వీరు జాలిపొందరు. ఈ ప్రపంచమును ఒక సాకార దేవుడు తప్పక సృష్టించి యుండునని వారందురు."

వారి వాదన ఎంత సబబుగా, అర్థవంతముగా, సమంజసముగా కనబడినా, అది ఎవరి చెమటనుండియో ప్రవహించుచున్న దను వారి వాదనవలె నుండును. నది యొక్క కారణము శరీరములనుండి కారు నీటికి కారణము ఒకటే అయియుండవలెనని వా రందురు. ప్రపంచముకూడ ఎవరివలననో చేయబడి యుండవలెను.

వేదాంత మీ విధమైన వాదమును నిలబెట్టదు. తప్పక నిలపెట్టదు. వేదాంత మనునదేమన, నీవే చూడుము. ప్రయోగమును చేయుము, కండ్లతో చూడుము, తిన్నగా అనుభూతి ద్వారా ఈ లోకము వాస్తవముగా కనపడునట్లు లుండలేదని నీవు చూడగలైదవు. ఎటుల ? వేదాంత మనునదేమన, నీళ్లు రాళ్ళనుండి వచ్చుచున్నవని మాత్రమే నేను తెలుపగలైదను. నీళ్ళు రాళ్ళనుండి ఎటులవచ్చునో నేను చెప్పగలుగుచున్నాను. చెప్పలేకపోవచ్చును, కాని నీళ్లు రాళ్ళనుండి వచ్చుచున్నవని నేనెరుగుదును. నాతోకూడా ఆచోటికిరమ్ము. నీళ్లు రాళ్ళనుండి వచ్చుట చూడగలైదవు. నీళ్ళుఅటుల రాళ్ళనుండి ఎందుకువచ్చుచున్నవో చెప్పలేకపోయిన నన్ను దూషింపకుము. ఆ రాళ్ల నుండి వచ్చుచున్న నీటిని తిట్టుము. నీళ్ళు రాళ్ళనుండి ఎటుల వచ్చుచున్నవో చెప్పుట నాకు చేతగాదు, కాని అది సత్యము నీవే ఋజువు చేసికోవచ్చును.

అటులనే వేదాంతమనునదేమన, ఈ మాయ లేక అవిద్య ఎందులకున్నదో నేను చెప్పగలిగినను లేకపోయినను అది సత్యము. అదిఎందులకొచ్చినదో నేనుచెప్ప లేకపోవచ్చును. ఇది వాస్తవం, అనుభవంద్వారా చూడనచ్చును. వేదాంతము యొక్క దృష్టికోణము శాస్త్రీయము అనుభవైకవేద్యము. అది ఏమైన ఊహాలనుగాని, వాదనలగాని చేయదు. ప్రపంచపు పుట్టుకను విశదము చేయగలిగెదనని అది అనదు; ఇది మనో బుద్ధుల కతీతము. అది వేదాంత సిద్ధము. ఇదే మాయ యన బడును. ప్రపంచ మెందులకు కానవచ్చుచున్నది నీవు చూచు చున్నావు గాబట్టియే యని వేదాంత మనును. ప్రపంచ మెందుల కచటనున్నది? నీవు చూచుచున్నావుగాబట్టియే యని వేదాంత మనును. నీవు చూడకపోయినచో, ప్రపంచమేలేదు. ప్రపంచ మిచట నున్నదని నీవెటుల ఎరుగుదువు? నీవు చూచుచున్నావు గాబట్టియే. నివు చూడబోకుము, అప్పుడు ప్రపంచ మెక్కడ నున్నది. నీ కండ్లు మూసుకొనుము, లోకములో నైదవవంతు లేకుండబోవును. ప్రపంచములో నీ కండ్లకు కనపడు భాగము లేదు. నీ చెవుల మూసుకొనుము, ఇంకొక అయిదవవంతు లేకుండ పోవును. ముక్కును మూసుకొనుము, మరొక అయిద వవంతు లేకుండపోవును. నీ ఇంద్రియములలో దేనిని పనిచేయిం పకుము, లోకమే లేదు. నీవు లోకమును చూచుచున్నావు, ప్రపంచ మచ టెందుకున్నదో నీవే తెలియపఱచవలెను. నీవే దానిని నిర్మించుచున్నది. నీవే సమాధానము చెప్పవలె.

నీవు నన్నడుగుట యెందులకు ? నీవే అచట ప్రపంచమును నిర్మించుచున్నది.

ఒకప్పుడొక పసివాడు అద్దములో నొక చిన్నవాని ప్రతిబింబమును - అనగా తన ప్రతిబింబమునే - చూచెను; ఎవరో వానికి అద్దములో చాల అందమైన చక్కని పిల్లవాడున్నాడని చెప్పిరి; అద్దములో చూడగా వానికిగూడ చక్కని పిల్లవాడు కనబడెను. కాని అది తన ప్రతిబింబమే నని వాడెరుగకపోయెను, ఆ అద్దములో నున్నదెవరో క్రొత్త పిల్లవాడని తలచెను. తర్వాత ఆ పసివానితల్లి అద్దములోని పిల్లవాడు వాని ప్రతిబింబమేనని నిజమైన పిల్లవాడు కాదని నొక్కి చెప్ప జూచెను. కాని యా పసివాడు నమ్మడాయెను. అద్దములో నిజమైన మరొక పిల్లవాడు లేడని వానికి అర్థము కాదాయెను. వాని తల్లి "ఇదిగో చూడు, అద్దము. ఇందులో పిల్లవాడెవరూ లేడు," అని చెప్పగా ఆ పసివాడు దాని దగ్గరకొచ్చి ఇటులనెను, "అమ్మా, అమ్మా, ఇదిగో పిల్లవాడు, లేకేమి ఇదిగో పిల్లవాడు" ఆ పసివాడు "ఇదిగో పిల్లవాడు" అని చెప్పుచున్నప్పుడే తన ప్రతిబింబము నద్దములో పడవేసెను. అద్దములో నిజమైన పిల్లవాడొకడు లేడని తల్లి తిరిగి చెప్పజూచెను, కాని యాపసివాడు తిరిగి రుజువుకోరెను. పసివాడా యద్దముయొద్ద కెళ్లి చూడు ఇదిగో పిల్లవాడు" అని చెప్పెను. కాని అద్దములో వస్తువేమియు లేదని ఋజువు చేయుటలోనే, వా డద్దములో వస్తువ నొకదానిని తీసికొచ్చి పెట్టెను.

అటులనే, నీ పీ ప్రపంచ మెచట నుండి వచ్చినది ఎందుల కొచ్చినది, ఎటుల వచ్చినది అని చెప్పుటలోనే అజ్ఞానము లోనే అసగా నీ పీ ప్రపంచపుట్టుపూర్వోత్తరముల విచారించుటకు ప్రారంభించగానే నీ పీ ప్రపంచము నచట బెట్టుచున్నావు, నీ పీ ప్రపంచమును సృష్టించు చున్నావు. కాన నీ పీ ప్రపంచ మెటుల బుట్టినదో ఎందులకో ఎటుల తెలిసికొనగలవు? దాని కారణమును మన మెట్లు ఎరుగగలము? దాని కతీతమును ఎటుల తెలుసుకొనగలము? దాని నెట్లు అతిక్రమించగలము? * పిండాండదృష్టితో నైతేనేమి, తత్త్వమీమాంసాదృష్టితో నైతేనేమి ఈ విషయము ఇంకా బాగుగా విశదీకరింపబడవలెను. ఒక భౌతిక (Mundane) దేవుడు లోకమును సృష్టించినాడనియు, ఎచటనో యొక సృష్టికర్త యున్నాడనియు కొందరందురు. వారొక ఇంటివి చూచిన అది ఎవరిచేతనో కట్టబడినదని ఎరుగుదురు, కాన వారు ఈ లోకముగూడ ఎవరిచేతనో చేయబడినదనెదరు. అప్పుడొచ్చు ప్రశ్న ఏమన — ఈ లోకమును సృష్టించుటకు సృష్టికర్త ఎచటనో నిలుచొని యుండవలెనుగదా, అత నెచట నిలుచొననో? అత నెక్కడనో నిలుచునియుండిన అతనికొక విశ్రాంతిస్థల మప్పటికే యుండినదన్నమాట. అయితే సృష్టించుటకు ముందే లోకముండి యుండెనన్నమాట. ఎందుకన ఆ విశ్రాంతిస్థల మెక్కడనో లోకముందే యుండి యుండవలె

* పిండాండము = Microcosm

బ్రహ్మాండము = Macrocosm

గదా ! లోకము సృష్టింపబడుటకు ముందే యుండును. లోక మెప్పుడు ప్రారంభమైనది? అని వివేచించుటకు ప్రారంభించు నపుడు నీవు రెండు భావములను వేరుచేయు జూచుచున్నావు. ఎప్పుడు? ఎందుకు? ఎచట అను భావమొకవైపున లోకమను భావం (Idea) యొకప్రక్క ఎందుకు ఎప్పుడు ఎచటనను మాటలు దిక్కాలకారణముల భావములు (Ideas) లోకములో నంతర్భూతములు కావా? అవి లౌకికములు కావా? అవి తప్పక లౌకికములే. గుర్తుంచుకొనుము. నీ విచట విచారింపదలచినది ప్రపంచము ఎందుకు పుట్టెను? ఏటులనయ్యెను? అననది. ఈ ప్రశ్న ఎందుకు? ఎక్కడ? ఎప్పుడు అను వాటి నంటియున్నది. జ్ఞప్తియుంచుకొనుము. దిక్కాలకారణములు లోకములోనే యున్నవిగాని లోకాతీతములు గావు. కాలము లోకాతీతము కాదని నీ వెరుగుదువుకదా! "లోక మెప్పుడు ప్రారంభమైనది" యని నీ వనగానే లోక మొకవంక ఎప్పుడు అనుభావము మరొక వంక అయినవి. అప్పుడు నీవు లోకమును లోకమునకు ముందుంచు చున్నావన్నమాట. ఇది చాల సూక్ష్మము, కష్టము నగు విషయము. మీరు దయయుంచి శ్రద్ధతోను అపేక్షతోను వినవలెను.

లోకము ప్రారంభించినది (పుట్టినది) ఎప్పుడు? అనుటలో నీవులోకమును దానినుండి వెలికిదీయ గోరుచున్నావు; లోకము నుండి 'ఎప్పుడు' అనుభావమును వేరుచేయు గోరుచున్నావు; నీవు లోకమును ఎప్పుడు? ఎందుకు అను వానితో కొలత వేయ గోరుచున్నావు. కాని ఎప్పుడు ఎందుకు అనునవే లోకమని

నీ వెరుగుదువు కదా! నీవు లోకము నతిక్రమింప గోరుచున్నావు. లోకముపైకి దాటిపోగోరుచున్నావు. నీవు లోకముపై కెగిరి గంతువేయ గోరుచున్నావు, అక్కడనే నీవు లోకము నుంచుచున్నావు.

ఒకసారి ఒక బడికి ఒక ఇన్స్పెక్టరు వచ్చి పిల్లల నీ ప్రశ్న వేసెను "ఒక సీమ సున్నపు ముక్కను గాలిలో వదలితిమేని అది నేల నెప్పుడు తాకును?" "ఇన్ని సెకండ్లలో పడు" నని ఒక కుఱ్ఱవాడు బదులుచెప్పెను. "ఒక రాతిముక్క ఇదిగో ఇంతటి ఎత్తునుండి వదలబడెనేని ఎంతసేపటిలో క్రింద పడును?" "ఇంతటిసేపులో" నని పిల్లవా డనెను. అప్పు డిన్స్పెక్టరు ఇటు లనెను, "ఈ వస్తువు నొదలితిమేని ఎంతసేపు పట్టును?" పిల్లవాడు జవాబిచ్చెను. అప్పుడాతడు ఒక చిక్కు ప్రశ్నను వేసెను, "భూమి పడెనేని, ఎంతసేపటిలో పడును?" పిల్లలు తెల్లముఖము వేసిరి. ఒక తెలివిగల కుఱ్ఱవా డిటులనెను. "భూమి ఎచట పడునో ముందుగా చెప్పుడు?"

అటులనే ఈ దీప మెప్పుడు వెలిగింపబడినది. ఈ ఇల్లెప్పుడు కట్టబడినది. ఈ నేల నెప్పుడు గచ్చుచేసిరి. అను ప్రశ్నల వేయువచ్చును. కాని "భూమి ఎప్పుడు సృష్టించబడినది? లోక మెప్పుడు సృష్టించబడినది" అను ప్రశ్నను మన మడిగినప్పుడు "భూమి ఎంతటిసేపులో పడును. భూమి ఎక్కడ పడును? అను చిక్కు ప్రశ్నలవంటిది. ఎందుకు? ఎక్కడ? ఎప్పుడు - అనునవి జగత్తునందలి భాగములు. సర్వజగత్తుయొక్క ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ అన్న వానిని గూర్చి

ప్రస్తావించునప్పుడు మనము వంకరగా మాటాడుచున్నామన్న మాట. తార్కికముగా తప్పు త్రోవలో పడినామన్నమాట. నీలోనుండి నీవు బయటికి గంతువేయగలవా ? లేదు. అటులనే ఎందుకు? ఎక్కడ? ఎప్పుడు అనునవి ప్రాపంచికములు కాబట్టి ప్రపంచమునందలి భాగములు. కాన అవి ప్రపంచసమస్యను పరిష్కరింపలేవు. ఇది వేదాంతము చెప్పునది.

ఇదే మరొక విధముగా ఇక ఇప్పుడు బోధింపబడును.

ఒక మనుష్యుడు నిద్రించుచున్నాడనుకొనుము, నిద్రలో అతడెన్నియో రకముల వస్తువుల జూచును. అతడే ద్రష్ట, దృశ్యముకూడా; స్వప్నములో కంగారుపడిన ద్రష్ట అతడే; (అందు కానవచ్చిన) అరణ్యములు, నదులు, కొండలు తదితర వస్తువులుకూడ అతడే. నిన్నటిరాత్రి చూపించినట్లు అచట స్వాప్నిక ద్రష్టాదృశ్యము లొక్కటియే ప్రకటితమగుచున్నవి. స్వప్నములోని ద్రష్ట, స్వప్నములోని సాధుడు, ఈ నదులు, కొండలు, సరస్సులు ఇతర దృశ్యములు ఎప్పుడు పుట్టినవో చెప్పగల్గుదువా? నీవు కల కనుచున్నంతసేపు ఈవస్తువు లెప్పుడు ఉనికిలోనికొచ్చినవో చెప్పగలవా ? చెప్పలేవు. నీవు కలవరించునపుడు, నీకానదులు, లోయలు, కొండలు, మైదానములు శాశ్వతములుగానే కన్పడును. ఇవియన్నియు స్వాభావికములుగానే కన్పడును. ఆదినుండి ఉంటున్నటులే కనపడును. కలవరించుచున్న ద్రష్టవుగాన కలవరించుట ప్రారంభించినది. నీవే నని తలపనే తలపవు; దానినే నిజముగా ఎంతువు. ఆ లోయలు, నదులు, మైదానములు శాశ్వతములుగా కనబడును.

వీనిపుట్టుక నెఱుగజాలవు; కలవరించు చున్నంతసేపు కల యొక్క ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ అనునవి ఎఱుగజాలవు. మేల్కాంచుము అంతయుపోవును. మేల్కాంచుము, అంతయు అదృశ్యమగును.

అటులనే ఈ ప్రపంచములో నీ వన్నిరకముల వస్తువులను చూతువు; అవి సత్యములైనట్లు కనపడును. వాని కంత మున్నట్లు గోచరింపదు. కలలో అంతమున్నట్లే; స్వప్నమెప్పుడు ప్రారంభమాయెనో నీవెఱుగలేవు. కాలమెప్పుడు మొదలిడెనో నీవు చెప్పగలవా? ఇది కాంట్ కూడ చూపించిన విరోధాభాసమే ( Antinomy ) కాలమెప్పుడు ప్రారంభించెను ? కాలమాకాలములో ప్రారంభించెనని, నీ వనినప్పుడు, నీవు కాలమును స్థాపించుచున్నావు. ఈ ప్రశ్న అసంభవము. అవకాశము (దిక్కులు)(Space) ఎక్కడ మొదలిడెను? ఈ ప్రశ్న అసంభవము. అవకాశము మొదలిడినచోటి కావల అనునప్పుడు అది మొదలిడినచోటయొక్క బిందువునుంచు చున్నావు. అవకాశముయొక్క ప్రారంభము 'ఎక్కడ' అను భావముచే ఆవరింపబడి యున్నది; 'ఎక్కడ' అనుభావములో దిక్కులుగూడ అంతర్భూతములు. ఈప్రశ్న అసంభవము. కార్యకారణములను గొలుసున కాది ఎక్కడ? ఈప్రశ్న అసంభవము. కార్య కారణము లను శృంఖుల మెందులకు ప్రారంభమైనది? ఇదియూ దానివలెనే అసంభవము. కార్య కారణములను గొలుసున కేమైన మొదలను నీవు చూపించితివేని, అప్పుడు ఎందుకు అను భావమే కారణత యగును. ఇట్లది నిన్నుదాటి పోవును. సమాధానము చెప్ప

టకు వలనుపడని ప్రశ్న అది. ఈ వైపునగాని, ఆవైపునగాని, దిక్కాలములకుగాని, కార్యకారణములకుగాని అంతమనునది లేదు. శోపెన్‌హోర్ ఇది ఋజువుచేసినాడు. హెర్బర్ట్‌స్పెన్సర్ ఋజువుచేసినాడు. ప్రతిదార్శనికుడు దాని కంతము లేదు, అంతము లేదు అనినీకు చూపించును. కలలలోగూడ, నీవు వానిలో జూచునట్టి రకపు కాలమునకుగూడ ఈ వైపునగాని ఆవైపునగాని అంతము లేదు; కలలలోగూడ నీవు వానిలో జూచునట్టిరకపు అవకాశమున కంతము లేదు. కలలలో నీవు వానిలో జూచురకపు కార్యకారణముల కంతము లేదు.

జాగ్రదవస్థలోగూడ నంతే. ఈప్రశ్నకు వ్యావహారిక ముగా సమాధానము చెప్ప ప్రయత్నించు వారందరు తప్పు పడి, సూటిగా వాదించక వంకరగా పోవుచున్నారు. ఈ సమస్యకు వ్యవహారిక పరిష్కారము (Impirical solution) అసంభవము. స్వాప్నిక ద్రష్టమేల్కొంచి నంతనే సమస్య అంతయూ పరిష్కార మగుచున్నది. లేచిన పిదప, కలగాంచు చున్న ద్రష్ట ఇట్లనును, "కలయే లేదు, అంతవరకు అది యంతయు వాస్తవమే," అటులనే సత్యాను భూతిలో మేల్కొంచినంతనే, వేదాంతము ప్రతిదానికిని ఆదర్శముగా నిలబెట్టు ముక్తియను పరిపూర్ణస్థితి ప్రాప్తించినంతనే, నీవీ ప్రపంచమంతయు నొక తమాషయని, ఒక విలాసమని, ఒక ఎండమావి యని తెలిసికొందువు.

ఈ మాయా సమస్యనే మరొక విధముగా పెట్టవచ్చును. "నగుడు దేవుడాయెనేని, అతడు తన నిజస్వభావమునేల మరచి

పోవలెను?" వేదాంత మిట్లు సమాధాన మిచ్చెను, "నీలో నున్న నిజమగు దేవుడు తన నిజస్వభావము నెప్పుడు మరువ లేదు; నీలోనున్న సత్యదేవుడు తన నిజస్వభావమును మరచె నేని ఆతడెల్లప్పుడు ప్రపంచమును పాలించుచు, ఏలుచు, నియ మించుచునుండ లేడు: సత్యదేవు డసలు మరువనేలేదు. ఆత డింకను లోకమును శాసించుచు, ఏలుచు, పాలించుచునే యున్నాడు. అయితే మరచిపోయిన దెవరు? ఎవరునూ లేదు. ఎవరూ మరువలేదు. అది కేవలము స్వప్నము వంటిది. స్వప్న ములో నానారకములైన వస్తువులను నీవు చూచునప్పుడు ఆ వస్తువులను జూచునది నిజముగా నీవు కాదు, స్వప్నములోని ఇతర వస్తువులతో పాటు సృష్టింపబడిన స్వప్నములోని ద్రష్టయే అది యంతయు జూచునది, ఆదృశ్యముల నన్నిటిని జూచునది, ఆ లోయలలో, ఆ కొండలలో, ఆ నదులలో ఉండునది ఆతడే, నిజమైన ఆత్మ, సత్యదేవుడు—ఎప్పుడు ఏదియు మరువ లేదు, ఈ అసత్యమైన అహంకారము (Ego) కూడ మాయాసృష్టియే ఇతర విషయముల వంటి ఎండమావియే. నిజమైన ఆత్మ ఏమియు మరువలేదు. "దేవుడు తన్ను తాను మానవునిగా, క్షుద్రమైన అహంతగా, ఎందుకు పొరపడినాడు" అని నీవని నప్పుడు, నీ ఈ ప్రశ్నలో తార్కికముగా * తప్పున్నదని వేదాంత మనుచున్నది నీ వెవరి కీ ప్రశ్న వేయునది? నీ వీ ప్రశ్న వేయునది స్వప్నమందలి ద్రష్టకా. జాగ్రదవస్థ యందలి

* Circulus in proband. ఋజువు చేయుటలోని గమనమును ప్రమాణముపై ఆధారము చేయుట.

ద్రష్టకా? స్వాప్నిక ద్రష్ట ఏమియు మరువలేదు. కావున, వానినీ ప్రశ్న వేయలేవు అతడు చూచు ఇతర విషయముల వలె అతడును ఒకసృష్టియే, ఇక జాగ్రదవస్థలోని నిజమైన ద్రష్టను కూడ నీ వీ ప్రశ్నను వేయలేవు. ప్రశ్న వేయున దెవరు? కలలలో ప్రశ్నలు వేయువాడు కలలలోనే నుండవలెక దా, స్వాప్నిక ద్రష్ట వేరు చేయబడినప్పుడు, ప్రశ్న ఎవరు వేయును? మాయయను స్వప్నము సాగినంతవరకే, ఉన్నంత వరకే, ప్రశ్నించుట, సమాధానముచెప్పుట యను ద్వైతమంతయు సాధ్యమగును. స్వాప్నిక ద్రష్టనే నీ వీ ప్రశ్న వేయగలైదవు, ఇక అతడో దానికి బాధ్యుడు కాదాయె; స్వాప్నిక ద్రష్టను తొలగించుడు, ఇక వస్తుజాలమంతయు, స్వప్నమంతియు లేకుండ పోవున; ప్రశ్న వేయుట కెవరూ మిగిలియుండరు. ప్రశ్ననెవరు వేయుదురు? ఎవరిని?

ఇచ్చట నొక చక్కని పడ వున్నది. ఇచట పడవ నడుపువాని బొమ్మ వున్నది: వాడు పడవను నది దాటించును. పడవవాడు చాల మంచివాడు; పడవ నిజమైనదిగా ఎంచబడి నంతసేపే వాడు పడవకు యజమాని: పడవ పడవగా ఏ అర్థములోనై నదో ఆ అర్థములోనే పడవవాడు దానికి యజమాని. వాస్తవముగా ఎచ్చటనూ పడవా లేదు, పడవవాడూ లేదు. రెండును అసత్యములే. కాని పసిపిల్లవాని కొకనికి మనము, "రారమ్మ, రమ్మ పడవ కెంత చక్కని యజమాని" అని చూపినప్పుడు పడవ యజమాని పడవకూడ ఒకేవిధమైనవి.

పడవకంటె పడపయజమాని నిజమైనవాడనుటకు మన కధికారము లేదు.

అటులనే వేదాంతము ప్రకారము విశ్వముయొక్క నియామకుడు, ఈశ్వరుడు, యజమాని లేదా దేవుడు - లేక సృష్టికర్తయను భావమునకు విశ్వమునకు ఉన్న సంబంధము బొమ్మలోని బోటువానికి బోటునకు ఉన్న సంబంధమువంటిది. అక్కడ బోటున్నంతసేపు బోటువాడుకూడ ఉన్నాడు. బోటు అసత్యమని నీవు గుర్తించగానే, బోటువాడుకూడ అదృశ్యుడగును.

అటులనే ప్రపంచము నీకు నిజముగా కనపడినంతసేపే నియామకుడు, ఈశ్వరుడు, సృష్టికర్త, చేయువాడు అను భావము నిజము. ప్రపంచమును పోనిండు ఆ భావముకూడ పోవును. సృష్టికర్తయను భావము (Idea)లో సృష్టి ఎందుకు, ఎప్పుడు, ఎక్కడ అనునవి అంతర్భూతములు. బోటువాడు బోటు ఒకదాని కొకటి సంబంధించియున్నటులే ప్రపంచము యొక్క ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ అను ప్రశ్నలు ప్రపంచమునకు సంబంధించియున్నవి; అవిరెండునుకూడ ఒకే సంపూర్ణమైన చిత్రముయొక్క భాగములు. రెండును ఒకే విలువగలవియైనచో, రెండూ భ్రాంతులే "ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ" అను ప్రశ్నకూడ భ్రాంతియే. ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ-అను ప్రశ్నయే బోటువాడు. ప్రపంచమును నడిపించునది, లాగుకొని వెళ్ళునది, నీవు మేల్కాంచి సత్యానుభూతి నొందినంతనే, ప్రపంచమంతయు నీకు గుడ్డపై గీయబడిన బోటు బొమ్మవలె

నగును; అప్పుడు బోటువాడుగా నుండిన ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ అను ప్రశ్న అదృశ్యమగును. దిక్కాల కారణముల కతీతముగానున్న సత్పదార్థమందు ఎందుకు? ఎప్పుడు? ఎక్కడ, అనునది లేదు. ప్రపంచము ఒక సాకారుడగు (వ్యక్తియగు) (Perssonal) సృష్టికర్తవలన ఏర్పడిన దని జనులందురు. వేదాంతము నేతి యనును. ఈ 'నేతి' యనుమాట సంస్కృతమందు తరచువచ్చుచుండును. అమెరికన్లు దీనికి "నిట్" అను ఉద్భవమును తయారుచేసిరి. ఈ ప్రశ్న అసంభవము, సమాధానము చెప్ప వీలుపడనిది.

మరొకడొచ్చి ఇటులనును. "దేవుడు తన్నుదా ప్రేమించుకొని, ఈ ప్రపంచమును తయారుచేసెను. తనసే ఇన్ని రూపములుగా చూడదలచుకొని, అతడీ లోకము నొక అద్దముల ఇల్లువలె తయారు చేసెను. వేదాంతము నేతియనును అట్టి యూహా నూహించుటకు నీ కధికారము లేదు.

మరొకడొచ్చి ప్రపంచ మిదిగో ఇన్ని ఏండ్లక్రిందట సృష్టించబడిన దనును వేదాంతము నేతియనును. ఎందుకు అని దాని అపలర్థము మాయ. మాయ యనగా కాదు అని అర్థము, య అనగా అది అని అర్థము. మాయయనగా అది కాదని అర్థము. నీ వేయలే నటువంటి ప్రశ్న అది అది కాదు. ప్రపంచము సత్యమా, యని ప్రశ్న. వేదాంతము, నేతి, మాయ అదికాదు అనును. దానిని నీవు సత్య మనలేవు. ఎందుచేత? సత్యమనగా సనాతనమైనదని అర్థము కాబట్టి, నిన్నను, నేడును, ఎల్లప్పటికిని ఒకటిగా నుండునది యని

అర్థము కాబట్టి. అది సత్యమనగా ప్రపంచమెప్పటికి నుండునా? అది ఎప్పటికి ఉండదు. కాన అది సత్యము కాజాలదు. నీగాఢ నిద్రలో అది అదృశ్యమగు చున్నది; నీపూర్ణస్థితిలో, నీముక్తావస్థలో అది అదృశ్యమగు చున్నది. కాన అది ఎల్లప్పుడు ఉండునది కాదు. కాన అది సత్యమని యనుటకు నీ కధికారము లేదు ప్రపంచ మసత్యమా? వేదాంతము నేతి, మాయ, అది కాదు అనును. ఇది బహువింతగా నున్నది. ప్రపంచ మసత్యము కాదు. "కాదు అది అసత్యము కాదు. ఎందుకనగా వేదాంతపు నిర్వచనము ప్రకారము అసత్యమనగా మనిషి కొమ్మువలె ఎప్పుడునూ ఉండనిది. అవువలె మనుష్యునికి కొమ్ములెన్నడైన యుండునా? లేదు. అదీ అసత్యమంటే, ఇక ప్రపంచ మిప్పుడే నీకండ్లకున్నట్లుకనపడుచున్నదిగాన అసత్యము కాజాలదు. ఉన్నట్లుగా అది నీకు కానవచ్చుచున్నది గాన, అది అసత్య మనుటకు నీ కధికారములేదు. ప్రపంచము సత్యమా? నేతి ప్రపంచ మసత్యమా? నేతి. అయితే ప్రపంచము కొంత వఱకు సత్యము. కొంతవఱకు అసత్యమూనా? వేదాంతము, మాయ, నేతి, అదియు కాదు అనును. సత్యాసత్యములు కలసియుండ లేవు." అని వేదాంత మనును. ఈ ప్రశ్నల కీయబడిన ఈ సమాధానములు వేదాంతము యొక్క మాయావాద మనబడును. ఈ ప్రశ్నల కీయబడిన ఈ సమాధానములు "మిధ్య" యనికూడ అనబడును. మీ మైథాలజి అను శబ్దమునకు సమజాతికమైనది ఈ మిధ్యాశబ్దము. అనగా, మనము సత్యమని కాని, అసత్యమని

కాని, సత్యాసత్యాత్మక మనిగాని అనుటకు వీలుకాని దని అర్థము అటువంటిది ఈ ప్రపంచము.

నరీశ్వరవాదులు దేవుడు లేడందురు. వేదాంతము నేతి, నేతి, మాయ అనును. వారనునది పొరపాటు. ఏలయన దేవుడు లేడనుటకు వారికి కారణ మేమియు లేదు. కొందరు సాకారుడగు దేవుడున్నాడందురు. వేదాంతము నేతి, నేతి, మాయ అనును. అట్టి మాట యనుటకు నీ కధికారము లేదు. నీవు అడుగు వేయలేని ప్రదేశమిది. నీ తెలివి నుపయోగింప వీలుగాని ప్రదేశమిది—యని వేదాంత మనును. నీ తెలివి నుపయోగించుటకు ఈ లోకములో ఎంతో పని యున్నది. అచట పని చేయించుకొనుము. "సీజరుకు చెల్లించ వలసినవి సీజరుకు చెల్లింపుడు. దేవునికి చెల్లింపవలసినవి దేవునికి". భౌతిక సీమలో, వ్యావహారిక జగత్తులో, నీ తెలివికి చాలినంత పని యున్నది. అతి భౌతిక సీమలోని కొచ్చుటకు నీ కొకటే మార్గమున్నది. ఆమార్గమే అనుభవమార్గము, ప్రేమమార్గము; భక్తియొక్క, శ్రద్ధయొక్క, జ్ఞానముయొక్క మార్గము; వింత చందపుజ్ఞానము, వింతరకపు ఈశ్వరానుభూతి. నీవీ ప్రదేశము లోనికి సరైన త్రోవగుండ వచ్చినప్పుడు ప్రశ్నలన్నియు నమసిపోవును. సమస్యలన్నియు పరిష్కారమగును. సామ వేదాంతర్గతమగు కేనోపనిషత్తులో నొక శ్లోక మీా విధముగ నున్నది.

*"తెలిసితిని దాని నని నేను పలుకజాల
లేక దానిని తెలుసునో లేదటంచు
పలుకజాలను, అది మఱి తెలుసుకొనుట,
తెలిసికొనకుండు టిలకు, నలీత మెవుడు."

నేటి తాత్త్వికులు చెప్పునదికూడ సరిగా నిదియే. "ప్రారంభిక సూత్రములు" అను తనగ్రంథములో మొదటి భాగమున "అజ్ఞాతము" అను అధ్యాయమున హెర్బర్ట్ స్పెనర్ కూడ ఈ నిర్ణయమునకే వచ్చెను; అతను వ్రాసిన దంతయు మీకు రాముడు చదివి వినిపింప నక్కఱ లేదు. కాని కొంచెము మాత్రము చవెదను. "సైన్సుకు పునాదియై సైన్సు ద్వారా స్థాపింపబడుటకు వీలుకాని పదార్థ (Principle) మొకటియుండి యుండవలెను. తార్కికముగా పరిక్షింపబడిన పర్యవసానము లన్నియు ఏదోయొక అనుమానముపై ఆధార పడి యుండవలెను. మేధాశక్తి పోగూడనట్టి పోవుటకు సాహసింపనట్టి అజ్ఞాతసీమను మనము తాకునట్టి ప్రదేశ మొకటి యుండియుండవలెను."

దార్శనికు లందరు ఈవిషయమున దాదాపల్లేయుందురు. చూడుడు. దేవుని కుద్దేశ్యము లున్న వని యాపాదించుచు, దేవుడు ఈ పని చేసియుండవలె, దేవునికి దయయుండవలె, ప్రేమయుండవలె, దేవునికి మంచితన ముండవలె, దేవునికీ గుణముండవలె, ఆ గుణముండవలె నను వారందరు ఎంతటి

* శ్లోకానువాదము శేశవతీర్థ స్వామిది,

పొరపాటు పడుచున్నారో చూడుడు. ఇది ఇటుల, అది అటుల అనివిభజించుట యంతయు సరిహద్దుల వేయుటయేగదా! దేవుని నీవు ఒకనోటితో అప్రమేయుడని, ప్రమేయుడని అనుచున్నావు. ఒకప్రక్క-అప్రమేయుడనుచు, వేరొకప్రక్క "ఓహో ఆతని కీగుణ మున్నది, ఆతని కా గుణమున్నది" యనుచున్నావు. ఆతడు మంచివాడని నీ వనినప్పుడు ఆతడు చెడ్డవాడు కాడన్నమాట యేకదా! అనగా ఆతడు నీ పరిమితుడు (హద్దుకలవాడు) (Limited) అన్నమాటేగదా! ఏచట చెడ్డ యున్నదో, అచట మంచి లేదుకదా! ఆతడు సృష్టికర్త యని నీవనినప్పుడు ఆతడు సృష్టింపబడినవాడు కాదన్నమాటేకదా! ఆతని నట్లు నీమితునిగా చేయుచున్నావు. ఆతడు లేనిచో నొకదానిని వ్రేలుపెట్టి చూపుచున్నావన్నమాట. ఆతడు సమస్తము అటు నీవలనే దేవు డీ లోకము నిందులకు సృష్టించినాడు, అందులకు సృష్టించినాడు అనినప్పుడు, నీవు దేవుని నీ ముందునకొచ్చి తన చేతలకు జవాబిచ్చుకొనువానినిగా చేయుచున్నావు; మేజస్ట్రేటు ముందుకువచ్చి తన చెయిద్యములకు సమాధానము చెప్పుకొను మనుజునివలె దేవుని చేసినావన్నమాటేకదా! కాన నీవు దేవుని దేనికయినా బాధ్యునిగాజేసి, ఆతని ఉద్దేశములను, ఊహా పోహాలను ఆపాదించినప్పుడు, నీవు నిన్ను మేజస్ట్రేటుగా జేసి కొని, దేవుని నీముందునకొచ్చి తన పనులను తాను పూచీ చెప్పుకొనవచ్చిన మనుష్యునిగా చేసినావన్నమాట. ఇటులాతని నీవు నీమితునిగా చేయుచున్నావు. దేవుని నీముందట

బోనెక్కించుటకు నీ కధికారము లేదని వేదాంత మనుచున్నది. ఈ ప్రశ్నను వదలివేయుము. ఇది యసంబద్ధము.

వేదాంతమనగా ఏ ప్రత్యేకవ్యక్తికిగాని బానిసత్వము కాదు. మహమ్మదీయుడను శబ్దము మహమ్మదు పేరుపై ఆధారపడియున్నది. మహమ్మదు చేసినది, చెప్పినదంతయు మనము నమ్మవలయును. క్రైస్తవమతమనగా క్రైస్తుపేరుకు దాసుడగుట. బౌద్ధమత మనగా బుద్ధుడను పేరునకు దాసుడగుట. జొరాయస్ట్రియన్ మత మనగా జొరాయాష్టర్ పేరుకు బానిసగుట. వేదాంత మను పేరు ఏ ప్రత్యేకవ్యక్తికిగాని బానిసగుట కాదు. వేదాంతమనగా అసలర్థము జ్ఞానముయొక్క పరమావధి యని యర్థము. వేదాంతమనగా సత్యమని అర్థము. కాన అందులో సాంప్రదాయిక మేమియు లేదు. అది విశ్వవ్యాప్తము; మీకు పరిచయము లేని పేరుగాన దాని విని పక్షపాతము చెందకుడు. వేదాంతమనగా హిందువు లర్థము చేసికొనినట్టి, బోధించునట్టి సత్యమని మీరననచ్చును. జర్మనీలోగాని, అమెరికాలోగాని, సత్యము నెచట అన్వేషించినను తేలునదొకటియే కదా! సూర్యుని మానవుడు ఎక్కడనుండి చూచినను అతడు తేజస్వంతముగాను, ప్రకాశవంతముగాను కనపడును. ఎవడు తన పాక్షపాతముల నొదిలి స్వతంత్రించునో వాడు, వేదాంతముయొక్క నిర్ణయమునకే వచ్చును. నీవు స్వతంత్రముగా, విశాలబుద్ధితో పక్షపాతములను, అపోహాలను తప్పుట, అభిప్రాయములను వదలి సమాలోచించితివేని ఇవి నీ నిర్ణయములే, నీ వాదనలే, నీవు తెచ్చిన ఫలితములే.

లనునట్లు పైకిమాత్రమే ప్రతిబింబము. అసత్యప్రతిబింబము భ్రమ. అసలువస్తువ ముఖము. ముఖమూ, ప్రతిబింబమూ కలిసి ఒకేపరి ఉంటున్నవి; భ్రమపదార్థమగు ప్రతిబింబము సత్పదార్థమగు ముఖమూ కలిసి ఒకేపరి ఉంటున్నవి బహిరంగిక భ్రమలోని ప్రత్యేకత ఇది కాక మరొక ప్రత్యేకత ఏమన బహిరంగిక భ్రమలో అద్దమువంటి ఏదోయొక సాధనము (Medium) ఉండును. అద్దము సాధనము, భ్రమపదార్థము ప్రతిబింబము, సత్పదార్థము ముఖము. కాన బహిరంగిక భ్రాంతిలో, ఆ వేళకు మూడు వస్తువులుండవలెను. ఆంతరంగిక భ్రాంతిలో ఆ వేళ ఒక్కవస్తువమాత్రమే ఉండును.

సమస్త విశ్వముయొక్క ఏకత్వమును స్థాపించు వేదాంతుల ప్రయోగము లీ రకపు వని నీకు చూపింపబడును. వారి ప్రయోగములు, అనుభూతులు, వారి మతాభివృద్ధి, సత్యానుభవము ఇవి యన్నియు ఈ లోకము. బహిరంగిక, ఆంతరంగికములను ద్వివిధభ్రాంతులచే ఏర్పడినదని సిద్ధాంతీకరించును. మతజీవితమును ప్రారంభించి, దేవత్వము (Divinity) తనలోనే అనుభవింప సమకట్టు వ్యక్తి బహిరంగికభ్రాంతిని మాత్రమే జయించును. పృథ్విపై నున్న మతములన్నియు క్రైస్తవమతము, మహమ్మదీయమతము, బౌద్ధమతము, జారోయాష్ట్రియన్ మతము, వేదాంతము కాక ఇవన్నియు బహిరంగికభ్రమను జయించుట కెంతో తోడ్పడినవి. బహిరంగిక భ్రమను జయించుటలో అవన్నియు సరైనసనీతే చేయుచున్నవి కాని వేదాంతము వానికన్న ఇంకో మెట్టు

పైకి పోయినది. అది ఆంతరంగిక భ్రమనుకూడ నశింప జేయును; ఇతరమతములు మామూలుగా దానిజోలికి పోవు. అచటనే వేదాంతమునకు మాకు గిట్టదు. అని అవి యనును. కాదు, కాదు, అది వానికి విరుద్ధముగ నిల్చినదు. అవి దేనిని మొదలిడినవో దానిని అది సంపూర్తికావించును. అది వాని కూత నిచ్చుచున్నది; అది వానికి వ్యతిరిక్తముగాని విరుద్ధముగాని కాదు. కాని ఇదంతయు మాకు సంస్కృత ములో మాటాడి నట్లున్నది. గ్రీకులో మాటాడినట్లున్నది దీనియర్థ మేమి యని మీ రందురు.

ఇప్పుడు అతిసూక్ష్మ విషయమొకటి చెప్పబడబోవు చున్నది గాన శ్రద్ధతో వినుము. త్రాడును చూచి సర్పమని భ్రాంతి కల్గినది. త్రాడులో నొకసర్పము కానవచ్చినది. సర్పము ఏవిధమైన భ్రాంతివలన వచ్చినది? సర్పము ఆంతరంగిక భ్రాంతివలన వచ్చినది. సర్పమచటయున్నచో, త్రాడచట లేదని నీ వెఱుగుదువు. త్రాడచట యున్నచో సర్ప మచట లేదు. ఒక్క పరి కనపడునది ఒక్క వస్తువమాత్రమే. అది ఆంతరంగిక భ్రాంతి. చూడుము. ఈ కనబడిన సర్పము ఆంతరంగిక భ్రాంతి వలన ఏర్పడిన భ్రమపదార్థము. అందులోనికి చూచినప్పుడు అద్దము నీ కే విధముగ ఉపకరించునో, తన కాధారభూతమగు త్రాటికి ఈ పా మావిధముగనే ఉపకరించును. ఇది నీకుబుజువు చేయవలెను. అద్దము నీ కొక సాధనముగా ఉపయోగించు చున్నదని నీ వెఱుగుదువు కదా! అద్దము సాధనముగాన నీ వద్ద ములో నొక భ్రమపదార్థమును (దానిని నేను ప్రతిబింబమం

మను) చూచుచున్నావు. అద్దము సందర్భములో బహిరంగిక భ్రాంతి తటస్థించుచున్నది. త్రాటిలో అంతరంగిక భ్రమవలన పాము కనబడినదని చూపబడును; ఈ పాముే ఆధారభూత సత్యమగు త్రాటికి అద్దమువలె నొక సాధనమగుచున్నది. ఇటుల ఆ చోటనే బహిరంగిక భ్రాంతికూడ తటస్థించినది.

నీ వద్ద కొక పిల్లవా డొచ్చి ఇట్లనును, "నాన్నా! నాన్నా! నాకు భయమెత్తినది; అచ టొక పా మున్నది." "నాయనా, పా మెంతపొడుగున నున్నది" యని మన మడిగెదము; పిల్లవా డిటు లనును. "పాము రెండుగజముల పొడుగున నున్నది." సరే పా మెంత లావున నున్నది. పిల్లవా డిటులనును. "అది చాల లావుగ నున్నది. నిన్న శాన్ఫ్రాన్సిస్కో రేవు నొదిలిపోవుచున్న ఓడలోని త్రాటియంతటి లావున్నది." "పా మేమి చేయుచున్నది" అని మన మడిగెదము. "పాము చుట్టజుట్టుకొని పడియున్న"దని వా డనును. అసలు పా మచట లేదని నీ వెఱుగుదువు పా మసత్యము. అచట నున్నది త్రాడు మాత్రమే. త్రాడే రెండుగజముల పొడుగున నున్నది. అదియే ఆతడు శాన్ఫ్రాన్సిస్కో రేవు నొదలిపోవు పడవులో నున్న త్రాటియంతటి లావుగ నున్నది. త్రాడే నేలపై చుట్టగా పడియున్నది. త్రాటి గుణములే దాని లావు, పొడుగు, దాని స్థానము, భ్రాంతి సర్పములో ప్రతిబింబించి నట్లయినవి. త్రాడే తన లావును, వెడల్పును, స్థానమును భ్రాంతి సర్పములో పడవేసినది. పా మంతటి పొడుగుది కాదు. ఆ పొడుగు త్రాటిదే పా మంతటి లావుది కాదు. త్రాటికి వర్తించు లావే అది.

పా మూ స్థానమందు లేదు. క్రొటికి వర్తించు స్థానమే అది. కాన మొదట ఆంతరంగిక భ్రమకు ఫలితముగా సర్ప మేర్పడి నది. తదుపరి మనము సర్పములో మరొక రక భ్రాంతిని సృష్టించినాము. దానిని మనము బహిరంగిక భ్రాంతి యన వచ్చును అనగా ఒకదాని గుణముల మరొక దానికి వర్తింప జేసినాము.

ఇది రెండవరకపు భ్రాంతి. ఈ భ్రాంతుల దొలగించుటకే ప్రక్రియ నవలంబింపవలె. మనము మొదట నొక భ్రాంతిని తొలగించి తదుపరి మరొక భ్రాంతిని తొలగింతము. మొదట బహిరంగిక భ్రాంతిని తొలగింతము. తదుపరి ఆంతరంగికమును తొలగింతము.

వేదాంతము ప్రకార మీ విశ్వ మంతయు ఒకే అచ్ఛేద్య మైన, అవర్ణనీయమైన, భావకు, దిక్కాలకారణములకు అతీత మైన, సత్తనుటకుకూడ వీలుపడని సత్తు (Reality) ఈ సత్తను క్రొటిలో ఈ ఆధారభూత మగు అధిష్ఠానములో, పదార్థములో (లేక మరొక పేరుతో పిలువుము) నామరూపములు విభేదములు (లేక దానిని నీవు శక్తి ఉత్సాహము లేక స్పందనములు అన వచ్చును) కనపడుచున్నవి. ఇవి సర్పమువంటివి. ఈ ఆంతరంగిక భ్రాంతిపూర్తి యైనపిమ్మట బహిరంగిక భ్రాంతి కలుగుచున్నది. ఈ బహిరంగిక భ్రాంతిచే ఈ నామరూపములను ఈ వ్యక్తి త్వములను విభేదములను మనము స్వతః సత్యములుగా స్వత స్సిద్ధములుగా, స్వతఃస్థితములుగా, తమంతటతాము నిజమైనవిగా ఎంచుచున్నాము. ఇట్టిక్కడ రెండవది యగు బహిరంగిక

భ్రాంతికూడ ఏర్పడుచున్నది. ఈ ప్రకియను తారుమారు చేసితి మేని నీ వర్థము చేసికోగలవు.

మతము లేమిచేసినవి? ప్రియమైన క్రైస్తవమతము, ప్రియమైన మహామ్మదీయమతము, ఈ మతము లన్నియు బహిరంగిక భ్రాంతిని తొలగించుట కెంతో తోడ్పడినవి. శుద్ధ ప్రేమమయజీవితమును, దివ్యానందపు జీవితమును, ఆశతోను శ్రద్ధతోను, ధర్మముతోడనునిండిన జీవితమును గడుపుచు అన్ని వైపుల అంతులేని ప్రేమను వెడలగ్రక్కుచు విశ్వము నంతయు దేవత్వముతో నింపివేయుచు, మానవులు బ్రతికిరేని, వారు ప్రతివస్తువయందు దేవుని కనుగొందు రని ఈ మతములు చూపినవి. చూడుడు; నిజమైన ఋషి లేక ముని నిజమైన క్రైస్తవుడు పేరులలోగూడ దేవునే జూచును ఆతడు శత్రువునికూడ ద్వేషించబడును. మరి ప్రేమించును. అహా! "నీ శత్రువును కూడ నీ వలెనే ప్రేమింపుము," అను క్రైస్ట్ బోధ ఎంతటి మహత్తైనది! ఆ సత్యదేవునే ఆతడు పూలలో జూచును. నీ వాస్తికి హాతివా? నిజముగా మతముగల వా రాస్తికి బోయిరి. పూవులు నీతోడ మాటాడును. రాళ్లలో నీకు వేదఘోషలు వినవచ్చును. పారుచున్న వాగులలో పుస్తకముల చదివెదవు. నక్షత్రములు నీకు ముచ్చట్లు చెప్పును; నరుల ముఖములలోగుండ నీకు దేవత్వము కానవచ్చు చుండును. దేవత్వమునకు మానసిక ప్రమాణము లవసరమా? లేదు, దానిలోనే దానికి వలసిన ప్రమాణ మున్నది. ప్రాపంచిక

మగు తర్కమును, తత్త్వశాస్త్రమును అతిక్రమించు ప్రమాణముపై అది ఆధారపడి యున్నది. ప్రతిచోట దేవుని అనుభవించువాడు; దేవునిలోనే, దేవత్వములోనే బ్రతుకుచు, కదలుచు, అందులోనే అస్తిత్వము కలిగియుండువాడు- ఈ విధమైన మతజీవితముద్వారా, సాధనద్వారా, అనుభవముద్వారా, ప్రయోగముద్వారా బహిరంగిక భ్రాంతిని జయించును, ఎటుల? ఈ అన్నిరూపములలో, ఈ అన్ని తెరుగులలో, విభేదములలో, దేవుడున్నాడని నీ వనుచున్నావుకదా! ఇవియన్నియు సర్పమువంటివి. అయినను వాటి నతిక్రమించి చూతువేని, వాని కతీతముగా చూచితివేని, నీవు సర్పము క్రింద నున్న ఆధారభూత మగు త్రాటిని చూడగల్గెదవు. పొడవు, వెడల్పు, లావు ని వాపాదించునది పామునకు గాదు. ఆధారభూతమగు త్రాటికే. ఇటులొక విధమగు భ్రాంతిని నీవు తొలగించుకొనుచున్నావు. నీవు ప్రతిదానివెనుక దేవునిజూచుస్థితికి రాగానే, నీ శత్రుమిత్రుల కెవరికి ఉద్దేశ్యముల నాపాదింపవు వారిలో నీవు దేవత్వమునే చూచెదవు. వారివెనుక నీకు దేవునివేరిలే, విధివిలాపమే పొందలుట కాన వచ్చును; అప్పుడు నీవు ఒకే దేవత్వము, సర్వమయినట్టి దేవుడే ఈపను లన్ని చేయుచున్నా డనియు, నీ స్నేహితులకే ఉద్దేశ్యములను ఆపాదింపరాదనియు అనెదవు. ఇటుల ఒక రకమైన భ్రాంతి బహిరంగభ్రాంతి జయింపబడినది. నీ ప్రగతిలో ఇది యొకమెట్టు. కాని వేదాంతము దాని నతిక్రమించిపోయి ఇటు లనును, "సోదరా, ఈ అన్నిటిలోనూ

దేవుడే ఉన్నా డని యందు వేని, అది పూర్ణ సత్యము కాదు, దానికి పైగా వెళ్లుము.'' ఈ రూపములు, ప్రతిరూపములు, విభేదములు, ప్రభేదము లన్నియు తమలో దేవుని కలిగియే యున్నవి. కాని ఒకేపరి, ఈ వివిధ భ్రాంతులు, రూపములు, అసత్యములు. త్రాటిలోని పామువంటివి; దాని నతిక్రమించి పొమ్ము, దాని కంతకు అతీతమగుస్థితిని, భావములకు శబ్దము లకు అతీతమైన స్థితికి వెళ్లుము. ఇదియు అసత్యమే. ఇటుల వేదాంతము సర్వమతముల పర్యవసానము పూర్ణత యని కను గొందువు. అది ఈ ప్రపంచ మందలి ఏమతమునూ ఖండింపదు.

ఈ ప్రపంచ మీా దేవుని వలననో లేక ఆ దేవుని వల ననో సృష్టింప బడిన దని చెప్పుటయనవసర మని చూపబడును. ఈ రూపములు, ఆ కృతులు, ఈ విభిన్నపరిస్థితులు ఆకారము లన్నియు ఈ ప్రపంచమే గాని వేరుకాదని ఋజువుచేయ బడును.

ఇచట రెండు త్రికోణములు, ఒక చతురస్రము కలవు:






ఈ త్రికోణములు రెండుద్విసమభుజత్రికోణములు. అనగా రెండుభుజములు సమానమైన పొడుగుగలవి. సమాన పొడుగు గలవానిని 3 సంఖ్యతోను, మూడవభుజమును 4 తోను గురుతు వేసినాము. చతురస్రములో పొట్టిభుజములను 3 సంఖ్యతోను, పొడుగుభుజమును 4 సంఖ్యతోను గురుతు వేసినాము. ఈ చిత్రములను కాగితముతోడనో, అట్టతోడనో కత్తిరించినాము. వాని నన్నిటిని ఒక్కచిత్రముగా అగునట్లు పెట్టుడు త్రికోణముల క్రిందిభుజములు, చతురస్రపు పొడుగు భుజములతో ఏక మగునట్లుగా పెట్టుడు. అప్పు డేమగును? అన్నిభుజములు 3 గా గలట్టి షడ్భుజపట మొకటి వచ్చును. 4 సంఖ్యగల భుజములు పటములోపలికి వచ్చుటం జేసి, అవి ఇక పొడుగుభుజములు కాజాలవు. ఈ షడ్భుజ పట మెటుల వచ్చినది? త్రికోణములయొక్క, చతురస్రము యొక్క స్థానమును తారుమారుచేసి వేరువిధముగా కలుపుట వలన వచ్చినది. మొదటి పటముల గుణము లేమి? ఇప్పటి ఈ పటపు గుణ మేమి? ఈ పటపు గుణములు మొదటి పటముల గుణములకు (Properties) పూర్తిగా భిన్నములు. మొదటి

పటములలో (Acute) కోణములు గలవు. ఈ పటములో (Acute) కోణముసలు లేదు. చతురస్రములో 90° కోణము లున్నవి. ఈ పటములో అసలు 90° కోణము లేదు.

మొదటి పటములలో 4 సంఖ్యగల భుజము లున్నవి. ఇందులో ఆ పొడుగు భుజ మసలు లేదు మొదటి పటము లలోని భుజము లన్నియు సమానమైన పొడుగుగలవి కావు. ఈ పటమందలి ఆరుభుజములు సమానమైన పొడుగు గలవి. దాని కోణము లన్నియుగూడ సమానములు. ఇక్కడ మన మొక సృష్టిని జూచుచున్నాము; ఈ వర కెన్నడు యెరుగని గుణము లొచ్చినవి. ఈ పూర్తిగా క్రొత్తగుణము లెచట నుండి వచ్చినవి? చూడుడు. ఈ క్రొత్తగుణము లీ సృష్టికర్త చేతను సృష్టింపబడలేదు. మొదటివాని గుణములనుండి ఈ క్రొత్తగుణములు పుట్టలేదు; అవి యన్నియు ఒక క్రొత్త రూపముయొక్క ఫలితములు; ఒక క్రొత్త స్థానముయొక్క క్రొత్తరచనయొక్క ఫలితములు. వేదాంతము దీనినే మాయ యనును. మాయ యనగా నామరూపములే. అవి నామ రూపముల ఫలితములే యని గుర్తించుకొనుడు. ఇంకొకటి జూడుడు: ఈ ద్విసమభుజ త్రికోణములు రెండు ఉదజని చతురస్రము ఆమ్లజని అని అనుకొనుడు. అప్పుడు క్రొత్త పటము నీ రగును. ఈ మొదటి వస్తువులగు ఉదజని ఆమ్లజనుల గుణము లొకరకపువి. ఈ క్రొత్తపదార్థపు (నీటి) గుణములు ఇంకొకరకపువి. ఉదజని ఆమ్లజనులు మనకు నీటి నిచ్చుచున్నవి. ఉదజని మండును, నీ రటుల కాదాయె. ఉదజని

కసలు లేనేలేని గుణము నీటి కున్నది. ఆమ్లజని మంటకు సాయము చేయును నీ రటుల చేయదు. దానిగుణము పూర్తిగా క్రొత్తరకపుది. అటులనే, మనము ఉదజని తేలి కయిన దనియు, ఆమ్లజని అంతటి తేలికయినది కాదనియు జూచు చున్నాము. ఉదజనిని తిత్తులలో నింపిన అవి నిన్ను పైకితీసుకు పోవును. కాని అందులో నుండియే ఏర్పడిన నీరటుల ఫలితముగా వచ్చిన మిశ్రమముయొక్క గుణములు. ప్రారంభిక మూల ద్రవ్యముల గుణములకు పూర్తిగా భిన్నములు. ఈ మిశ్రమ మునకున్న గుణము లెచటనుండి వచ్చినవి. అది ఈ గుణము లను సృష్టికర్త నుండి పొందుచున్నదా? లేక మూలద్రవ్య ములనుండి పొందుచున్నదా? కాదు అది వానిని క్రొత్త రూపము నుండి, క్రొత్త స్థానమునుండి, క్రొత్త ఏర్పాటునుండి ఈ గుణములను పొందుచున్నది. అదీ వేదాంతము మనకు చెప్పు నది. ఈ ప్రపంచమున నీవు జూచునదంతయు నామరూపముల ఫలితమేనని అది నీకు చెప్పుచున్నది. నామరూపముల ఫలిత మగు దీనికిగాని, దానికిగాని కారణము సృష్టికర్త ఉండుటయే, నని నీ వన నక్కర లేదు.

ఇదిగో ఇచ్చట నీ ఎదుట ఒక బొగ్గుముక్క ఉన్నది. ఒక ప్రకాశమానమగు వజ్ర మున్నది. బొగ్గు గుణములకు పూర్తిగా భిన్నములైన గుణములను కలిగియున్నది వజ్రము. ఇనుమునుకూడ కోయగలిగి నంత కఠిన మైనది. వజ్రము కాగితముపై గీసినచో అరిగిపోయి అచటకూడ నల్లని చార నొదలు నంతటి మెత్తనిది బొగ్గు. వజ్రమెంతయో అమూల్య

మైనది. విలువగలది, ప్రకాశవంతమైనది. బొగ్గంతో చప్పనైనది, చూచుట కసహ్యమైనది, నల్లటిది. రెంటి కెంత భేదమో గమనించుము. కాని వాస్తవముగా అవి రెండును ఒకే వస్తువ. సైన్సు ఈ విషయమును ఋజువు చేసినది. "నాతల కిది పట్టదు" అని నీ వందువు. నీ వొప్పుకొనినను, వొప్పుకొనక పోయినను, అది నిజమే. అటులనే వేదాంత మనున దేమన ఇచట నొక చెడ్డయున్నది. అచట నొకమంచి యున్నది. వజ్రము మంచిది, బొగ్గు చెడ్డది. నీవు చెడ్డ యనున దొకటి ఇచట నున్నది. నీవు మంచియనున దొకటి యున్నది. నీవు మిత్రులనున దొకటి యిచట నున్నది. నీవు శత్రువులనున దొకటి అచట నున్నది. కాని వాని కన్నిటికి అధిష్ఠానముగ నున్నది ఒకే వస్తువ. బొగ్గు లోను, వజ్రములోను నున్నది ఒకే కార్బన్ అయినట్లు రెండు శావులలోను గోచరించునది ఒకే దేవత్వము. భేద మున్నది నామరూపములలోనే, వేరొక దానిలో కాదు. వజ్రములోని కార్బన్ అణువులు, బొగ్గులోని కార్బన్ అణువులకంటె వేరు విధముగా ఏర్పాటైయుండి వేరువిధము లైన అణుసముదాయ మునకు కారణములైనవి. వజ్రమునకు బొగ్గునకు గల భేదము నామరూపములవలన వచ్చినదే. దానినే హిందువులు మాయ యందురు. ఈ భేదములన్నియు నామరూపముల వలన వచ్చినవే.

అటులనే మంచికి చెడుగునకు గల భేదముగూడ మాయవలన - నామ రూపములవలన - వచ్చినదే: ఎల్లప్పటికి ఉండునవి కాదు. కాబట్టి నామరూపములు సత్యములు కావు.

ఒకసారి కనపడి, మరొకసారి కనబడునవికావు. కాబట్టి అవి అసత్యములు. విశ్వ మను నీ ప్రక్రియ నామరూపములుగాక మరొండుకాదు; విభేదములు, మార్పులు, కలయికలు గాక మరొంకుకాదు; ఈ వివిధమార్పులు కలయికలు దేనివలన వచ్చినవి? అంతరంగికభ్రాంతివలన వచ్చినవి. అంతరంగిక భ్రాంతివలన వచ్చిన ఈ నామరూపములలో, ఒకే దేవత్వము తనను ప్రకటించుకొనుచున్నది. మాయ యనబడు ఈ ప్రపంచముయొక్క నామరూపములలో దేవుడు తనను తాను ప్రకటించు కొనుచున్నాడు. ఇది యంతయు అంతరంగిక భ్రాంతి వలనవచ్చినది. దాని నతిక్రమించుము. నీ విక సమస్త మయ్యెదవు. అందరిలోను సమత్వమును చూచువాడే నిజముగ చూచుచున్నాడు: అందరిలోను ఒకే దేవత్వమును సమస్థితముగ జూచువాడే కళ్లు కలవాడు.

భగవద్గీతలోని ఈ క్రింది వాక్కులు దీనిని మీకు విస్పష్టము చేయును.

"అహం క్రతు రహం యజ్ఞః
స్వధాఽహ మహ మౌషధమ్
మన్త్రోఽహ మహ మేవాఽజ్య
మహ మగ్ని రహం హుతమ్.

పితాఽహ మస్య జగతో
మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోఙ్కార
ఋక్సామ యజు రేవచ

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ
నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రలయం స్థానం
నిధానం బీజ మవ్యయమ్

తపా మ్యహ మహం వర్షం
నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ
సదసచ్చాహ మర్జున! ”

---

*గంగానదీ శ్రావ్య సంగీతరవము
చలియించు దేవదారువుల గీతములు
వనధిగర్జనల ప్రతిధ్వానములును
గోనితంబముల సాధుత్వగుణంబు

తళతళ మెఱిసెడి మంచుబిందువులు
బరువుతో వంగిన వార్ష మేఘములు
పశి కందుపదముల మృదులశబ్దంబు
జనుల గుంపున గల్గు నవ్వుల గోల.

* ఈ ద్విపద శ్రీ కేశవతీర్థుల అనువాదం.

సూర్యుని బంగారు కిరణంబు మఱియు
మహాగ తారల కంటి తళుకుల వెలుగు
కాంతులు నలుదిక్కులకు వెదజల్లు
కార్తీక చంద్రుని ధవళ కాంతులును

ఉద్ది ప్తకరవాల ధారలో కాంతి
పరిశుభ్ర నవరత్న తళతళ క్కాంతి

మసక చీకటి నర్ధరాత్రి కాలమున
కనవచ్చు దీపగృహోపరి కాంతి
సస్యసమృద్ధమౌ భూమండలంబు
స్వర్గీయ మౌ మహాద్భుత సంపదయును
నిశ్శబ్దము శబ్దము శిఖ లేని జ్యోతి
చీకటి లేనట్టి చీకటి మఱియు
పతనముల్ లేని ఆకాశయానంబు
చిత్తవిహీన మౌ చింతన మఱియు
చూపులు లేనట్టి చూపు నిరాస్య
భావన కరములు లేనట్టి పట్టు
నే నహో, నే నహో, నే నహో! నేన!!

ఓమ్! ఓమ్ ॥ ఓమ్!

## ప్రపంచ మెప్పుడు ప్రారంభ మైనది ?

బుధవారము 1904 ఏప్రిల్ 6 వ తేదీన చెప్పబడిన ఉపన్యాసము

స్త్రీ పురుష రూపముగ నున్న ప్రేమాత్మక మగు దేవత్వమా !

ప్రపంచ మెప్పుడు ప్రారంభ మైనది అను ప్రశ్న అడుగ బడినది 'ఎప్పుడు' అను దాని నిర్వచనమును వెతుకబోగా, ఏ కాలమున అని అర్థము తెలును. కాన ప్రశ్న ఏమన, ప్రపంచ మే కాలమున ప్రారంభ మైనది అని కాని, కాలము ప్రపంచమున దంతర్భూతము గావున కాల మే కాలమున ప్రారంభ మైనది యనియే దాని అర్థ మని తెలును; ఈ విధ ముగ నడిగిన నది పిచ్చిగనే తోచును. ప్రపంచ మెక్కడ ప్రారంభ మైనది ? అవకాశము (దిక్కులు) ఎచట ఆరంభ మైనది? కాక ప్రపంచ మెటుల ప్రారంభ మైనదను ప్రశ్నకూడ ఉన్నది. కొందరు తెలివికలవారు ఈ ప్రశ్నలకు జవా బివ్వ ప్రయత్నింతు రేమో ! నే నీ ప్రశ్నలను వారికే వదలెదను. నేను చేయగోర దలచు దానికంటె అది అధిక మైనది. ఈ ప్రశ్నల పరిష్కార మందే తమ దినముల గడపువారు కొందరున్నారు. అయితే నేమి ? వారు కొంతవరకే పోయి అచట అసాధ్యమైన రాతి గోడలవలన ఆపబడిన ట్లగుదురు.

ఇదిగో ఇది పటకారు. పటకారు ఈ వస్తువను, ఆ వస్తు వను పట్టుకొని ఎత్తగల్గును కాని, వెనుకను తిరిగి వానిని పట్టు కొని నడిపించుచున్న చేతిని పట్టుకొనలేదు. కాన, దిక్కాల

కారణములను త్రయము ప్రపంచప్రక్రియలను పట్టుకోగల్గునే గాని, దాని కతీతముగ నున్న ఆత్మను పట్టుకోలేవు,

ఒకసారి కంటికి పొరవేయుటచే (Cataract) నల్గురు మనుష్యులు ఆపరేషన్ కొఱకు వైద్యశాలకు తీసుకపోబడిరి. వీరిలో నెవరికిగాని కొంచెమేని కనపడదాయెను. కాని వారి కున్నవి నాలుగింద్రియములే నాయెను. ఒకనాడు వారు కిటికీ అద్దము ఏ రంగు దని తగువులాడ జొచ్చిరి. ఒక డిట్లనెను "విశ్వ విద్యాలయమందు చదువుచున్న నా కుమారుడు నిన్న ఇచటికి వచ్చి అద్దము పసుపురంగు దని చెప్పెను. కాన అది పసుపు రంగుదే" మఱొక డిట్లనెను "మునిసిపల్ కమీషనర్ అగు నా పినతండ్రి నిన్న ఇచటికి వచ్చినాడు. అద్దము ఎరుపురంగు దని ఆతడనెను. అతను తెలివికలవాడు ఆతనికి తెలియనిది లేదు." మూడవవాడు ఇటు లనెను "విశ్వ విద్యాలయమందు ఆచార్యుడుగా నున్న మావా డొకడు మొన్న వచ్చి అద్దము ఆకుపచ్చ రంగు దని చెప్పినాడు. ఆతనికి తెలియక యుండదు." ఇటుల వారు అద్దము రంగునుగూర్చి తగవులాడ జొచ్చిరి. ఆ పై వారు తామంతట తాము అద్ద మే రంగుదో తెలిసి కొనుటకు ప్రయత్నింపజొచ్చిరి. తమ నాలుకలను అద్దముపై నుంచి రుచి చూచిరి: కాని రంగు నా విధముగ తెలిసికోలేరు గదా ! తరువాత దానిని వేలితో కొట్టి ఏమి శబ్దము వచ్చునో యని విని చూచిరి. కాని రంగు నా పద్ధతిగా తెలిసికో వీలు లేదుకదా ! వారు దానిని వాసనజూచిరి; కాని వారి స్పర్శేంద్రియ, ఘ్రాణేంద్రియ, రసనేంద్రియ, శ్రోత్రేంద్రియములు

అద్దపురం గెటువంటిదో చెప్ప లేకపోయెను. అట్లే మనము అప్రమేయమును, ఇంద్రియములద్వారా తెలిసికోలేము. అప్రమేయమును ఇంద్రియములద్వారా తెలిసికోగల్గుదు వేని అది యెంతటి అసంభవమైన విషయమో చూడుడు. అప్రమేయము ప్రమేయమునకన్న చిన్నదియై యుండవలెగదా! విశ్వ చైతన్యముద్వారానే దైవచైతన్యము ద్వారానే మన మప్రమేయము నెఱుగగలము. ఇదిగో నే నొక నిప్పుపుల్లను నా చేతిలోనికి తీసుకొనుచున్నాను. దానిని పట్టుకొనిన చేతికంటే నిప్పుపుల్ల చిన్నది. ప్రమేయమైన ద ప్రమేయము నెటుల పట్టుకోలేదో చూచితిరా? ఇంద్రియములు వాని కతీతమైన దానిని గ్రహింపలేవు. అద్దపు రంగును స్వయముగా నెఱుగక ఇదిగో నా పినతండ్రి చెప్పినాడు; గాన అద్దము ఎర్రనిది. ఇదిగో నా కొడుకు చెప్పినాడు, గాన, అద్దము పచ్చది అని తగవులాడిన గ్రుడ్డివారివలె ఆత్మను తెలుపుటకు మీరు బాహ్యవ్యక్తులపై (వ్యక్తులపై) ఆధారపకుడు. ఉదజని, ఆమ్లజనులు నీటిని పుట్టించునని నేను వింటిని. నే నది ఎఱుగుదునా? లేదు కాని రసాయన శాస్త్రజ్ఞు లందరు నా కది నిజమే నని చెప్పుదురు. ప్రయోగ శాలలోనికి స్వయముగ వెళ్ళి, స్వయముగ చేసి చూచినప్పుడే దానిని నే నెఱుగ గలను. అప్పుడే అది నాకు యదార్థ మగును. మీపై మీరుగాక బయటి ప్రమాణముపై దేనిపైనను కృష్ణునిపై గాని క్రైస్తుపైగాని, బుద్ధునిపై గాని - ఆధారపడ లేవు. దాని నెరుగుటకు, నీవు స్వయముగా ఎఱుగ వలెను. నీకు సరైన

వాడోకడు, ఉదాహరణ కొక యాచార్యుని అద్ద మొగ్గరగ నున్నదని చెప్పననుకొనుడు. కాని దాని నెఱుగుటకు నీవు స్వయముగ చూడవలెకదా ! "నాతండ్రిపొట్ట మంచి గట్టిది; అతడు నాబదులు నా భోజనమునుకూడ జీర్ణము చేసికొగలడ"ని యొక యువకుడు అనును. కాని అది సాధ్యమా ? కొడుకు భోజనమును కొడుకే జీర్ణముచేసుకోవలెగదా! ప్రపంచమం దొచ్చిన ఆ మహాపురుషులందరికి నేను నమస్కరించెదను. కాని నా తిండిని నాబదులు వారు జీర్ణించుకొగలరా ? అది నేనే చేసుకోవలె. దేవునికిని నాకును గల ఏకత్వమును వారు నాకు నచ్చుచెప్పలేరు. అది నాకై నేనే చేసికోవలెను. విశ్వ చైతన్యముద్వారానే మనము సత్యము నెఱుంగగలము. ఇది మీకు తరువాత చెప్పెదను.

అవిశ్వాసియు, స్వతంత్రాలోచకుడును అగువాడు నేనే స్వయముగ విచారింతును అనును. అట్టివా డెంతవరకు పోవునో చూతము. ఈ నిప్పుపుల్లలో నిప్పున్నదని అతడనును. అయితే దాని నెచట కనుగొందము ? అందుకై అతడు నిప్పు పుల్లను చిన్నచిన్న ముక్కలుగా కోసి చూచును. కాని నిప్పును గనుగొనలేడు. అపై వాడు దాని నింకను చిన్నచిన్న ముక్కలుగా చేయును. కాని అప్పటికీ ఆతనికి నిప్పు కనపడదు. ఈ దేహములో ప్రాణమున్నదని అతడనును. వాడు దేహ మును తీసికొని, దానిని ముక్కలుగా చేయును. కాని వానికి ప్రాణము కానరాదు. ఎముకలను తీసికొని పిండిచేయును. అచటను వానికి ప్రాణము కనపడదు. సత్పదార్థ మొక

టున్నచో అది నేనై యుండవలె నని ఆతడనును. కాని అది అజ్ఞాతము. ఆతడు పోయినంత వఱకది నిజమే కాని ఆతడింకను విశ్వచైతన్యము నభివృద్ధిచేసికో లేదాయె. ఆతడు ప్రాదేశిక (Local) చైతన్యమునే అప్రమేయము నెఱుగుట కుపయోగించినాడు. కాని ఈ మార్గమున ఆత డెన్నటికి దానిని ఎఱుగజాల డనునది స్పష్టము. బుద్ధిద్వారా అప్రమేయము వరకెళ్ళి అది యున్నదని తెలిసికోగలము. కాని అది ఎట్టిదో తెలిసికోలేము. నా వెనుకగా ఒక మనుష్యుడొచ్చి నాకండ్లను మూసినచో, అచటెవడో ఉన్నాడనియు, వాడెవడో మిత్రుడే కావలయుననియు ఎఱుగుదును. ఎందుకన క్రొత్తవాడొచ్చి అంత స్వతంత్రముగ కండ్లను మూయలేడు; కాని వాడెవరో మాత్రము చెప్పలేను. ఒక బంతిని గోడకేసి కొట్టితిమని బంతి గోడవరకెళ్ళును; గాని తిరిగి వెనుక కెగురును. బుద్ధి అప్రమేయములో సికిచ్చోరలేదు. *అప్రమేయము(అనంతము)ను తెలిసికొనుటకు పీ లున్నచో, ఏకత్వమునకు బదులు వెంటనే ద్విత్వము స్థాపింపబడును. ఇక నప్పుడు తెలిసికొనబడునది అప్రమేయము కాజాలదు. తెలిసికొనువాడు అప్రమేయము కాజాలడు. విశ్వచైతన్యమువలననే ఏకత్వము స్థాపింపబడును.

ఇక ఈ దేవచైతన్యాభివృద్దినిగూర్చి, మొదట మీకు కొంచెము పసిబిడ్డనుగూర్చి చెప్పెదను. బిడ్డకు విశ్వచైతన్యమూ

---

* ఇంగ్లీషులో రామతీర్థులు Infinite అని వాడినారు. అనగా అఖండమైనది, అనంతమైనది అని అర్థము. అప్రమేయమైనది అనిక్షూడ అనవచ్చును. నాకదియే బాగుండి ఆమాట్నే వాడినాను.

లేదు, ప్రాదేశికచైతన్యమూలేదు. ఈ చిన్న పసిబిడ్డ కేమి తెలియును? కాని అది తన్ను తా నెరుగువరకు మనము దానితో మాటాడకుండ ఆగెదమా? లేదు. దాని చుట్టు నున్న వస్తువుల నన్నిటిని అది ఎఱుగువరకు, మనము దానినిగూర్చి మాట్లాడ కుండెదమా? లేదు. బిడ్డ ఎంతో చిన్నదిగా నున్నప్పుడే దానికి పేరుపెట్టబడును. ఉదాహరణకు జానీ అని పెట్టినా మనుకొనుము. తల్లిదండ్రులీ పేరుతో ఆబిడ్డను పిలిచెదరు. దానితో మాటాడెదరు. దానికి వివిధ వస్తువులనుగూర్చి చెప్పెదరు. అది (బిడ్డ) ఎంత అందముగ నున్నదో ఎంత ప్రియముగనున్నదో దానికి చెప్పెదరు. దానికి వారు అమ్మను గూర్చి, నాన్ననుగూర్చి చెప్పెదరు. బిడ్డ కొంచెము పెద్దదై తనంతట తాను ఆడుకొనసాగగానే, అది మన కర్థముకాని ధ్వనుల చేయసాగును; కాని తరచుగా అమ్మ, నాన్న మాటలాడుచుండుట వినుటచే బిడ్డ ఆధ్వనులనే ఉచ్ఛరింపసాగును. అప్పుడు బిడ్డ "నానా" అనగనే తల్లి తండ్రితో నిట్లనును, ఓహో! బిడ్డ మిమ్ములను పిలుచుచున్నది. తండ్రి బిడ్డతో నిటు రమ్మనును. బిడ్డ కది ఏమిటో తెలియునా? లేదు: తండ్రి చేతుల జాచి బ్రతిమాలుటచే తాను తండ్రివద్దకు రావలయును కాబోలని దానికి బోధపడును. కాన, ప్రాదేశిక చైతన్య మీ విధముగా అది యున్నవారి సహవాసమువలన అభివృద్ధి గాంచును. అటులే విశ్వచైతన్యముకూడ అది కల్గిన వారితో, అనగా దేవత్వము ననుభూతిలోనికి దెచ్చుకొనిన వారితో, సహవాసము చేయుటవలన అభివృద్ధియగును.

బాగుగా దుఃఖములో నున్నవారితో సహవాసము చేయుము. నీ హృదయము కూడ శోకావిష్టమగును; సంతోషముతోడను సల్లాపములతోడను బ్రతుకుచున్న వారి సావాసము చేయుము. నీకును ఆనందము కలుగును; అటులనే సహవాసమువలన ఈ చైతన్యము ప్రబుద్ధమగును. ఈ సహవాసము ప్రకృతితోడ, లేక జ్ఞానులతోడ లేక జ్ఞానుల వ్రాతలతోడ చేయవచ్చును. దేనితో జేసినను ఫరవాలేదు. సహవాసములోన దీనిని తప్పక జాగ్రత్తము చేయుము. బిడ్డ జానీ అయినదాక తలిదండ్రులు జానీ! జానీ యని పిలిచెదరు; వారు విల్లీ ! విల్లీ యని పిలిచిన అది విల్లీయే యగును. అవునా ? కాదా ? అటులనే ఒకగదిలో ఇద్దరు ముగ్గురు పిల్లలు నిద్రపోవుచుండ వచ్చును. జానీని పిలిచిన, జానీయే పలుకును; విల్లీ కాదు. పెద్దగా బొబ్బబెట్టినను విల్లీ లేవడు; ఎందుకన పిలువబడినది వాడు కాదు గదా!

ఆత్మతో ఏకత్వానుభూతి నొందిన వానిని, అజ్ఞానము వలన యొకడు ఏదీ ఒక గడ్డిపోచను చేయుము; అనవచ్చును. ప్రశ్నించువాడు ఇటుల డుగవచ్చును "చూడు, నీవు దేవుడనని చెప్పుకొనుచున్నావు; నీ వేమి చేయగలవు ? దేవుడు లోకమునంతయు చేసినాడు, నీవు గడ్డి పోచ నైనా చేయలేవు: అయినప్పటికి దేవుడ నని చెప్పుకొనుచున్నావు. ఏదీ చూపించు, నీవేమి చేయగలవో". జీసను ఈ విధముగా భ్రమపెట్టబడ లేదా ? కొండనుండి క్రిందికి దుముక మనిన సైతాను ఎత్తిపొడుపులను లెక్క చేయక, అతడు సైతానుతో నిట్లనెను. "వెళ్ళు, నీవు నావెనుకకు వెళ్ళుము" శక్తియంతయు అతనిద్వై

యుండ, ఒక అవిశ్వాసికోట కాతడు ఎందుల కటుల చేయ వలయునుః కోట్లకొలది ఆశ్చర్యములైనను. సంశయించు వానిని నమ్మించ లేవుకదా! అతనిలోగూడ విశ్వచైతన్యము కలుగ నిదే, అతడు ఆత్మను ఎఱుగనేరడు. "నేను దేవుడను" అని నప్పుడు నా యభిప్రాయ మేమి? ఈ చిన్న వ్యక్తిత్వమా? కాదు, అదికాదు. ఈ మనస్సా? కాదు, అదికాదు; అది ఈ లాగున నున్నది. ఒక మనుష్యుడు ఎం. ఎ, ప్యాసయి డిగ్రీని పొందు ననుకొనుడు. ఒకడు రాజుగావున రాజను బిరు దున్నదను కొనడు – అప్పుడు ఆ డిగ్రీ లేక ఆ బిరుదు వ్యక్తిత్వమునకు బహిరంగమైనది: పైన కొసరు వంటిది. అటులనే. ఆ పాము నల్లనిది అని నే ననవచ్చును. నల్లన అనునది పాముకాదు, దానికి వేరైన మరొకటి పాముయొక్క గుణము. కాని నేను పాము త్రాడు అనినప్పుడు అది యొక క్రొత్తపరిస్థితి. నేనొక రాజును; రా జనునది యొక బిరుదు, ఒకహోదా; కాని నేను దేవుడను అన్నప్పుడు ఈ క్షుద్ర వ్యక్తిత్వ మని అర్థముకాదు. ఆ త్రాడే పాముకానట్లు అది యొక భ్రమ నీ అజ్ఞానములో నీవు త్రాటిని పాముగా నెంచితివి; కాని అది సత్యముకాదు, అది నిజముగా త్రాడే కాన ఈ వ్యక్తిత్వ మనున దొకభ్రాంతి. నేను దేవుడను; ఏకైక దేవుడను, సనాతనుడను, సర్వమును మరొక విరుద్ధమైనది లేదు

దీనిని కొంచెము విపరించెదము. ఇచట రెండు తరంగ ములు కలవు. ఒకదానిలోనినీరు మరొకదానిలోని నీరుకంటె భిన్నమా ? లేదు. నీ రొకటియే. సముద్రమంతటిలోను ఉన్నట్టి

నే యొకటియే. ఇచట నొక రూపమున్నది. అచట మరొక రూప మున్నది ఈ రూపములో నున్న ఆత్మ, ఆ రూపములో నున్న ఆత్మకంటె భిన్నమా? కాదు. ఏకమే సర్వము. అది అద్వితీయము. ఈ దేహము లన్నియు ఆత్మయొక్క దేహములే. అవన్నియు నావే. భేద మేమియు లేదు. వేరు వేరు భాషలలో మనము "వెలుతురును" వేరు వేరుగా పిలచెదము, ఇంగ్లీషులో దానిని "లైట్" అందుము, జర్మన్ భాషలో "లిక్ట్" అందుము. కాని వెలుతురొకటియే కదా! పేరులు మారినను వెలుతు రొకటియే కదా! ఆత్మకు పేర్లేమియు భేదమును తేలేవు, అదే సర్వము.

ఈ దేహము అఖండితమైన (Continuous) దేహము, నాయంతట నేను స్వతంత్రముగ బ్రతికెదను నినే తిండి నార్జించెడిది. కాన నేను సంపాదించున దంతయు నాకే కావలయును; అని చేయి అనినచో ఎట్లుండును? అన్నమును నోటిలో పెట్టి పొట్టలో జీర్ణ మగునట్లు చేయుటకు బదులు, చేతిలోనికి ఆహారమును ఇంజక్షన్ ద్వారా పంపిన పరిహాసాస్పదము కాదా? చేతికి డాలర్లసంచి నొకదానిని కట్టిన, లేక కందిరీగ కుట్టిన, వాచి బాధపెట్టును. కాని చేతిని వరికి వేసిన తరచు బాధ కష్టమూ కలుగును. ఎందుకన చేయి శరీరమంతటికి చెందియున్నది. ఆహారము పొట్టలో జీర్ణము కాగానే చేయికిగూడ దానివంతు వచ్చుచునే యున్నది. శరీరమంతయు కలసి ఒకటిగా పనిచేయును. కాననే ఒకటి (పూర్ణత) నుండి మనలనుమనము ఖండించుకొనగానె, తిరిగి మనము

మన విశ్వాత్మమును గురుతించినదాక బాధపడుచునే యుందుము. ఈ కార్యములో విశ్రాంతి యుండజాలదు విశ్వచైతన్య మభివృద్ధికాగానే దేహము లన్నియు పరస్పరతంత్రము లని గురుతింతుము. అవన్నియు నావే. వేరుదన మనునది లేదు.

ఒకసారొక స్వాములవారు బంగారుపని చేయువాని యొద్దకేగి ఇటులనెను. "నీ కున్నవానిలో కెల్ల మంచి ఉంగర మును తీసికొనివచ్చి దేవుని వ్రేలికిపెట్టుము." తరువాత ఆతడు చెప్పులుకుట్టువానియొద్దకు పోయి ఇటులనెను." నీ కున్నవాని లోని కెల్ల మంచిచెప్పులను దెచ్చి దేవునిపాదములకు తొడు గుము." తరువాత ఆతడు గుడ్డల గుట్టువాని యొద్దకు పోయి ఇటులనెను. "దేవుని శరీరముపై నీకున్న మంచి చొక్కాను తొడుగుము." అనగా స్వాములవారు తనదేహ మను అభి ప్రాయముతోడనే అటు లనెను. జనులది వినగానే, ఆతనిని దేవదూషకుడని నిందించి ఇటులనిరి. "వానిని తీసుకుపొండు. కైదులో వేయుడు." ఆయనను లాగుకొని వెళ్లబోవుముందు స్వాములవారు తనకు చెప్పవలసినది కొంత ఉన్నదనియు, కైదులో వేయుటకుముందే తా నది చెప్పగోరెదననియు అడిగెను. స్వాములవారు వారితో నిట్లనెను. "ఈ లోక మెవనిది?" వారు దేవుని దని బదులు చెప్పిరి. "నక్షత్రములు, సూర్యుడు ఎవరివి?" "దేవునివి". "ఈ మూగాణులూ వానిలో నున్నదంతయు ఎవరిది?" "దేవునిది". "మీరిది నమ్ముదురా?" "తప్పక. అది సత్యమే" నని వారు బదులుచెప్పిరి. అప్పు డాయన ఈ శరీర మెవరిది? అని అడిగెను. దేవుని దని వారు

సమాధానము చెప్పెను. ఎవరి పాదములు? దేవునివి. ఎవని వేళ్ళు? దేవుని వేళ్ళు. అవి నిజముగా దేవునివే నాయెను. వారి వాదన ప్రకారమే ఆయన వారికి తా ననినది సత్యమని చూపెను. కాన ఆయన నేమియు చేయరైరి. వా రందరు అజ్ఞాను లగుటచే స్వాములవారు చూచినంత లోతుగ చూడరైరి.

ఇండియాలో ఎవడైన చచ్చినప్పుడు వాడు దేహము నొదిలె నందురు. ఇచట ఆతడు ఆత్మ *(భూతము) నొదిలె నందురు. అచట వారనుమాటే దీనికంటె మిన్నగ నున్నది. ఎందుకన? అది శరీరముకంటె ఆత్మ భిన్నమని సూచించుచున్నది. వారచట ఇటులగూడ అనెదరు. "వాడిప్రాణము పోయినది." ఒకసారి ముగ్గురు మనుష్యులు కూర్చుండి తప్పత్రాగు చుండిరి. వారందరికి మత్తెక్కెను. అందులో ఒక డిట్లనెను. "ఏదీ కొంచెము జల్సాచేసికొందము." అప్పుడు అందులో నొకనిని మాంసము, ఇతరవస్తువులు తెచ్చుటకు పంపిరి. ఆతడు పోయిన తరువాత ఉన్న ఇద్దరిలో ఒకడు అస్వస్థత ననుభవింపసాగెను. తన చెలికానితో "ఓ! నాప్రాణము పోవుచున్న" దనెను. "లేదు. లేదు. నీ ప్రాణము పోగూడదు" అని రెండవ వా డనెను. ప్రాణముపోకుండ ఉంచుట కాతడు రోగి ముక్కును గట్టిగా పట్టుకొనెను. ఆతని చెవుల మూసెను. నోటినిగూడ

* భూ = To be.

పెదవులు తెరువకుండ పట్టుకొనెను. అటులచేసిన ప్రాణము పోకుండ శరీరములోనే యుండు నని ఆతను తలచెను. కాని అటుల చేయుటవలన జరుగున దేదో మన మెఱిగినదేకదా! వారట్టిపని చేయుటవలన వచ్చు ప్రయోజనము కానరైరి.

కృష్ణుడొకసారి విందు చేయ బోవుచుండెను. మంత్రు లందరు ఆహ్వానింపబడిరి. కాని ఆతడు తన ప్రియురాలగు రాధను పిలువడాయె. ప్రధానమంత్రి ఆమెకుగూడ ఆహ్వానము పంప మని ఆయన నెంతో బలవంత పెట్టెను. కాని ఆయన ఆతనిమాట వినకపోయెను. అయినను, ప్రధానమంత్రి అంతటితో నూరుకొనక, రాధవద్దకుపోయి కృష్ణుడివ్వబోవు విందునుగూర్చి చెప్పెను. ఆమె అతనితో నిట్లనెను. నీ వొకవిందు చేయు నప్పుడు నీ స్నేహితుల కాహ్వానము పంపుకొందువు. నీకు నీ వాహ్వానము పంపుకొందువా? కృష్ణుడు విందు చేయబోవు చున్నాడని నే నెరుగుదును మే మిద్దఱ మొకటియే."

ఒకనాడు మజ్నూయొక్క ప్రేయసి తన కారోగ్యము లేదనియు, తన కేదియు బాగుండ లేదనియు అనెను. వైద్యుని పిలువనంపిరి. నాటి ప్రాత యాచారము ప్రకారము వైద్యు డొచ్చి లైలీ చేతిలోనుండి కొంచెము రక్తము తియసాగెను. అనగా ముంజేతిలో కొంచెము గాయము చేసి నెత్తురు తీయ బోయెను. కాని లైలీ చేతినుండి నెత్తురు రాదాయెను. కాని మజ్నూ చేతినుండి బొటబొట కారసాగెను. ఈ ప్రేమికుల ఏకత్వ మంతటిది.

## ప్రపంచము

*ఈ ప్రాథమిక వాచకము గంటి నేను
పఠియించి, దీనిని గ్రహించినాను
ఈ అక్షరముల వాచక మేను గంటి
చక్కగా నన్ను వర్ణించిన దిద్ది
ఇందులో రచిత మా వర్ణంబు లెల్ల
బొమ్మల లిపిలోన వ్రాయగాబడుచు
వివిధరీతుల నన్ను వర్ణన జేసె
ఈ వర్ణమాలిక ఒకనాడు నాకు
ఆశ్చర్యముగ గానవచ్చె నీనాడు
చింపి దీనిని దిబ్బలో పారవైతు
ముక్క ముక్కగ చింపి ఈ పుస్తకమును
తగులబెట్టెదను సంతోషచిత్తమున
ఏకాంతముగ పీల్చు హుక్కా రగుల్చ!
ఆనందముగ నోట హుక్కాను పీల్చి
వదలుదు నోటితో పొగమబ్బు లపుడు!
ఆ పోవు చిత్రమా పొగ చూచుకొనుచు
హాయిగా నిర్లక్ష్యముగ నుందు నేను

ఓమ్! ఓమ్! ఓమ్!

---

* ఈ ద్విపద శ్రీ కేశవతీర్థులది

## హిప్నాటిజము : వేదాంతము

1. ఒకనిని దొంగదొంగ యనుము. వాడు తప్పక దొంగిలించును అని ఎమర్సన్ అనినాడు అనగా ఏదైన సూచనను చేయుము. దాని ఫలితము క్రియారూపముగ నీకు కనపడును. ఈ మాట కొన్ని మారులు నిజమే అయినను సర్వత్ర సత్యము కాదు. కొన్ని సందర్భములలో ఒక సూచన సూటియగు ఫలితమును జూపును. కాని మఱికొన్ని సందర్భములలో దానికి విరుద్ధమగు ఫలితమును జూపును. కాన సూచన (Suggestion) లను తిన్నగా ఉపయోగింపవచ్చునని గట్టిగా తలచువారు పూర్తి సత్యము నెరుగ రన్నమాట. వేదాంతము ప్రకారము విద్యుచ్ఛక్తివలెనే సూచనలుకూడ రెండువిధములుగ పనిచేయుచున్నవి.

మన సూచన తిన్నగా పోయి ఆ మనుష్యుని (సూచనను పొందువానిని) తాకునప్పుడు ఫలితము సూచనకు తిన్నగను, సమరసముగను ఉండును. కాని మన సూచన పోయి తిన్నగా రోగిని తాకని సందర్భములలో అనగా రోగి బుద్ధిసూచన చేయు మనుష్యునిపై అయిష్టముగనుండి; అడ్డుకగిలి సూచనను రోగి కారణశరీరమునకు తగులనీ యని పక్షములో ఫలితము అనుకున్నదానికి వ్యతిరేకముగ నుండును. ఇది సంవర్తిత హిప్నాటిజము. మొదటిది వివర్తిత హిప్నాటిజము.

2. కారణ శరీరము గుప్తశక్తులయొక్క అభిప్రాయ ములయొక్క *అంతశ్చైతన్యపు మనుష్యుని దాగియుండు స్థలము. మనుష్యుని కర్మలు, కదలికలు, నడత, పరిస్థితులు అన్నియు కారణ శరీరమందు దాగియున్న పదార్థపు ప్రక్రియయే. దానికి తగిన ఫలిత మవశ్యము కనపడును. కారణ శరీరము మనుష్యుని వేరుపుట్టువు, అసలు కేంద్రము. రాజు లేక నీవు దానిని నరుని అంతర్మస్తిష్కము ( Subjective mind) అన వచ్చును.




C కారణ శరీరము

B సూక్ష్మ శరీరము (మనోబుద్ధులు)

A ప్రాకృత శరీరము

ప్రాకృతశరీరముచే చేయుబడిన కర్మ లన్నియు తక్షణమే మానసికశక్తిగా లేక ఆలోచనగా మారిపోంది, అచట మానసికక్షేత్రమందు కొంతతడవుండి (దీనిని ప్రక్కబొమ్మ B తో గురుతు వేసినాము) చివరకు కారణశరీరములోనికి పోవును. (దీనిని బొమ్మలో C తో గురుతు వేసినాము) మానసిక క్షేత్రములో (B లో) ప్రాకృత జగత్తులోనుండి వచ్చినట్లు కనపడకుండనే కనపడు భావము లన్నియు కారణ శరీరములో నిలువగా నున్న ప్రాతశక్తి; అదియే క్రిందిక్షేత్ర మగు B లోని

* అంతశ్చైతన్యము = Subconscious
ఉపచైతన్యము అనిన ఇంకను బాగుండును.

కొచ్చినది. కాన A. B, C లకు అనగా మూడు శరీరముల కున్న సంబంధము గాలికి, నీటికి, నీటి యావిరికి ఉన్న సంబంధము వంటిది; లేదా మంచుకు, కొండవాగనకు, క్రింద మైదానములోనికి దిగినతరువాత అదే వాగునకును ఉన్న సంబంధమువంటిది. అనగా అవిచ్ఛిన్నమైన సంబంధమని తాత్పర్యము.

నీవు రోడ్డుపైబడియున్న రోగి నొకనిని చూచితి వనుకొనుము. తక్షణమే నీవుపోయి వాని కేమి కావలెనో చేసెదవు; ఆ బాధపడుచున్నవాని బాధతీర్చుటకు వీలైన దంతయు చేయుదువు. నీ యింద్రియములు, అవయవములు పూర్తిగా పనిలోనుందును; నీ వా మనుష్యునికి చేయవలడినది చేయుట పూర్తి అయినపిదప, ప్రాకృతములగు నీ యింద్రియ ములు అవయవములు విశ్రాంతి నొందును. అప్పుడు ఇంద్రియ క్షేత్రములోనే A లోనే, మొదట పనిచేయుచున్న శక్త్యుత్సాహ ములు B లోనికి పోవును. అనగా నీ మనస్సు స్వాభావికముగా నీవుచేసిన పనులగూర్చి యోచించును. ఆ పనియొక్క మంచినిగూర్చియో, వీరత్వమునుగూర్చియో, చైతన్యవంతముగ ఆలోచించును. కొంత సేపైన తరువాత ఈ B క్షేత్రమందు పనిచేసినశక్తి అచటున్నట్లు కనపడదు. ఎక్కడికి పోయినదది? అదృశ్యమైనదా? ప్రకృతిలో నశించున దసలు లేదు; గాన అది అట్లు యుండనోపదు. వేదాంతముప్రకారము ఈ శక్తి అదృశ్యమై అంతశ్చైతన్యస్థితిలోనికి, C లోనికి, కారణశరీరము లోనికి పోయినది. మన స్వప్నములలోనూ, మన లోపలి

వు ద్రేకములలోనూ, లోపలి వాలకములలోనూ, తూకముల లోనూ, గాఢత్వములలోనూ, క్షేత్రములో ప్రకటిత మగుచు ఈ శక్తి కారణశరీరములో నిలువయుండును.

ప్రయోగము.

జాగ్రదవస్థలోగాని, హిప్నాటైజ్ చేయబడినప్పుడు గాని ఒకమనుష్యుని కారణశరీరమును తిన్నగానో, లేక వంకరగానో తాకినా మనుకొనుడు. అచట ప్రవేశ పెట్టబడిన వాలకము. తగుకాలములో తప్పక బయల్పడును. ఒకనిని హిప్నాటైజ్ చేసి, వాడు తిరిగి మేల్కాంచిన తరువాత ఫలాన సమయమునకు ఫలానపని చేయవలయు ననుసూచన. ఆకాలము రాగానే ఆపనిని చేయవలె నను గాఢమైన కోరిక రూపముగా తప్పక ఫలించును. తిన్నగా కారణశరీరమున ప్రవేశించిన సూచనద్వారా చేయబడిన ఈ పనిలోవలెనే, మనుష్యుడు చేయు పను లన్నిటిలోనూ కారణశరీరములో అంతకు పూర్వమే ప్రవేశించిన సూచనల ఉనికి యున్నదని వేదాంతము చూపుచున్నది. ఆ సూచనలు ఇంద్రియముల హిప్నొటిజము వలననో, లేక ప్రపంచమంతయు ఏ హిప్నొటిజమునలన చేయ బడినదో, ఆ హిప్నొటిజముయొక్క ఏ రూపముననో వచ్చి యుండు నని, వేదాంత మను చున్నది. కారణశరీరమును ఆరోగ్యసూచనలో సింపుము. ప్రాకృత శరీరము తప్పక ఆరోగ్యవంతమగును. కారణశరీరమును దేవత్వపుసూచనతో ముంచి తేల్చుము; ఆ మనుష్యుడు తప్పక ప్రవక్తయై తీరును. కారణశరీరమును హానిసత్వముయొక్క బలహీనతయొక్క

సూచనలతో నింపివేయును. ప్రాకృతశరీరము బలహీనము, బానిస అగును. మనుష్యుని చుట్టుపక్కల వాతావరణమున కంతకు అతని కారణశరీరమే బాధ్యముగావున, మనుష్యుడే తన చేతలకు శిల్పి.

౩. * సోమ్నాంబ్యులిస్టిక్ స్థితిలోనో, ♦ హిప్నాటిక్ స్థితిలోనో ఉన్నవాడు ఇతరుల కేమియు లేనిచోట సరస్సును చూచునట్లు, ఇతరుల కేమియు లేనిచోట చేపలబట్టు గుంటను

---

* Note - షరా

* సోమ్నాంబ్యులిజం అనగా నిద్రలో మేల్కొని ఏవైనపనులజేసి తిరిగి వచ్చి పడుకొని నిద్రపోయి ప్రొద్దున లేచినతరువాత, ఆ పనుల జేసిన ట్లసలుం జ్ఞాపకము లేకుండు మానసిక రోగము. శ్రీరామతీర్థ లీ వ్యాసములో జగద్వ్యాపారమును సోమ్నాంబ్యులిజముతోడను, హిప్నాటిక్ స్థితితోడను పోల్చినాడు.

♦ హిప్నాటిస్‌లో జరుగున దేమన మానసికరోగిని ఒకఏకాంతప్రశాంతమగు గదిలో నుంచి, సమర్థుడగువాడువానిని పడుకొండబెట్టి వాని అంగీకారముతో వానిని వివిధ సూచనలద్వారా నిదురించునట్లు చేయును. నిదురలో వాని అంతశ్చైతన్యమున నాటుటకై అనేక సూచనలు చేయును. తరువాత తిరిగి వానిని మేల్కొల్పును. హిప్నాటిక్ స్థితిలో చేయబడిన సూచనలు బాగుగా హత్తుకొనిపోయి రోగి రోగమును తీసివేయు నందురు. హిప్నాటిక్ స్థితిలోనున్నవాడు ఏమిచెప్పినను చేయును. నమ్మును. ఈ ప్రపంచమందున్న మనము హిప్నాటిక్ స్థితి యందున్న వానివలెనే గ్రుడ్డిగ మనము చూచున దంతయు (లోకమంతయు) సత్యమని నమ్ముచున్నాము. అటులకాదు. ఆత్మ ఒకటియే సత్పదార్థము. నామరూపము లసత్యములని తెలిసికొని మన ఈ హిప్నాటిక్ నిదురను (మాయను) పోగొట్టుకొని ప్రబుద్ధులము కావలెను—అని శ్రీరామతీర్థుల తాత్పర్యము.

—అనువాదకుడు

చూచు నట్లును, ఇతరుల కెన్నడు అస్తిత్వము లేని వస్తువుల జూచు నట్లు, ఈ ప్రక్రియ లన్నియు అతని ఆత్మపైననే ఆధారపడి యుండి దానిమీదనే నిలిచియున్నవి. అటులనే వేదాంతము ప్రకారముమనుష్యునిచే చూడబడు ప్రపంచ మంతయు నిశ్చయముగ అతని ఆత్మమీదనే ఆధారపడి యున్నది. ఇక ప్రాపంచిక ప్రక్రియలకును సోమ్నంబ్యులిస్టిక్ ప్రక్రియలకూ భేదమేమన సోమ్నంబ్యులిస్టిక్ ప్రక్రియలు ప్రాపంచికప్రక్రియల కన్న తక్కువకాల ముండునవి. ప్రపంచములో నుండుట యనగా, ఒకనిని హిప్నొటిక్ స్థితిలోపెట్టి అతని హిప్నోసిస్‌ను తీసివేయ మరచిపోయినట్లు ప్రపంచములోని మనుష్యు లందరు ఒక వింతరకపు హిప్నొటిక్ స్థితిలో పడవేయబడినారు. వారి హిప్నోసిస్ తీసివేయవలె నన్న దేవ-చైతన్యముతో నిండిన స్వతంత్రవ్యక్తి ఒకడొచ్చి, వారి హిప్నోసిస్‌ను తీసివేసి వారికి నిజమైన దేవత్వమును చూపువరకు - అంతటికాలము-వఱకు వారు మేల్కొంచరు. ఏది అసలువస్తువో, ఏది ప్రక్రియల కన్నిటికి ఆధారభూతమో, అదియే సత్పదార్థమై యుండవలె. దానిపై ఆపాదింపబడిన దంతయు హిప్నొటిక్ ప్రక్రియ యే అయి ఉండవలెను. హిప్నొటిక్ స్థితిలోను జాగ్రత్ స్థితిలోను, సుషుప్తిస్థితిలోను, స్వాప్నిక స్థితిలోనుకూడ మార్పొందక ఒకటిగానుండు, కారణశరీరమున కధిష్ఠానముగ నుండునదియే నిజమైనఆత్మ. సత్పదార్థము. మిగిలిన దంతయు దానిపై ఆరోపింప బడినది. అదంతయు హిప్నొటిక్ ప్రక్రియే. ఆత్మానుభూతియనగా నిస్సహాయతను, హిప్నొటిజమును వదలుకొని,

ఈ చరమసత్పదార్థములో గలయుటయే. ఇంద్రియముల సూచనచే బలిష్ఠము చేయబడిన, తల్లిదండ్రుల సూచనచే ప్రాపంచికమగు హిప్నాటిక్ నిద్ర తేబడినది. తిరిగి దానికి సరియగు వ్యతిరిక్త సూచనచే ఆ నిద్రము తొలగును.

ఆత్మ ఎందుకు తప్పుత్రోవన పడినది ?

ఈ ఎందుకు? ఎక్కడ? ఎప్పుడు అను ఆదుర్దాలన్నియు హిప్నాటిజము నంతర్భూతములే. తత్ఫలితములే. అవి సత్యకారణముయొక్క బిడ్డలు, ప్రజలు. ఈ ప్రశ్న వేయుటయనగా కార్యముద్వారా కారణమును తెలిసికోగలమను నాశ. తండ్రికి ముందుబిడ్డను, గుఱ్ఱమునకుముందు బండిని పెట్టుటవంటిది. ఈ ఎందుకు ఎందు కను వాలకము, ఈ ప్రశ్నించుపద్ధతి, ఈ సందేహించు స్వభావము, ఇవన్నియు సంవర్గిత హిప్నాటిక్ స్థితియొక్క ప్రకటనలే. హిప్నాసిస్ పోగానే ఇవన్నియు ఉండవు. నిజమైన అసలుస్థితిలో ఇదేదియు ఉండదు. అచట ప్రశ్నలు సాధ్యములు కావు. ఈ కార్యకారణ శృంఖలమంతయు కాగితపు ముక్కపై గీయబడిన చివరలేని చుట్ట (Spiral) ఈ కార్య కారణములను గొలుసు ఎన్నటికి ఆగదు. చుట్టలు చుట్టుకొనుచునే పోవును. సత్పదార్థ మొకటియు మాత్రము ఈ వంకరటింకర నన్నింటిని నిలబెట్టుచున్న కాగితము ముక్కవంటిది. అది గొలుసుకు అతీతము. కాన ఎందుకు? ఎక్కడ? అను ప్రశ్న వేయుట. కాగితమును చుట్టకి కొనగానో, ఆకొనగానో, చేయుటవంటిది. చుట్టయొక్క

లోవంకలలో వెలువంకలలో, త్రిప్పు వంకలలో [illegible]ము లేదనుకొనుట వంటిది. కాన మిమ్ములను మీరు [illegible] గొలుసులో గాని, ఈ చుట్టలోగాని, పాముయొక్క మెలులలో గాని తగుల్కొనినా మని తలపవద్దని, లోకమున కంతయు రాముని ఆజ్ఞ. నీ వీ పాముచుట్టల నియామకుడుగా, ఈశ్వరుడుగా, యజమానిగా అనుకొనుము. గురుతించుకొనుము నీవు కారణతను దాటెదవు. నిశ్చయముగా, నిశ్చయముగా.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !



# వేదాంతము : సమాజవాదము

మొదటగా సమాజవాద మన నేమో చూతము. దానిని * వ్యక్తిత్వవాద మనిన రామున కిష్టము. సమాజవాద మను పేరు సమాజముయొక్క పరిపాలనకు లేక అధికారమునకు ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చుచున్నది. కాని ప్రపంచమంతటికంటె విశ్వమంతకంటే వ్యక్తియొక్క శ్రేష్ఠత్వమును నొక్కి చెప్పుటయే సత్యముయొక్క యథార్థమైన అర్థము. ఏ కీచులాట, ఏ విచారము, ఏ దిగులు లేకుండ వుండుటయే వ్యక్తిత్వవాద మని రాము డనును. జనుల కిష్టమైనదానిని సమాజవాద మన వచ్చును. వ్యక్తియొక్క దృష్టికోణమునుండి చేయబడిన వేదాంత బోధ ఇది.

సమాజవాదముయొక్క ఉద్దేశ్యము పెట్టుబడిదారీ విధానము నంత మొందించుటయే; వేదాంతముయొక్క ఉద్దేశ్యము కూడ నీ మమత్వమును, నీ ద్రవ్యాభిమానమును, నీ కున్న పోగు చేయు బుద్ధిని, నీస్వార్థమును నశింపచేయుటయే గావున, సమాజవాదపు ఉద్దేశ్యమూ, వేదాంతపు ఉద్దేశ్యమూ ఒకటియే. రెంటి కున్న ఉద్దేశ్యమూ ఒకటియే.

వేదాంతము సమత్వమును బోధించును; సమాజవాదముకూడ సమత్వమునే బోధించును. బహిరంగకమైన సొత్తునకుగౌరవముగాని, మర్యాదగాని ఈయదు. ఇది చూచుటకు భయంకరముగనేయుండును గాని, వరుడు అన్నివిధములుగా

---

* చాలమంది Individualism ను వ్యక్తిస్వాతంత్ర్యవాద మనెదరు,

మమత్వమును, దవ్యాపేక్షను వదలినగాని అతనికి పృథ్విలో సౌఖ్య మనునది యుండదు. సమాజవాదము నరుని ఇవన్నియు వదలుమని కోరును; వేదాంత మటుల కోరుటయేగాక దానికొక కారణముకూడ ఉన్నదని తెలుపును. సమాజవాద మనబడు నది వస్తుస్థితిని పైపైననే గ్రహించి, మనుష్యలోకము, సమత్వము, సౌభ్రాతృత్వము, ప్రేమలతో యుండవలె నను సిద్ధాంతమునకొచ్చును. వేదాంతము వస్తుస్థితిని అంతరంగికముగా, గాఢముగా అధ్యయనము చేయును. వేదాంతముప్రకారము ఏమైన స్వంత ఆస్థి నుంచుకొనుట యనునది ఆత్మ కెంతో విపరీతమైనట్టి, విరుద్ధమైనట్టి పని. వేదాంతము ప్రకారము మానవునికి యిచ్చుటకే అధికారమున్నదిగాని ప్రతిగ్రహించుటకు లేదు. నీ కిచ్చుటకేమియు లేకపోయినచో, పురుగులకు తినుటకు కనీసము నీ శరీరమునైన ఇవ్వుము. నీవు ఉంచుకొనున దంతయు శూన్యమే. అది ఉన్నందుకు నిన్నెవరూ భాగ్యవంతు డనరు. నీ విచ్చునదానినిబట్టియే నీవు భాగ్యవంతుడవు. ప్రతివాడును ఏమియు లేకుండ ఉండుటకే ప్రయత్నించుచున్నాడు. సమస్తము ఇచ్చివేయుటకే ప్రయత్నించుచున్నాడు. ప్రపంచము చేయు పెద్దపొరపాటేమన, అది సంతోషమును ఏమైన పొందుట వలననే దొరకునని తలచుచున్నది. సంతోష మనునది ఇచ్చుటలోనే యున్నదిగాని, అడుగుటలోగాని, యాచించుటలోగాని లే దను సత్యమును నీవు గురుతించవలసిన దని వేదాంతము కోరుచున్నది. నీలో యాచకభావమును, దైన్యమును ప్రవేసించ నిచ్చినతోడనే, నీవు నిన్ను సంకుచితము చేసికొను

చున్నావు. నీనుండి సంతోషమును బయటికి తోలివేసికొను చున్నావు. నీ వేస్థితిలో నైన నుండుముగాని, ఇచ్చినట్టి స్థితిలోనే యుండుముగాని బిచ్చగానిస్థితిలో నుండవద్దు అప్పుడు నీవు చేయుపని విశ్వతోముఖ మగును. స్వార్థయుతము కానేరదు.

హిమాలయములలో నేడు ఈ సామాజిక జీతమును (Socialistic Life) వేదాంతికమత మవలంబించిన భారతీయ యతు లనేకులు గడుపుచున్నారు; ప్రాగితిహాసిక దినములనుండి కూడ వారీ విధజీవితమును గడుపుచునేయున్నారు. వారేమి సోమరిపోతులుగారు; వారు సౌఖ్యములోను విలాసములోను బ్రతుకును తెల్లార్చుకొనువారుగారు. వారెంతగానో కష్టించి పనిచేయుదురు. ఇండియొూరొపియక్కు బృహత్సాహిత్యమంతయు వారి పరిశ్రమల ఫలితమే. వీరే మహాకవులుగను, నాటక కర్తలుగను, శాస్త్రజ్ఞులుగను, దార్శనికులుగను, వైయాకరణు లుగను, గణితజ్ఞులుగను, ఖగోళజ్ఞులుగను, రసాయనికులుగను, వైద్యులుగను వాసికెక్కినది. అయినను వారు చిల్లిగవ్వనైన ఎన్నడు తాకలేదు. ఎంతో సఫలమైన కష్టజీవితమును గడిపి నది వీరే. సమాజవాదము మనుష్యులను పిరికిపందలుగా, సోమరిపోతులనుగా, పరతంత్రులనుగా తయారుచేయు నని దూషించువారికి ఈ యతుల జీవితమే జవాబు. ఎవడు తాను స్వతంత్రుడ నని ఎంచుకోగల్గునో, వాడే చక్కగా పనిచేయ గల్గును.

సమాజవాదము ప్రకారముగాని, వేదాంతము ప్రకారముగాని, నీకు *భార్యాబిడ్డలనుగాని, ఇల్లునుగాని స్వార్థముగ ఉంచుకొనుట కధికారము లేదు.

స్త్రీ వ్యాపారపువస్తువుగా చేయబడి, ఒక చెట్టో, ఇల్లో, డబ్బో, ఎవరికేని చెందియున్నట్టుగా, ఒక మొగవానికి చెంది వానికిలోబడియుండుట యనునది నాగరిక సమాజపు ముఖమున తీరనిమచ్చ. పురుషునకు స్వేచ్ఛగా పోవు నధికారముండ, స్త్రీకి నాగరిక సమాజములో అచేతనవస్తువున కీయబడిన స్థానమీయబడినది; పురుషుని దారి కడ్డ మనునది లేకుండయుండ, స్త్రీ కాలుచేతు లాడకుండ కట్టడిలో పెట్టబడినవి. స్త్రీ యొకనా డొకనికి, మరియొకనా డొకనికి పొత్తగుచున్నది. సమాజవాదము ప్రకారమూ, వేదాంతము ప్రకారమూకూడ ఇది ఎంతో ఆశ్చర్యకరమైన పరిస్థితియే; కాని పురుషునివలెనే స్త్రీకూడ తన స్వాతంత్ర్యమును గుర్తించుకోవలెను. పురుషుడు ఎంతస్వతంత్రుడో స్త్రీయు నంత స్వతంత్రురాలే. కాన, పురుషున కేమియుస్వత్వ (Possession) మనునది ఉండకూడకపోయిన, స్త్రీకిని ఏమియు ఉండరాదు. తన సుఖము సుఖముకొరకు స్త్రీయును. భర్తను స్వార్థపరచుకొన నధికారము లేదు. ఇచట సమాజవాదముపై నొక పెద్ద ఆక్షేప

---

* కమ్యూనిజం, వేదాంతమున కెంతో వ్యతిరేకమని తలచువారు శ్రీ రామతీర్థుల ఈవాక్యములను గమనించవలెను. ఆధ్యాత్మిక కమ్యూనిజమునే ఉపనిషత్తులు బోధించునదని "హిందూమతము" అను నా ఆంగ్ల పుస్తకములో చూపినాను. — (అను.)

మొచ్చును. సమాజవాదము స్త్రీపురుషులకు పూర్ణస్వాతంత్ర్య మంగీకరించునేని, అది సమాజమును పశుస్థితికి తీసికొనిపోయి ప్రజలను నిరంకుశులనుగా చేయును. రాముడు చెప్పునదేమన కామముదృష్టితో చూచితిమేని (From the sexual standpoint) స్త్రీ పురుషుల కంతకంటె మంచిపని వేరొకటిలేదు. ఆవులు, గేదెలు మున్నగు పశువులు తమ సంభోగములో ఎంతో తెలివిగ ప్రవర్తించును; తమ నడతలో ఎంతో మర్యాదగ తెలివిగ ప్రవర్తించును. మనుష్యులుకూడ అదే విధమున ప్రవర్తించిరేని, నాగరిక సమాజములోని కామము ఉద్రేకము (వ్యభిచారము) రూపులేకుండ పోవును.

ఎంతటివింత ? మనుష్యులకంటె పశువు లెంతో మెరుగై యుండ, వ్యభిచారిని పశువు అని తిట్టుట ఎంతటిపొరపాటు. పశువులలో అర్థములేని కామము ఆవంతయును లేదు. సంతానము కొరకే అవి సంభోగముచేయును. కాని మనుష్యుడట్లుకాదు. తిన్నని ప్రశాంతజీవితమును గడుపు వ్యక్తి పశువుల వలె స్వాభావికజీవితమును గడుపును. వ్యభిచారి జీవితము అస్వాభావికము. వ్యభిచారియైన వానిని పశు వనరాదు. వాడు నాగరికత గల మనుష్యుడు. ఇది నాగరికతయొక్క ప్రత్యేకత దీని కీ పశు (అనాగరికత) జీవితమునకూ సంబంధము లేదు. పశువులు తెలివిగ స్వాభావికముగా ప్రవర్తించును. అవి ప్రతిపనిని సకాలమున సక్రమముగ చేయును. వేదాంతము ప్రకారము సమాజవాద ప్రకారము స్వాభావికమైన, తిన్న

నైన, ఋజువైన స్థితి వచ్చుకొలది ఈ విషయతృష్ణ (కామము) తగ్గిపోవును. వెనువెంటనే భర్త, భార్య, తండ్రి, బిడ్డ అను మమత్వము (నాది యను భావము) స్వత్వత్వము (Sense of possesion) కూడ తగ్గిపోవును.

ఇదిగో ఈ పిల్లసంగతి చూడవలె. ఈ పెండ్లాము సంగతి చూడవలె. ఈ చెల్లెలిసంగతి చూడవలె అను హృదయముపై గుదియల బండవంటి భారమే వ్యక్తిని అధ్యయనము చేసికొనీయదు. వ్యక్తిని దేవత్వము ననుభవింపనివ్వదు. నన్ను స్వతంత్రునిగా చేయుటకు వేదాంతము, సమాజవాదమూ నీ గుండెపైనున్న బరువు తీసివేయ గోరుచున్నవి. అప్పుడు విచార సముద్రములోనికి మునిగినప్పుడు నీవు విజయపతాకములతో వెలికివత్తువు. పరిశోధనా రంగస్థలములోనికి దిగినప్పుడు నీవు వైజయంతులతో వెలువడెదవు. ఎందుకని? నీవు స్వతంత్రుడవుగా, అబాధితుడవుగా, అబంధితుడవుగా, అకుంఠితుడవుగా పనిచేయుదవు గాన, విశాలప్రపంచ మంతయు నీ గృహముగానే నిశ్చయించుకొందువు. గాన నీ వెల్లప్పుడు స్వచ్ఛందత ననుభవింతువు.

---

షరా: Sex అనుమాటకు తెలుగులో సరైనమాట అసలులేదు కాన ఇంగ్లీషులో ఆమాటను వాడినచోట నెల్ల సందర్భోచితమైన మాట ననువాదములో వాడినాను.

జనుల దుఃఖరోగముల కన్నిటికి కారణమైన *మమత్వాభిమానమును (ఏమిదైన నాకు కలిగియుండవలె నను భావమును) నివారణచేయుట ఒక్కటియే మనము చేయవలసిన దెల్ల. ప్రపంచమందలి జనబాహుళ్య మీ భావమును గ్రహించి

* సోషలిజం, కమ్యూనిజముల ఆదర్శము కూడ ఇదియే. అయితే వాని ఏకతావాదము భౌతికము (Material); శ్రీరామతీర్థునిది ఆత్మికము (Spiritual), అదీ ముఖ్యభేదము — అను.

స. రా: శ్రీరామతీర్థుల ఈ పై వాక్యములు దాదా యేబది ఏండ్ల నాడు పలుకబడినవి. కాని నేటి యాటమిక్ యుగమునకుకూడ అవి అభినవముగనున్నవి. మార్క్స్ ఎంగెల్స్ స్టాలిన్లుకూడ ఇంత ఉదాత్తమైన సోషలిష్టు సంఘమును స్వప్నములలోకూడ సంవీక్షణ చేయలేదు. స్త్రీ పురుషుల సంబంధమునుగూర్చి సెక్సునుగూర్చి ఇంతటి నిష్పక్షపాతముగా కొలదిమంది సోషియాలజిష్టు బయాలజిష్టులు మాత్రమే చెప్పగలిగినారు. నేడు సగము ప్రపంచమునకుపైగా క్రమ్ముకొచ్చిన కమ్యూనిజము ఏ రీతిన దృక్కోణముల ను పరివర్తనము చేసుకొనవలెనో (How communism should reorien tate itself, without giving up its basic deals) అటుల జరిగిన ప్రపంచ మెటుల స్వర్గలోకముగ మారుట కవకాశమున్నదో శ్రీరామతీర్థులు చక్కగా చూపినాడు. ఈ భావములనే నేను "కారుమబ్బులు" అను పుస్తకములో ప్రవచించినాను.

వేదాంతమన నేమిగోడో యనుకొను, నేటికాలపు కాలేజియువకులు నవచింతకులు (People who claim to be original thinkers) శ్రీరామతీర్థుల నవనవ భావములను జీర్ణించు కొందురుగాక!

— అనువాదకుడు.

వంతనే సమాజవాదము లోకములో కారుచిచ్చువలె వ్యాపించును. వారి రోగముల కన్నిటికి ఈ వైదాంతిక - సమాజవాద మొక్కటియే అమృతతుల్యము. ఒకపరి ఈ వైదాంతిక-సమాజ వాద ఘోష ఈ లోకములో వినబడెనేని, కృతయుగ మొచ్చినట్లే దృష్టిదోషమువలన ఉన్నట్లుతోచు అభ్యంతరములూ, పరిస్థితులను సరిగా అవగాహన చేసికోకపోవుటవలన తోచు ఆటంకములూ అప్పు డదృశ్య మగును ఈ సమాజ వాదము వచ్చినప్పుడు రాజులుగాని, అధ్యక్షులుగాని, పురోహితులుగాని, సైన్యములుగాని అవసరముండదు ప్రతివాడు ఒక విద్యాలయమే అయిపోవుగాన, విద్యాలయము లవసర ముండవు. గ్రంథాలయములు మాత్ర మవశ్య ముండును. వాని లోని కెవరైన రావచ్చును. చదువుకొన వచ్చును. చిన్న పిల్లలకుతప్ప ఆచార్యు లెవరికి అక్కరుండదు. వేదాంతము ప్రకారము స్వాభావికజీవిత ము గడుపుటవలన రోగ మనునది రాదు. గాన వైద్యుల అక్కరయేయుండదు. ప్రజలు వారిష్ట మొచ్చినదెల్ల చేయవచ్చును. సృష్టిలో నెక్కడనైన వారిష్ట మొచ్చినచోటనెల్ల తిరుగవచ్చును. ఇప్పటివలె సోదరు లన్న భయపడ నక్కర లేదు. మంచిపనుల జేయును. దర్శనశాస్త్రము మున్నగు నిజముగా ఉపయోగించు వాని నధ్యయనము చేయుచు, తాత్త్వికపరిశోధనల జేసికొనుచు, తమ దేవత్వ మును, ఈశ్వరత్వమును పూర్ణరూపముగ అనుభవములోనికి దెచ్చుకొనుచు జీవింపవచ్చును.

ఓమ్ ఓమ్ ఓమ్

# మానవుడే తన విధికి ప్రభువు

స్త్రీ పురుష రూపముగ నున్న సర్వలోకేశ్వరా! నేడు ప్రస్తావించబోవు విషయము "మానవుడే, తన విధికి కర్త" అను విషయము. మన మింతవఱకు మానవుని అతని వాస్తవికరూపములో విచారించినాము. అసలు నరుడు నిజమైన మనుష్యుడు (True man) దేవత్వమే, దేవుడే, దేవుడు కాక మరియొండు కాదు; అసలు నరుడు ఒక్క శరీరముయొక్క విధికి మాత్రమే కర్తగాదు. ప్రపంచ మంతటియొక్క విశాల భువన మంతటి యొక్క విధికి కర్త.

నేడు మనుష్యుడు అను శబ్దమును వేదాంతులు సూక్ష్మ శరీరమను శబ్దమును వాడు నర్థములో గ్రహింతెము; అనగా కోరికలు కోరునట్టి, వాంఛించునట్టి, తహాతహా లాడునట్టి మనుష్యుడు. ఈ సంకుచితమైన, పరిసీమితమైె అర్థమందుకూడా మనుష్యుడే తన విధికి తానుకర్త. ఈ ప్రశ్నకు వివిధ దృక్కోణము లున్నవి. ఒక రాత్రిలోనే వాని నన్నిటిని తీసికోలేము. ఈ ప్రశ్నను నేటి రాత్రికి పిండాండదృష్టితో తీసికొందము.

నరుడు పుట్టినపిదప తన పరిస్థితులను చాలా వఱకు మార్పు చేసుకోగడని నమ్ముట సులభము. ఒకనరుడు ప్రత్యేక పరిస్థితులలో పెట్టబడెనేని, ఆ పరిస్థితులు నాతడెంత వఱకో ఒకంతవఱకు నియమించగల డనియు, వానికి యజమానిగా కాగలుగు ననియు, వానికి అతీతుడు కాగల్గు ననియు, తనను తాను సమర్థునిగా చేసికోగలుగు ననియు నమ్ముట సులభము. కొందరు జనులు చేసికొనినట్లుగా అతడు దేశమందలి దార్భా

గ్యులలో కెల్ల దౌర్భాగ్యుడుగ నుండియు, దేశమందలి శ్రీ మంతులలో కెల్ల శ్రీమంతుడు కాగల్గును. లోకములో దరిద్రులు గౌరవము యొక్కయు ప్రఖ్యాతియొక్కయు శిఖరము నధిరోహించుటలో సమర్థులైరి కదా? చాలా నీచమైన, అసహ్యమైన పరిస్థితులలో పుట్టిన జనులు ఎంతో ఔన్నత్యమునకు పోవ గల్గిరి కదా! నెపోలియన్ బోనా పార్ట్ సంగతి చూడుము, షేక్స్పియర్ సంగతి చూడుము. లండన్ లార్డుమేయర్ గానైన విట్టింగ్ టన్ సంగతి చూడుము. లేదా చైనా ప్రధానమంత్రిగానైన బీద రైతుసంగతి చూడుము. ఒకసారీ లోకములోనికొచ్చిన తరువాత మన జీవితకాలములో మన పరిస్థితుల మార్పు చేసికోవచ్చును. ఇది యంతయు ఋజువుచేయుట సులభమే కాని నీ పుట్టుకను, నీ తల్లిదండ్రులను నిర్ణయించునదికూడ నీవే నని వేదాంతము చెప్పినప్పుడు దానిని ఋజువుచేయుట కష్టము. బిడ్డయే పురుషుని తండ్రి, అంతేకాక బిడ్డయే తండ్రికి తండ్రి. దీనిని ఋజువు చేయుట కష్టము. కాని వేదాంత మిట్లనును. "ప్రశ్న నేవైపు నుండి చూచినను, నీ విధికి నీవే కర్తవు. నీవు గ్రుడ్డివాడుగా పుట్టితివేని, నీవిధికి నీవే కర్తవు. నిన్ను గ్రుడ్డిగా చేసికొనినది నీవే; నీవు బీద తల్లిదండ్రులకు పుట్టితివేని, నీవిధికి నీవే కర్తవు. ఎందుకన బీద తల్లిదండ్రులకు పుట్టునట్లుగా చేసికొనినది నీవే; నీ వెంతో గతిమాలిన పరిస్థితులలో పుట్టితివేని, అప్పుడును నీ విధికి నీవే కర్తవు. అది చేసుకొనినదీ నీవే. పుట్టునప్పుడు కూడా నీవిధికి నీవే కర్తవు." ప్రశ్నయొక్క ఈ ఫలకము

నీరాత్రి తీసికొందము. నరుడు తన తల్లిదండ్రులను తానే ఎన్నుకొనును ? అనగా ఈరాత్రి పునర్జన్మనుగూర్చి కొంత వఱకు ఆలోచింతము; దానిని సంపూర్ణముగా విచారింపలేము. దానిని కొంతవఱకు విచారింతము.

మనుష్యుడు చనిపోయినప్పుడు అతడు పూర్తిగా చనిపోవునని కొందరు జనులందురు. కొందరు జనులు మనుష్యుడెవడేని చనిపోయినప్పుడు అతనిలో అంతర్గతముగ, అంతస్సిద్ధముగ, స్వతముగ నున్న అమృతత్వ (immortality) భావముయొక్క ఉనికి నర్థముచేసికొనుటకు, మన బంధువు చావకూడదను మన స్వంత కోరికనుబట్టి, మన మిత్రులు చావకూడదను మన స్వంతకోరికనుబట్టి, — కొన్ని మతముల వారు, కొందరు జనులు కల్పితమైన పరలోక మొకటున్నదనుట అవసరమని తలతురు; కాని అట్టిలోక మొకటున్నదని మాత్రము ఇచట ఋజువు చేయలేము. కొందరా విధముగ తలతురు. ఈ జనుల పక్షమునగూడ సత్య మొకింతకలదు. దానినిగూర్చి నిన్నటి సాయంకాలము ఈ హాలులో చర్చించితిమి. కాని అదియే పూర్ణసత్యము కాదు. చచ్చిన తరువాత నీవు స్వర్గమునకో, నరకమునకో పోయెద వనుట మాత్రమే పూర్ణసత్యముకాదు; మన మీ విషయములను ఈ (లౌకిక) దృష్టిలో, భౌతికదృష్టితో సమర్థించగలగవలయును. నీ ఆత్మిక జగత్తుయొక్క సూత్రములకు నీ భౌతిక జగత్సూత్రములపై ఒత్తుకొనివచ్చుట కధికారము లేదు. ఇచ డొక మనుష్యుడు నేలక్రింద పాతిపెట్టబడినాడు. మట్టి మట్టిలో గలసిపోయిన దని

ఆతని గోరీవద్ద అనెదరు. కాని ఏదీ చూతము. శరీరము నిజముగానే మట్టిలోని కెళ్ళినది. కాని శరీరము నశించలేదు. శరీరము కేవలము మార్పొందినది. శరీరమందలి భౌతిక పదార్థములు మార్పొందినస్థితిలో నున్నవి. అవి నశించలేదు. నీ స్నేహితునియొక్క ఆ శరీరమే గోరీపై సుందరమైన గులాబి పూవుగా కానవచ్చును. అదియే మరొకరోజున ఫలవృక్షముల రూపముగా కానవచ్చును. అది నశించలేదు.

ఇక మనకు సందేహము కలుగున దే విషయమునుగూర్చి? ఏమి నశించెను? ఆత్మయా, సత్యమా, సత్యదేవుడా? కాదు, కాదు. అదెన్నటికి నశించలేదు. నిజమైనవ్యక్తి, నిజమైన మానవుడు (True man) ఎన్నడూ నశించలేడు; ఎన్నడూ నశింపబడలేడు. అయితే, దేనినిగూర్చి మనకు సందేహము? సూక్ష్మ శరీరమునుగూర్చి- అనగా మానసిక వాంఛలు, మానసికభావములు, ఉద్రేకములు, హృదయపు కోరికలు, మనస్సుయొక్క ఇచ్ఛలు, లేదా ఆత్మయొక్క తృష్ణనుగూర్చి, తహతహనుగూర్చి, సూక్ష్మ శరీర మనగా నిదియే కదా! దీనిసంగతి ఏమి? మనుష్యుడు పాతిపెట్టబడినాడు; ఇవియు పాతిపెట్టబడినవా? లేవు, లేదు. వానిని పాతిపెట్ట వీలులేదు. అయితే అవి ఏమైనవి? ప్రశ్నయంతయు నీ మానసికశక్తి, లోపలి ఉత్సాహము, లోపలి ఉద్రేకములు, భావములు, వాంఛలతో చేయబడిన ఈ సూక్ష్మశరీరమును గూర్చియే. ఈ శక్తి ఫలితము ఈ ఉద్రేకముల, ఈ లోకోరికల కలయిక కూడిక ఏమగుచున్నది? ఇది యంతయు ఆధ్యాత్మికజగత్తులో

అరగా భౌతికసూత్రములతో ఋజువుచేయు నలవిగాని ఆధ్యాత్మిక జగత్తులో సాగుచున్న దనుట నీదృష్ట్యా ఉచితము కావచ్చును. కాని ఈ శక్తి ఏమగుచున్నది. అను దానిని గూర్చి భౌతికక్షేత్రములో సైన్సు నిదర్శనమును కోరుచున్నది. సంశయించుటకు వీలుగాకుండ సైన్సుచే ఋజువు చేయబడి నట్టి "ప్రపంచమం దేదియు నశింపబడదు." అను అనివార్య మైన, విశ్వవ్యాప్తమైన సూత్రమును నీ వెఱుగుదువుకదా. దీనినే * శక్తినిత్యత్వ సూత్రము, ప్రకృతిసనాతనమని చెప్పుసూత్రము అనెదరు. ఏదియు నశింపబడదని ఇది నీకు చెప్పుచున్నది సరే, బాగున్నది. శరీరము నశింపక కేవలము మార్పొందునేని, మనలోని దివ్యత్వము శాశ్వతము అవ్యయము గాన నశింపదేని, ఈ మానసికేచ్ఛలు, మానసికశక్తి, లోపలి జీవితము నశింపబడవలెనా ? అవి ఎందుకు నశింపబడవలెను ? శక్తి నిత్య మను అనివార్యమైన సూత్రము. అవి ఎన్నడు నశింపబడవని తెలుపుచున్నది. అవి నశించినవని చెప్పుటకు నీ కధికారము లేదు. అవి అటులనే ఉండవలసినదే. అటులనే సాగిపోవలసినదే. అవి తమస్థానములో, స్థితిలో మార్పొంద వచ్చును. కాని అవిమాత్ర మెప్పటికి జీవించియే యుండును. అవి ఎన్నడు నశింపబడవు. నీవొక క్రొవ్వత్తిని తీసుకొని వెలిగించితి వేని, అరగంటలో క్రొవ్వు, వత్తి, సమస్తము

---

* Law of the Persistence of Force,
Law of the Indestructibility of Matter.
Law of the Conservation of Energy.

పోవును. కాని అది నశింపలేదు. పోలేదు అని సైన్సు సిద్ధాంతీకరించు చున్నది. రసాయనశాస్త్రము ఋజువు చేయు చున్నది. కాస్టిక్‌సోడాయును, మరొక రసాయనిక ద్రవ్య మును కలిగియున్న ఒక వంపు గాజుగొట్టముతో (Bend test tube) కొత్తిరిలో పోయినదెల్ల ఆవంపు గాజు గొట్ట ములో నున్నది. అని చూపబడుచున్నది. ఒక చిన్న పళ్లెర ములో నిండుగా నీరుపోసినతరువాత, కొంతసేపటి కది యంతయు ఆవిరైపోయిన తరువాత, సాధారణమనుష్యుడు నీ రంతయు పోయినది. నీరేమియు లేదు అని చెప్పును. కాని ప్రకృతిశాస్త్రము నీరు పోలే దని చెప్పును. ప్రయోగముల ద్వారా నీరు గాలిలోనే యున్నదని అది నశింపబడదని చూప బడు చున్నది.

అటులనే ఎవరైన మనుష్యుడు చనిపోయినప్పుడు అతని మానసికశక్తి, కోరికలు, ఉద్రేకము, భావములు అన్నియు వినష్టమైనట్లు కనపడినను, అవియు చనిపోయినట్లు కనపడినను, వేదాంతము తన ఆత్మిక రసాయనశాస్త్రము (Chemistry of Soul) తో సిద్ధమై అది నశించలేదు. నశింపబడదు. అని చెప్పుచున్నది. అది నశింపబడక పోయినచో, అది ఏమైనది? గణితశాస్త్రసమస్యల పరిష్కరించిన తీరుననే, మన మీ ప్రశ్నను పరిష్కరింతము. మన మొక సమస్యను తీసుకొని ఇవ్వబడినదేమి (Data) సిద్ధాంతీకరించ వలసినదేమి(Quisita) ప్రతిజ్ఞ ఏమి ? నిగమన మేమి ? అని విచారించెదము. రెండు విషయములగూర్చి ఆలోచించెదము. కొన్నిసారులు ప్రతిజ్ఞపై

లేక ఇవ్వబడిన విషయముపై ధ్యానించుటవలన, విషయము నంతయు ఋజువుచేయ గలైదము. కొన్ని సారులు నిగమనము ను లేక ఋజువు చేయవలసినదానిని తీసికొని దానినిగూర్చి ఆలోచించి ఆలోచించి, ఋజువు చేయవలసినిదానిని ఇవ్వబడిన దానితో కలుపవలసి వచ్చును. ఇక్కడ ఇవ్వబడిన దేమి? ఋజువు చేయవలసిన దేమి? జీవితము, మరణము, ఇవి ఇవ్వబడినది. ఋజువు చేయవలసినది. జన్మప్రక్రియ ఇవ్వబడినది. మరణప్రక్రియ ఋజువు కావలసినది. లేదా అది ఇటు ఇదిఅటు చేసికొనినను సరియే. ఎందరో ఈ లోకములో పుట్టుచున్నారు. ఎందరో గిట్టుచున్నారు. చచ్చుచున్నట్లు కనపడుచున్న వా రందరి మానసికశక్తి, వారి కోరికలు, వారితోనే చచ్చుచున్న వని అనుకొనినచో, * సైన్సు సిద్ధాంతములకు విరుద్ధ ముగను మన మానసిక శక్తులు గతించి పోవుచున్న వేని అవి శూన్యములోనికే గతించు చున్నవన్నమాట. కాని అది అసంభవమని నీ వెఱుగుదువుకదా. ఏదియు ఏమిలేని దాని లోనికి (శూన్యములోనికి) పోలేదు. ఆ తప్పను దిద్దుకొనుటకు, మరణానంతరము మానసికి వాంఛలు, మానసికశక్తి, మానసిక ప్రక్రియ శూన్యములో కలువ వని నమ్మవలెను. ముందా మాట నొప్పికొనవలెను. ఆ తరువాత, అదేమగుచున్న దను ప్రశ్న వచ్చును.

---

* సైన్సుకు సరైన తెలుగుమాట లేదు. ఇంగ్లీషులో ఆశబ్దము యొక్క (Conception) చాల విశాలము. కొందరు దానిని శాస్త్రమని, విజ్ఞానశాస్త్రమని అనువదింతురు. కాని అదితప్పే. అటులనే మన ధర్మమను శబ్దమునకు ఇంగ్లీషులో సరైమాట లేదు.

మానసిక వాంఛలు మున్నగున వేమగుచున్న వను తరు వాతి ప్రశ్నను జన్మమును గూర్చి విచారించుచు పరిష్కరింతము. ఎందరో మనుష్యులీ లోకములో భిన్నములగు చాకచక్యము లతో, భిన్న భిన్న రుచులతో, కోరికలతో, భిన్న భిన్న శరీర నిర్మాణములతో, అంగసౌష్టవముతో, భిన్నభిన్న మస్తిష్కము లతో, కొందరు బరువైన బుర్రతో, కొందరు తేలికయిన బుర్రతో, కొందరు గుండ్రని తలతో, కొందరు కోలగనుండు తలతో పుట్టుచున్నారు. జను లీ లోకములో భిన్నభిన్నములగు శక్తులతో, చాకచక్యములతో పుట్టుచున్నారు. అదెటుల సంభ వించుచున్నది? ఒకే తల్లి దండ్రులు ఒకే యింటిలో కెయినును, ఆబెలును పుట్టింపలేదు. ఒకే ఇంటిలో జోసెఫ్‌ను, జోసెఫ్ సోదరులను పుట్టింపలేదు? ఒకే కాలేజికిపోయి, ఒకే పాఠ్యములో నుండి, ఒకేఆచార్యుని క్రింద చదువు విద్యార్థులు భిన్నరుచులు కలిగియుండ లేదా? ఒకనికి గణితశాస్త్రమనిన ఇష్టము. మరొక నికి ఇతిహాస మనిన ఇష్టము. ఒకడు కవి, మరొకడు మొద్దు. జనుల రుచులలో వాలకములలో భేదమున్నదా లేదా? ఉన్నది. అది నీవు కాదనలేవు. కొందరు ఎంతో తెలివితో, పుట్టెదరు. చిన్నతనములోకూడ వారెంతో తేటగనుందురు. కొందరు చిన్నతనములోకూడ సోమరిగా నుందురు; రుచిలోను వాలకములోనూ ఈ భేదమునకు కారణమేమి? భిన్నజనులలో మనము గమనించు రుచులలోని వాలకములలోని ఈ భిన్నత దేనివలన వచ్చునది? దాని నెట్లు సమర్థింతువు? అదంతయు దేవుని ఇచ్ఛ, అదంతయు ఈశ్వరుడు చేసినది, అని నీవనినచో, అద్ది

సరైన సమాధానము కానేరదు. అది కేవలము ప్రశ్నను దాటవేయుట యన్నమాట; ప్రశ్నను దాటవేయుట దార్శనిక పద్ధతి కాదు. నీ అజ్ఞానమును ప్రకటించుకొనుట యన్నమాటే. సైన్సు సిద్ధాంతముల ద్వారా దానిని తేట పఱుచవలెను. చిన్నతనము నుండియే వారిటుల భిన్నరుచులతో పుట్టుట దేవుని చిత్తమని నీ వనినచో, నీవు సైన్సు సిద్ధాంతములను కూలద్రోయుచున్నా వన్నమాట. శూన్యమునుండి ఏమియో వచ్చుచున్నదని నీవు వక్కాణించుచున్నా వన్నమాట; అది అసంభమని నీ వెఱుగుదువు కదా! ఈ కష్టమును తప్పించుకొనుటకు, బిడ్డ రుచులలోని వాలకములలోని ఈ భిన్నతను మరొక ప్రపంచమునుండి తీసికొని వచ్చుచున్నాడని నీ వంగీకరించవలెను, లేదా అనుకోవలెను. బిడ్డ లీ వివిధ కోరికలను శూన్యమునుండి తీసికొచ్చుటలేదు: ఈ కోరికలను కూడ దేనినుండియో ఒకదాని నుండియే వచ్చుచున్నవి. అవి శూన్యమునుండి అస్తిత్వములోనికి వచ్చుటలేదు. అవి ఈ వఱకే ఉంటున్నవి. అనగా జన్మతోడనే జనులు తీసికొచ్చుకొను ఈ కోరికలన్నియు వెనుకటి రూపము (ఆకృతి) (Form) నుండి తీసుకొని రాబడుచున్నవన్నమాట. కొంచెము కాలము క్రిందట కూడ, ఈ కోరికలుంటుండెను—ఇచట మనము జన్మము యొక్క * ఋజువు చేయవలసిన దానిని (Quisila) మరణము

* ఇవి గణితశాస్త్రపు పారిభాషికములు. అందు తీరం (సిద్ధాంతము) యొక్క ఋజువు చేయవలసిన దానిని (Quisita) అందురు. ఇవ్వబడినసూత్రములను Data అందురు.

యొక్క ఇవ్వబడిన దానిని (Data)ను విచారించుచున్నాము. వేదాంత మీ రెంటిని కలిపి, నరుడు చచ్చినప్పుడు మరణ సమయమున నున్న ఆతని తీరని కోరికలు నశింపబడవని అనుచున్నది. ప్రత్యేకములైన భిన్న వాంఛలతో ఒకడున్నాడను కొనుము. వాని వాంఛలు శూన్యమునుండి రాలేదు. గోరిలోని మనుష్యునితో పాటు పాతిపెట్టబడిన కోరికలు మరొక ఇంటిలో పుట్టిన క్రొత్త మనుష్యునిలో పునః ప్రకటిత మగుచున్నవా? ఇది అంగీకరించితివేని, ఏదేని శూన్యములో వినష్టమగుచున్నది. ఏదో శూన్యమునుండి వచ్చుచున్నది అను గొప్ప పొరపాటు నుండి తప్పకొనుచున్నావు. హిందువుచే కర్మసిద్ధాంత మని పిలువబడు దీని నంగీకరించుటచే నీవి కష్టమునుండి బయటపడుచున్నావు. జన్మ మరణములను ప్రక్రియ (Phenomena) యంతయు స్వాభావికమై ప్రకృతి సూత్రములకు, విశ్వములోని సామరస్య సూత్రములకు సరిగా సరిపోవుచున్నది.

తర్కశాస్త్రముయొక్క మరియొక సూత్రప్రకారము కూడ, నీవు కర్మసిద్ధాంతము నంగీకరింపవలసివచ్చును. ఆసూత్రమును తార్కికులు లాఘవత్వ సూత్రమందురు (Law of the Parsimony.) ఏదేని విషయమును తిన్నని, మామూలైన, స్వాభావికమార్గముగ తెలియజెప్పుటకు వీలున్నప్పుడు, మనము వంకరైన, అస్వాభావికమైన, అసాధారణమార్గముగ చెప్పరాదు. కర్మసిద్ధాంతము నీకు అన్నిటికంటె స్వాభావికమైన, తేటయైన, శాస్త్రీయమైన సిద్ధాంతము నిచ్చుచున్నది. దీనిని

త్రోసివేసి, నీవు అనవసరమైన పనికిమాలిన సమాధానమును అవలంబించరాదు.

ఇచటొక ప్రశ్న వచ్చుచున్నది. సైంటిష్టు లిట్లన వచ్చును; "ఓహో, కాదు, కాదు. క్రొత్తగా పుట్టిన బిడ్డలలోని భిన్నరుచులను మేము కర్మసిద్ధాంతము ప్రకారము అంగీకరించము. ఆ సిద్ధాంతము నవలంబించరాదు. దానినంతయు పారంపర్యవాదము (Law of Heredity) ప్రకారము అర్థము చేసికొనవచ్చును పారంపర్యవాదము దానినంతయు తెల్లము చేయును" కాని కర్మసిద్ధాంతము పారంపర్యవాదమునకు విరుద్ధము కాదని వేదాంత మనుచున్నది. అది దానిని కూడ తనలోననే నిమిడ్చుకొనుచున్నది. దానిని కూడ అర్థమగునట్లు చేయుచున్నది, కర్మసిద్ధాంతము పారంపర్యవాద మర్థమగునట్లు చేయుటయేగాక, పైపెచ్చు మరణసమయమున మానసికశక్తి నష్టమైనట్లు కానవచ్చుటకుకూడ అర్థమగునట్లు చేయుచున్నది; పారంపర్యవాద మటుల చేయలేదు. కాన కర్మసిద్ధాంతము సైంటిష్టులనుండి, దార్శనికులనుండి, పారంపర్యవాదమునకంటె హెచ్చైన మన్ననను పొందదగియున్నది. కర్మసిద్ధాంతము పారంపర్యవాదమునుకూడ ఎటుల తేటతెల్లము చేయుచున్నది? మనుష్యుడు మరణించినప్పుడు, అతని కోరికలన్నియు గాలికి పోయినట్లు, వినష్టమైనట్లు కనపడును. అవి వినష్టము కాలేదు అని వేదాంత మనుచున్నది, ఒక క్రొవ్వు వత్తి వెలుగుచున్నప్పుడు క్రొవ్వుగాని వత్తిగాని వినష్టముగావు; కాని నష్టమైనట్లు కానవచ్చునప్పుడు, రసాయనిక పారస్పర్యము

(Chemical affinity) వలన కార్బను ఆమ్లజనితో కలయును. ఉదజని ఆమ్లజనితో గలయును: పారస్పర్యమువలన కలయును. అటులనే ఈ కోరికలు, ఈ మానసికశక్తి, లేక మనుష్యుని ఈ సూక్ష్మశరీరము, మరణానంతరము పారస్పర్యము వలన, ఆధ్యాత్మిక పారస్పర్యమువలన (లేదా మనకిష్టమైన, భౌతిక పారస్పర్య మనవచ్చును,) ఇది కలయును; నీ మానసికశక్తి యంతయు, పరిసరములు పరిస్థితులు దాని పెంపుదలకు, దాని అభివృద్ధికి, దాని వికాసమునకు తోహదమిచ్చు క్షేత్రమునకు ఆకర్షించబడును. అనగా, నీ కోరికల కలయిక లేక కూడిక లేదా నీ మానసికశక్తి నీ కుపయుక్తమగు క్షేత్రమున కాకర్షింపబడును. నీ ఉపయోగింపబడని శక్తులు నీ పూర్ణము గాని కోరికలు, ఫలించు తావున కాకర్షింపబడును.

అటుల ప్రతివాడును తన తల్లిదండ్రుల తానే వరి కొనును. ఒకనినిపి జీవించునప్పుడు ఎన్నో కోరికలతో నింపి యుండుట గమనించుచున్నాము. ఆతని కోరికలలో హెచ్చు భాగము జీవితకాలములోనే పూర్ణమగును కాని కొన్నికావు. అవేమగుచున్నవి? అవి పూర్తిగా నశించునా? లేదు, లేదు. తోటలో నొక మొగ్గ కనపడినప్పుడు, అది వికసించుటను సూచించును: మొగ్గయొక్క సూచన సాగుచున్నది. సఫల మగుచున్నది. చీమలయొక్క, తదితర క్రూరజంతువులయొక్క కోరికలుగూడ తృప్తమగుచున్నవి. మనుష్యుని వాంఛలేల ఈడేరకూడదు? ప్రకృతివలన లేక విధివలన మనుష్యుడు ఏల పరిహసింపబడవలెను? ఆతనిని గేలిచేయుటకు వీలులేదు.

ఆతని వాంఛలుకూడ ఫలించవలసినదే: మన కోరికలలో
ఎక్కువభాగము మన జీవితములోనే ఫలించును మన కర్మ
లుగా అవుచున్నది మన కోరికలే. అవియే మన పనులను
నడిపించు శక్తులు. కాని ఎన్నో కోరికలు ఈడేరవు.
అవి ఏమగును? వేదాంత మిట్లు అనుచున్నది. "ఓ వరుడా!
దేవుడువలన నీవు పరిహాసింపబడవు నీ పూర్ణముకాని ఆశలు,
నీ తృప్తములుగాని శక్తులు, ఈ లోకమున గాకున్న మరొక
లోకములోనైనా ఫలించవలసినదే.

ఇచటొక ప్రశ్న వచ్చుచున్నది. మన మేదేని పూర్వ
జన్మయందుండి యున్నచో, మరణానంతరము మనము తిరిగి
జన్మించవలసి యున్నచో, మనపూర్వజన్మలను జ్ఞాపకముంచు
కొన మెందుకు? "జ్ఞాపకశక్తి యనగా ఏమిటి" యని వేదాంత
మడుగుచున్నది. ఉదాహరణకు రాముడిప్పుడు మీతో నొక
విదేశభాషలో మాట్లాడుచున్నాడు. రాముడిప్పుడూ ఇండి
యాలో ఇంగ్లీషున ఉపన్యసింపలేడు. ఇంగ్లీషులో మీతో
మాట్లాడు నప్పుడు, మాతృభాషలోని ఒక్కశబ్దముకూడ
రాముని మనస్సుకు తట్టుటలేదు. కాని ఆ ఇండియన్ భాష
వినష్టమైనట్లేనా? లేదు అది అచటనే యున్నది. రాముని శిష్ట
మైన అరబిక్, పర్షియన్ లేక మరొక భారతీయ భాషలు ఒక
క్షణములో ఆతని జ్ఞప్తికొచ్చును. అయినచో జ్ఞాపకశక్తియనిన
నేమి? నీ మానసమును సరస్సొకటి యున్నదనుకొనుము; భార
తీయభాషలైన పర్షియన్, అరబిక్, సంస్కృతములు రాముని
విషయములో ఈ సరస్సు అడుగున పేరుకొని యున్నవి. ఒక్క

క్షణములో ఈ సరస్సును బాగుగా కదల్చివేసి, ఈ వస్తువు నన్నిటిని పైకి తీసుకొని రావచ్చును. అదీ వస్తువును జ్ఞప్తి చేసికొనుట యనగా. నీ వనేక వస్తువుల నెఱుగుదువు. కాని అవి నీ స్ఫృహాలో లేవు. సరస్సను నీ మానసమును కదల్చుటవలన ఈ క్షణములోనే అవి యన్నియు నీ స్ఫృహాకొచ్చును. పైకి తెచ్చుటవలన అవి నీ మనస్సులోనికి లేక బుద్ధిలోనికివచ్చును.

అటులనే వేదాంత మనునదేమన, నీ జన్మలు నీ ప్రాచీన జీవితములు, అన్నియు నీ అంతశ్చైతన్యపు సరస్సులో నున్నవి. లోపలిజ్ఞాన సరస్సులో నున్నవి. అవియన్నియు అచటనే ఉన్నవిగాని, ప్రస్తుతము అడుగున పేరుకొని యున్నవి. పైన లేవు నీ పూర్వజన్మ లన్నిటిని గుర్తుతెచ్చుకొన గోరదవేని, అది కష్టమైనపనికాదు. నీ జ్ఞానమను సరస్సును కదల్చివేసినచో, పైకి నీ కిష్టమైనదానిని దేనినైన తీసుకురావచ్చును. నీ పూర్వజన్మల నన్నిటినికూడ నీ కిష్టమైనచో, జ్ఞాపకములోనికి తెచ్చుకోవచ్చును. కాని అటుల చేయుటలో శ్రమకు తగ్గ ఫలితములేదు. ఎందుకన ఉత్క్రాంతి వాదము ప్రకారము నీవు ముందుకు పోవలెను. సూటిగా ఎదురునకుపోవలెను. చచ్చినవారిని చచ్చినవారిని పాతి వేసుకో నిమ్ము. భూతకాలము భూతకాలమును పాతివేసికో నిమ్ము. నీకు దానితో నిమిత్తమేమియు లేదు. నీవు ముందుకే సాగవలెను.

మఱియు, కర్మసిద్ధాంతము ప్రకారము నీ వీ ప్రపంచములో చూచు వస్తువులన్నియు, నీ వెంతో అభిలాషతో చూచు వస్తువులన్నియు, నీకెంతో ఇష్టమైన వస్తువులన్నియు,

నిన్ను ఆకర్షించు వస్తువులన్నియు ఒకప్పుడు నీవు ఇవి యన్ని గాను ఉంటివి, గానన, నీకు అవి యనిన ఇష్టము. నీకు వానిలో నభిలాష. నీ కవియన్న ప్రేమ. నీ కవి గురుతు. నీవు శిలలుగా నుంటివి. నీవు ఒకప్పుడు శిలలలో నిద్రించితివి. వాగులతో ప్రవహించితివి. మొక్కలతో పెరిగితివి. పసువు లతో పరువు లెత్తితివి. కానన నీవు వాని నన్నిటిని గురుతించు చున్నావు. వాని నన్నిటిని చూచుచున్నావు. దానిని మరొక ప్రమాణముతో గూడ ఋజువుచేయవచ్చును.

ఇది ప్లేటో, సోక్రెటీసులు ప్రమాణమును కొంచెము మార్చి చెప్పుట. స్మృతి (Reminiscence) అననేమి? ఇప్పుడు మనకు జ్ఞాపకమున్న ఏదేని వస్తువును ఈ వరకే ఎఱిగి యుం డుట స్మృతి. ఉదాహరణకు, ఈ ఉపన్యాసములకు ఇద్దరు మనుష్యులెప్పుడు కలసి జంటగా వచ్చినా రనుకొనుము. ఈ హాలులో నీయబడిన ఏడు ఉపన్యాసములకు వారొచ్చి రను కొనుము. ఎనిమిదవ దానికి ఒక్కడే వచ్చినా డనుకొనుము. రెండవవాడు రాలేదు. వేరుపడిన మనుష్యుని, ఆ వేరుపడిన మిత్రుని స్నేహితు లీ ప్రశ్న వేయుదురు. నీ మిత్రు డెక్క డున్నాడు. నీ చెలికాడేడీ?" అని ఈ ప్రశ్న ఏల వేయబడు చున్నది? ఇదిస్మృతిసూత్రమువలన లేక సహవాససూత్రమువలన వచ్చినది. Law of Reminiscence or law of Association.) మనమెప్పుడు వాళ్ళిద్దరూ కలసియుండుట చూచితిమి. ఇద్దరూ మనకు పరిచితులైరి. వాళ్ళిద్దరు మన మనస్సులో ఏకీభవించినట్లు అయ్యెరి; తరువాత వాళ్ళిద్దరిలో ఒక్కనినే

చూచినప్పుడు, వాడు మనకు రెండవవానిని జ్ఞప్తిచేయును. బుద్ధిలో సహవాసము (Association) స్థాపింపబడున దీ తీరు వనే. స్మృతి కలుగున దీ తీరువనే. మన కిప్పుడు జ్ఞాపకమున్న వస్తువు సంబంధమైన జ్ఞానము మన కీవరకే ఉన్నదని స్మృతి యను శబ్దము సూచించుచున్నది.

ఇచటొక అనుమానమున్నది. మానవులందరు మర్త్యులే. జాన్ ఒక మానవుడు. కాన జాన్ మర్త్యుడు. నీ తర్కము, నీ వాదము, నీ హేతువులు అన్నియు "మానవులందరూ మర్త్యులే. జాన్ ఒక మానవుడు" అను వాక్యములపై ఆధార పడి యున్నవి. ఈ రెండు వాక్యములను మాత్రమే పలుకుము. చరమ వాక్యమును ఉచ్చరింపకుము. వెంటనే నీమనస్సులో "జాన్ మర్త్యుడు" అను చరమవాక్యము స్మృతివలె స్ఫురించును. ఈ చరమవాక్యమెటుల వచ్చినది? ప్లేటో నిర్ణయించి నట్లు స్మృతి సూత్రమునుబట్టి వచ్చినది కాదా? అవును. "మానవులందరూ మర్త్యులే," "జాన్ ఒక మానవుడు." "జాన్ మర్త్యుడు" అను * వాక్యత్రయమున్నది. ఇందులో "మానవులందరూ మర్త్యులే". "జాన్ ఒక మానవుడు" అను రెండూ నీ ఎదుట నుంచబడినవి వెంటనే మానసిక సూత్రములనుబట్టి, మూడవది నీ మనస్సునకు తట్టును. అది అందరి మనస్సులలో తట్టును. అది ఎటుల సంభవించుచున్నది? ఇద్దరి

---

* Proposition ను వాక్యమని అనువదించినాను. Proposition కు Sentence కు భేదము కలదు. ఇంగ్లీషులో అది తార్కిక పారిభాషికము.

స్నేహితులలో ఒకనిని చూడగానే, వాని సహవాసములో
నెప్పుడు ఉండు రెండవనా డెటుల మనకు జ్ఞాపక మొచ్చునో,
అటులనే ఇదియు సంభవించును. ఈ స్మృతి ఎటుల సంభ
వించును? ఈ విచారసూత్రము ఏవిధముగా అందరి మస్తిష్క
ములలోను అంతర్గతముగ నుండెను? ఈ విధమైన స్మృతిని
తెచ్చిన ఈ విచారసూత్రము ప్రతి ఒక్కరి మనస్సులోను
ఏవిధముగ నుండెను? ఒక విధమైన స్మృతి వలననే. స్మృతి
అనగనే అందు పూర్వజ్ఞాన మిమిడియున్నది. బుద్ధియున్న
ప్రతిబిడ్డయు విచారింపగలుగును. ప్రతి బిడ్డతోను మనము
వాదింపవచ్చును. అతడు కొంచెము వెనుక ముందు చూచు
టకు మొదలిడగానే, మనము వానికి అనుమాన మీయ
వచ్చును. వాడు దాని నంగీకరించును.

ఇచట మనము యూక్లిడ్‌లోని సూత్రము నొకదానిని
బుజువు చేయుచున్నాము. పర్యవసానమునకు మనము వెంటనే
వచ్చెదము. ఈ పర్యవసానము స్మృతివలన తేబడినది. ప్రతి
యొక్కని మస్తిష్కమందు ఈ స్మృతి అంతర్నిహితముగ
నుండుటవలన, స్మృతివలన మీ మస్తిష్కములలో పునర్జా
గృతము చేయబడు వస్తువులన్నిటితోడను మీరీవరకే పరిచితు
లని తెలియవచ్చుచున్నది. స్మృతివలన మీ మస్తిష్కము
లలో జాగృత మవునట్టి వస్తువులతో మీరు ఈవఱకే పరిచితులై
యుండుటకు, వానిని మీరీవఱకే ఎఱిగియుండుటకు, మీ
రెప్పుడో ఒకప్పుడు వానిని నేర్చుకొనియుండి యుండవలెను.
ఎప్పుడో వానిని గ్రహించి యుండియుండవలెను. కాని దానిని

సీ వీ జన్మలో నేర్చితో లేదని, గ్రహింప లేదని మీకు గట్టిగా తెలుసును కదా! అయినచో మీ కీ జ్ఞాన మెప్పుడు అలవడెను? పూర్వజన్మలో నని వేదాంతము జవాబు చెప్పుచున్నది.

ఇచట మరొక ప్రశ్న వచ్చును. మన యదృష్టమునకు మనమే కర్తలమైనచో, మనలో నెవ్వరు బీదగా నుండగోరరు కదా! అయినచో మనము బీదగా నెందుకు పుట్టుచున్నాము? మన మందరము భాగ్యవంతులుగా పుట్టవలెననే కోరికొందము గదా! అయినచో మనలో నెక్కువమంది దరిద్రులుగా నున్నా మేల? దరిద్రులముగా పుట్టుచున్నా మేల? మీరు విషయములను సరైనదృష్టితో చూడవలెను. సమగ్రముగా అవగాహనము చేసికోవలెను అని వేదాంతము చెప్పుచున్నది. అర్ధసత్యములపై ఆధారపడకుము. ఉన్నవిషయము నన్నివైపు లనుండి చూడుము. ప్రతివాడూ లండన్ నగరపు లార్డు మేయరుగా కాగోరడుకదా! ప్రతివాడూ కోటీశ్వరుడు కాగోర డనునది సత్యము. వారమున కైదు డాలర్లు సంపా దించుకొనువానికి, వారమున కేడు డాలర్లు వచ్చు స్థితి కావలె నని కోరికయుండును. ఆతని బుర్రలో నెప్పుడూ లండన్ నగరపు లార్డుమేయరుగా కావలె నని యుండదు. అది ఉండ దనుట ముమ్మాటికి నిజము.

మరొకదృష్ట్యా విషయమును చూడుము. జనులు తమ కోరికలలో నిలకడగను, సమంజసముగను నుండరు. తమ కోరి కలను పరిస్థితులతో సామరస్యముగా చేసికొనరు. కోరికలకు వారు బానిస లగుదురు. వారు తమ కోరికలకు యజమానులు

గారు; కాన వారిని త్రోసిపుచ్చి వారికోరికలు వారికి కష్టముల లోనికి, విచారములలోనికి, ఆదుర్దాలలోనికి లాగికొనిపోవు చున్నవి.

ఇక నిచ్చటనే ఉపన్యాసములో నెల్ల ఆకర్షణీయమైన భాగము వచ్చుచున్నది. ఒకడు తన పశుప్రవృత్తులను సంతృప్తి చేసికోగోరు ననుకొనుడు. వానికి జ్ఞానముతో నిమిత్తమే లేదనుకొనుడు. ఆధ్యాత్మిక విచారణతోగాని, మతముతోగాని, నీతితోగాని, పేరు ప్రతిష్ఠలతోగాని వాడు పాత్తే కోరడను కొనుడు. వానికి కావలసినదెల్ల తన పశుప్రవృత్తుల సంతృప్తి చేసికొనుటయే. తన వాసనలనెల్ల పూర్ణము గావించుకొను టయే. ఇట్టివాడు చచ్చును. (ఇది దృష్టాంతము, విషయ మును తెలియజెప్పుటకు చెప్పబడినది.) అట్టివాడు తనకెట్టి తల్లిదండ్రులను చేకూర్చికొనును? అతనికోరిక అతనిని విజ్ఞాన వంతులగు వారికి బిడ్డగా పుట్టుమని నిర్బంధింపదు. అతనిలో నున్నటువంటిశక్తి తన పెంపుదలకై భాగ్యవంతులైన, తల్లి దండ్రులను గోరదు. అది విద్యావంతులైన నాగరకులైన తల్లి దండ్రుల కోరదు. వేదాంత మనునదేమన, ఈ మనుష్యుడు కేవలము పశుప్రవృత్తులతోడనే నిండియుండుచేసి వాడు తనకు తగినట్టి శరీరమును ఏ కుక్క ఆకృతిలోనో ఏ అడవిపంది ఆ కృతిలోనో పొందును. ఎందుకనగా అప్పుడు వానికి ఎంత తిని నను తృప్తిలేనటువంటి, ఎంతగా జంతుప్రవృత్తులను తీర్చి కొన్నను తృప్తిలేనటువంటి, తనను తాను మూర్ఖునిగా చేసి కొనుటకు వీలైనట్టి శరీరము దొరకును. వాని కాతీరు శరీ

రమే ప్రాప్తించును. వాని కోరిక లీడేరవలెనన్న వాడు అడవి పందిగానో కుక్కగానో పుట్టవలసియున్నది. ఆవిధముగా వాడు పందియో, కుక్కయో అయినప్పటికిగూడ వానివిధికివాడే కర్త.

ఈ లోకములోని ప్రజలు తామేదియైన కోరినప్పుడు, దాని పర్యవసానమేమగునో చూడరు తా మెందులోనికి పోవుచున్నారో గమనించుకొనరు. తరువాత వారి కోరికల ఫలితములు సంప్రాప్తమైనప్పుడు, తమవిధి ఇట్లున్నదని ఏడ్చెదరు మొత్తుకొందురు. తమ అదృష్ట మింత తెరగున నున్నదని ఆవటిల్లెదరు ఏడ్చుచూ పండ్లను కొరుకుకొనెదరు. పెదవులను కరచికొనెదరు [illegible] కోరుకొను చున్నప్పుడే, కోరికల కేమి ఫలిత మొచ్చునో గమనించు కొనుము. ఈ దుఃఖమును తెచ్చిపెట్టిన దంతయు నీవే మరొకరు కాదు.

రాముడు మీకిప్పుడు తూర్పిండియాలోని యొకకవి కథ చెప్పును. అతనొక మహమ్మదీయకవి. చాలామంచివాడు. చాలా తెలివైనవాడు వానిని మీరు చాలా తెలివికలవాడు; చాలా చాకచక్యము గలవాడని అనవచ్చును. తనపై ఎంతో అభిమానముగల యొక స్వదేశప్రభువు ఆస్థానములో ఆతడుంటుండెను. ఒకరాత్రి ఆ ప్రభువు వానిని చాలా ప్రొద్దుపోవువరకు తనతో నుంచుకొనెను. కవి ప్రభువును ఎన్నో రకములైన పద్యములతోను, తమాషాయైన కథలతోను, ఆకర్షణీయమైన గల్పికలతోడను, సంతోషపెట్టెను. ప్రభువు ఆ కవిచే ఆనందింపబడుచు తన నిదురనే మరచిపోయి, ఎప్పటికో వెళ్లి పండుకొనెను. రాణి ప్రభువును విశ్రాంతి గదులకు

ఇంత విపరీతమైన ఆలస్యముగ వచ్చుటకు కారణమేమని
అడిగెను "మాతో ఈ సాయంకాల మొక మంచి తెలివి
కలవాడుండెను వాడెంతో మంచివాడు. ఎంతో మేధా
సంపన్నుడు. ఎంతో ఆకర్షణ కలవాడు" అని ప్రభువు
జవాబిచ్చెను. రాణి యింకను ఆతనినిగూర్చి యడిగెను.
ఆమె కుతూహలమును శాంతి పరుచుటకు, రాజు కవియొక్క-
సామర్థ్యమునుగూర్చి ప్రతిభనుగూర్చి ఎంతో ప్రొద్దుపోవు
వఱకు ముచ్చటించెను. వారిద్దరు పండుకొనబోవునప్పటికి
దాదాపు తెల్లవారెను. రాణి కుతూహలము చాల ఎక్కువగా
రేగుటచే, ఆమె ప్రభువును ఒకనాడా కవిని తన సముఖమునకు
తోడి తెమ్మనెను. మరునాడా కవి రాణిసన్నిధికి తేబడెను.
పాశ్చాత్య దేశములలోవలె గాక, ఇండియాలోని అలవాట్లు
భిన్నము లని మీ రెరుగుదురుకదా! ఇండియాలో స్త్రీలు వేరు
గదులలో నుండి, ఎక్కువగా పురుషులతో కలియరు. వారు
వేరువేరుగా నుందురు; హిందువు లటుల చేయరుగాని మహమ్మ
దీయస్త్రీలు ముఖ్యముగా బరువైన ముసుగులను (పర్దా) వేసి
కొందురు, తమ భర్తలనుతప్ప అన్యులను తమ ముఖముల
చూడనీయరు. ఎప్పుడేని చాలపవిత్రులు, మర్యాదగలవారి
కైనచో కనపడెదరు. రాజు ఈ కవిని రాణివాసములోనికి
తీసుకొచ్చెను. అనగా స్త్రీల అంతఃపురము లోనికి తెచ్చెను.
అచ్చటాతడు తన పద్యములపాడెను, కథల జెప్పెను. స్త్రీలంద
రికి ఎంతో ఆహ్లాదము కలిగెను. అప్పుడు కవి తాను గ్రుడ్డి
వాడి నని, తానేదో కండ్లరోగముతో బాధపడు చున్నాననియు

చెప్పెను. కాని అసలాతనికండ్ల కే రోగమూ లేదాయెను. స్త్రీల రహస్యపుగదులలో నుండుటకు అనుమతింపబడవలె నని, వారు తనను నమ్మి బ్రహ్మచారి డనితలచి, తమ ఆట పాట లలో స్వేచ్ఛగా నుండవలెనని, వారు తనముందట ముసుగు వేసుకోకుండ సంచరించవలె నని ఆ కవికి దురిచ్ఛకలిగెను. ఆతనిని బ్రహ్మచారి డని నమ్మి, ప్రభువు స్త్రీల గదులలో ఆతని నుండ నిచ్చెను. కాని సత్యమునుమరుగు పరచుటకు వీలు లేదని మీ రెఱుగుదురు కదా!

"అణగద్రొక్కబడియు సత్యము పైకి లేచును.
దేవుని సనాతన వత్సరము లన్నియు అవివే"

దానిని దాచి పెట్టవీలులేదు, ఒకనా డది తప్పకబయటి కొచ్చును. ఒకనా డీ కవి ఒకదాసీదానిని ఏదో వస్తువను తెమ్మని యడిగెను కొంచెము భాగ్యము రాగానే ఇండియాలో జనులెంతో సోమరిపోతు లగుదురని మీ రెఱిగిన విషయమేకదా! భాగ్యమునకు సోమరితనమే చిహ్నముగా వారెంతురు. నీ వేదియు స్వంతముగ చేయలేకపోయిన నీ వెంతో, గొప్ప వాడవు; నిన్ను బండెక్కించుటకు ఎవడేనివచ్చి సాయము చేయవలసియున్నచో నీ వింకా గొప్పవాడవు; నీ కెవడేని వచ్చి ధోవతి గట్టవలసి యున్నచో నీ వింకా గొప్పవాడవు: ఎవడేని వచ్చి నిన్నుపట్టుకొని నడిపింపవలసి యున్నచో నీ వింకా గొప్పవాడవు. ఇటుల పారతంత్ర్య మొక గౌరవముగా చూడ బడుచున్నది. స్వాతంత్ర్య, స్వయం తంత్రతలు, పారతంత్ర్యము

గాను, బానిసత్వముగాను ఎంచబడుచున్నవి. ఈ కవికి రాజ గృహములో గౌరవస్థానములభింపగానే, తానున్నచోటు నొదిలిపోయి ఒకకుర్చీ తెచ్చుకొని ఇష్ట మొచ్చినచోటవేసి కొని కూరుచుండుట హోదాకు భంగకరముగా కనిపించెను. అందుచే ఆత డొక దాసీని అటుల చేయుమని ఆజ్ఞాపించెను. కాని యది వెగటుగా కర్కశముగా నాకు వ్యవధిలేదు. నాకీ పనుల చేయుటకు సమయము లేదని చెప్పెను. ఆ తరువాత మరొక దాసీకి రాగా, అతను దానిని తనవద్దకురమ్మని పిలచి ఆ కుర్చీని తెమ్మని యడిగెను. కాని అది ఆగదిలో కుర్చీయేలేదని చెప్పెను. అతను మరల, "ఆ నీ రున్న బొచ్చెనిటు తెమ్మని" యడిగెను. "ఈ గదిలో లేదు, వేరొక గదిలోనికిపోయి తీసు కొచ్చెదనని" అది చెప్పెను, "దానిని తీసుకురా, గదిలోబొచ్చె ఉన్నది. నీకది కనపడుటలేదా, అదిగో అది" అని ఆత సనెను. ఆపని చేయించుకోవలెనను ఆ సర్దాలో ఆతను తన్నుతా మరచెను. అ దీజరుగునది. అబద్ధము లాడువారిని సత్యమీ విధముగానే తమాషా చేయును. లేడీమేక్‌బెత్ పని నయితే చేసెనుగాని, దాచుకోలేక పోయెనని మీ రెఱుగుదురు కదా! సత్య మామెను పిచ్చిదానినిగా చేసెను, ఆమె స్వయముగా డాక్టరుకు ఉన్న దుస్నటుల చెప్పెను. అదీ జరుగునది. ఇది ప్రకృతి నియమము. "ఇదిగో ఇక్కడ నున్నది. నీ కది కన పడుటలేదా" యని కవి అడుగగానే దాసీది వాని కా పని చేసి పెట్టుటకు బదులు తిన్నగా రాణీవద్దకు పరుగెత్తుకొని పోయి వాని రహస్యమును బయట పెట్టెను. "చూడండి, ఆ మను

ష్యుడు గుడ్డివాడు కాడు; వాడు దుర్మార్గుడు. వానిని ఇంటి నుండి బయటకు వెడలగొట్టవలెను" వాడింటినుండి బయటికి వెడలగొట్టబడెను, కాని షుమారు మూడు రోజులలో వాడు నిజముగా గ్రుడ్డివాడాయెను. అదెట్లుజరిగెను? ఈ నరుని నిన ఇచ్ఛవలననే గ్రుడ్డివాడాయెనని కర్మసిద్ధాంతము చెప్పుచున్నది. వాని విధికి వాడే కర్త. గ్రుడ్డితనమును తెచ్చుకొనినది వాడే. మరొకరాతనిని గ్రుడ్డిగా చేయలేదు. అతని కోరికలే, అతని ఆరాటములే; అతనిని గ్రుడ్డిగా చేసినవి. తరువాత గ్రుడ్డితన మొచ్చినప్పుడు, వాడేడ్చును, మొత్తుకొనును, పండ్లను కొరుకుకొనును, గుండెను బాదుకొనును.

ఒకసారొక మనుష్యుడు తనవీపుపై పెద్దబరువును మోయుచుండెను. వాడు ముదుసలి, బలహీనుడు; కొంచెము జ్వరముతో గూడ నుండెను. కాక వాడున్నది వేడిదేశమగు ఇండియా. వాడొక చెట్టునీడను కూరుచుండి బరువును క్రింద పారవేసి కొంచెముసేపు విశ్రమించెను. తరువాత, "ఓ మృత్యువా; ఓ మృత్యువా, రమ్ము నన్నుకడతేర్చుము కడతేర్చుము" అని అరచెను. మృత్యుదేవ తాక్షణమునవే వాని ఎదుట ప్రత్యక్ష మాయెనని కథగలదు. మృత్యుదేవతను చూడగానే, వాని కాశ్చర్యము కలిగెను. వాడు వణకసాగెను. ఆ విపరీత పాకారమేమి? ఆ భూత మేమి? వాడు మృత్యుదేవతను నీ వెవరని అడిగెను. మృత్యుదేవత "నీవు పిలచినది నన్నే, నీవిప్పుడే నన్ను పిలచితివి. నీ కోర్కెను తీర్చుట కొచ్చితిని" అని చెప్పెను. అప్పుడు ముసలివాడు వణకుచు ఇటు

లనెను, "నన్ను చంపుటకు నిన్ను నేను పిలువలేదు. ఈ బరువు నెత్తి నా వీపుపై పెట్టుటకే నిన్ను పిలచితిని."

జనులు చేయునదది. నీ కష్టములు, నీ అడ్డంకులు, నీవు దుఃఖములననవి యన్నియు నీమూలముగానే వచ్చుచున్నవి. నీ విధికి నీవే యజమానివి; కాని విషయము సంభవించినప్పుడు నీవు ఏడ్చెదవు, మొత్తుకొందువు; నీవు మరణము నాహ్వానింతువు. మరణము రాగానే ఏడువసాగెదవు. అది కుదురదు. ఒక వేలములో అన్నిటికంటె పెద్దధరను ఎప్పుడు పాడినావో అప్పుడు నీవది తీసుకొనవలసి వచ్చును. నీవు గట్టమును తోలినప్పుడు, దాని వెంటనే బండియు కదలును. కాన నీవొకసారి వాంఛింపగానే, దాని ఫలితముల ననుభవింపవలసివచ్చును. జనులు సాధారణముగ ముసలితనములో చచ్చెదరు యౌవనములో కొలదిమందే చచ్చెదరేల? జనులు ముసలివాండ్రు కాగానే, వారి శరీరములు రోగగ్రస్తము లగును. అని వేదాంత మనును. రోగములచే బాధింపబడి వారు చావకోరెదరు. బాధ తొలగిపోవలె నని కోరుకొందురు. అది అటులే తొలగిపోవును. ఇటుల నీ మరణమును తెచ్చుకొనునది నీవే. వేదాంతము ప్రకారము ప్రతివారూ ఆత్మహత్య చేసికొనువారే. నీవు కోరిన క్షణములోనే మరణ మొచ్చును. జనులు (కొందరు) నిండు యౌవనములో చచ్చెదరేల? ప్రస్తుతము మీకు రాముడు చెప్పుదానిపై నమ్మకము లేకపోవచ్చును. కాని మీరు సరిగా వస్తుస్థితిని గమనించిన, రాముడిప్పుడు చెప్పుదానితో ఏకీభవింపవలసియే వచ్చును రాము డెందరో జనులు

నిండు యౌవనములో గతించుట చూచినాడు. రాముడు వారి అంతర్జీవితమును గమనించి విషయ మంతయు విచారించినాడు. ఈయువకులు వారి హృదయములోపల మృత్యువును కోరు కొనుచుండి రనియు, పరిస్థితులు వారిని విసిగించె ననియు, వారు తమ పరిసరము లను మార్చుకోదలచి రనియు, రాముడు తెలిసికొనెను. ఇప్పుడు సోదాహరణముగ నిరూపింప వ్యవధి లేదు గాని, ఇది అసలు నిజమే

ఇండియాలో నొక సాంప్రదాయమునకు చెందిన కాలేజీలో (Sectarian College) ఒక మంచి తెలివిగల యువకుడు పని చేయుచుండెను. ఒక బహిరంగోపన్యాసములో ఆతడు తనజీవితము ఆ కార్యమునకు వినియోగింపబడిన దని ఘోషించెను. తన నా కార్యమునకు కైంకర్యము చేసికొనెను; కొంతకాల మాతడెంతో పట్టుదలతో అచట పనిచేసెను. తరువాత ఆతని అభిప్రాయము మారెను, ఆతని ఆలోచనలు విజృంభించెను. బుద్ధి వికసించెను దృష్టి విశాలమయ్యెను. అప్పుడిక నాతడీ సంకుచిత సాంప్రదాయికులతో కలసిపని చేయ లేకపోయెను. ఆ సాంప్రదాయికులు కూడ వారిహృదయ ములలో ఈతనిపట్ల సానుభూతిని కన్పరచుకోలేకపోయిరి. కాని తనను ఈవరకే బద్ధునిగా చేసికొని యుండుటచే, వారి ఆదర్శములకు తనను ఈ వఱకే బద్ధునిగా చేసికొని యుండుటచే, ఆతను వారితో గలసి పని చేయవలసి వచ్చెను. ఆ యువకునికి మరొక మార్గము లేకపోయెను. ఆతని హృదయ మొకచోట యుండెను. శరీరము మరియొకచోట

నుండెను. శరీరమునకు హృదయమునకు అవాంతర మొచ్చెను. ఇది కానిపని యాయెను. ఇది సాగకపోయెను. అతడు చచ్చెను, మరణముగాక పరలోకమార్గమున అతడు తన పరిస్థితిని మార్చుకోలేక పోయెను. మరణమువలననే పరిస్థితులు మారెను. కాన మరణము మనకు కనుపడునంతటి భయావహమైనది కాదు.

నీవే నీ పరిస్థితులకు యజమానివి. నీ విధికి నీవే స్రష్టవు. జనులు దుఃఖితులుగా ఏల చేయబడుచున్నారు? కష్టము లెందుకు వచ్చుచున్నవి? వాంఛలలోని వైరుధ్యము వలన నిన్ను ఒకవిధమైన పనిని చేయుమను కోరిక నీకుండును నిన్ను మరొకవిధముగా చేయుమను కోరికలుకూడ నీకుండును. రెండు కోరికలు ఉండును. ఒకకోరిక నిన్నొకస్థితికి తీసుకొని పోవగోరును. అనగా నిన్ను గ్రంథకర్తగానో, వక్తగానో, ఆచార్యుడుగానో, ఉపన్యాసకుడుగానో, బోధకుడుగానో చేయగోరును. మరొకవిధమైన కోరికవచ్చి నీవు ఇంద్రియములకు దాసుడవుగా కావలెనని కోరును. ఐకమత్యముతో నుండలేనటువంటి పరస్పరవిరుద్ధములైన కోరికలిట్టుండును. అప్పుడు జరుగునదేమిటి? రెండూ ఈడేరవలసినదే. ఒకటి నెరవేరుచుండ, రెండవది బాధపడుచుండును. నీవు కష్టములో నుండెదవు రెండవది నెరవేరుచుండ మొదటిది బాధపడు చుండును. నీవు కష్టములో నుండెదవు. ఇదిగో ఈ విధముగనే, జనులు తమపై విపత్తుల తెచ్చిపెట్టుకొనెదరు. నీ దుఃఖముకూడ నీవు నీ విధికి కర్తవనియే తెలుపును. రాముడు మీకీ విషయము నొక చక్కని కథతో నిరూపించును.

ఇండియాలో ఒకని కిద్దరు భార్యలుండిరి. హిందువు లెప్పుడు బహుపత్నీత్వము నంగీకరింపరు. కాని మహమ్మదీయు లంగీకరింతు రని మీ రెఱిగినదే కదా! ఆ ఇద్దరు భార్యలుండిన దొక మహమ్మదీయునికే. అందులో ఒకటి మేడమీద; మరొకటి క్రింది భాగములోనూ ఉంటుండెను. ఒక నాడింటిలోనికి దొంగవచ్చెను. వాడు ధనమంతయు దోచుకో దలచెను. కాని ఇంటిలోని వారందరు బాగా మేల్కొనియుండుటచే, దొంగకు దోచుకొను నవకాశము లభింపదాయె. తెల్లవారుజామునకు ఇంటిలోనివారు దొంగనుచూచి పట్టుకొని, మేజిస్ట్రేటు దగ్గరకు తీసుకుపోయిరి. దొంగతన మయితే ఏమియు జరుగలేదుగాని, దొంగ ఇంటిలోనికొచ్చెను. జరిగిన నేర మదియే. మేజిస్ట్రేటు దొంగను పరీక్షించుటకు కొన్ని ప్రశ్నలు వేసెను. వాడు వెంటనే ఏమైన దొంగిలించ వలెనను ఉద్దేశ్యముతో ఇంటిలోనికి పోయితినని చెప్పెను. మేజిస్ట్రేటు వానికేదో శిక్ష విధింప బోవుచుండెను. అప్పుడు వాడిట్లు వేడుకొనెను "అయ్యా! మీచిత్తమొచ్చిన దేదైన చేయుడు నన్ను చీకటికొట్టులో వేయుడు. నన్ను కాట్రుకుక్కలముందు పారవేయుడు. నా శరీరమును కాల్చివేయుడు. కాని నాకొక శిక్ష మాత్రము వేయకుడు" మేజిస్ట్రేటు ఆశ్చర్యముతో అది ఏమిటి యని అడిగెను. వాడిటు లనెను. "నన్ను మాత్ర మెప్పుడూ ఇద్దరు భార్యలకు భర్తగాచేయకుడు. ఈ శిక్ష మాత్రము నాకు వేయకుడు." ఎందుకని? అప్పుడు దొంగ తానెటుల పట్టుబడెనో, తన కెటుల దొంగిలించుట కవకాశము

చిక్కలేదో చెప్పసాగెను. రాత్రంతయు ఆయింటి యజమానికి మెట్లపైననే నిల్వోనవలసి వచ్చెననియు, ఒకభార్య వానిని మెట్లపై కీడ్చుకొని పోవుచుండెననియు, రెండవభార్య వానిని మెట్లక్రిందికి లాగుచుండె ననియు, దొంగచెప్పెను. వాని తలవెంట్రుక లన్నియు లాగబడెను. వాని కాలిగోళ్లు పీకివేయ బడెను. రాత్రంతయు వాడు చలితో గడగడ వణకుచుండెను. ఇట్లుండుటచేతనే తాను పట్టుబడితి ననియు, దొంగిలించుట కన లవకాశమే చిక్కలేదనియు చెప్పెను.

అటులనే నీ దుఃఖము లన్నియుకూడ పరస్పరవిరుద్ధము లైన నీకోరికలవలననే వచ్చుచున్నవి. నీ కోరికలకు సామ రస్యము లేదు. ఒకదానితో నొకటి పోరాడుచుండును. గృహకలహ మున్న ఇల్లు నేలగలువవలసి నదే నని మీ రెఱుగుదురుగదా! కాన మీ మనస్సులను హృదయములను పరీక్షించుకొని శాంతియున్న దేమో చూచుకొనుడు. నీ ఉద్దేశ్యములలో ఏకాగ్రతయున్న, పట్టుదలలో నిలకడయున్న, నీ కేమియు కష్టముండదు. నీ కేమియు దుఃఖముండదు. కాని వైరుధ్యము, వైమనస్యము ఉన్నచో ఇల్లును ఊడబీకవలసినదే. నీవు బాధపడవలసినదే.

ఇదియే మీ దుఃఖమునకు కారణము. ఇది మీరు తెచ్చిపెట్టుకొనినదే. మీ విధికి మీరే కర్తలు. మనుష్యునికి నిమ్నస్తరపు కోరికలు, ఉన్నత వాంఛలు రెండునూ వుండును. రెంటికి ఎప్పుడూ యుద్ధమే. కాని విశ్వవ్యాప్తమైన ఉత్క్రాంతి

వాదము *(Law of Evolution) ప్రకారము ఈ పోరులో వేని కెక్కువ బలమున్నదో అవియే గెలుపొందును; బలశీలములై నవి గెలుచుటయే ప్రకృతి నియమము. కాన బలశీలములైనవే ఉండగలవను ఈ విశ్వవ్యాప్తమైన నియమము ప్రకారము, ఈ పోరులో, ఏ కోరికలలో నెక్కువ బలమున్నదో అవియే గెలుచును. కాని ఈ బల మెచ్చటనుండి వచ్చుచున్నది? బల మెచ్చునది సత్యమునుండియే, సత్యమునుండియే. ఏకోరికలలో ఎక్కువ సత్యమందునో, వేనిలో నెక్కువ మంచితనము, న్యాయము, దేవునిపై గౌరవము, శుద్ధత్వము ఉండునో అవియే గెలుచును బాకుమైన యెడుటనే నీ వభివృద్ధిచెందవలె. ప్రగతిలో ముందడుగువేయావలె, అన్నివేళల ఇంద్రియ లోలత్వములో ననీ వోలలాడలేవు. స్వార్థయుతమైన పేరాశలోనే, అసూయలోనే ఎప్పుడు మురిగిపోలేవు. నీవు మెల్లగా, దృఢముగా లేవవలసియేయున్నది. ఇదిగో మీా యెదుట ఆనందమున్నది. కర్మసిద్ధాంతము ప్రతి ఒక్కనికి ఆనందమును దిగ్దర్శనము చేయుచున్నది.

కోరిక లెందుకు కొనసాగవలెను? నీ అసలు ప్రకృతి (Nature) (స్వభావము), నీసత్యాత్మ, అమృతత్వమని వేదాంత మనును; రాముడు అవినాశియగు దేవుడు. నీ కోరికలు, మన శ్శరీరములు సత్యవారిధిలోని, శాశ్వతత్వమను ఉదకములోని నుడులు గాన, తరంగములు గాన, అవి జేనిచే అసలు చేయు

---

* Evolution Theory ని ఉత్క్రాంతివాదమనియు, వికాసవాదమనియు అనువదించినారు.

బడినవో ఆ పదార్థపు ప్రకృతినే కలిగియుండును. సత్యదేవుడు, దివ్యత్వము లేదా ఆత్మ; లోకమును తన శ్వాసనువలె చేయుచున్నది ప్రపంచము నాశ్వాస, నీవు కనుమూసి కనుదెరుచునంతలో, నేను లోకమును సృష్టింతును. నీ నిమేషములో ప్రపంచము సృష్టింపబడినది; (నేను నీవే). ఈ కోరికలన్నిటిలో దివ్యతయుగలదు. క్షుద్రమగు అహంత (Little selfish ego) యు గలదు. కోరికలలో ఏ భాగము దివ్యత్వముపై లేక అమృతత్వముపై ఆధారపడియున్నదో, అది వానిని కొనసాగునట్లు చేయును. కోరికలలో ఏ అంశములు మాయపై ఆధారపడియున్నవో, అవి వానిని ఈడేర్పుటలో జాగుచేయును. నీకోరిక లీడేరుటలోని ఈజాగు నీ కోరికలోని మాయాభాగము వలన కలిగినది, నీకోరిక లీడేరునను గట్టి నమ్మకము నకు కారణము. నీ కోరికలలో అంతర్నిహితముగను న్న దివ్యత్వమే. కోరిక లెటుల దివ్యముల నినీ వడుగవచ్చును? కోరికలన్నియు (కామమంతయు) ప్రేమతప్ప మఱియొండుకాదు; ఇక ప్రేమయే దేవుడుగాక వేరొండుకాదు; ప్రేమ దేవుడుకాదా? కోరిక లన్నియు గురుత్వాకర్షణము (Gravitation) వంటివే. గురుత్వాకర్షణ మననేమి? ఇదిగో భూమి చంద్రుని ఆకర్షించుచున్నది. సూర్యుడు భూమి నాకర్షించుచున్నాడు గ్రహములు పరస్పర మాకర్షించుకొనుచున్నవి. విశ్వప్రేమయే ఆకర్షణ సూత్రము. దానివలననే ఒక అణువు మరొక అణువునాకర్షించుచున్నది. అణుసముదాయము లలోనున్న ఒకదానికొకటి ఒత్తుకొనియుండుస్వభావమునకు (ఒక అణుసముదాయము మరొక అణుసముదాయమునాకర్షించుకొను

స్వభావమునకు) * ఉన్న శక్తి ఏమిటి? ఆ కర్షించుటయునగా,
నీ దృష్టి కోణముతో జూచిన, కోరుకొనుటయే ఈ ఆకర్షణ,
ఈ శక్తి, ఈ పరస్పర మొత్తికొని యుండుట, ఈ రసాయనిక
సన్నివేశము. ఈ గురుత్వాకర్షణ ఎందులకు? ఇదంతయు
కామమే (కోరికయే) (Desire) నీ కోరిక లన్నియు దివ్యములే.
కాన నీ కోరికలలో నున్న దివ్యత వాని సాఫల్యము కావలె
నను చున్నది; కానినీవు వానిని స్వార్థయుతములుగా వైయక్తి
కములుగా (Personal) చేసినప్పుడు, వాని స్వార్థ స్వభావము
కోరికలను మాయా వంతములుగా చేయుచున్నది. అందుకని
కొనసాగుటలో వాని కాలస్యమగుచున్నది.

నీ కోరికలు ఘర్షణ లేకుండ సులభముగా ఈడేరుటకు,
నీకు పూర్ణతృప్తి కలుగునట్లుగా అవి కొనసాగ గలందులకు,
నీవు నీ కోరికలలోని మాయా స్వభావమును తగ్గించు కొన
వలెను. నీ కోరికలలోని నిస్వార్థ భాగమును దివ్యతను ప్రాము
ఖ్యతలోనికి తీసుకు రావలెను. అప్పు డవి ఫలించును.

సరే, ప్రార్థనలోని తత్త్వ మేమిటి? ప్రార్థన లెటుల
ఫలించును, ఈ విషయమును మరొకసారి తీసికొందము.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !

* Force of cohesion amongst molecules'

మన కొంక పద్యమును చదివి నేటి కిక ఆపుదము.

ఒకసారి నీవే నీ విధికి కర్తవు (ప్రభువువు) అని గుర్తించుము. నీ వెంత ఆనందము ననుభవింతువో నీవు ఓంకారము నుచ్చరించునప్పుడు, నీవే నీ విధికి కర్తవని తెలిసికొనినప్పుడు, ఏడ్చుటకు మొత్తుకొనుటకు అవసరము లేదు; బాధపడుట కగత్యము లేదు. నీ పరిస్థితులను భిన్నములుగా చేసికొనినావు. నీ ప్రభుతను గురుతించుకొనుము. నీ పరిస్థితులకు దాసుడవుగా ఎంచుకొనుము ఈ సత్యమును గ్రహింపుము. నీ విధికి నీవే ప్రభువు వను ఈసత్యము ననుభవింపుము. నీ పరిస్థితు లేవియైనను సరే, నీ వాతావరణ మేదియైనను సరే, నీ శరీరము జైలులో పెట్టబడినను లేదా తీవ్రమైన ప్రవాహమున బడి కొట్టుకొని పోవుచున్నను, లేదా ఎవని కాళ్ళక్రిందయైన పడి నలిగిపోవుచున్నను పరిస్థితులకు ప్రభువెవడో వాడే నేను అని జ్ఞప్తియుంచుకొనుము. "నేను శరీరమును కాదు, విధికి ప్రభు వెవడో వాడే నేను." నీ స్నేహితులు నీ వలనే చేయబడుచున్నారు. నీ కోరికలే నీ చుట్టునూ నీవు మిత్రులను వారిని ఉంచునది. నీ స్వంతకోరికలే నీ చుట్టునూ నీవు శత్రువులను వారిని ఉంచునది. ఓ శత్రువులారా! మీరు నావలననే చేయబడితిరి. ఓ మిత్రువులారా! మీరు నాసృష్టియే ఈ భావమును గ్రహించి అనుభవములోనికి తెచ్చుకొనుము, నీ వెంత ఆనందించెదవో చూచుకొనుము,

* ఓహో! నా ఆనంద మధుపాత్రనిండె
సర్వవాంఛలు పరిపూర్ణంబు జెందె
మధుర మంజుల మలయా నిలంబులను
వీయుచున్నది నేన అతి మనోజ్ఞముగ
మంద మారుతములు కొసరి ముద్దాడ
పూవులలోనేన పులకరించెదను.
వరదగూడునగల సప్తవర్ణములు
నాభూషణంబులే నాయలంకృతులె!
నాదు సందేశముల్ నలుదిక్కులకును
విద్యుదగ్నికణాల విధముగా నురుకు
ప్రేమ స్వరూపంబు లన్నియు నేన
మధురమా హ్లాదమంబు లన్నియు నేన
పారవశ్యము లేనే, వాంఛలు నేన
మధుర పుష్పంబుల మందహాసములు
మంచుబిందువులను మంచి ముత్తెములు
మాధుర్యరసమున ముంచగాబడిన
ఉద్దీప్త భాస్కర కిరణజాలముల
పరిశుద్ధ నవనవ రుక్మమాలికలు,
రమణీయ నిర్మల చంద్రబింబంబు

---

* ఈ ద్విపదానువాదం శ్రీ కేశవతీర్థస్వామిది.

నీటిలో క్రీడించు నీబుద్బుదములు
ఇటు నటు లూగెడు ఈ వృక్షపంక్తి
తరుమండములు కౌగిలించుకున్నట్టి
వనలతా సుందరీ సందోహములను,
మధుగీతికలుపాడు భృంగకన్యకలు
నా ముఖాంబోజ విన్యాసమే కాదె,
నే వీడు పరిమళశ్వాసయే కాదె,
బ్రతుకు చావులు రెండు పరికించికంటి
అస్మదీయోచ్ఛ్వాస నిశ్వాసలేను
ఏ నింత చేయగావలసిన దేమి ?
ఏనింక కదలు టెచ్చోటికో హాహా !
నేను సర్వవ్యాప్త వాసుదేవుడను
నే లేని నెలవేది కదలుద మన్న
నేను కోరున దేమి ? వద్దను టేది ?
నా స్వరూపంబెకా సకలకాలంబు
అఖిలమౌశక్తి నాబాహు వీర్యంబె
నాకు సంశయ విచారంబులుగలవె ?
లేవు – నేనే మూలకారణంబగుట
ఇప్పుడైయున్నది సర్వకాలంబు
ఇక్కడైయున్నది సర్వదూరంబు
అఖిలసమస్యలు విడివడిపోయె

ఘనరహస్యము తేటతెల్లమైపోవు
ఈ మంచి చెడుగుల, సుఖదుఃఖములను
నా రక్తనాళమే స్పందనచేయు
ప్రేమ స్వరూపంబు లన్నియు నేనె
మాధుర్య హృదయంబు లన్నియు నేనె,
నేనె భావంబులు, వాంఛలు నేనె!
స్వార్థాశయము లేదు బంధంబు లేదు
నా కంద రనుగుణంబుగ నుందు రెపుడు
శత్రు మిత్రులలోన సమముగానున్న
కర్తృత్వరహిత పరబ్రహ్మమేను!
సర్వంబు నాయందు సాష్టాంగపడును.



# మరణానంతరము లేక సర్వమతముల సమన్వయము

గోల్డెన్ గేట్ హాలులో 1903 సం॥ జాన్యువరి 15 తే॥ చేయబడిన ప్రసంగము.

స్త్రీ పురుషరూపములో నున్న అమృతతత్త్వమా ! సర్వమతముల గమ్యస్థానమా !

ఇంతవఱకు హాలులో నిచ్చిన ఉపన్యాసములు చాల కష్టములైనవి. విషయములు కఠినముగను సూక్ష్మముగను ఉండెను. కాని నేటి ప్రసంగము వానితో పోల్చిన సులభమైనది.

కొన్ని ఏండ్లక్రిందట రాముడు తూర్పిండియాలో నుండగా, తూర్పిండియాలోని ఒక విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగా నుండినట్టి, క్రైస్తవ మతాచార్యుడైనట్టి ఒక అమెరికను వ్రాసినపుస్తకము రాముని చేతిలో పడెను. ఆ పుస్తకములోనివిషయము " మరణానంతరము. " చక్కని ఉదాహరణముతో ఈ ప్రపంచ మొకక్షేత్ర మనియు, పరలోకము సముద్రముల కావల నున్న మరొక క్షేత్రము వంటిదనియు, సముద్రమునుదాటదలచు వా రందరు టిక్కెట్లను కొన వలసి యున్నదనియు ఆతడా పుస్తకమున జూపెను. సరైన టిక్కెట్లు లేనివాడు ఓడనుండి బయట కీడ్చి సముద్రమున పారవేయబడును. సరైన టిక్కెట్లున్నవారు గమ్యస్థానమునకు పోనివ్వబడెదరు. మొదటితరగతివి, రెండవ తరగతివి, మూడవ తరగతి ఇటుల ఎన్నో టిక్కెట్లు గలవు కొన్ని దొంగ టిక్కెట్లుకూడ గలవు. అవి తెల్లగా, నల్లగా, పసుపు, రంగుగా పచ్చగా నుండును.

కాని మిమ్ముల గమ్యస్థానమునకు తీసుకొనిపోవు టిక్కెట్లు జీసస్ క్రైస్ట్ నెత్తుటితో తడుపబడి ఎఱ్ఱగానుండును. అట్టి టిక్కెట్లు గలవారే గమ్యస్థానమునకు అడ్డంకిలేకుండా వెళ్ళనీయబడెదరు; ఇతరులను వెళ్ళనీయరు. తెల్ల, నల్ల, పచ్చ టిక్కెట్లు ఇతర మతముల టిక్కెట్లు; ఎఱ్ఱ టిక్కెట్లు మాత్రమే జీసస్ క్రైస్ట్ రక్తసించితములు: అవి క్రైస్తవ టిక్కెట్లు. ఇదీ ఆ పుస్తకపు విషయము, ఆ పుస్తకమెంతో చక్కగా అచ్చువేయబడెను. ఆ మతాచార్యుడు ఆ పుస్తకము వ్రాయుటలో తన తెలివి నంతటిని, తన ఇంగ్లీషు భాషా జ్ఞాన మంతటిని వినియోగించెను.

క్రైస్తవుల యొక్కయేగాక తక్కిన మతముల వారిది కూడ ఈ రకపు విశ్వాసమే. మరణానంతరము, టిక్కెట్టును పోగు చేయువాడు ప్లేటను మాష్టరు. లేక లెక్కలు సరిగా నున్నవేమో చూచువాడు మహమ్మదనియు, ఆయన సంతకము లేని టిక్కెట్లుందువారు నరకములో పారవేయబడుదురనియు, మహమ్మదీయులు తలతురు. ఇతర మతములకు గూడ ఇట్టి భావములే ఉండును. చచ్చినవారందరు అమెరికాలో, యూరపులో, ఆఫ్రికాలలో, ఆష్ట్రేలియాలో, ఏషియాలో నెక్కడ జచ్చినను, క్రైస్ట్ కానిండు, మహమ్మదు కానిండు, బుద్ధుడు కానిండు, జొరోయాష్టరు కానిండు లేదా కృష్ణుడు కానిండు వీరిలో ఎవరో ఒక్కని అధీనమందే చచ్చినవారందరు ఉందురని తలతురు మతముల పరస్పర పోరాటమునకు, పోట్లాటకు ఇదియే కారణము. మతముపేరిట ఈ లోక

ములో కార్చబడిన నెత్తురు కంతయు ఈ గుడ్డినమ్మకమే, ఈ దురభిప్రాయమే కారణము.

ఈ విషయముపై వేదాంతపు అభిప్రాయము మీ ముందుంచబడును. వేదాంత మీ మతముల నన్నిటిని సమన్వయము చేయును. ఇతరమతముల హక్కులకు భంగము వాటిల్లకుండానే ప్రతిమతము చెప్పునదీ సమంజసమే నని వేదాంత మనును. నీవు చెప్పునది మంచి అగుటకు, నీతోటి సోదరులను తప్పుపట్టింప నక్కరలేదు. ఇది పెద్దవిషయము. వేదాంతదృష్ట్యా దీనిలోని కొన్ని ముఖ్యఅంశములను మాత్రమే ఇప్పుడు ప్రస్తావించవచ్చును

ప్రపంచములోని ప్రగతి యంతయు సూటియైన సుందర మగు గీతగానే (తోవనే) నడచు చున్నది. ప్రపంచములోని ఉత్క్రాంతి, అభ్యుదయము సామరస్యమార్గమున నున్నది. ప్రపంచమందలి స్పందన మంతయు సామరస్యయుతము. ఒక సరైన నడకలోనే క్రిందిమీదలు ఉదయపతనములు నడచు చున్నవి. గణితశాస్త్రము ప్రతిబృహత్సంఖ్యకు (Maximum) అల్పసంఖ్య యొకటున్న దనును. బృహదల్పములు తారు మారగుచుండును. రాత్రింబవళ్లు సమరసముగా సంచల మొన రించుచున్నవి. నీవు కదలవలసి నప్పుడుకూడ మొదటొక పాద మును కదల్చి తరువాత మరియొక పాదమును కదల్చవలెను. సంవత్సరమందలి ఋతువులుకూడ ఒకనిర్ణీతక్రమమున వర్తించు చున్నవి. వచ్చినఋతువే మరల దానితరుణ మొచ్చినప్పుడు వచ్చును. దీనినే చక్రనేమిక్రమ మందురు. (Periodic

motion); లేక ఋతుసంవర్తన మందుగు. మన కీలోకమందు చక్రనేమిక్రమము గలదు. ప్రతిరోజు నీవు మేల్కాంచు చున్నావు. తిరిగి పండుకొనుచున్నావు. తిరిగి లేచుచున్నావు. నిదుర మేల్కాంచుట అనునవి ఎటుల ఒక నిర్ణీతక్రమమున ఒకదాని తర్వాత ఒక టొచ్చునో, అటులనే వేదాంతము ప్రకారము గూడ జన్మమృత్యువులు, మృత్యుజీవితములు, ఒకదాని తరువా తొకటి నిర్ణీతక్రమమున వచ్చుచున్నవి. ఈ ప్రపంచ మంతటిలో, ఎప్పుడు ఎన్నడు చివుక్కున ఆగిపోవుట యనునది జరుగలేదు. కాల మెన్నడేని ఆగునా? లేదు. కాలమెప్పుడు ప్రారంభమాయెనో ఎఱుగుదువా? అవకాశమునకు ఎక్కడేని అంతమున్నదా? లేదు. అంతము లేదు. నదు లెప్పుడేని ఆగునా? నీ వవి ఆగునందువు. కాని అవి ఆగవు. సముద్రములో ప్రవేశించిన నదులు ఆవిరిరూపముగా పైకిలేచి, తిరిగి పర్వతములను చేరి, తిరిగి సముద్రములోనికి ప్రవహించును. సముద్రము నుండి తిరిగి పర్వతములను చేరును. ఇక్కడొక క్రొవ్వువత్తి ఉన్న దనుకొనుము. ఒకగంటలో నది వెలిగిపోవును. వత్తి కూడ పోవును. అది చచ్చినదని నీ వందువు. కాని అది చావదు. రసాయనశాస్త్ర మది చావదని చూపుచున్నది. అది కేవలము మార్పొందు చున్నది. దానిలోనుండి ఏర్పడిన నీరు, కార్బను డై ఆక్సైడను వాయువు, తిరిగి వృక్షములలో కానవచ్చు చున్నది. ఏదియు చావదు. ప్రపంచములో ప్రగతియంతయు చక్రమువలె గుండ్రముగ నున్నది. లేదా సాంద్రచక్రమువలె నున్నది. చూడుము. నీవు బ్రతికియున్నావు నీవు చచ్చెదవు.

ఈ మరణానంతరస్థితి ఎప్పటికి ఉండునా? ఉండుననుటకు నీ కధికారము లేదు. అట్లనుట ప్రకృతి నియమములకు విరుద్ధము. మరణానంతరము శాశ్వత నరకమే. జీవిత మనునది లేదు, అని నప్పుడు నీవు ప్రపంచము నేలుచున్న అన్నిటికంటె అనివార్యమైన నియమములకు వ్యతిరిక్తముగ నుడువుచున్నావు; అట్లనుటకు నీకధికారము లేదు. ఒరుడు చచ్చిన తదుపరి దేవుడు వానిని శాశ్వత నరకములో కూలద్రోయునేని, వాడెంత పంతగొండి దేవుడు. మానవుడు తానున్న ముప్పాతిక మూడేండ్లు కష్టించుచున్నాడు. పాపము, వానికి సరైనవిద్య నలవరచుకొను అవకాశము చిక్కలేదు. తన యాత్మతత్త్వమువరకు తీసుకొనిపోవుటకు మార్గము దొరకలేదు, అతడు విద్యగఱపలేని, ఏ చర్చికి తీసుకుపోలేని తల్లితండ్రులకు పుట్టెను, వాడు చచ్చెను క్రైస్తు రక్తసించితమైన టిక్కెట్టు వానికి చిక్కలేదు. ఇక ఈ మనుష్యుని ఎప్పటికి ఎప్పటికి నరకములో పారద్రోయవలసినదే. అట్టి వాడెంతో పంతగొండి దేవుడు కాడా? అట్లెవడు చేయును? న్యాయము పేరిట ఇట్టిమాట ననుటకు నీకధికారము లేదు. వేదాంతము ప్రకారము ఒక మనుష్యుడు చచ్చినప్పుడు, వాడెప్పటికి అటుల చచ్చియే యుండకూడదు. ప్రతిమరణము తరువాత జీవితము కలదు ప్రతి జీవితము తరువాత మరణము కలదు. నిజముగా మరణ మనునది యొక పేరు; మరణమనగా స్థితిపరివర్తనము. మరేమీకాదు. మరణములో వికార్యమైనది, భయంకరమైనది ఏమియు లేదు. దాని నెంతో భయావహ

ముగ జేసికొనుట పెద్ద పొరపాటు. అందులో భయంకరమైన దేమీ లేదు. అది కేవలము స్థితిపరివర్తనమే.

నీ వీ లోకములో బ్రతికియున్నన్ని రోజులూ, 70 ఏండ్లనుకొనుము, లేదా 80 ఏండ్లనుకొనుము; నీవొక దీర్ఘమైన జాగ్రదవస్థలో నున్నావనుకొనుము, ఇహలోకమందలి జీవితము సుదీర్ఘమైన జాగ్రత్ స్థితి; జీవితముతరువాత మరణ మనునది దానికి తగిన దీర్ఘనిద్ర, అని వేదాంత మనును. వేదాంతము ప్రకారము మరణమనగా దీర్ఘనిద్ర. ప్రతి 24 గంటలలోనూ మూడు నాల్గు గంటలు నిదురించి, తిరిగి నీ వెటుల లేతువో, అటులనే మరణ మను విశ్రాంతి ననుభవించి, నీవు తిరి గీ లోకములో పుట్టవలసినదే, నీవు పునర్జన్మ మెత్తవలసినదే. పునర్జన్మ మనునది ఒక కూరుకుపోయినతరువాగ తిరిగి లేచుట వంటిది.

వేదాంతము ప్రకారము, మానవుడు మరణించిన పిదప తక్షణమే పునర్జన్మ మెత్తడు. చెట్టునుండి విత్తొకటి పడినప్పుడు, అది తక్షణమే క్రొత్తచెట్టుగా కాదు, కాలము పట్టును. మానవు డొక యింటిని వదలిపెట్టినప్పుడు తక్షణమే మరొక యింటిలో ప్రవేశింపడు. వానికి కాలముపట్టును. అటులనే, మనుష్యుడు చావగానే వెనువెంటనే తిరిగి జన్మింపడు. మనము మరణ మనిపిలచు స్థితిగుండా లేక దీర్ఘసుషుప్త్యవస్థ గుండా వాడు పోవలసివచ్చును. ఈ స్థితి నంగ తేమిటి? మరణ మునకు మరొకజన్మకు మధ్యనుండు ఈస్థితి ఎవిధ మైనది? అది నిద్రావస్థ. నిదురకుండు లక్షణము లన్నియు దానికిని ఉండును.

మానవుడు నిదురపోయినప్పుడు, జాగ్రదవస్థలో ఏలాటిపనుల జేయుచుండెనో, అట్టి విషయములనే, వాడు స్వప్నములలో చూచును. అది సామాన్య నియమము. కొన్నిసారులు దీని కపవాదముండును. కాని సగుడు స్వప్నములలో సాధారణముగా జాగ్రదవస్థలో చూచునట్టి వస్తువులవంటి వానినే చూచును. విశ్వవిద్యాలయములలో పరీక్షలకు చదువువారు రాముని ఈ మాటను సమర్థింతురు; పరీక్షలు చాల దగ్గర కొచ్చినప్పుడు, వానికోస మెంతో కష్టించునప్పుడు, వారు స్వప్నములలో పగలు తాము శ్రమచేసిన వంటి విషయములనే చూతురు. అనేకపుపనులనే చేతురు. పరీక్ష అయిపోయిన తరువాత, ఫలితములకు వేచియుండి ప్యాసు కావలెననియు ప్యాసయిన వారిలో కెల్ల ఉచ్చశ్రేణిలో నుండవలెననియు కోరుకొనుచు, వేచియున్న స్థితిలో, వారు పరీక్షలఫలితములను గూర్చియే కలలుకనెదరు. ఒక ప్రత్యేకవిషయమునో వస్తువునో ప్రేమించువారు, రాత్రి దానినిగూర్చి కల గనక మానరు.

రాముడు బి. ఏ పరీక్షకు చదువుచున్నప్పుడు, ఆతనితో పాటుగదిలో మరొక సహపాఠి ఉంటుండెను ఆ సహపాఠి చాల టక్కరివాడు. వాడు కాలమంతయు ఆటపాటలలో వినియోగించెడివాడు. ఒకనాడొక పెద్దమనుష్యుడీ మిత్రుని చదువునకు రోజుకు నీ వెన్నిగంటలు వినియోగించుచున్నావని అడిగెను. వాడు చిరునవ్వుతో, "పదునెనిమిదిగంటలు పూర్తిగా వినియోగించు చున్నా"ననెను. ఆ మిత్రుడిట్లనెను. "దాని కర్థమేమిటి? నా కండ్లయెదుటనే నీవు రోజుకు నాలుగైదు

గంటలు వృధా చేయుచున్నావు; 24 గంటలలో నీవు. 8 లేక 9 గంటలు నిదురపోయెద వని ఎరుగుదును; ఇక నీకు మిగులు నది 10 లేక 12 గంటలేకదా, అయినను 18 గంటలు నిండుగా చదువుచున్నా ననెద వేల?'' ఆ యువకుడు ఇటుల జవాబిచ్చెను. "మీరు గణితశాస్త్రమును చదువలేదు. నేను 18 గంటలు నిండుగా చదువుచున్నా నని ఋజువుచేయగలను. ఆ పెద్ద మనుష్యు డెటులనో చెప్పుమని అడిగెను. యువకు డిటు లనెను. "నేనూ, ఈ రాముడూ కలసి ఒకేగదిలో నున్నాము. వాస్తవముగా నేను 12 గంటలు చదివెదను. వాడు 24 గంటలు చదువును. మొత్తము 36 గంట లయినది. సగటు తీసికొనిన వాడివంతు 18; నా వంతు 18 అగు చున్నది'' "నీవు 12 గంటలు చదువుచున్నావని యొప్పు కొనినను, రాముడు 24 గంటలూ చదువుచున్నా డని ఒప్పుకో లేను. అదెటుల సాధ్య మగును? రాముడెంతో కష్టించి చదువు విద్యార్థియని నేనెఱుగుదును. అత డెన్నో విషయము లను చదువు చున్నాడని నే నెఱుగుదును. విశ్వవిద్యాలయ ములో చేయుచున్న కృషియేగాక దానికి నాల్గురెట్లు ఎక్కువ పనిచేయుచున్నాడు. ఎన్నో గ్రంథముల జేయుచున్నాడు. ఎన్నోపనులు జేయుచున్నాడు. కాని ప్రకృతి అతనిని 24 గం టలు పని చేయనీయదు.'' అని పెద్దమనుష్యు డనెను. సహ పాఠి విషయమును తెలియ జెప్పసాగెను. "వాడు భోజనము చేయునప్పుడుకూడ, వానిమనస్సు ఒక క్షణముమకూడ వృధా చేయడు. వానివద్ద ఎల్లప్పుడు ఏదో శాస్త్రీయ సమస్యయో,

గణితశాస్త్ర ప్రశ్నలోయున్న కాగితముకటుండును. దానిని
గూర్చి ధ్యానించుచుండును, లేదా తాను వల్లెవేయదలచుకొన్న
ఏదైన పద్యమునో, పుస్తకమునో దగ్గరుంచుకొను నని చూప
గలను; ఏదో పద్యమల్లుచునో లేక మరోపనే చేయుచునో
ఉండునుగాని, భోజనముచేయునప్పుడుకూడ ఒక నిమిషమేని
వృధాచేయడు. స్నానాలగదిలో నున్నప్పుడుకూడ వాడు
సీమసున్నముతో గోడపై ఏదోబొమ్మల గీయుచునే యుండును;
నిదురపోయినప్పుడుకూడ ఏదో ఒక సమస్యనుగూర్చి ఆలో
చించుచునే యుండును; పగలు తాను విచారించు విషయము
లనుగూర్చియే అతడు రేయి కలలు గనుచుండును; ఇటుల
వాని 24 గంటలు అధ్యయనమునకే వినియోగింపబడు
చున్నవి."

సరివాడనినదానిలో కొంత సత్యమున్నది. తన 18
గంటలు పూర్తిగా చదువునకే వినియోగించువాడు, పగలు
చేయునట్టి పనినేగాక మరొక రకపు పనిని కలలలోగూడ
చేయలేడు. కొన్నిసారులు జనులు కలలలో తామెన్నడు
చూడనట్టి వస్తువులను జూచితిమని చెప్పెదరు. వేదాంత
మది యథార్థముకాదనును. ఒకమనుష్యుడు కలలో
తాను భూతమునుచూచితి ననును. ఆ భూతమునకు సింహపు
తల, ఒంటెవీపు, సర్పపుతోక, కప్పకాళ్లు ఉండెను. అట్టిజంతు
వును తా నెన్నడు చూడలేదని వాడనును; వేదాంతము వాడి
కిటుల చెప్పును, "అన్నా, నీవు మనుష్యుని చూచితివి;
ఒంటెను చూచితివి; కప్పను చూచితివి; ఇక కలలో నీవు

సర్పపు తోకను, సింహపుతలను, ఒంటెపీపును, కప్పకాళ్లను, కలిపి ఒక క్రొత్తవస్తువును తయారు చేసితివి; కాన నిజముగా నీవు కలలోజూచునదంతయు అనగా నీకు క్రొత్తగా కనపడు ఈ భూతముకూడ నీవు జాగ్రత్ స్థితిలో చూచినదే.

రష్యా నెన్నడు చూడనివాడు దానినిగూర్చి ఎన్నడు విననివాడు, తాను పీటర్స్బర్గ్ పట్టమున నున్నట్లు ఎన్నడు కలగనడు. దార్శనికు డెవడైన కలలో మాదిగపని చేయునా? వాడు మాదిగవాని ప్రక్క ఇంటిలోనున్నను, కలలలో తరచు మాదిగ వానిని జూచినను చెప్పులుగుట్టు మాదిగపనిచేయుచున్నట్లు మాత్ర మెప్పుడూ కలగనడు.

సమాచార మిది గావున, మరణ మను నీ దీర్ఘనిద్రలో నీ వేమి ఆశించవచ్చును? మరణమునకు పునర్జన్మకు మధ్యనున్న వ్యవధి దీర్ఘనిద్ర కాలము ఎటుల గడచును? ఇది నీ స్వర్గముల లోనో, నీ నరకములలోనో, ఇదినీ దేవలోకములలోనో, నీ యమలోకములలోనో గడచు నని, వేదాంతము చెప్పుచున్నది. ఈ స్వర్గనరకము లేమిటి? ఒకచావుకు మరొక జన్మకు మధ్యనున్న స్వప్నలోకము లని. చాలా పవిత్రమైన, శ్రద్ధాయుతమైన ధార్మిక జీవితమును గడుపుచు ప్రతి ఆదివారము చర్చికి బోవుచు, ప్రతి సాయంకాలము ప్రార్థనల జేయుచునున్న నిజమైన క్రైస్తవు డున్నాడను కొనుడు. వాడు తానుతిను ప్రతి భోజన మప్పుడు దేవుని తలచుకొనును. క్రైస్తు శిలువను తన గుండెపై జీవితకాల మంతయు ఉంచుకొనును. పుట్టినప్పటి నుండి గిట్టువరకు మేల్కొని యున్నప్పుడెల్ల వాడు క్రైస్తును

గూర్చియే ధ్యానించెను. జీసస్ క్రైస్ట్ పవిత్రసన్నిధిలోనే వాడు బ్రతుకుచు, కదలచు, తన అస్తిత్వము నుంచుకొనెను. తన 80 లేక 90 ఏండ్ల జాగత్స్థితిని వీడు క్రైస్ట్ పేమకే వినియోగించెను, ఆలోచనలన్ని క్రైస్ట్‌పైననే ఉంచుకొనెను. మరణానంతరము తాను క్రైస్ట్ కుడివైపున కూర్చుండు నని ఆశించెను. మరణానంతరము తనకు స్వాగత మిచ్చు దేవదూతలను గూర్చి, దేవశ్రేష్ఠులనుగూర్చియే బ్రతికి నన్నాళ్లు తలచుచుండెను. వేదాంతము ప్రకారము ఇట్టి క్రైస్తవభక్తుడు మరణానంతరము క్రైస్ట్ కుడిచేతివైపునే కూరుచుండును. తప్పకుండా మరణానంతరము, ఈ మృత్యువునకు రాబోవుజన్మకు మధ్యనున్న సుదీర్ఘనిద్రలో వాడు తనచుట్టు దేవదూతలు, దేవశ్రేష్ఠులు దైవసంకీర్తనము చేయుచుండుట చూచును. వాడు తాను వారిమధ్యనున్నట్లుగా నుండకుండుటకు కారణము లేదు. వేదాంత మిటులనును." ఓ క్రైస్తవులారా! మీరు శ్రద్ధావంతులేని, మీరు భక్త్యుపేతులని, మీకు మీ గ్రంథములలోని వాగ్దానము లన్నియు అమలు పడును. కాని మహామ్మదీయులనుగాని, హిందువులనుగాని దూషింపకుడు. మహామ్మదీయుడు సరైన మహామ్మదీయుడేని, తన 70 ఏండ్ల లేక 80 ఏండ్ల జీవితమను జాగత్స్థితి నంతయు మహామ్మదు చెప్పినట్లు నడిపించు కొనునేని, మహామ్మదుపైననే దృష్టి యుంచుకొని ఆయనను గూర్చియే చింతించుచు, మహామ్మదునకు రోజు కైదు సార్లు ప్రార్థన లర్పించునేని, (మహామ్మదుదీయులు రోజుకు నాలుగైదుసారులు ప్రార్థింతు రనియు వారు చాల నియమ

వంతులయు, భక్తులనియు మీరెరుగుదురు కదా !) మహమ్మదు పేరిటే బ్రతుకుచు, మహమ్మదు పేరిట జీవిత మర్పించుటకుకూడ సిద్ధముగ నుండెనేని, (మహమ్మదీయులు మతో ద్రేకము గలవారు; వారి కావేశమెక్కువ. కొన్నిసారులు ఆ ఆవేశములో వారికి మతియుండదు.) జీవిత మంతయు మహమ్మదీయ మతమునే ఆరాధించవలెనని, మహమ్మదు పేరును ప్రపంచపు ప్రతి మారుమూలలోను మ్రోగునట్లు చేయవలెనని వాడు కలలలోగూడ తలచు చుండెనేని, అట్టి మహమ్మదీయుడే మగును? ప్రకృతి నియమములకు విరుద్ధముగా వానికేమియు జరుగదు. మనము జాగ్రత్ స్థితిలో దేనిని కలగను చుందుమో, అదియే నిదురలోగూడ కలగను చుందుమని ప్రకృతి సిద్ధాంతము. వాడు మహమ్మదును, స్వర్గమును, చక్కనితోటలను, సుందర స్త్రీలను, ప్రవక్తచే మరణానంతరము వాగ్దానము చేయబడిన ద్రాక్షాసవపు వాగులు, స్వర్గములో మరణానంతరము లభించు వైభవోపేతములగు భవనములు, విలాస సామాగ్రిలు వీనినే స్వప్నములందు చూచుచుండెను. వాడు కలలలో చూచుచున్న ఈ విధమైన స్వర్గమును పొందకుండ అడ్డముపడు శక్తిగాని, నియమముగాని ప్రకృతిలో లేదు. వాడట్టి స్వర్గమునే తప్పక జూచును. తనప్రవక్తచే వాగ్దత్తము చేయబడినటువంటి స్వర్గమునే వాడు మరణానంతరము తప్పక పొందును.

కాని వేదాంతము చెప్పున దేమన ;—ఓ మహమ్మదీయులారా! యీ ప్రపంచ మందలి జను లందరు మరణానంతరము

మీ ప్రవక్తయగు మహమ్మదు దయపైననే ఆధారపడి యుందు రని మీ రనుటకు హక్కు లేదు. క్రైస్తవులను, వారి భావస్వాతం త్ర్యమును వారనుభవింపనిందు; వారినిస్వతంత్రులనుగా చేయుదు; వీ రందరు యూరోప్‌లో, అమెరికాలో, తూర్పిండియాలో, జపాన్‌లో, లేక చైనాలో చచ్చినను మహమ్మదు దయపైననే ఆధారపడి యుందు రనకుడు. వారికి మహమ్మదులో విశ్వాస మున్న నరియే, లేకున్న నరకమే, అని క్రూరముగ పలుకు టకు మీకు హక్కు లేదు. నీవు మహమ్మదు అనుచరుడ వైనచో నీవు కోరుకొను నట్టి స్వర్గమునే నీవు పొందెదవు. ఇతర మతములతోగూడ నిట్లే. మీ మతములను, మీ సాంప్ర దాయములను మీరు సత్యముగ అనుసరించితిరేని, మీరాశించు నట్టి స్వర్గమే మరణానంతరము మీకు లభించును. వాస్తవ ముగా, మరణానంతరము స్వర్గముగాని, నరకముగాని మీపైననే ఆధారపడి యున్నది. మరణానంతరము స్వర్గమును చేసికొను నది మీరే, నరకమును చేసికొనునది మీరే. వాస్తవముగా స్వర్గనరకములు మీ స్వప్నములు మాత్రమే. ఆవేళకు మీకు నిజముగా కనపడునది కలలేగాని మరేమీకాదు. స్వప్న ములో నున్నంతసేపు మనకు స్వప్నము నిజముగా కనపడునని మీ రెరుగుదురు కదా! కాన ఈ స్వర్గనరకములు మరణానంత రము మీకు సత్యములుగా కనపడును; కాని వాస్తవమున కవి కలలేగాని మరేమీకావు.

మరొక సంగతి చెప్పవచ్చును. మన శాస్త్రములు మనకుచేయు వాగ్దానములు నిజమైనచో, మనకు మరణానంత

రము శాశ్వతానందము లభించునుకదా! మన శాస్త్రములు మరణానంతరము శాశ్వతానందమో లేక శాశ్వతనరకమో లభించు నని వాగ్దానము చేయుచున్నవిగదా! దాని సంగతిఏమి? వేదాంత మిట్లనును, "శాశ్వత మనగా నేమి? శాశ్వతమను నది కాలమునకు, సుదీర్ఘ కాలమునకు, చిరకాలమునకు చెందిన శబ్దము. జాగ్రదవస్థలోని కాలము స్వాప్నావస్థలోని కాలము నకు భిన్న మని నీ వెఱుగుదువుకదా! నీ జాగ్రదవస్థలోని కాల మొక విధమైనది, స్వాప్నావస్థలోని కాలము మరొక విధమైనది. నీ స్వప్నజగత్తులో ఒక్కొక్కసారి ఒకవస్తువు ఏ అయిదువేల సంవత్సరములనుండియో యున్నట్టుల చూచెదవు. కలలో నీవు పర్వతమును చూచితి ననుకొనుము, జాగదవస్థ దృష్టితో జూచిన ఆ పర్వతము ఆచోట అక్షణము నీచే సృష్టింపబడినది, కాని స్వాప్నావస్థ దృష్టితో చూచిన అది 5000 ఏండ్ల క్రిందటిది. వేదాంత మనున దేమన నీకలలో నీవు అనాదినుండి స్వర్గములో నున్నట్లుగా కాంచెదవు; స్వాప్నికద్రష్ట దృష్టితో నీవు స్వర్గ మందునో, నరకమందునో అనాదినుండి ఉండినట్లు అనుభ వింతువు, కాని జాగ్రత్ ద్రష్ట దృష్టితో కాదు.

బైబిలులో నీకు చేయుబడిన వాగ్దానములు నిజమైనవిగా కనుగొనగలవు; ఎందుకన ఆస్థితిలో నీవు అట్టులనే నిత్యమూ (For ever) ఉన్నట్టులుగా తలచెదవు. అది నీకు సనాతన మగును. ఏది స్వాప్నికద్రష్ట దృష్టిలో సనాతనమో అది జాగ్రత్ ద్రష్ట దృష్టిలో క్షణభంగురము.

వేదాంత మిటుల మరణానంతరము సర్వమతముల సమన్వయముచేయునో దీనినిబట్టి మీకు కొంత అర్థమైనది.

* పునర్జన్మము సంగతి ఏమిటి? ముక్తపురుషు లను వారి సమాచార మేమిటి? ప్రతివాడును మరణానంతరము ఈ స్వర్గనరకము లను స్థితులలో పడి తరువాత తిరిగి జన్మించ నక్కరలేదని, వేదాంత మనుచున్నది. ముక్తపురుషులను వారు గలరు, వా రెవరు? వారు పునర్జన్మమునకు లోబడనివారు; వారు స్వతంత్రులు: వారు స్వర్గనరకములలో బంధింపబడరు; స్వర్గనరకము లన్నియు వారిలోనే గలవు; లోకము లన్నియు వారిలోనే ఉన్నవి. వీరినిగూర్చి కొన్నిమాటల చెప్పవలెను.

నీస్వప్నములలో ద్రష్టాదృశ్యము లను ద్వివిధ ప్రక్రియలు గలవు. నీచుట్టూ నుండియుండు నదులు, కొండలు, గుట్టలు దృశ్యము; స్వప్నము గాంచువాడు, ఈబాటసారి, ఈపాంథుడు ద్రష్ట, నీ కలలలో ఎన్నో వస్తువు లున్న వని ఎరుగుదువుకదా! అందులో నొకటి నీవు "నేను" అని పిలచునది, తదితరములు నానుండి వేరగు నట్టి "వస్తువులు" అనబడునవి నీవు "నేను" అనునది "ద్రష్ట" "నేను కానిది" అని నీ వనునది "దృశ్యము" సాధారణముగా స్వప్నములలో ఈ ద్రష్టాదృశ్య మను భేదము గలదు. ఈద్రష్టాదృశ్యములు రెండూకూడ నీ సృష్టియే. అస లాత్మయొక్క జాగ్రత్ ఆత్మయొక్క సృష్టే నని వేదాంత మను చున్నది. సంభాషణ చక్రవర్తి యనబడిన

* Transmigration = దేహాంతరమునకు బోవుట.

నిఘంటుకారు డగు ఆచార్య జాన్సన్ ఎన్నడూ వాగ్వా దములో తన నోడిపోనివ్వ లేదు. చివరిమాట తనదే యగునట్లు చూచుకొనువాడు. ఆతను పిస్తోలుతో కాల్చ లేకపోయిన, దాని మడమతో నైన నెత్తిన మొట్టునని ఎవరో అనినారు. విజయ మెప్పుడు అతనివైపునే ఉండ వలసినదే. ఎవరైన, ఎప్పుడైన వాదనలో ఆతనిని మించె నేని, ఆతడు దానికి ప్రతీకారము చేయుటకై స్వర్గమర్త్యము లను కదల్చివేసెడివాడు. మహావక్తయగు ఎడ్మండ్ బర్క్ తనను వాదనలో జయించినట్లాతడొకసారి కలగనెను. జాన్ సన్ వంటి స్వభావముగల మనుష్యుని కిది కొరివిదెయ్య మాయెను. అది ఆతనిని కదల్చివేసెను. ఆతను మేల్కొని మనస్సు కుదుటపడక కొట్టుకొను చుండెను. తిరిగి నిదుర పోవు టెట్లో ఆతనికి తెలియకపోయెను. ఘన స్వప్పుడు విశ్రాం తిని వెదకుచుండు నని, విశ్రాంతిని కోరుచుండు నని, మీా రెఱుగుదురు కదా! దానికే మైన అలజడి కలిగినప్పుడు, అది విశ్రాంతికై దేవులాడును. ఎందు కనగా విశ్రాంతియే దాని గృహము. తనగృహమునకై అది వెదుకులాడుచుండును. జాన్ సన్ శాంతిని వెదుకుకొనవలసివచ్చెను. ఆతడు తన నీ ఆలో చనతో సమాధాన పరచుకొనెను. "నేను ఎడ్మండ్ బర్క్ వద్దకుపోయి" ఓబర్క్ నీ వేవాదమును చేసినన్ను స్వప్నములో గెలిచితివి అని అడిగినచో, బర్క్ ఆ వాదనను చెప్పలేడు. నేను నిదురించుచుండగా ఆతడుచేసిన బలిష్ఠమైన వాదన నెఱుగుదును. నా ఓడిపోవుటకు కారణములైన నిర్బలవాద

ననూ ఎఱుగుదును. గెలిచినవైపును, ఓడిపోయిన వైపునను నేను రెండింటిని ఎఱుగుదును కాని ఎడ్మండ్ బర్కు దానిని గూర్చి ఏమియూ ఎఱుగడు. కాన రెండువైపుల వాదనలను జేసినది నా బుద్ధియే. నేనే ఒకవైపున గెలుపొందిన ఎడ్మండ్ బర్కుగాను, మరొకప్రక్క ఓడిపోయిన జాన్సన్‌గాను కాన వచ్చితిని.

కాన నీ కలలో ఒకవైపున దృశ్యముగానూ, ఒక వైపున ద్రష్టగాను కనుపించునది నీవే నని వేదాంతము చెప్పు చున్నది నీవే, నీలోని నిజమగు ఆత్మయే కొండలుగాను, నదులుగాను, అడవులుగాను, పక్షులుగాను, మృగములుగాను, జంతువులుగాను ఒకవైపున కానవచ్చుచున్నవి. మరొక ప్రక్క విభ్రాంతిచెందిన పాంథుడుగా కానవచ్చుచున్నది. నీవే ద్రష్టవు. నీవే దృశ్యము.

కాన, వేదాంతము ప్రకారము మరణమను నీ దీర్ఘ నిదురలో, నీవే స్వర్గము. నరకమూ నీవే. స్వర్గములో సుఖించు నది నరకములో యాతనపడునదికూడ నీవే. దానిని తెలిసి కొనుము నీవు స్వతంత్రుడవయ్యెదవు.

ఈ వేదాంతజ్ఞానమును బడసిన ఒక స్త్రీ యుండెను. ఆమె నిప్పునొక చేతిలోను, చల్లని నీటినొక చేతిలోను ఉంచుకొని వీధులవెంట బోవుచుండెను. జను లామె దగ్గరకొచ్చి ఈ ప్రశ్న వేసిరి. "చన్నీళ్ళ నొక చేతిలోను, నిప్పునొక చేతిలోను తీసి కొని పోవుటలో నీ అభిప్రాయ మేమిటి?" ఈ ప్రశ్న వేసిన వాడొక పెద్ద మతప్రచారకుడు (మిషనరీ). ఆమె ఇట్లనెను.

"ఈనిప్పుతో నీ నీస్వర్గలోకమునకు నిచ్చుపెట్ట బోవుచున్నాను. ఈ నీటితో నీ నరకాగ్నిని చల్లార్ప బోవుచున్నాను." తానే స్వయముగ స్వర్గము నని, తానే స్వయముగ నరకము నని తెలిసిన జ్ఞానవంతునికి నీ స్వర్గ మనిన ఆకర్షణా లేదు; నీ నరక మనిన భయమూ లేదు. వాడు ఆరెంటిని అతిక్రమించినాడు. అయితే ఈ నీ ప్రపంచము సంగతేమిటి. నీ వింతగా అనుభ వించు ఈ జాగ్రదవస్థ సంగతేమిటి? ఈ గట్టిగా, మొద్దుగా, కనపడు ఈ ప్రపంచముకూడ అసత్యమే. నీ స్వప్నములకు దానికి భేదము లేదు. అని వేదాంత మనుచున్నది. పరిమాణ మందు భేదమేగాని, స్వభావమం దేమీ భేదము లేదు. నీ జాగ్రత్ స్థితికూడ స్వప్నమే; అయితే ఘనీభవించిన స్వప్నము (Solidified dream), ఈ ఘనముగా కనపడు ప్రపంచమందు కూడా ద్రష్టాదృశ్యములు నీ నిజమైన ఆత్మయొక్క సృష్టియే గాని, మరేమీ కాదని వేదాంత మనుచున్నది. నీ సత్యాత్మయే నగరములుగా, పట్టణములుగా, నదులుగా, కొండలుగా ఒక వైపునను, లోకమందలి ఏకాకియైన బాటసారిగా, యాత్రి కుడుగా ఒకవైపునను కనపడుచున్నది. ద్రష్టగా కనపడునదే దృశ్యము. దృశ్యముగా కనపడినదే ద్రష్ట. జాగ్రదవస్థలో కూడ నంతే.

మరణ మనగా ద్రష్టయొక్క ఉపశాంతి; దృశ్యము యొక్క ఉపశాంతి కాదు. నీవు కలగనుచున్నావు; ఆ కలలో నీవు బొంబాయి పట్టణ మందున్నట్లుగా తలచితి వనుకొనుము; కాని అసలు నిజముగా నీవు శాన్ ఫ్రాన్సిస్కోయందే పండుకొన్నా

వనుకొనుము. అప్పుడు నీ కలలో ఆ బార్క్లే పట్టణమేమిటి? దానితో సంబంధించిన ఆ దృశ్యములన్నీ ఏమిటి? అవియన్ని యుదృశ్యములు, ఆ బార్క్లేలోనున్న నీవు ద్రష్ట; మనకు కొన్ని సార్లు రెట్టింపు నిదురయుండు నని ఎరుగుదువుకదా! కొన్నిసార్లు మనము నిదురలో నిదురించెదము; బారువడ్డీ (Compound interest) ఉన్నట్లే ఇచట స్వప్నములో స్వప్నము లేక రెట్టింపు స్వప్నమున్నది. బార్క్లేలో నీవు నిదురపోయినచో, ఇది రెట్టింపు నిదుర కుదాహరణము. అప్పు డేమగును? నీవు తిరిగి మేల్కొందువు కొన్నిసార్లు మనము స్వప్నములలో ఒకచోట పడి నిదురపోయెదము, తిరిగి అదే స్వప్నములో మేల్కొందుము; కావున ఇప్పుడు నీవు పండుకొనియుంటివి, స్వప్నములో బార్క్లేలో నున్నట్లు చూచుకొంటివి. బార్క్లే దృశ్యము, నీవు ద్రష్టవు, ద్రష్ట నిదురపోయెను, దృశ్యమగు బార్క్లే మాత్రము అదియేయుండెను, ద్రష్ట ఉపశాంతినొందితిరిగి లేచెను; నీవు తిరిగి బార్క్లేలో నున్నట్లుగా కనుగొంటివి; కాని నిదుర మామూలుగానే సాగెను; బార్క్లేనుండి నీవు లాస్ ఏంజెల్స్ కుపోతివి. లాస్ ఏంజెల్స్ లో నీవు నీ ప్రియమిత్రులలో ఒకని ఇంట దిగితివి. తిరిగి నిదురపోయితివి. అచట లాస్ ఏంజెల్సు, నీ మిత్రుని ఇల్లు మొదలగునవి దృశ్యము; నీవు ద్రష్టవు: అచట ద్రష్ట ఉపశాంతి పొంది నిదురపోయి తిరిగి లేచినాడు; లాస్ ఏంజెల్స్ లో ఒక కూరుకుపోయి, నీవు లిక్ అబ్సర్వేటరీకి పోదువు. అచట లిక్ అబ్సర్వేటర్ లో మరల ఒక కూరుకు పోదువు; లిక్ అబ్సర్వేటరీదృశ్యము, నీవు ద్రష్టవు; ద్రష్ట కొంతసేపు ఉప

శాంతి నొంది తిరిగి లేచును. లిక్ అబ్సర్వేటరీనుండి నీవు తిరిగి ఏదో వేసవికాలపు విశ్రాంతిస్థానమునకు పోదువు. అక్కడ నుండగా నీ ఇంటిలో ఎవరో వచ్చియున్నా లేపును. ఇచట నీవు వేసవి కాలపు విశ్రాంతిస్థానము; నీవే వేసవికాలపు విశ్రాంతిస్థానము ననుభవించు మనుష్యుడవు; నీవు మేలాంచినంతనే, ద్రష్టా దృశ్యములు రెండూ అదృశ్యమగును; కాని నీవు కలగాంచు నప్పుడు ద్రష్టమాత్రమే ఉపశమించెను, దృశ్య మటులనే యుండెను; నీవు నిజముగా మేల్కొని యుండలేదు.

ఈ ఉదాహరణ నుపయోగించి చూతము. వేదాంతము ప్రకారము ఈ విశ్వము, ఈ విశాల ప్రపంచము ఒక స్వప్నము. ఈ విశాల ప్రపంచ మను స్వప్నములో, దిక్కాల కారణ ములు, నీవు చూచు శరీరము ఇదంతయు దృశ్యము, నీవు "నా శరీరము, నేను" *అనుకొనునదికూడ దృశ్యమే. సాధా రణమనుష్యుడు చచ్చునప్పు డేమి జరుగును? మాయ లేక అవిద్యయను దీర్ఘస్వప్నము నశించదు; అటులనే యుండును, వాడు చచ్చును; మరణ మనగా కేవలము ద్రష్ట ఉపశాంతి నొందుటయే దృశ్యము మారొందక అటులనే యుండును; కాన ఒక మనుష్యు డక్కడ చచ్చినప్పుడు పునర్జన్మలో తిరిగి మేల్కాంచును. తాను చావబోవునప్పుడు ఎట్టి లోక మును ప్రేమించెనో; అట్టి లోకమునే తిరిగి తన చుట్టూ చూచును; ఆ రెండవ జన్మలో వాడు 80, 90 ఏండ్లు బ్రతికి మరల చచ్చెననుకొనుము. అప్పుడు కార్కలే వతనో, లాస్

---

* Mylittee self అహంకారము.

ఏంజెల్సువలెనో యున్న రెండవజన్మలో దృశ్య మటులనే యుండును; ద్రష్టమూ తము కొంచెమునే ప్రుపశమించును, దీని ఫలితముగా వాడు మరల జన్మించును. మూడవ జన్మలో వాడు 70 లేక 80 ఏండ్లు బ్రదికి మరల చచ్చును లిక్ అబ్రర్స్ టరీవలె నున్న దృశ్య మటులనే యుండును ద్రష్ట ఉపశమించి తిరిగి రానవచ్చును. ఈవిధముగా దృష్టాదృశ్యములు రెండూ కలసి ఉపశమించినదాకా ఈజననము, మరణము, జననము మరణము సాగుచునే యుండును. ఈ ప్రపంచము నీకంటె భిన్నమైనదిగా నీకు కాన్పించి నంతవరకు, నీవీ ప్రపంచములో బంధింపబడిన వ్యక్తివే. ఈజననమరణరూపకసంసారచక్ర మున కెప్పుడూ కట్టబడియే యుందువు; అది నిన్ను పైకి క్రిందకు తీసుకొనిపోవుచు నీచుట్టూ తిరుగాడుచు నిన్ను నలి నలి చేయుచూ ఉండును నీ వెన్నడు విశ్రాంతినిగాని, శాంతిని గాని కనుగొనలేవు

దీని నెవడు వదలించుకొనునో వాడు తనలోనే ద్రష్టా దృశ్యములు రెంటిని కనుగొనును. ఆచార్య జాన్సన్ వలెనే మనకును, మనమే స్వప్నమందలి దృష్టాదృశ్యముల మను అనుభూతి ఎన్నడు కలుగునో అప్పుడు మనము స్వతంత్రులము. ప్రపంచము నాశరీరము. యావత్తు ప్రపంచము నాశరీరమేనని చెప్పగలిగినవాడు పునర్జన్మనుండి ముక్తుడగును. వాడెక్కడికి పోగల్గును? వాడెక్కడికి రాగల్గును? అతనిచే ఈవరకే వ్యాపిం పబడని ప్రదేశ మెక్కడా లేదు. అతడు అఖండుడు. (అనం తుడు). అత డెక్కడికి పోవును? ఆత డెక్కడి కొచ్చును?

ప్రపంచ మాతనిలో నున్నది. ఆతడు ప్రభువులకు ప్రభువు; పునర్జన్మనుండి ముక్తుడు. తూర్పిండియాలో తల్లిపాలతోపాటు ప్రతివాడు లోనికి పీల్చుకొను కోరిక — తన కట్టి యనుభూతి కలిగి జనన మరణములకు లోబడకుండ యుండవలె ననియే; తాను ముక్తుడై దేవ - చైతన్యముతో పూర్ణానందము నొంద వలెననియే.

మిల్టన్ జీవితములో అతని భార్యగానుండిన స్త్రీని గూర్చిన చక్కని కథకలదు. ఆమె స్వప్నములో తన భర్తను చూచెను. ఆమె హృదయము ఆయుసకై కొట్టుకొనుచున్నట్లు చూచెను ఆమె ఆయనను కౌగలించుకొని నాప్రభూ! నేను పూర్తిగా నీదాన నని చెప్పెను. అక్షణములోనే ఆమె మేల్కాని తన పక్కలోనే పండుకొనియున్న కుక్క యొకటి దాని శరీర మును తన కేసి వొత్తుటను చూచెను. ఆకుక్క పక్కలోనుండి క్రిందకు దూకెను. ఆమెకు స్వప్నములో తన ప్రభువుగా తన భర్తగా కనబడినది ఆకుక్క వొత్తిడియే. ఆకుక్క తనశరీరము నింకను అధికముగా ఒత్తియుండ నేని, ఆమె తన గుండెపై పెద్ద హిమాలయ మెుట్టి పడిన దని తలచెడిదే. అవిద్యయనునట్టి— మాయ యనునట్టి కుక్క ని న్నెంతవరకు క్రిందకువొత్తు చుండునో, అంతవరకు నీ స్వప్నము లెప్పుడు మంచినుండి చెడుకు, చెడునుండి మంచికి మారుచుండును. కొన్నిసారు లొక పెద్ద హిమాలయము, కొన్ని సార్లొక భర్త నిన్నొత్తు చునేయుండును; అని వేదాంతము చెప్పుచున్నది. కన్నిటికి చిరు నవ్వుకు మధ్య ఊగుచునే యుందువు. ప్రపంచము నీ గుండెపై

ఎంతో బరువుగానే యుండును నీకు విశ్రాంతి యుండదు; ఈ అవిద్యయను, అజ్ఞాన మను ముసుగును పారద్రోలుకొనుము; నిన్ను నీవు సర్వశక్తియుతు డగు దేవునిగా చేసికొమ్ము. అదిగా చేసికొనుము. అదిగా గుర్తించుకొనుము. అప్పుడు నీవు స్వతంత్రుడ వయ్యెదవు.

* ఒక వేయివేషాలతో నన్ను నీవు
విభ్రమపెట్టించ యత్నించవచ్చు,
కాని సర్వప్రియా! నిన్ను సరాసరిగ
గుర్తింపగల నోయి గుర్తింపగలను
చిత్ర విచిత్రపు తెరలచాటునను
నిముసాల మాటిదా చినగాని
సర్వమయా! నిన్ను గుర్తింతు సరిగ.

---

ఈగీతానువాదం శ్రీ కేశవతీర్థస్వామిది.

## కొన్ని ప్రశ్నలకు సమాధానములు

గోల్డెన్ గేట్ హాలు, ఆదివారము జాన్యువరి 25, 1903.

పరిణామశీలము లగు స్త్రీ పురుష రూపములలో నున్న సనాతన తత్త్వమా!

ప్రశ్న :—చిన్నబిడ్డ లేల చచ్చుచున్నారు ?

( ఈ ప్రశ్నలను వివరముగా చర్చించుటకు వ్యవధి లేదు; సమాధానములను కేవలము సూచించి వదలివేయుదము.

ఉత్తరము :—ఇచట ఎవరో వ్రాసిన పుస్తకమున్నది. ఇం దెన్నో ఇంగ్లీషు ఘట్టము లున్నవి; కొన్నిచోట్ల సంస్కృత శ్లోకములు, ఘట్టములు ఉదాహరింపబడినవి; సంస్కృతము వ్రాయుటకు, ఇంగ్లీషు వ్రాయుకలమునకంటె భిన్నమైన కలము కావలె నని మన మెఱుగుదుము కదా! కాన ఒక గ్రంథకర్త ఇంగ్లీషు వ్రాయునప్పుడు ఆతడొక రకపుకలము నుపయోగించును. సంస్కృతము వ్రాయునప్పుడా కలమును మార్చుకొనును. అటులనే నీ వీ ప్రాపంచిక దేహమునం దున్నంతసేపు, దానిని నీవు కలము నుపయోగించుకొని నట్లే ఉపయోగించుకో వచ్చును. నీ అవసరముల నది తీర్చునంత కాలము నీ వీ దేహమును నీ చేతులలో నుంచుకొందువు, నీవు దీనిని కలిగియుండి దానిపై అధికారము వహింపవచ్చును. శరీరము ముసలిదైనప్పుడు, అది రోగగ్రస్తము అయినప్పుడు, అది నీ కక్కరకు రాదు; దాని నప్పుడు నీ వావల పారవైతువు: బట్టలు పాతవై

పోయినప్పుడు వాని నావల బారవైచి క్రొత్తవి గ్రహించి నట్లే నీవు పురాతన శరీరమును గ్రహింతువు; కాన దానిలో భయంకరమైన దేమియు లేదు. అది స్వాభావికమే

బిడ్డలేల చచ్చెదరు? వివిధరకములైన వాంఛలుగల వాడొక డున్నాడనుకొనుడు; ఒక ప్రత్యేకరకపు వాంఛలు మరొక ప్రత్యేకరకపు వాంఛలుగా మారు సమయము ఎప్పుడేని తటస్థించును. ఉదాహరణకు, ఒకడు అమెరికాలోని ఒక పట్టణములో బహుకాల ముండు ననుకొనుము; ఆతని అంతర్గత కోరికలను, వాలకములను మార్పుజేయు నట్టి సాహిత్యమును, గ్రంథములను ఆతడు చదువు ననుకొనుడు ఆతని అంతర్భావనయములో ఆతడు పాక్దేశస్థుడుగా, హిందువుగా పెరుగ ననుకొనుడు; తన బాహ్యవాంఛలనుండి అంతర్గత ఉద్దేశములు, వాంఛలు పూర్తిగా భిన్నములై పోవుదాక ఆతడు అమెరికన్ వ్యవహారములలో నిమగ్నుడై యుండు ననుకొనుడు అప్పుడిక నాతడు అమెరికాకు చెందడు; ఆత డిండియాకు చెందును ఆత డిండియాలో పుట్టవలసినదే. కాని తన కిష్టమైన ఒక భాగ్యవంతునితో కలసి యుండవలె నని కూడ ఆతనికి కోరిక యున్న దనుకొనుము శాన్‌ఫ్రాన్సిస్కో మేయరుతోడనో లేక మరొక గొప్పవ్యక్తితోడనో సహవాసము చేయవలయు నను ఈకోరిక, ఇండియాలో పుట్టవలయునను కోరిక యంతటి బలిష్ఠము కాదు. ఈ మొదటికోరిక, రెండవ కోరికకూడ పూర్తిగావలసియున్నవి; దీని నెట్లు నిర్ణయించవలెను? ఆతడే గొప్పవ్యక్తితో కలసి యుండవలెనని కోరునో ఆ కోరిక తీవ్ర పరిస్థితు లాతనికి చిక్క-

వనుకొనుడు; కాన ఆతడు చనిపోయి తిరిగి ఏ మేయర్సుకో లేక ఆతని నాకర్షించిన మరొక గొప్పవ్యక్తికో పుత్రునుగా పుట్టును; ఆ మనుష్యునితో ఆత డేర్పరుచుకొదలచిన సంబంధము పూర్తి యగువఱకు ఆతడు అచటనుండి తదుపరి చని పోవును. ఇక ఇప్పు డాతడు ఇండియాలో పుట్టవలె; బాకీవున్న కోరికల తీర్చుకోవలె. అందుకూ పిల్లలు పోవునది.

ఎవరో ఒకరు తనకు తల్లిగానో, తండ్రిగానో నుండవలె నను కోరిక, ఇంగ్లీషులో వ్రాసిన బృహద్గ్రంథములోని యొక సంస్కృత పంక్తివంటిది. పూర్తిగా విదేశభాషలలో వ్రాయ బడని పుస్తకములలో ఉదాహరింపబడిన పంక్తుల (Lives of reference ) వంటివారు పసితనములో పోవుబిడ్డలు.

ప్రశ్న : మంచి చెడుగుల సరిహద్దును నిర్ణయించుము.

ఉత్తరము:— ఒక నిచ్చెన యున్నచో పైకిపోయినచో మంచి, క్రింద కొచ్చినచో చెడుగు.

గణితశాస్త్రములో పరస్పర సహకారము చేసికొను స్వయంసిద్ధ సూత్రము (Co-ordinase oxiouns) లున్నవి. అందులో ఈసూత్రము అర్థవంత మనిగాని, ఈసూత్రము వ్యతిరేకార్థవంతమనిగాని ఖచ్చితమైన నిర్ణయ మొకటిలేదు. అర్థవంత, వ్యతిరేకార్థవంతశబ్దములు సాపేక్షకములు (relative ).

అటులనే వేదాంతము ప్రకారము మంచి చెడుగులు సాపేక్షకములు. ఇచట చెడుగు అంత మొందుచున్నది. ఇచటి మంచి బయలుదేరును అని చెప్పుటకు ఏ లగుస్థాన మొకటిలేదు.

గణిత శాస్త్రములో "క" క్రమముగాగల రేఖ యొక్క టున్నదనుకొనుము. ఒక బిందువుయొక్క చలనము ఒక వైపునకైనచో అది అర్థవంతమన బడును. మరొక అనగా దానికి విరుద్ధమైన వైపునకైనచో అది వ్యతిరేకార్థవంత మన బడును. కాని ఆబిందువుయొక్క స్థానమునే వ్యతిరేకార్థవంత (negative) దృక్కోణముతో అర్థవంతమనియు, అర్థవంతమగు దృక్కోణములతో వ్యతిరేకార్థవంత మనియు అనవచ్చును. అటులనే నీవు ఊర్ధ్వముఖముగ ముందడుగు వేయుచున్న నీవు ఒక ప్రత్యేకవిధమైన పనివలన సత్యమునకు దగ్గరగా చేరు చున్నచో అప్పుడది మంచియగును. ఒకానొక విధమైన పని వలన నీవు సత్యదూరుడ వగుచున్నచో నీ కా పని విషము వంటిది. వైవాహిక సంబంధమువలన నీవు విశ్వప్రేమకు, విశ్వ శాంతికి దగ్గరగాచేరుచున్నచో వివాహబంధములు నీకు పవిత్రములు. వైవాహిక సంబంధమువలన నీవు విశ్వప్రేమకు విశ్వశాంతికి దగ్గరగాచేరుచుండకపోయినచో అవి నీకు విష సమానములు, పాపయుతములు, వివాహబంధములు నీకు శాప భూతము లగును.

వేదాంతముప్రకారము ప్రతివాడు ఈపశుప్రవృత్తులలో గుండ పోవలసినదే. ఇది కర్మ సిద్ధాంతము. ఉత్క్రాంతి వాదము జను లందరు ముందుకే అభ్యుదయమువైపునకే సాగు చున్నారు.

క్రొత్తగా పశుదేహమునుండి వెలువడి నర దేహములోని కడుగు పెట్టిన జనులు కొందరున్నారు, వారిలో

తప్పక పశుప్రవృత్తులు బలిష్ఠములుగా నుండును. వారు కొద్ది కాలము క్రిందటనే తోడేళ్ళు, పులుల, కుక్కల, అడవిపందుల దేహముల నొదలినా రన్నమాట. కాన వారిలో అకోరికలు మెండుగా నుండును. ప్రకృతిశాస్త్రనియమము ప్రకారము ప్రతివస్తువ సమచలనముతో, సమరేఖలో వర్తించును.

ఆ నియమమేగాని ఈ లోకములో లేకున్న, లోకము చీకాకగును; ఆ నియమమును తీసివేయకున్నచో, ఏ జనులు పశువులనుండి వచ్చినారో ఆ జనులు పశుప్రవృత్తినే కలిగి యుండవలెను. ప్రవహించుచున్న నదులను ద్వేషింపనక్కర లేనట్లే, మన మీ జనులను దూషింప నక్కరలేదు. వారిని మనము పాపులని తక్కువగా చూడనక్కరలేదు. కోపిష్టులు, అసూయపరులు అని మన మెవరిని అనుచున్నామో వారిని ద్వేషించుటకు మనకు హక్కులేదు. ఈ పాపులనబడు వారిని ప్రేమించుటకు మన కధికారమున్నది. పాపిని ప్రేమింపుడు; అని జీసస్ అనుచున్నాడు. వారి ననమానపరచుటకు తగిన కారణ మేమీలేదని వేదాంతము చూపుచున్నది. పాపులుగా నుండుట వారికి స్వాభావికము.

ఈ జనులు తమకు లక్ష్యముగా నుంచుకోవలసిన దేమిటి? వారు అభ్యుదయము చెందవలె; లోకములో నున్నది పైజెప్పిన ప్రకృతి నియమమొక్కటియేకాదు; వారు ప్రాణవంతులేని, వారా జడత్వ నియమము నతిక్రమింపవలె.

ప్రారంభిక జడత్వములో మార్పునుదెచ్చుదానినే శక్తి యనెదము. ప్రారంభిక సంచలన మార్గము (Original line of

Force)ను మార్చునదే శక్తి లేదు, ప్రాణము లేదు. ఇప్పుడీ జనులు ప్రాణవంతులుగా తలపబడగోరెదరేని, వారిలోని జీవశక్తి ప్రదర్శింపవలె; తమను తాము ఉద్ధరించుకోవలె, తమలోని శక్తిని మార్పుచేసికొని ఆ మార్పుచేసికొనిన ఆధ్యాత్మికశక్తి ద్వారా తమ స్వాభావికశక్తినిగూడ పూర్తిగా మార్పుచేసికోవలె, ఇచట "స్వాభావిక"మను శబ్దము ఉపయోగింపబడినది. ఈ శబ్దము ఎన్నోవందలమందిని, వేలమందిని తప్పుత్రోవన లాగుచున్నది; కాన దానిని సరిగా బోధపరుచుకోవలెను. 'స్వావిభాక'మను పేరిట యెన్నో తప్పులు యెన్నో దుర్మార్గములు చేయబడుచున్నవి.

మనస్సులో రేగు జంతుప్రవృత్తులు, వాంఛలు, అన్నియూ స్వాభావికములే నని కొందరెంతురు; "ఇంద్రియ ప్రవృత్తులను మనగుర్రముల నొదలివేతము, మన నిజనడతను అదుపులో పెట్టు కళ్ళెముల నొదిలివేయుదము; మనము స్వతంత్రులము కావలెను." అని వారందురు, కాని ఈ స్వాతంత్ర్యమనగా ప్రాపంచికమగు పశుజీవితమే కాని మరేమియూ కాదు

పిల్లలాడుకొను కారొకటి చాలవేగమున పోవుచున్నదనుకొనుము. దానిని లాగివేయుట మానుము; అప్పుడా కారు దానంతటఅదియే కొంతదూరము పరువెత్తును. ఎందుచేత? అటుల పరువెత్తుట కారుకు స్వాభావికముగాన, దాని శక్తి లేక ఉద్వేగము దానిని ఇంకా ఇంకా ముందునకు పొమ్మనినది; గావున అది స్వాభావికము, స్వాభావికమనగా జడత్వమే (Inertia) జడత్వమూ కారుకు ఆ తీరున పరుగెత్తమనినది.

ఒక రాతిని గాలిలోనికి విసరివైచినప్పుడు ఇంకా ఇంకా కదలి పోవును; దానికి కారణము జడత్వమే. తన శక్తివలననో, లేక ఉద్వేగమువలననో పిల్లవానిబొంగరము గుండ్రముగ తిరిగి పోవుచుండును; గుండ్రగుండ్రముగ తిరిగిపోవుట దానికి స్వాభావికము.

అటులనే; నీవు పశువుల శరీరములం దున్నప్పుడు ఒక ప్రత్యేక దిక్కునకు పరువెత్తుచుంటివి. పశువుల దేహములం దున్నప్పుడు, పశుప్రవృత్తుల పూర్ణము చేసుకొనుటకు జనులు ప్రాకులాడినది స్వాభావికమే. అప్పుడీ చెయిద్యములు నీకు స్వాభావికమునే తోచి, నీకవి తగిపోయియుండెను. ఆ క్రియల వలన, కోరికలవలన, నీవు ఉన్నతి చెందుచుంటివి. నీకా క్రియలు కోరికలు మంచివే నాయెను. వాటిద్వారా నీవు పైకిలేచి, అవసరమైన జ్ఞానము నార్జించితివి.

కుక్కచేష్టలు చేసినందులకు కుక్కను పాపియనవలెను. అడవిపంది చేష్టలు చేసినందులకు అడవిపందిని పాపి యనకుము.

నరదేహములోనికి వొచ్చినప్పుడుకూడ, పశుదేహములలో నున్నప్పటికి అలవాటు ప్రకారము పశువాంఛలు, పశుఇచ్ఛలు, పశుసంస్కారములు కలిగియుండుట స్వాభావికమే. ఇప్పుడు నరదేహమున్నది. ఈ కర్మలు స్వాభావికముగా సంభవిల్లినవి. అవి నీలోని జడత్వమువలన కలిగినవి. పూర్వము పశుదేహము లలో నున్నప్పటి స్వాభావిక కర్మలవలన వచ్చినవి. కాన, స్వాభావిక మను శబ్దమునకు జడత్వ మను అర్థముతప్ప మరొక

అర్థము లేదు కాని జడత్వము నీకు నీ నిజస్వభావమును ప్రదర్శించు వస్తువు కాదు. నీలోని మృతసత్త్వులను చూపించు నది. అది దివ్యత్వమును ప్రదర్శింపదు

ఈ జడత్వమును జయించి, దానిపై కెగసినప్పుడే నరుడు నిజమైన నరుడు ఈ పశువాసనలు, ఉద్రేకములు పశువులకూ, క్రొత్తగా నరదేహములోనికి వచ్చినట్టివారికి స్వాభావికములు. ఆకోరికలవెంట పరువెత్తుటకు వారికి స్వాతంత్ర్య మున్నది. కాని కొంతకాలము తరువాత వారు వానిని వదలివేసి, వానిపై కెగసి, వాని కతీతులు కావలెను.

ఇట సందర్భోచితమైన యొక కథ వినుము. తూర్పిండి యాలో తులసీదాసను పేరుగల ఋషియొకడుండెను. ఆయన రామునిపూర్వీకుడు. ఆయనకు భార్యయనిన ఎంతో ప్రీతి. అంతకు ముందెన్నడూ ఎవరూ ప్రేమించని విధమున ఆయన తనభార్యను ప్రేమించెను. ఆయన ఊరికి ఏడెనిమిదిమైళ్ల దూరములో నున్న మరొక ఊరిలోనున్న పుట్టింటికి ఒకసారి ఆయన భార్య వెళ్లుట తటస్థించెను. ఋషి ఆ ఎడబాటును సహింప లేక పోయెను. తన ఇంటి నొదలి ఆమె నన్వేషింప బోయెను. రాత్రి 11 గంటల కాతడు తన భార్యవెళ్లిన సంగతి తెలుసు కొనెను. కాని ఆ ఆదుర్దాలో ఉన్మత్తునివలె తన ఇంటినుండి పరువెత్తెను. రెండుగ్రామములకూ మధ్య నది యొకటుండెను. నదియొక్క తీవ్రప్రవాహమువలన అంతటి రాత్రివేళ ఆనదిని దాటుట ఎంతో కష్టముగ నుండెను. కాక అప్పుడెవరూ తోడు లేరైరి. నదిఒడ్డున అతనికొక కళ్లుచున్న శవము కానవచ్చెను.

కాని తన ఉన్మత్త ప్రేమచే, భార్యను చేరుకోవలె నను తొం దరలో, ఆ శవమును గట్టిగా వాటేసుకొని, నది నీదుకొని సురక్షితముగా ఆవలియొడ్డుకు చేరెను. అతడు రొప్పుచూ పరు వెత్తి భార్యఉన్న ఇంటినిచేరుకొనెను. కాని తలుపు లన్ని వేసిఉండుటచే లోనికి పోలేకపోయెను. లోపలిగదులలో ఎక్క డనో నిదురపోవుచున్నందున నౌకరులనుగాని, లోపలున్న వారినిగాని లేపలేకపోయెను. ఇక నాత డేమిచేయవలెను? నదిఅడ్డమున్న ప్రేమ దానినిదాటును; కొండ లడ్డమున్న ప్రేమ దానినెక్కును. అని యనుట మీరెరుగుదురు కదా! కాన ప్రేమ రెక్కలపై అతడు భార్యను చేరుకోవలె కదా! ఏమి తోచక బుర్రను కలతపెట్టుకొనుచుండ, అతనికి ఇంటిపై ఏదో వ్రేలాడుచుండుట కానవచ్చెను. తన నెంతో ప్రేమించి, తాను పై కెక్క ఇంటిలోనికి రాగలందులకు తనభార్య ఏదో వ్రేలాడ వేసినదని అతడు తలచెను. అతని సంతసమునకు మేర లేక పోయెను. ఈ త్రాడు నిజముగా త్రాడుకాదాయెను. అదియొక పొడుగాటి పాము. అత డా పామును పట్టుకొనియే ఇంటి పై అంతస్థున కెక్క తన భార్య పండుకొనియున్న గదిలో ప్రవే శించెను. ఆమె లేచి ఆశ్చర్య విభ్రాంతయై ఇట్లనెను. "మీ రిచటి కెట్లు వచ్చితిరి, చాల వింతగానున్న దే." అయనానందభాష్ప ములగార్చుచు, ఇట్లనెను, "ప్రియా, నే నిక్కడికివచ్చు మార్గమును కష్టరహితముగా చేసినది నీవే. నేను నదిని దాట గలందులకు నీవు దానియొడ్డున ఏదోపథమైన తెప్ప నుంచ లేదా! నేను పై కెక్క గలందులకు గోడపై ఆ త్రాటిని వ్రేలాడ

వేయలేదా?" ఆత డున్మత్తుడువలె నుండెను; ప్రేమ యాతని పిచ్చివానిగా జేసెను. భార్య దయతోడను, సంతోషము తోడను బాష్పముల కార్చసాగెను. ఆమె పండితురాలు; దివ్యజ్ఞానపుదేవత, అందుచే ఆమె ఇటు లనెను. "ఓ దివ్యుడా! ఓ ప్రియతమా! నా శరీరములో అంతర్గతముగనుండి, దానిని నిలబెట్టుచున్న దాని కాధారముగ నున్న సత్యముపై, దివ్యత్వముపై, మీ కింతటి గాఢప్రేమను కలిగియున్నచో మీరు దేవుడు కాగలెడివారే; ప్రపంచములోని కెల్ల గొప్ప ప్రవక్త కాగలెడివారే; పృథ్విలోనికెల్ల గొప్ప ఋషి కాగలిగెడి వారే; ప్రపంచమున కంతటికి ఆరాధ్యముగు దేవత కాగలెడివారే."

ఈ దివ్యత్వభావమును ఆతనిలో జాగృతముచేసి, తానూ దివ్యత్వమూ ఒకటే నని ఆతనికి బోధించునప్పుడు ఆమె ఇటు లనెను, "ఓ ప్రియమగు ప్రభూ! నీ వీ నా శరీరమును ప్రేమింతువా? ఇది నశ్వరము; అది నీ ఇంటినొదిలి ఈఇంటి కొచ్చెను. ఇదేవిధముగ ఈ శరీరము కే రోగము నొదల వచ్చును చే డీ శరీరము రోగగ్రస్తమై తన అందము నూతనతా ఒక్క క్షణములో పోగొట్టుకొనవచ్చును. నా చెక్కిళ్ళకు స్ఫూర్తి నిచ్చున దేమిటి? నా కండ్లకు కాంతి నిచ్చున దేమిటి? నా వ్యక్తిత్వమునకు హుందా నిచ్చున దేమిటి? నా కండ్లలో ప్రకాశించున దేమిటి? నా ఈ వెంట్రుకలకు బంగారు కాంతి నిచ్చునది, నా ఇంద్రియములకు శరీరమునకు, ప్రాణమును, ఓజస్సును, ఉత్సాహమును ఇచ్చున దేమిటి? నిన్ను విముగ్ధునిగా చేసినది నా ఈ తోలుకాదు; నా ఈ దేహముకాదు

చూడుడు; మరి అదేమిటి? అది నిజమైన ఆత్మ; ఆత్మే నిన్ను ముగ్ధునిగా చేయునది, ఆకర్షించునది. నాలోని దివ్యత్వమే అటుల చేయునది, మరొకటికాదు; అది దేవుడే; వేరొండు కాదు. నాలోని ఆ దివ్యత్వమే నాలోని ఆ దేవుడే; మరొకటి కాదు. ఆ దివ్యత్వము ననుభవింపుము, ఆ దివ్యత్వమును సర్వత్ర గాంచుము. ఆ దివ్యత్వమే, ఆ దేవుడే నక్షత్రములలో నుండి, చంద్రునిలోనుండి నిన్ను తొంగిచూచుట లేదా?

ఈ ఋషి ఇంద్రియ వాసనలను, పశువాంఛలను, ప్రాపంచిక సంబంధములను అతిక్రమించెను. మొట్టమొదట తన భార్యపై ఎంతో ప్రేమతో నుండిన ఈఋషి ఆ ప్రియతముని, ఆ దివ్యత్వమును, ప్రపంచములో సర్వత్ర దర్శించెను. ఈ ఋషి, ఈ దైవభక్తుడు, దివ్యత్వమును తనివిదీర త్రాగిన ఈ పవిత్రుడు, ఈ శుద్ధుడు, ఒకనాడు అరణ్యములలో తిరుగుచుండగా, చేతిలో గొడ్డలి నుంచుకొని సుందరమైన తమాల వృక్షము నొకదానిని నరకనున్న యొక మనుష్యుని చూచెను. సుందరమైన ఆ తమాలవృక్షపు మ్రానిపై గొడ్డలిపెట్టు పడుటతోడనే, ఋషి మూర్ఛపోసాగెను. ఆయన నా మనుష్యుని వద్దకు పరుగెత్తిపోయి ఇటు లరచెను; నీ దెబ్బలు నన్ను బాధపెట్టుచున్నవి. అవి నా గుండెను చించుచున్నవి; దయచేసి ఇది ఇటుల చేయకుము." "అదేమిటి ఋషీ" యని వా డడిగెను ఋషి ఇటు లనెను; "అయ్యా, ఈ తమాలవృక్షము ఈ సుందరవృక్షము నా ప్రియ తమము; అందులో నేను నిజమైన

దివ్యత్వమును చూచుచున్నాను. అందులో నేను దేవుని చూచు చున్నాను."

ఇప్పు డిక ఆయనకు దేవుడే భార్య అయ్యెను. దేవుడే ఆయనకు బిడ్డగా, తల్లిగా, సోదరిగా, సర్వస్వముగా నాయెను. ఆతని శక్తియంతయు, ఆతని ప్రేమయంతయు, దివ్యత్వపు పాద పీఠముపైననే సమర్పింపబడెను. దివ్యత్వమునకే, సత్యమునకే, అర్పింపబడెను. కాననే ఋషి ఆ మనుష్యునితో ఇట్లనెను. "అచట నేను నా ప్రియతముననే చూచుచున్నాను; నా ప్రియ తమ మగు దివ్యత్వముపై నేను దెబ్బలు పడుట భరింపలేను."

ఒకనా డొక మనుష్యుడు ఒక లేడినో దుప్పినో చంప బోవుచుండుట ఋషి చూచెను; ఆయన పరుగెత్తికొచ్చి ఆ మనుష్యుని పాదముపై సాష్టాంగపడెను. "ఇదేమిటి, ఋషీ," యని ఆ మహాత్ము డడిగెను. ఆయన ఇట్లనెను "దయచేసి ఈ లేడిని రక్షింపుము. దాని సుందరనేత్రములగుండ తొంగిచూచు చున్న నా ప్రియతముని చూడుము. నా ఈ శరీరమును చంపుము. దివ్యత్వముపేరిట నా ఈ శరీరమును ఆహుతి చేయుము. దేవునిపేరిట నా శరీరము నాహుతి యిమ్ము; నేను సహిం చను కాని, దయచేసి నా ప్రియతముని వదలుము."

ఈ ప్రపంచములో నీవు చూచునట్టి ఆకర్షణీయమైన దంతయు నిజమైన దివ్యత్వమే; ప్రియుని శరీరమందు కానవచ్చు నట్టి వస్తువే వృక్షములలోను, పర్వతములలోను, గుట్టలలోను భిన్నమగు వేషమును దాల్చును. దానిని గుర్తెరిగిన నీవు ప్రాం ధిక వ్యక్తికములను, ఇచ్ఛలను జయించగలవు; ప్రాపంచికేచ్ఛ

లను ఆధ్యాత్మికోపయోగమునకు ద్రిప్పుటకిదియే మార్గము; వాటిని వాటి కొఱకే ఉపయోగించుటకుకూడ ఇదియే మార్గము. మీరు మిమ్ములను ఆధ్యాత్మికముగా ఎందుకూ పనికిరానివారుగా, పాపులనుగా చేసికొనుచున్నారు కాని ఈ ప్రాపంచికేచ్ఛలనే సక్రమముగా ఉపయోగించి ఉన్నతములుగా చేసికొందువేని ఆ పనులే పుణ్యకర్మలగును.

ప్రశ్న :— మన మసంపూర్ణమునుండి పూర్ణమునకు పోవుచున్నామని ఉత్క్రాంతివాదము చెప్పుచున్నదే; అది పునర్జన్మను ఋజువు చేయుచున్నదా?

ఉత్తరము :— అటువంటి పునర్జన్మ మొదటినుండియు అగ్రగామియే; ఒక మనుష్యుడు రేపే కుక్క అగునను అది వెనకడుగు కాదా. ఒక మనుష్యుడు అడవిపంది అగునని సిన్న చెప్పిన ఉదాహరణ కల్పితము; ఒక పక్షమునుమాత్రమే గ్రహించి అటుల చెప్పితిమి: కాని దాయొక్క పెద్ద ప్రశ్నను తీసికొనునప్పుడు మన మన్నిభాగములను గ్రహించవలెను.

విద్యార్థులకు ద్వైనమిక్సునుగూర్చి బోధించునప్పుడు మొదట వ్యాపార ప్రతివ్యాపార సూత్రము నొక్కదానినే తీసికొందుము. ఇతర సూత్రములను అప్పుడే లేనట్లే ఎంతుము; తదుపరి డైనమిక్సును ఇంకా బోధింపవలసినప్పుడు తక్కిన సూత్రముల గ్రహింతుము; కాన రాత్రికాలము లేమి ఒక ఫలకమునే గ్రహించితిమి ఈ ప్రశ్న తక్కిన పక్షములను గూడ విచారించ మనుచున్నది.

ఈ రోజొక మనుష్యుడు వెనుకకుపడుటకు ప్రయత్నించ వచ్చును క్షుద్రజంతు జీవితము గడుపుటకు తనకు చేతనైనంత ప్రయత్నము చేయవచ్చును ఆతను తనమనస్సునుండి ఉన్నతము లైన, సున్నితములైన భావముల నన్నిటిని పారద్రోలుకొనుటకు ప్రయత్నింపవచ్చును; ఆతడు నిజముగా తననొక కోతినిగా చేసికొనగలిగె నేని, తన వాసనల నన్నిటిని క్షుద్రజంతువాసన లుగా చేసికొనగలిగెనేని, తననొక పశువుగాచేసికొనునేని, ఆతడు రాబోవు జన్మలో తప్పక కోతిగా పుట్టును. కాని మనుష్యు డటుల చేయలేడు ఆగని యటుల చేయకుండ అడ్డుపెట్టు ఇతర శక్తులు గలవు. అవి యేమిటి? దుఃఖము, విపత్తు, కష్టము అనునవే ఆతని పతనమున కడ్డంకులు ఈ శక్తులు నిన్ను అధో గతిని పడనీయవు: అటుల ప్రగతి సురక్షితము చేయుబడుచు న్నది. ఉత్క్రాంతియొక్క జీవితము ప్రగతియే, ప్రగతి సాగ వలసినదే, నిత్యపోరాటము నిత్యయుద్ధము అవసరములే.

ఈ కష్టములు, బాధలు, దుఃఖములు, అదుర్దాలు, విప త్తులు, విచారములు ఇవన్నియు మీ హృదయములను చీల్చి వేసి, మీ మనస్సులలో భయంకరయుద్ధము చేయునప్పుడు మీ శరీరములలో జరుగుపోరాటము మిమ్ము ప్రగతి నందిం చును. అని వేదాంతము అనుచున్నది. ఈ శక్తులద్వారానె మీరు ముందుకుపోవలెను. ఇచ్ఛల పరస్పర పోరాటమువల ననే ఈ యుద్ధ మొచ్చుచున్న దని నిన్న చూపబడినది.

కొన్ని పరిస్థితు లొకమనుష్యునికి సుఖ మీయవచ్చును. మఱొకనికి కష్ట మీయవచ్చును. నెలకు వేయిడాలర్ల జీతము

పొందువాని జీతమును 500 కు తగ్గింపబడెనేని, ఆ 500 వాడికి కష్టమును, చింతను ఇచ్చును. నెలకు 100 డాలర్లు జీతము పొందువానికి నెలకు 500 డాలర్లు ఇచ్చెనేని, వానికది స్వర్గ తుల్యమగును. వానికి శాంతిని, సంతోషమును, ఆనందమును ఇచ్చును. కాన ఏపరిస్థితియు నిజముగా మంచిదియుకాదు; చెడ్డదియుకాదు, ఏకర్మయు దానంతట అదియే వస్తుతః పాప కర్మగాని, పుణ్యకర్మగాని కానట్లే, స్థితిగతులుకూడ వస్తుతః మంచి వనిగాని చెడ్డవనిగాని వుండవు. బాహ్యపరిసరములకు పరిస్థితులకు నీకూ ఉండు సంబంధముపై అంతయు ఆధారపడి యుండును. ఈస్థితి అభ్యుదయోన్ముఖమైన నీకు సంతోష ముండును. లేదా దుఃఖము బాధనీయంతు కాన యీకోర్కెలు వివిధ తెరగు లవై యున్నందున, నీ అభ్యుదయమును తోడ్పె చ్చును అవి పూర్వజన్మలవలన తేబడినవిగాని వాటినుండి వచ్చి నవిగాని కాదు. ఈ జడత్వము జయించమని నిన్ను కోరు కోరిక లివి. జడత్వము బలపడిపోయి, ఆధ్యాత్మికశక్తి బలహీనమయ్యె నేని నీవు బాధపడెదవు, ఈదుఃఖము, ఈబాధ, ఒకవిధమైన ఆధ్యాత్మికమగు జ్ఞాపక కారి. ఈదుఃఖము, ఈబాధ నీకు నీ ఉన్నతస్వభావమును, జ్ఞప్తి చేసి నీ ఆధ్యాత్మికజాడ్యమును నయం చేయుచున్నది. దుఃఖబాధ లీ జగత్తులోని వరములు. బాధగాని దుఃఖముగాని లేకపోయిన ప్రగతియే లేదు. ఈ దుఃఖమాత్రము వలననే నీ పతన మాపబడుచున్న దని వేదాంత మనుచున్నది. అధోగతిలోనికి లాగబడుదుననిగాని, పతితుడవౌదువనిగాని నీ వెన్నడు తలపవద్దు

ఎవరైన నీకన్న ఎంతో పైముందున్నచో అసూయపడవద్దు; ఎందుకన, ఏదోయొకరోజున నీవే ఆస్థితిలోనుందువు; ఎవరైన నీకంటె ఎంతో క్రిందస్థితిలో నున్నవానిని లోకువగా చూడవద్దు, ఎందుకన వాడెప్పుడో ఒకప్పుడు నీస్థితికొచ్చును. నీవు పదిజన్మలక్రిందనున్న స్థితిలో కొందరీనాడున్నారు; నీవు పదిజన్మలతర్వాత నుండబోవుస్థితిలో కొందరీనాడున్నారు. కాన నీకందరిపై విశ్వప్రేమయుండవలె, దేనినిగాని, ఎవరినిగాని లోకువగా చూడబోకు. ఉచ్ఛస్థితిలోనున్న ఎవరినీచూచి అసూయచెందకు; తగు సమయము వచ్చునప్పటికి నీవే ఆస్థితిలో నుందువు; ఇటుల వేదాంతము సక్రమబోధద్వారా విషయముల నవగాహనము చేసికొనును.

ప్రశ్న:— బాధయను నియమముద్వారానే (Law of Pain) మనము ముందడుగు వేయవలసియున్నచో, పారంపర్యవాదమందేమైన సత్యమున్నదా? పిల్లలు తమ తల్లిదండ్రుల ప్రత్యేక రోగములవలన బాధపడుచుందురు. దీనిని మన మెట్లు సమన్వయము చేయగలైదము?

సమాధానము :— మనమే మన తల్లిదండ్రుల స్రష్టలమని నిన్న చెప్పినాము కదా! ఒకప్రత్యేకరకపు రోగము గలవాడొకడున్నాడనుకొనుడు. జనులు చెడురోగములను వానిలో అదియొకటని అనుకొనుదురు. నిజముగా "చెడు" అనునది తారతమ్యాత్మకము. ఎందుకన సర్వమూ దేవుడే. కాని ఇంద్రియలోలత్వమార్గములో నడచుటవలన వచ్చినరోగమిది. పశుప్రవృత్తుల నవలంబించుట వలన, వాసనలను, తుచ్ఛ

కోరికలను అనుసరించుటవలన వచ్చిన రోగమిది. ఈ మను ష్యుడు మరణానంతరము ఈ కోరికలు ఫలించుట కనుగుణ్య మగు యీ కోరికలు కనబడుటకు వీలగునట్టి ప్రత్యేక క్షేత్రమును, పరిస్థితులను పరిసరములను ఏరుకొనును.

ఆధ్యాత్మిక సన్నిహితత్వ సూత్రప్రకారము (Law of Spiritual Attinety), అతడు అట్టివారివద్దకే ఆకర్షింపబడి వారికే పుట్టును. అతడు తనలోని కోరికలు ఫలించుటకు వీలగు నట్టి మస్తిష్క-మునే, శరీరమునే పొందును అటుల అతడు అట్టి వారివద్దకే వచ్చును; అతని ఇచ్ఛకు దోహదమిచ్చు ప్రత్యేకవిధ మగు ప్రాకృతిక బోధనను కలిగించుచున్నది. గావున పారంపర్యసూత్రము (Law of heredity) నకు భంగమురాదు. ఉదాహరణకు, "నాకొక పుస్తకము ప్రక టింప వలెనని కోరికయున్నది" యని అతడనుకొనును. ఒక మనుష్యుడు ఏదేని పుస్తకము నచ్చువేయ గోరికేని, అతడొక అచ్చాఫీసుకు పోవలెను, అచట వారాతనికి మెషీనులు, సామా నులు ఇచ్చి అతని కాపనిచేసి పెట్టుదురు. పారంపర్యసూత్రము అచ్చాఫీసు వంటిది. అది జీవికోరికలకువలయు సామాగ్రి నిచ్చును. ఒకమనుష్యుడు ఖూనీచేయగోరు ననుకొనును. మరొక డాతనికి బాకునిచ్చును. బాకును తయారుచేసినవాడు, ఖూనీచేయగోరినవానికి బాకునిచ్చును. దానితో అతడు శత్రువుని చంపును. దోషము బాకును తయారుచేసిన వానిపై గాని హంతకునికి బాకునిచ్చిన వానిపై గాని వానికోరికలు ఈ డేరునట్లు

చేసిన విధానముపై గాని ఉండదు. దోషము పొడిచినవాని తలపైననే ఉండును.

కావున దీనిని అడిగినాము కాబట్టే, దీనిని కోరినాము కాబట్టే, తల్లిదండ్రులు మన కీబుద్ధిని, ఈ శరీరమును ఇచ్చినారు. రోగగ్రస్తమైనప్పటికి మనము కోరినశరీరమే మనకు దొరికినది. తనకోరికలు కొనసాగుటచే నరుడు శరీరమును పొందవలసియున్నచో, అతడు రోగగ్రస్తమగు శరీరమును పొందకూడదు. ఈ కోరికలూ కొనసాగవలసినదే. వాటిని మనము వదలిపెట్టవలసినదే. ఇదే సూత్రము. (This is the Law.) నరుడే తనవిధికి యజమాని. నిమ్నస్తరపు వాంఛల విడనాడి, ఉన్నతస్తరపు కోరికలను గ్రహించుటగా, గ్రహించక పోవుటా యనునది నీపైననే ఆధారపడి యున్నది. ఈ దుఃఖ బాధలు నీ స్వాతంత్ర్యమును అపహరించుటకుగాదు. దాని నభివృద్ధిచేయుటకే. దుఃఖబాధలవలన తెలిసియో, తెలియకనో మనము జాగ్రత్తగలవారమై మనస్వేచ్ఛతోడనే మనము నీచ వాంఛల విడనాడి, ఉన్నతవాంఛలను గ్రహింతుము. ఇటుల దుఃఖబాధలు మనను లోబరుచుకోవు. మనకు స్వాతంత్ర్యము నిచ్చును

తుచ్ఛవాంఛ లెక్కువగానున్న వాడొక దుస్నాడను కొనుము. ఈ ఇంద్రియజన్యములగు పశువాసనలు ఈడేర వలెను. కాక వానిని వదలిగూడ వేయవలెను; అదీ నియమము. నీలోనున్న ఈ రాజు, ఈ అధికారి ఈ కోరికల తృప్తి కావలె నన్నాడనుగాన. అవి తనివితీరవలసినదే: అవి ఈడేరు

చున్నప్పుడే దుఃఖబాధాశోకములు కలుగును. కావున ఈ దుఃఖబాధలు నిన్నాదుర్బలత్వమునుండి ముక్తునిచేయును. కాన తనకు రోగము నిచ్చునట్టి, రోగమును సంక్రమింప చేయు నట్టి పరిసరముల నసహ్యించుకొనసాగును, ఈ అసహ్యతలోనే పరిసరముల దర్శనములపైకూడ అసహ్య మేర్పడును. ఇటుల నరుడు ఈ వైపునుండి ఆవైపునుండి పొడువుల దినుచుండుటచే క్రమముగా పైకిలేచి ఉన్నతి నందును.

ప్రశ్న :— నిమ్నవాంఛలనుగూర్చి, పారంపర్యమువలన వచ్చిన వనుకొబడు నట్టి రోగములనుగూర్చి మీారిచ్చిన సమాధానము అర్థమైనది; కాని ఉదాహరణకు; ఆ రోగము మన క్షుద్రమున వచ్చినదైతే దప్ప, క్షయరోగములో వాంఛ యను దానికి ఆస్కార మెచటనో నాకు కానరాదు.

సమాధానము :—ఉన్నతము, నిమ్నము; పుణ్యము పాపము అనుమాట లేవిషయమునంతను బోధపఱచజాలవు. జనులు సాధారణముగా మంచి చెడుగు లనుకొను నవి, వేదాంతము ప్రకారము మంచిచెడుగులు కావు.

వేదాంతము ప్రకారము అధికముగా తినుట, నీ కజీర్ణము చేయునట్టి ఆహారమునుతినుట యనునవే; పాపముల కన్నిటికి మూలము సాధారణముగా పాపములకు కారణము ఈ విషయములోని లోపమేమిా, మిాఅజీర్ణమువలన మనస్వామ్యత్వము పోవును; నీ వన్నిరకముల పాపముల బారిన పడెదవు; వేదాంతము ప్రకారము నీ ఆనందమును, నీలోని దివ్యసంతోషమును చెడగొట్టు నది ఏదియైనను పాపమే. ఇటుల నీ పాపముల

కన్నిటికి ముఖ్యముగా నీ యాహారమే కారణము. ఈ విష యమును రాముడు నొక్కి చెప్పినంతగా ఇతర మతములవారు చెప్పరు; కాని అసలదియే నిజము. రాము డీ విషయమును స్వాను భవము వలననేగాక, ప్రియస్నేహితుల అనుభవము వలనగూడ చెప్పగలుగును. మనపొట్ట సరియైనస్థితిలో నుండె నేని, మనము మంచి ఆరోగ్యములో నుంటి మేని; మనము మన స్వభావమును స్వాధీనతయం దుంచుకొన గల్గెదము; మన ఇంద్రియములను, మన వాసనలను హద్దులలో నుంచుకో గల్గెదము.

ఎన్నో వేల ప్రలోభనలను జయించి, ఇంద్రియ వాసన లను అదిమిపెట్టుకొన గల్గిన ఆదర్శ పుణ్యాత్ముడొకడు ఉనా డున్నా డనుకొనుము; నేడట్టి స్వభావము కల్గిన వాని నొకనిని తీసికొనుము; జను లాతనిని నేటి నడతనుబట్టి విచారించిరేని, వా రాతనినిగూర్చి, "ఓహో, ఆతడు క్రైస్తే" అన్ని అన వచ్చును. కాని ఆతనినే రేపు చూడుము; ఆతడే ఎంతో నీచములగు మనో వికారములకు లోనగును.

జనులు పరుగు లెత్తి ఏదోఒక నిర్ణయమునకు రాగోరు దురు. వా రొకని నొసటిపై "ఋషి" యనియు, మరొకని నొసటపై "పాపి" అనియు వ్రాయగోరెదరు. కాని నిజము నకు నిన్నటిరోజున ఋషిగా ఉన్నవాడు రేపటి రోజుకు పాపి అవుటకు వీలున్నది, నిన్నటిపాపి రేపటికి ఋషి అవుటకూ వీలున్నది.

చార్లెస్ డికెన్స్ వ్రాసిన "ఏ టేల్ ఆఫ్ టు సిటీస్" అను నవలలో సిడ్ని కార్టటన్ అను వాని పాత్ర ఎంతో నీచ

ముగా చిత్రింపబడినది. కాని వాని మరణము ఎంతో వీరోద్దీపితము, ఎంతో ఉదారము అగుటచే అది వాని దోషభూయిష్టము, పాపాత్మకము అగు స్వభావము నంతను కప్పివేసినది. రష్యన్ జమీందారగు టాల్‌స్టాయి, ఒక స్త్రీయొక్క స్వభావమును చిత్రించుచు నవల నొకదానిని వ్రాసినాడు. నవల అంతటిలోనూ ఆమెను ఎంతో పాపభూయిష్టము లగు మనోవికారములకు లోనగు స్త్రీగా చిత్రించినాడు; కాని ఆమె అవసానము ఎంతో మృదువుగ నుండుటచే మన అభిప్రాయము మార్చుకోవలసి వచ్చును.

హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో బేకన్ ప్రభువు మొట్టమొదటి సారి ఉపన్యాస మిచ్చినప్పుడు జనులు ఆశ్చర్యపడిరి 'ఆతడొక ఉదయముననే లేచి తా నెంతో కీర్తిమంతుడని తెలిసికొనెను.'' అని పత్రికలు వ్రాసెను. ఆ బేకన్ ప్రభువే జనుల కండ్లలో ఎంతో గర్హితుడుగా చివరికి బ్రతుకవలసి వచ్చెను.

తన జీవితపు ప్రథమభాగములో సర్ వాల్టర్ స్కాట్ లార్డ్ బైరన్ అంతటి మంచికవిగా ఎన్నిక పొందడాయెను, రాష్ట్రకవి (Poet laureate) గా ఆతడు వన్నెకెక్కలేదు. కాని ఆతని జీవితపు తుదిదినములలో ఆతని పసిగోనము ఎంతో విభూతిమంత మగుటచే ఆతనిని నవలాచక్రవర్తి యనిరి.

కాన రాముడు మీకు చెప్పున దేమన "మీకు తటస్థించు వారల ఆధ్యాత్మిక శక్తులలో ననంత సామర్థ్యములో విశ్వాస ముంచుడు; ఒకరిని విచారించ బూనకుడు; ఎప్పుడూ

ఒక ప్రత్యేక అభిప్రాయమును కలిగియుండకుడు; ఎవరినీ దూషింపకుడు."

దోపిడిమైనట్టి ఎంతో దుర్మార్గు డొకడు నీ ఎదుటికి వచ్చె ననుకొనుము. నీ హృదయములో ఏమాత్రము పక్షపాతముతోగాని, ద్వేషముతోగాని, వైమనస్యముతోగాని అతని వద్దకు పోకుము. ఆత్మయొక్క అఖండశక్తిని గూర్చిన ఒక్క ఆలోచనను మాత్రమే మనస్సునం దుంచుకొని అతనివద్ద కేగుము. నే డెంతో దుర్మార్గుడుగానుండినవాడే రేపటి దినమునకు పెద్ద వీరుడుగనో, లేక పెద్ద ఋషిగానో మారునని మరువకుము. నడత యొకటే అచ్చమైనది కాదు ఆత్మయొక్క అనంతావకాశములలోను సామర్థ్యములోను విశ్వసించుము.

నీ వద్ద కెవరొచ్చినను దేవునిగా ఎంచుము, కాని నిన్ను నీవు తక్కువగా చూచుకోవద్దు; నీ వీ దినము జైలులో నున్నను రేపు ఎంతో గౌరవస్థానము నందవచ్చును.

బైబిల్ ప్రాత నిబంధనలో సేమ్సన్ కథ కలదు. తన జాతి కంతకూ అవమానము తెచ్చిన సేమ్సన్ తన ప్రాతచరిత్రను తుడిచివేసి; తనపూర్వ అవమానమును తీసివేసికో గల్గెను. వేదాంతము మిమ్ములను మీలోనున్న నిజమైన ఆధ్యాత్మికతత్వములో, నిజమైనదివ్యత్వములో, దేవునిలో విశ్వసింపు మని అడుగుచున్నది. దానినే నమ్ముము: బాహ్య నిర్ణయముల నంగీకరింపకుము. అవి అకించనములు. వాటిని మనము త్రోసివేయవచ్చును; వాటి కతీతులము కావచ్చును.

ఈ ఆధ్యాత్మికతత్త్వ మెక్కడ నున్నదో అచట అన్నివస్తువులు కలవు. ఈ ఆధ్యాత్మికతత్త్వ మెక్కడికైనా వచ్చును.

మతములు ప్రపంచముయొక్క నైతికతత్త్వమును సరిగా అర్థము చేసుకోలేవు. చెడుగున కంతకూ ఏది మూలమో దానిని కొట్టవు ఈ రోజు ప్రలోభన లన్నిటినీ త్రోసివేసిన వాడు రేపు హంతకుడు, చండాలుడు కావచ్చును. ఇది శాస్త్ర సిద్ధాంతదృష్ట్యాగాని, శరీరదృష్ట్యాగాని అర్థము చేసుకో వచ్చును.

భౌతికదృష్ట్యా మన నడతలలోని ఈ భేదమునకు కారణ మిది. నీ శరీరము మంచిఆరోగ్యములో నున్నప్పుడు నీ కడుపు సరైన స్థితిలో నున్నప్పుడు నీ నడత సరిగానే యుండును. నీ వన్ని విధముల ప్రలోభనలను జయింపగలవు. రేపు నీ కేదో* రోగము వ్యాధి కలుగవచ్చును. నీ కడుపప్పుడు సరైన స్థితిలో నుండదు; అప్పుడే చిన్న విషయమైనా నిన్ను కదల్ప వచ్చును. నిన్ను ఉత్తేజితుని చేయవచ్చును. అదీ సంగతి.

మతప్రచారకు లీ సంగతిని ముచ్చటించుట తమ హోదాకు తక్కువ యని యనుకొనుట చిత్రము.

నీవు తిను ఆహారమునుగూర్చి జాగ్రత్త పడుము; నీ రోగమును నీవే కుదుర్చుకోగలవు.

కడుపులోనికి మితిమీరి ఆహారమును త్రొక్కుట, అయుక్తాహారమును తినుట – అనునవే పాపమున కంతకువేరు.

---

* దేహమునందో, మనస్సునందో, ఉన్న ఏదో ఒక రోగమే సమస్తమైన దుష్టనడతలకు కారణమని నేటి మనస్తత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయము,

ఈ రకపు వాలకము లున్నవాడు తదితరములగు ఏదురకముల పాపము లన్నిటినిగాని, కొన్నిటినిగాని చేసినంతటిపాపియే; అని వేదాంతమనుచున్నది. కడుపుపైని తీపియే యిదివరకు చెప్పినట్టి శరీరములను, తల్లిదండ్రులను పొందునట్లు చేయును: బాధ ద్వారానే మనము దివ్యసత్యమును పొందెదము.

ప్రశ్న:- ఆరుగురు పిల్లలున్న ఒక కుటుంబములో ఒకడు ఋషిగాను, ఒకడు పాపిగాను, ఒక డెంతో ఆరోగ్యము తోడను, మరొక డెంతో అనారోగ్యముతోడను పుట్టు నెందు లకు? వా రందరు ఇటుల భిన్నులుగా నున్నా రెందులకు?

సమాధానము:- పైయుక్తిక జన్మలు భేదించునది ఇటులనే. వీ రందరికి సామాన్యమగునది ఒకటిమాత్ర మున్నది. ఒక మనుష్యుడొక అచ్చాఫీసులోను, మరొక డొక పోలీసు పెట్టు సంస్థలోను, ఇంకొకడొక నూనె ఫేక్టరీలోను, ఇంకొకడొక గుడ్డలమిల్లులోనూ పనిచేయుచున్నా డనుకొనుము; ఈ జనుల తెన్నులు భిన్నములు. కాని వారందరికి సామాన్యమైన దొక టున్నది. వారందరు గుడ్డలను కొనునది మాత్ర మొక కొట్టు లోనే కాన ఒకదానిలో భేదము లున్నచో మరొకదానిలో. సామాన్యమగు నదేదో ఒకటి యుండకూడ దనునది లేదు.

ఈ పిల్లలందరిలోనూ వారి తల్లిదండ్రులపట్ల ఆసక్తి యనున దొకటిమాత్రము సామాన్య విషయము. వా రందరు కూడ ఆ ఇంటికి, ఆ ఆస్తికి, ఆ పరిసరములకు బంధితులు; వారి ఇతర కోరికలుమాత్రము భిన్నములు. ఈ ప్రపంచములోనికి ఒక డొకదారినివచ్చును; మరొక డింకొకదానినివచ్చును;

కాని ఎల్లరూ దారులుకలయుచోట కలయవలసినదే. వేరు త్రోవలవచ్చినను, ఆచోట కలయవలసిన దే.

ప్రశ్న:- కొన్ని సారులు జనులు బతికియుండగనే పాతి పెట్టబడెదరు. అట్టి పరిస్థితులు వారిపై బడుటకు వారికర్మయేనా కారణము, లేక, ప్రాణము శరీరమునుండి పోయినదా? లేదా? యను విషయము గట్టిగా తేలువరకు పాతిపెట్టరాదా? వేదాంత మేమని చెప్పును?

ఉత్తరము:- కర్మసిద్ధాంతము ఉత్సాహపూరితమైన, క్రియాత్మకమైన, శక్తియుతమైన జీవితము గడపుమని బోధించుచున్నది. అది ఉన్నదానినున్నట్లు గ్రహింపమనిగాని, సోమరిగా నుండు మనిగాని బోధింపదు క్రియ, శక్తి జీవితము అని అర్థము కర్మశబ్దమునకు.

నరుడే తన విధికి ఈశ్వరుడని, అత డేవిధమైన హానిసత్యమందుగాని, నిరంకుశత్వముక్రిందగాని లేడని, తన స్థితికి తానే కర్తయని రాముడు చూపినాడు. అట్టిచో, అటువంటిపరిస్థితిలో ఏల అడ్డముపోరాదు? అటిసితిలోగాని లేక మరొకస్థితిలోగాని ప్రపంచ మొప్పుకొననీ, లేకపోనీ, నరుడు తన కర్తవ్యము తాను చేయవలె. జనులు తమ కర్తవ్య మేదో చూచుకొందురుగాక. పైన చెప్పినట్లు జరిగిన దని ఎవడైన ఎరిగెనేని, ఆ ఎరిగినవాడు ఆ విషయములో జోక్యము కలుగజేసికోవలసిన దే.

ప్రశ్న:- ఈ శరీరమును విడచిన పిమ్మట ప్రేతజగత్తులలో (Spirit worlds) మానము సంపూర్ణత నొందుచుండెదమా?

ఉత్తరము:- వేదాంతము ప్రకారము మనము రాబోవు జన్మలలో సంపూర్ణత నొందెదము. రాబోవు జన్మలలో, రాబోవు జీవితములలోను మనము సంపూర్ణత నొందెదము; ప్రతి ఇరువదినాల్గు గంటలలోను మనకు కలుగు స్వప్నము లెట్లో ప్రేతజగత్తులును అంతే.

ప్రశ్న :- పోయినవారికి మనము ఆధ్యాత్మికముగా సహాయము చేయగల్గెదమా ?

ఉత్త :- అవును. చేయగల్గెదవు. వారి చిత్రపులనో, లేక వారి ఆకారములనో మానసికముగా మీ ఎదుట నుంచుకొని, వారు దివ్యాత్మలే నని తలచుటవలన, అనుభవించుట వలన, గ్రహించుటవలన వారికి లాభము కలుగును. వారిని గూర్చి మంచితలపులను తలుపుము. వారిపట్ల మంచిభావములను కలిగియుండుము. అటులచేయుటచే నీవు వారికి సాయము చేయగల్గెదవు; నీకును సాయము చేసుకో గల్గెదవు.

ప్రశ్న :- వారు మనకు భౌతికవిషయములలో ఏమైన సహాయమును చేయుదురా ?

ఉత్త :- భౌతికజగత్తులో మీకు ఇతరజనులు సహాయము చేయగల్గెదరేని, పోయినవారుకూడ మీకు సహాయము చేయుదు రని చెప్పవచ్చును; కాని వేదాంతము ప్రకారము భౌతికజగత్తులోగూడ మీకుసహాయము చేసుకొ గల్గినది మీరే. మృతజీవులరూపముగానో, లేక బ్రతికియున్నవారి శరీరముల గుండనో, మీకు మీరే సహాయము చేసుకొనునది. బయటి నుండి ఏమియుకోరక, మీ కేంద్రమును మీలోననే యుంచు

కొని, ప్రతిదానిని లోపలనుండియే వెదుకుకొనుచు లోపలి నుండియే గ్రహించుచు ఉండమని మిమ్ములను వేదాంతము కోరుచున్నది. నీ వస్వాధీనుడవైనచో, నీవు కోరవలసిన పనిలేదు. కోరదగిన వస్తువులు నీవద్దకే వచ్చును. నిన్ను నీ వస్వాధీనుడవుగా చేసికొందువేని, నీకు సహాయము తప్పక చేకూరును. ఇప్పుడు ఇక నిన్న వేసిన ప్రశ్న కొచ్చెదము.

తూర్పిండియాను ప్రేమించునట్లు, భారతీయ భావములు ఎల్లప్పుడు మనస్సులో కలుగునట్లు చేయు పరిసరములలో ఎవడైన ఉండెనేని, ఎల్లప్పుడు తూర్పిండియాను ఆతని మనస్సొకట నుంచు పుస్తకములను చదువుచు, అట్టి వ్యక్తులనే కలసుకొనుచు ఉండెనేని, అట్టిమనుష్యుడు అమెరికన్ వాడో ఇంగ్లీషువాడో అయినప్పటికి, తనభావముల ఫలితముగా వాడు మరణానంతరము ఇండియాలోనే పుట్టును. ఇటుల తనకోరికల వలననే ఆతడు ఇండియాలో పుట్టును.

ప్రశ్న :- మనుష్యులు పోయి కుక్కలుగాను, పిల్లులుగాను పుట్టుదురా ?

ఉత్త :- అది వారుండు పరిసరములపై ఆధారపడి యుండును. వారి భవిష్యజ్జన్మలు వారి ప్రస్తుత పరిసరములపై ఆధారపడియుండును.

ఇండియాలో ఒక మునివద్దకు ఇద్దరు మనుష్యులొచ్చిరి. అందులో ఒకనిది కుక్కస్వభావము. రెండవవానిది పిల్లి స్వభావము. లేదా మునివద్దకు ఒకకుక్క పిల్లి వచ్చెననవచ్చును. కుక్క మునినీప్రశ్న వేసెను. "అయ్యా ఇదిగో ఈపిల్లి లేక

పిల్లివంటిమనుష్యుడు. వాడుచాల దుర్మార్గుడు. చాలటక్కరి. చాలచెడ్డవాడు. అతడు రానున్నజన్మలో ఏమగును ? తదుపరి ఆపిల్లివంటిమనుష్యుడు మునివద్దకొచ్చి ఈ ప్రశ్నవేసెను. "అయ్యా! ఇదిగో ఈకుక్క లేక కుక్కవంటివాడు. వాడుచాల చెడ్డవాడు. వాడెప్పుడు అరచును. మొరుగును. మరణానంతరము వాడువచ్చేజన్మలో ఏమగును ;" ముని నిశ్శబ్దముగా కూర్చొనెను. కాని ఆప్రశ్నలే తరచు అడగ బడుటచే ఆత డిటులనెను. "సోదరులారా! మీా రాప్రశ్నల నడుగకుండ యున్నచో ఎంతో బాగుండెడిది." కానివారుజవాబు కావలెనని పట్టుబట్టిరి. ముని ఇటులచెప్పెను. "ఇదిగో పిల్లి. ఓకుక్కా, పిల్లినీ సహవాసమున ఉంటున్నది. నీఅలవాట్లను నేర్చుకొనుచు అది నీతో బ్రతుకుచున్నది. అందుచేఅది నీస్వభావమునే అలవర్చుకొనుచున్నది. ముందుజన్మలో ఈ పిల్లి కుక్కకాగలదు. అంతగాక ఇంకేమాతుంది?" "ఇక ఓ పిల్లీ! ఈ కుక్క నీతో ఉంటూ నీగుణాలను నేర్చుకుంటూ నీఅలవాట్ల నభ్యాసము చేసుకుంటూ ఉంది. అందుచే వచ్చేజన్మలో అది కుక్కకావలసినదే." కుక్కతోను పిల్లితోను సహవాస మెవరు చేయునో వానిపై ఆధారపడి యుండును. ఈప్రశ్న నింక లోతుగా చూడపనిలేదు.

ప్రశ్న :—చచ్చిన తరువాత మనుష్యుడు తిరిగి ఎంత కాలమునకు పునర్జన్మ నెత్తును ?

ఉత్తరము :—నే డొక మనుష్యుడు అనేక రకములయిన పనులు చేస్తా డనుకొనుము; అతడు నిద్దురపోయి తిరిగి మర్నాడు

పొద్దున లేచును. అతడు నిదురపోవు కాలము మరణము వంటిది; అతడు మేల్కొనుట యనునది పునర్జన్మవంటిది. అతడు నిదురపోయిన క్షణమునకు, మేల్కొను క్షణమునకు మధ్య గడచుకాలము - స్వర్గ నరకములలోను ప్రేతజగత్తుల లోను (Spirit worlds) గడచు కాలము వంటిది. ఈ లోకంలో మనము నాలుగైదు గంటలు మాత్రమే పడుకొను వారిని, పదిగంటలు పడుకొనువారిని, ఎనిమిది గంటలే పడు కొనువారిని చూచుచున్నాము. పిల్లలు ఎక్కువసేపు నిదురింతురు. వృద్ధులు ఎక్కువగా నిదురపోరు. యువకులకు ఎక్కువ నిదురకావలె. కాన ఆ యా మనుష్యులపైనను, వారి ఆధ్యాత్మికాభివృద్ధిపైనను ఆధారపడియుండును. ఈ లోకములో మీ జీవితానికొక నిలుకడ లేనట్లే, కొందరు పసితనములోను, కొందరు ముప్పైఏండ్లు, కొందరు నూరేండ్లు బ్రతికి చనిపోయినట్లే, పునర్జన్మకు కూడ ఒక నిర్ణీతమైన వ్యవధి లేదు.

ప్రశ్న :— ఈ కాలమున మనుష్యుడు వేదాంతమును అనుభవములోనికి తెచ్చుకొన వీలగునా? 20 వ శతాబ్దపు నాగరికతలో నుండువాడు వేదాంతమును ఉపలబ్ధించుకో గల్గునా? వేదాంతసాధనకు మనుష్యుడెటుల బ్రతుకవలెను; అటుల బ్రతుకవలెను. అని సూచింపబడినది కదా! అతడు హిమాలయారణ్యములలోనికి పోవలెనుకదా ?

ఉత్తరము :— లేదు, లేదు. మీ రరణ్యములలోనికి పో నవసరములేదని, రాముడనుచున్నాడు; మాకు టైములేదు; మే మెన్నో పనులు చూచుకోవలెను, మా బాధుమిత్రు లెంతో

కాలమును హరించుచున్నారు. అని జను లందురు. "దేవా! నన్ను నా శత్రువులనుండి రక్షింప" మని ఒక ప్రార్థనకలదు. కాని నేటి మనుష్యుడు, "దేవా, నన్ను నా మిత్రులనుండి రక్షింప"మని ప్రార్థించిన యింక ఎక్కువ బాగుండును స్నేహితులు మన కాల మంతయు హరింతురు; ఆపైన ఆదుర్దా కలుగును.

చివర కొకమాట. చదువుట లేక అధ్యయనము చేయుట అనేక విధములుగ నుండు నని మీ రెరుగుదురు కదా! కొందరు చిలుకలవలె నాలుకలతో చదువుదురు; కొందరు కళావంతులు (Artists) ఇంజనీర్లువలె చేతులతో అధ్యయనము చేయుదురు, కళావంతులందరు శాస్త్రజ్ఞులు కారని రాముడనుట లేదు. కాని శాస్త్రజ్ఞులు కానట్టి కళావంతులను మనము చూచినాము కదా! జలతత్వ శాస్త్రజ్ఞాన మావంతయు లేకుండనే, సముద్రములో ఇటు అటు ఈదగలవారిని చూచినాము కదా! వాయు తత్వజ్ఞాన మేమాత్రము లేకుండానే, గాలిలో విమానముల నడుపువా రున్నారు. మందుల తయారుచేయు వర్తకులకు సాధారణముగా రసాయనశాస్త్రముతో పరిచయ ముండదు. చేతులతో అధ్యయనము చేయుట మంచిపనే. హృదయముతో అధ్యయనము చేయువారు కొంద రున్నారు. వారే లోకమున ధన్యులు. సానుభూతిగలవారు; ఒక వస్తువును చూచుటతోనే గ్రహించువారు, యోగదృష్టికలవారు – వీ రందరు ధన్యులు; కాని, వారు కేవలము హృదయములతోనే అధ్యయనము చేసినచో వారి విద్య అక్కరకురాదు. వారి జ్ఞానమును వారి

విద్యను ఇతరులకు నేర్పవలెనన్న, వారికి గాఢమైన కోరిక, దానితోపాటు మంచి సంస్కృతి ఉండవలె. వారు కేవలము హృదయమునే అనుసరించినచో, వారేకపక్షావలంబకులు; బుద్ధి, హృదయము, నేర్చిన చెయ్యి నోరు కలిగి మూడు విధముల కార్యాచరణ చేయగలవారే లోకమున కెక్కుడు ఉపకారకులు; వీరే పెద్ద విద్యావంతులూ, నిజమైన సంస్కృతి గలవారు.

అటులనే, రాముడు వేదాంతమును మీరు కాయేనా, వాచా, మనసా, అన్ని విధముల నేర్చుకోవలెనని కోరుచున్నాడు. అది మీ రక్తములోని కెక్కి మీ నరములగుండా పరుగులెత్తి, మీ హృదయము నావరించి, మీ బుద్ధిని అభిషేకము చేసి, మీరు మీ అస్తిత్వమును నానబెట్టవలెను. అప్పుడే మీరు ఉన్నతినందురు. అప్పుడే మీరు ఏ దృష్టితో చూచినా స్వతంత్రులయ్యెదరు, అప్పుడే మీరు మీ దేవరూపమును గ్రహింపగల్గెదరు. మీ స్వస్వభావము నందెదరు. ప్రతివిధముగా స్వతంత్రులయ్యెదరు.

ఈ శరీరమునకు ఆ శరీరమునకు, మీకు భేదము కనపడినచో, ఎవరైన మనుష్యుడు హృదయపూర్వకముగా బోధించుటలేదని తోచినచో, అది మీ కనవసరము; దానితో మీకుపని లేదు. విషయమును మీకు మీరే గ్రహించి అందలి సత్యమును త్రికరణశుద్ధిగా అనుసరించి చూడుడు. దాని జీవితమందములుగో పెట్టిన నీవితోధిక ఉన్నతిని పొంది ఇంకను

బాగుపడెదవు; వైభవోపేతుడ వయ్యెదవు. మీ రలాగు కావలె నని రాముడు కోరుచున్నాడు; అది కండు.

రాములిలో వేయి తప్పు లున్న మీ కేమి? రాముని తప్పులకు రాముడే బాధ్యుడు. రాముడు మీకు పరమ సత్యము నిచ్చుచున్నాడు. దానిని మీ జీవితముగా చేసికొనుడు; మీ కది ఆనందమును చేకూర్చును; అది మిమ్ముల సంశయ రహితులనుగా చేయును.

తాను బోధించు దానిని రాము డమలులో పెట్ట డను కొనుడు; రాముని పరిస్థితులు లేక పరిసరములు అతని కడ్డు తగులుచుండవచ్చును. కాని మీరు ఆ సత్యమును అమలులో పెట్టి చూడవచ్చును.

అటులనే ఈ కాల్వినులు, ఈ ఎడిసన్‌లు మున్నగు మహాపురుషులు ఏమి చేయవలయునో తమ బుర్రలతో ప్లాను వేయుదురు వారు ఏర్పరచు ఆదర్శములు వారు వేయు ప్లానులు చేతితో అనుష్ఠపరచ వీలు లేదు; వాటిని పని చేయించుటకు మిమ్ము కావలెను. మీకు చేతు లున్నవి. మీరు మెషీన్లను తిప్పగలెదరు; మీరు మెషీన్లను చేయగలెదరు. ఈ ప్లానును వేయ మీకు శక్తి లేకపోవచ్చును. కాని దానిని గ్రహించి అనుభవములో పెట్టుటకు చేతు లున్నవి కదా!

కూలివాళ్ళతో వచ్చిన కష్ట మిదే; వారి కీయబడిన ప్లానులను తీసికొని ఆ ప్రకారము చేయరు.

అటులనే "తాను చెప్పిన దేమో చేయడు; కాబట్టి ఈ గురువు చెప్పినది గ్రహింపము" అను జనులవాదముకూడ మూర్ఖమే.

ఒకడు టానిక్కులను, పాలను, తీపివస్తువులను అమ్మి వనుకొనుడు వాడు టానిక్కులను పుచ్చుకొనడు; కాబట్టి వాడు పాలను త్రాగడు; కాబట్టి వాడు తీపివస్తువులను తినడు: కాబట్టి వానివద్ద నీవు ఏ వస్తువులను కొనరాదా?

ఒక డాక్టరు కేమైన రోగమున్నచో దానికి చికిత్స చేసికొనుటకు ఆతనికి చేతగాకపోయినను ఆతనివద్ద మందు తీసికొనవేని అది తెలివితక్కువే నని వేదాంత మనును. ఏదో జబ్బుండుటచే వైద్యునికి రోగమొచ్చినది నిన్ను బాధించు రోగమునకు మందెరుగును. కాని తన్ను బాధించు రోగమునకు వాడు మందెరుగడు ఆతడు తనను న్యాయము చేసికో లేడేమో కాని నీకు న్యాయము చేయుగల్గును

అనేకులు గ్రంథకర్త ఎవరో తెలిసినగాని పుస్తకములను చదవరని రాముడు ఇండియా, అమెరికాలలో జనులతో సంభాషించునపుడు కనుగొనెను. "ఇదిగో వీడొక గ్రంథకర్త. వీడా వెధవపని, ఈ వెధవపనిచేసినాడు; పైగా దేవుడనని చెప్పుకొనుచున్నాడు. వాడి పుస్తకము నేను చదువను." అని చాల మంది అనెదరు. కాని రాము డనున దేమన, "అన్నా! పొరపాటు పడకుము; వాడు చెడ్డవాడుకావచ్చును. కాని వాడిచ్చు సత్య మేమో చూడుము; సత్యమును దాని విలువపైననే గ్రహించుము.

ఇండియాలో, పర్షియన్ చక్రములతో బావులనుండి నీరు తోడెదరు. నీరు బయటకొచ్చి ప్రత్యేకముగా కట్టబడిన రిజర్వాయరులో పడును. అక్కడనుండి చిన్న కాలవలద్వారా పొలాలలోనికి పోవును. నీరు బావిలోనున్నప్పుడు అచట పచ్చిక గాని, పంటగాని, చెట్లుగాని లేవు. నీరు రిజర్వాయరులలో ఉన్నప్పుడు ఏమియు లేదు. కాని నీరు పొలాలకు ప్రాకినంతనే నేలసారవంతమై, పచ్చిక కానవచ్చును. నీరు బావిలోనూ; రిస ర్వాయరులోనూ ఉన్నప్పుడు పచ్చికెక్కడా లేదు; గావున, నీరు పొలాలలో పచ్చికను పుట్టింపదని వాదించలేము.

అటులనే, జ్ఞానము యెక్కడనుండి యైననుసరే; గ్రహింపుడు; అని రాముడు మీకు చెప్పుచున్నాడు; "జ్ఞానము ఇండియానుండి వచ్చుచున్నచో, ఆ దేశస్థులు అంత అధోగతిలో ఉన్నారేమని అనకుడు. సత్యమును దాని విలువచూచి గ్రహింపుడు సత్యమును దాని వెల నిచ్చి పడికట్టుడు. మనుష్యుని కానందమిచ్చు మార్గమదియే; దేవుని చేరగల మార్గమదియే. అది మిమ్ములను అన్ని ఆపదాలనుండి బయటికి తెచ్చును; దౌర్భాగ్యమునుండి నిన్ను విముక్తుని చేయును. అది ఒకటే మార్గము; మరొకటి లేదు. అటులనే, క్రైస్టుచరిత్రము నిర్మలము, పవిత్రము అయినచో, సత్యమంతయు క్రైస్టుబోధలలోనే ఉన్నదనిగాని, అవియంతయు సత్యమే యనిగాని నిర్ణయించకుడు అని రాముడు మీకు చెప్పుచున్నాడు. కొన్ని సారులు మన మెంతో సుందరమైన యువకులను చూచు చున్నాముకదా! వారిలో ఎంతో దుర్మార్గముండును. ఒకని

కర్మలు, బోధలు, వ్రాతలు యెంతో బాగుండవచ్చును; కాని అందువలన అతనినుండి వచ్చునదంతయు మంచి కాదు; అతని జెత్తురో, ఎముకలో మంచివి కావు.

అటులనే బైబిలు చదువునప్పుడు, అందులో నున్న దంతయు క్రైస్తు బోధలకే వర్తింపకుడు. క్రైస్తుసంపూర్ణుడు. అతని బోధలూ సంపూర్ణములు. కాని ఏది ఒకదానికి చెందినదో అది మరొకదానికి వర్తింపకుడు; దాని అసలు విలువ ఏమిటో చూచి పుస్తకమును గ్రహింపుము. ఇసేక్ న్యూటను వ్రాసిన ప్రిన్సిపియాలో ఎన్నో తప్పులు గలవు. ఆయన రోజులలో ఆయన అందరికంటె మంచివాడై యుండవచ్చును. కాని ఆయన పుస్తకములను వాటి విలువ చూచియే గ్రహింపుము.

అటులనే, రాముని సుగుణములతోగాని దుర్గుణములతోగాని మీకు పని లేదు అని మీకు రాముడు చెప్పుచున్నాడు. దాని విలువ ఎమిటో చూచే ఆ అధ్యాత్మిక బోధను గ్రహింపుము. వేదాంతబోధలు మిమ్ము ఉన్నతికి గొనిపోవును. దానిని తనబోధగా గ్రహింపు మని రాము డనుట లేదు; అది మీకొరకే, మీదే.

వేదాంత మనగా బానిసత్వముకాదు. బౌద్ధమతమనగా బుద్ధునికి బానిసత్వము. మహామ్మదీయమత మనగా మహామ్మదుకు బానిసత్వము; కాని వేదాంతమనగా ఏఋషికిని బాని సత్వముకాదు, అది సత్యము. సత్యము ప్రతి వారికి చెంది యున్నది.

ఎండలో కూర్చొనినప్పుడు, మనము సూర్యునిపట్ల కృతజ్ఞులముకాము. ఎందుకన సూర్యు డందరివాడు. అట్లే రాముడు వేదాంతసూర్యుని రశ్మిలో కూర్చొనినచో మీరును కూర్చొనవచ్చును. రామునిదైనట్లే అది మీదియునై యున్నది. సత్యము ఇండియా కెంతగా చెందునో, మీకును అంతగా చెందును. దానిని గ్రహించండి. దాని విలువచూచి దానిని పొందండి. అది మంచిదైనచో ఉంచుకొండి. అదిచెడ్డదైనచో, తన్నిపారద్రోలండి. ఇండియాకు మహమ్మదీయ మతమును, క్రైస్తవమతమును తెచ్చినట్లు మేముదానిని కత్తితోను, డబ్బుతోను తీసుకురావటములేదు. రాము డా విధముగా దానిని తేవటములేదు. వేదాంతము మీది. దానిని గ్రహించండి. అవలంబించండి.

ఒకమిత్రుడు సూర్యరశ్మిలో కూర్చుండియు, దానిననుభవింపలేకపోయినచో, మీరుదానిని అనుభవించకూడదా? వేదాంతముతోనూ అంతే. దానివిలువచూచి దానిని తీసికొనండి. దానిని నేర్చుకొండి. దానిని జీవితములో అనుసరించండి; వ్యక్తిత్వముల నన్నిటిని దాటండి. ఈ క్రైస్తులను బుద్ధులను, మహమ్మదులను, రాములను అతిక్రమించిపొండి. "ఈ దేహమును మీకాళ్లక్రింద వేసి త్రొక్కండి. నే నీ దేహము కాదు. అదిగ్రహించండి. అది తెలిసికొనండి. నేనేసత్యము. నన్ను తెలిసికొనండి. స్వతంత్రులు కండి." అది అనుభవములో గ్రహించి, ఓంకారము నుచ్చరించండి. "నే నున్నాను." (I am) —ఓం, జెహోవా, క్రైస్తులకు క్రైస్ట నేనే అని ఉచ్ఛ

రించండి. నన్ను తెలిసికొనండి. నేనే నీవు. ఇది గ్రహించిన నీ అదుర్దాలన్నీ పోవును. ఈతొందరను, ఈ వెనకాముందు చూడటమును అంతనూ వదలివేయండి. క్రైస్తులను, మహాత్ములను, వారినే స్థిరపద ప్రదర్శకులుగా చూచు మిత్రులను అతిక్రమించి పొండి.

వారు మారొందువారు. వారు నిలుకడలేనివారు. ఈ ఛాయలకన్నిటి వేరుకారణమైన పరమసత్యము నెఱుగుడు. అది తెలిసికొని స్వతంత్రులు కండు.

ఓమ్! ఓమ్! ఓమ్!



## వివిధ సంభాషణలు.

ప్రశ్న :- ఒకేఒక్క మతము ఎన్నటికైనా మానవుల నందరిని ఏల గలుగునా?

ఉత్త :- అవును. కాదు. భవిష్యత్తులో ఇక మతములూ మనుష్యులను ఏలుట యనునది ఉండదు; మానవలోకము కూడ ఒకమతమునకు చెందుటయనునది యుండదు. మతమే మనుష్యునికిచెంది యుండును.

ప్రశ్న :- ఒకేమతము మనుష్యుల నందరిని పాలింప గలదా?

ఉత్త :- లేదు. భవిష్యత్తులో మనుష్యులను ఏమతమూ పాలింపదు.

మతములు, సంస్థలు, న్యాయసూత్రములు, అన్నీ మనుష్యునికేచెంది యున్నవి.

న్యాయసూత్రములు నాకొఱకే అయిఉన్నవి. నేను న్యాయసూత్రముల కొఱకు, సంస్థలకొరకు పుట్టలేదు.

భవిష్యత్తులో మనుష్యలోకము నంతను సేవించునట్టి మతము ఉండబోవుచున్నదిగాని, పాలించుమతముకాదు. (A religion which will serve not rule.)

ఇక ఆ "ఒకేమతము" అనుశబ్దమునుగూర్చి, రాము డనునదేమన మానవు లందరిని సేవించుటకు ఒకేమతముండ గలదు, అయితే అది ఏమతము? అది ఏ మంతమూ చెప్ప

టకు ముందుగా ఆ మతమునకు పేరేమియు ఉండదని రాముడు చెప్పుచున్నాడు.

అయితే అది ఏ మతము? అది వేదాంతము శాస్త్రీయ మతము. వేదాంతమే విశ్వమతము.

ఇక మతమనగా కరుడుగట్టిన యొక సిద్ధాంతమని మీ అభిప్రాయమైనచో, మీరు మేల్కొనవలసినదే. ఈ రకపు మతము ఇక భవిష్యత్తులో నుండబోదు. ఇదిగో నేడు సైన్సు నధ్యయనము చేయుచూ జ్ఞానముయొక్క ఉన్నతస్థరములలో ఏమి జరుగుచున్నదో కండ్లనువిప్పి తెలుసుకొనుచున్నవా రున్నారు. ఇటువంటి స్వతంత్రపురుషులు అన్నిరకముల సిద్ధాంతములకు; వాదములకు అతీతులు. నిజమైన మతము మనకు స్వతంత్ర నిచ్చుటకుగాని, మనలను బంధించుటకు గాదు. మతము మనలను పరిపాలింపగలవారినిగా తయారుచేయుటకు గాని మనలను బానిసలుగా చేయుటకు కాదు.

మతములో పేరులు ఈ లోకమున నెంతో హాని చేయుచున్నవి. బౌద్ధ క్రైస్తవ మను పేరులను తీసికొనుము. ఆ రెండువృక్కోణముల మధ్య ఎంతో భేదము గలదు. బౌద్ధ మతము ఇండియాను నాల్గు సంప్రదాయములుగా విభజించినది. చైనాలో బౌద్ధులు సప్తసాంప్రదాయములుగా విభజింపబడిరి.

ఒక మనుష్యుడు హిందువు నని చెప్పుకొనును. వాడు క్రైస్తవునితోను, మహమ్మదీయునితోను పోరాడును. ఎందుకు కేవలము హిందువు అను పేరును నిలబెట్టుకోదలచి వాని ఆలోచనలను విశ్లేషణ చేసితివేని క్రైస్తవు లనబడువారికంటేగూడ

ఎక్కువ క్రైస్తవము వేలకొలది హిందువులలో గలదు. కాని తమ పేరున ధరించువారిపట్ల వారాసక్తి కలిగియుందురు.

భవిష్యత్ మతమునుగూర్చి మరొకమాట. వేదాంత శాస్త్రము, లేక వేదాంత సాహిత్యము ప్రతిపల్లెలోను, ప్రతి ఇంటిలోను వ్యాపించినపుడే ప్రతివానికి తగిన మతము రాగలదు. శాస్త్రీయమతము విశ్వమతము అయిన వేదాంతము ప్రపంచ మంతటా వ్యాపింపగల దూరమున లేదు, కాని మనుష్యుడు వేదాంత మను పేరున కతీతుడు కావలెను బౌద్ధ మను పేరున కతీతుడు కావలెను. ఇంతకు నామము లన్నిటికి అతీతుడు కావలెను.

నీకు కొన్ని అభిప్రాయము లున్నవి. మరొక డొచ్చి స్వర్గమునకు దారి తన మతమే యనును. అది వానికిని, వాని దేవునికిని మధ్యవిషయము. అందులో జోక్యము కలుగజేసి కొనుటకు నీ కేమి అధికారము గలదు? నీ కధికారము లేదు.

ప్రతివాని మతమూ, వానికీ, వాని దేవునికిని సంబంధించిన విషయము అను సత్యమును గుర్తించ మని వేదాంతము యొక్క ప్రధాన ఉపదేశము

ప్రశ్న :—తమ ప్రాణమును తామే తీసికొనువారి ఆత్మల కేమగును?

ఉత్త :—ప్రతివాడూ తన ప్రాణమును తానే తీసుకొనును అని రాముడు చెప్పుచున్నాడు. చచ్చునట్టి ప్రతివాడు ఆత్మహత్య చేసుకొనుచునేయున్నాడు. చచ్చువారి కేమగుచున్నది?

విశేషమైనదేమి అగుటలేదు. అటులనే ఆత్మహత్య చేసుకొని వారని తలంపబడువారికిగూడ విశేషమేమియు జరుగదు. ఈ జీవితములో నీపని పూర్తి అయినదాక నీవు చావలేవు; మరణ మెటుల సంభవించుచున్నది?

తమ కోరికలద్వారానో, తమ అజ్ఞానము ద్వారానో చిక్కులలోపడి ఈదేహము పోవుగాక యని కొందరు కోరికొందురు. వారి అంతరహృదయములో వారు చావు కావలెనని కోరుదురు. చావు వారి కొచ్చును. అదీ నియమము. తమ కోరికలవలనే వారు రోగములను తెచ్చిపెట్టుకొందురు. రోగశయ్యపై నున్నప్పుడు ఫలించుచున్న తమ పూర్వపు కోరికలవలనే వారాస్థితి కొచ్చి చావు కావలెనని బిగ్గరముగా కోరుదురు చావు వచ్చును. అందరూ ఆత్మహంతకులే (Suiciders).

ప్రశ్న:— వెనుకటి జన్మలు జ్ఞాపక ముంచుకొనుట సాధ్యపడునా ?

ఉత్తరము:—చాలా వీధులగుండా పోయి, ఇంకా అయిదు వీధులగుండా పోవలసిన వానివంటివారు వెనుకటి జన్మలను జ్ఞప్తిచేసుకో ప్రయత్నించువారు, జ్ఞప్తియుంచుకొను వారు. ఇంకా అయిదు వీధులు పోవలసియుండగానే, తాను బయలుదేరిన వీధిపేరు, తాను దాటిన వీధులన్నిటిపేరు, పదునైదు నిమిషముల క్రిందట తానున్నచోటు, ఒక గంట క్రిందట తా నున్నచోటు అడుగుట అనవసర శ్రమకాదా? మనుష్యుడెప్పుడు ముందుచూపు కలిగియుండవలె. వెనుక

చూపువలని లాభ మేమి? ముందుకే సాగుము. నీ వెన్నో జన్మలనెత్తితివి ఎన్నో వీధులను దాటితివి; ఇప్పు డిక ముందు కేగవలయును. నీవు ముందుకే సాగించో, మంచిదే. నీ వాగి నచో ప్రగతి కడ్డంకివగుచున్నావు. చెడగొట్టుకొనుచున్నావు. ముందుకే సాగుము.

ప్రశ్న :— భౌతిక దేహ మందుండగానే, మానసికసీమ (Mental plane) లో సచేతనముగా వ్యక్తీకరించుకొనుటకు వీలగునా? దివ్యజ్ఞాన సమాజపు బోధకులు వీలుకాదని చెప్పినారు.

ఉత్తరము :— ఈ ప్రశ్నలో చాల అంశము లున్నవి; వివరముగా విచారించుట కిప్పుడు వ్యవధి లేదు.

దివ్యజ్ఞాన సమాజసులు అనినట్లు వీలుకానిమాట నిజమే. మానసిక ప్రాకృతికసీమలు తోడుతోడుగా పోవును. మానసిక పరిశోధనలు మనస్సుద్వారానే చేయబడవలెను. కాని భౌతికసీమలో పనులు కేవలము మనస్సుద్వారానే కాక శరీరమువలనకూడ జరుగుచున్నవి. భౌతికసీమలో మన స్సెన్నో పనుల జేయుచున్నది త్రాళ్లు, ఓడలు మున్నగున వన్నియు మానసికభావముల వ్యక్తీకరణములే. కాని ఈ భౌతిక వస్తువులు శరీరముద్వారానే ప్రాకృతిక వ్యక్తీకరణము నందినవి. ఓడలను నిర్మించుటకు, త్రాళ్ళను (Cables) తయారుచేయుటకు పనిముట్ల నుపయోగింపవలెను. మన స్సు నాయకుడు లేక పనిముట్లా? మనస్సుకూడ ఒక సాధనమే (Instrument) కర్త కాదు.

పెద్ద పెద్ద ఓడలు, భవనములు, శిల్పములు మొదలైనవి మనస్సుద్వారానే యోచించబడి, శరీరముద్వారా తయారు చేయబడుచున్నవి.

నీ ఏకత్వమును గుర్తించుటకు నీవు రెంటిని ఉపయోగించ వలసినదే. ఏకత్వమును గ్రహించుట, మానసికసీమలో వ్యక్తీకరించుట యనునవి భిన్నవిషయములు. నీ ఏకత్వమును గ్రహించుటకు నీవు మానసిక భౌతికసీమల రెంటిని - రెండు లోకములను తృణప్రాయముగ చూడవలసినదే.

ప్రశ్న :—దేవుడు సర్వశక్తిమంతుడైనచో, మనమే దేవుడైనచో, కళ్లతో ఏల వినరాదు? చెవులతో ఏల చూడరాదు ?

ఉత్తరము :—నా కాళ్ళు, నాముక్కు, నాకళ్లు, నా చేతులు అని నీ వనుచున్నావు. అవి నీవైనచో, చెవులగుండా ఎందుకు చూడవు, కళ్ళగుండా ఎందుకు వినవు? దేవుడు ఒకడే అయినచో, సర్వశక్తిమంతుడైనచో, ఆయనను ఆయన ఇష్టమొచ్చినట్లు చేయనిమ్ము.

దేవుడు కొన్నిసీమలలో మనస్సు ద్వారాను, మరికొన్ని సీమలలో శరీరముద్వారాను ప్రకటించుకొనును. ఆతడు విశ్వమంతటా వ్యాప్తుడు. అతడు పరతంత్రుడైనచో, అతడు మనుష్యుని కోరికలు ప్రకారము చేయును.

మనుష్యులయొక్క న్యాయసూత్రములు, శక్తులు, కోరికలవలన ఆయన బంధితుడు కాదు కాబట్టి, ఆయన తన ఇష్టమొచ్చినట్లు చేయును.

నీవు ఆలోచించునట్టి, వాంఛించునట్టి మనస్సువు కావు అని రాముడు చెప్పుచున్నాడు. నీవు మనస్సువైనచో నీ ఇష్టముచ్చినట్లు చేయగలవాడవే. అప్పుడు నీవు మనస్సుయొక్క కార్యప్రణాళికను, దేహముయొక్క కార్యప్రణాళికగా మార్చవలనుపడెడిదే. కాని నీవు కామనాయుతమగు మనస్సువు కావు; ఈ ప్రపంచములో సమస్తము చేయుచున్న దేవుడెవరో అదే నీవు.

మనస్సు కతీతడవుకమ్మ. మనస్సు వాంఛించును. నీవీ కోరికలుగాని వాంఛలుగాని కావు.

ఏది చెట్లను పెరుగనట్లు, పక్షుల నెగురునట్లు చేయుచున్నదో అదీ నీవు. నీవే దేవుడవు; దేవుడే నీవు. దేవుడు నీయొక్క విశేషణము (గుణము) కాదు.

ప్రశ్న:- వర్తులములను వలయములను, (Rings and Rounds) అధ్యయనము చేయుట అవసరమా?

ఉత్త:- నీ మనస్సులో అజ్ఞానమున్నంతకాలము, నీకన్నివిధములైన ఆటవస్తువులు, అన్నివిధములైన ఆహ్లాదములు కావలెననియుండును. నీవు పెద్దవాడివైనప్పుడు, ఈ ఆటవస్తువుల నన్నిటిని వదలివేసెదవు. నిజమైన జ్ఞానము కలిగినప్పుడు, నీవుభౌతిక లోకముయొక్క, కారణ లోకముయొక్క ఆటవస్తువుల నన్నిటిని విడనాడెదవు. అది పొందనంతవరకు, నీ వీ వస్తువులతో సంతోషపడకమానవు.

జ్ఞాన మనగా అజ్ఞానమును తగులబెట్టుటే.

జ్ఞానాజ్ఞానములు ఒకే సోపానపరంపరలోని ఆరోహ ణావరోహణలు. అజ్ఞాన మనగా సోపానము క్రిందికిదిగుట. జ్ఞాన మనగా సోపానము పైకి ఎక్కుట. ఒకే వస్తువును దృక్కోణభేదముతో చూచుట.

ప్రకాశము, అంధకారము అనునవి భిన్నములుకావు. పరిమాణమందు భేదముగల ఒకే వస్తువని శాస్త్రము చెప్పు చున్నది.

ఒక చీకటి గదిలో ఘూర్ణనము. కొంచెమునే పయిన తర్వాత కంటిపాప పెద్దదగును. అప్పుడు నీవు చూడగలైదవు. అదివరకు చీకటిగా నున్నది వెలుతు రగును.

జ్ఞానాజ్ఞానములు విరుద్ధవస్తువులుకావు. భేదము పరి మాణమందుతప్ప, వస్తుగుణములో లేదు. నీ వజ్ఞానములో నున్నంతవరకు, జ్ఞానసోపానపు క్రింది మెట్టుపై నున్నా వన్న మాట. క్రిందిమెట్టుపై నున్నంతకాలము వర్తులములతోను, వల యములతోను సంతోషింపకమానవు; నీవు పైకెక్కినకొలది అవి వదలిపెట్టెదవు.

ప్రశ్న:- "వాయిస్ ఆఫ్ సైలెన్స్" అను పుస్తకములో ఇటుల చెప్పబడినది. "ప్రకృతియొక్క ఆత్మ, పురుషునియొక్క ఆత్మ ఎన్నటికి కలయజాలవు. రెంటిలో ఒకటి అదృశ్యము కావ లసినదే. రెంటికి తావులేదు." వేదాంతముయొక్క అభిప్రా యముకూడ ఇదేనా ?

ఉత్త:- ప్రకృతియొక్క ఆత్మ, పురుషునియొక్క ఆత్మ కలయజాలవు. ఈ రెండు శబ్దములకు, మామూలుగా అను

కొనుదానికంటె భిన్నమైన అర్థమున్న దని రాముడు తలచు చున్నాడు.

పురుషుని ఆత్మ నుపలబ్ధిచేసుకొనుటకుమున్నె ప్రకృతి యొక్క ఆత్మ అదృశ్యము కావలెనని చెప్పబడినదికాదా! ఆ ప్రకృతియొక్క ఆత్మ అనుదానినే రాముడు, నీటిలోబడు ప్రతి బింబమువలెనున్న తప్పుడహంకారము లేక అనాత్మ అనినాడు.

దేవునితో నీకుగల ఏకత్వము గురుతించుటకుముందు అది అదృశ్యము కావలెను. ఆ అర్థములో నది నిజమే. అజ్ఞానా లోచనలు పోవలెను. నీకు శరీరముతో తాదాత్మ్యమున్నదని చెప్పు: ఈ అజ్ఞానము, ఈ అంతయు నాదేనను క్షుద్రమగు అహంతయే ప్రకృతియొక్క ఆత్మ - అదియే ముందుగా నశించవలె

ప్రకృతియొక్క ఆత్మ, పురుషునియొక్క ఆత్మ అను శబ్దములకు- ప్రకృతిఇచటనున్నది; పురుషుడెక్కడనోనున్నాడు; ప్రకృతికొక ఆత్మవున్నది. పురుషునికి మరొక ఆత్మయున్నది. అవి రెండు వేరు వేరు పదార్థములు - అని అర్థమైనచో అవి తప్పు. ప్రకృతి పురుషుల కొకే ఆత్మ.

పురుషుడు అను శబ్దము ఇంగ్లీషులో అపార్థము చేయ బడుచున్నది. (Spirit is misunderstood) దార్శనికులు మనస్సనునదే పురుషుడనుదాని కర్థమైనచో అప్పుడుకూడ మనస్సుకు ప్రకృతికి రెండు వేరు ఆత్మలు లేవు. అవి రెండు ఒకటే. భేదము పరిమాణమందేగాని, స్వభావమందు కాదు.

మనస్సు, ప్రకృతి (matter) ఒకటేనని సైన్సు ఋజువు చేసినది. ప్రకృతి, శక్తి (చైతన్యము) రెండూ ఒకటేనని దార్శనికులు చూపెదరు.

ఇండియాలో 10,000 ఏండ్లక్రిందటే తెలిసియున్నను, అణువులు శక్తికేంద్రములని యూరోప్‌నకు లైబ్‌నిజ్ ముందుగా చూపెను. ఈ సిద్ధాంతమును సైన్సు ఋజువుచేసినది. గణితశాస్త్రపు లెక్కలతో లార్డు కెల్విన్ ఒక ప్రసిద్ధ నిబంధనలో ప్రకృతి, శక్తి (Matter and Force) ఒకటేనని చూపినాడు. అట్టిచో ప్రకృతిపురుషు లెట్లు భిన్నులు? ఒకవేళ ఆయన మనస్సు, ప్రకృతి అను అర్థములో ఉపయోగించినను అవి రెండూ ఒకే వస్తువులు కదా!

పర్వతములవద్ద కెళ్ళుదు. హిమాలయములపై నీవెంతో వైభవోపేతములైన దృశ్యముల జూచెదవు. అచ్చట పుష్పముల సౌరభము, పక్షుల కలరవము, నదీఘోషలు, శీతల వాయువులు — ఇవి అన్నియుకలవు ఇవి ఏమిటి? ఇవి ప్రకృతి కావా? కాని ఈ ప్రకృతియంతయు, శక్తిలోనికి — ఆలోచనల లోనికి, ఉత్సాహములోనికి, దైవచైతన్యములోనికి మారొంది సంగీతముగా పరిణమించి నీలో ఉన్నతభావములను సృష్టించుచున్నది. ఇట్లు బాహ్యప్రకృతి భావములుగా పరిణమించుట చూచుచున్నాము. మీ పెద్ద పెద్ద భవనములు; ఓడలు, పట్టణములు, నగరములు, స్త్రీపురుషులు — వీని సంగతి మాత్ర మేమి? ఒకప్పుడివియన్నీ కేవలము మనోభావములుగా

నుండెను. ఇట్లు మొదటగా మనస్సులో కట్టబడి ఆపై బయట నిర్మింపబడెను.

నీరు ఆవిరిగాను, ఆవిరి నీళ్ళుగాను మార్పుబడినట్లే హిమాలయములలో భౌతికపదార్థములు మానసికభావము లుగా మారుచున్నవి. దీనివలన ఏమి తేలుచున్నది? రెండూ ఒకటే నని. ప్రకృతిపురుషులు భిన్నులైనచో, పురుషుడు ప్రకృతిపై తన ప్రభావ మెట్లు చూపగల్గును?

పర్షియన్ భాషలో ఒక అందమైన పద్యము కలదు. దాని తాత్పర్య మిది: మేఘములనుండి కన్నీటిరూపముగా ఒకచిన్న నీటిబిందువు పడెను "ఈ ఏడ్పెందుకు" అని అడుగగా ఆకన్నీరు ఇటుల సమాధాన మిచ్చెను. "ఆహా! నే నెంతటి చిన్న దానను: క్షుద్రమైనదానను; నే నెంతటి తుచ్ఛురాలను; చిన్న దానను; సముద్ర మెంతటి పెద్దది. నా చిన్నతనమును చూచు కొని నే నేడ్చుచున్నాను." "ఏడువబోకుము. నామరూపము లకు మాత్రమే సంకుచితముగా బంధితుడవు కాకుము. లోనికి చూచి, నీవేమిటో తెలిసికొనుము. నీవు నీరు కావా. సముద్ర మేమిటి? అదిమాత్రము నీరుకాదా? నిన్ను నీవు దిక్కాలముల వలన పరిసీమితమైన దానినిగా చూచుకోకుము. దిక్కాలముల కావలచూచి, నీ సత్యత్వమును గమనింపుము" అని దానికి చెప్పిరి; ఒక వస్తువుకు సమానముగానున్న మరిరెండు వస్తు వులు పరస్పరసమానములుకదా! కాలపరిసీమితునిగా చేసి కొనినప్పుడు నీవు దుఃఖితుడ వయ్యెదవు. అన్నిటిని దాటి పొమ్ము. ప్రకృతి పురుషులు మాత్రమేకాక, అన్నివస్తువులే

ఒక చేఆత్మ కాలాతీతము. ప్రపంచమంతయు నీలోననేఉన్నది కలలలో నీవు అడవులలోనికి కొండలలోనికి, పోయినట్లును, నదులను, వాగులను చూచినట్లును, అవన్నియు ఎచటనో బయట నున్నట్లును తోచినను, అవన్నియు నీలోనేకదా ఉన్నవి. అవియన్నియు బయటనున్నచో, గది నిలువదుకదా! పర్వతం తయు నీవు వాచు నీటితోనే తడసిపోవును కదా!

అటులనే, వేదాంత మిటుల అనుచున్నది. "ప్రపంచ మంతయు నీలోనే ఉన్నది కారణ, మనో లోకములుకూడ నీలోనే ఉన్నవి. అయినను నీవువానిలో నున్నానను కొనెదవు. తన బొటనవ్రేలిపై నొకఅద్దమును ధరించినస్త్రీ దానిలోనికి చూచుకొని, తానసలుబయటనే యున్నాను అద్దములో నున్నానని తలచినట్లే, ప్రపంచము నీయందున్నదిగాని, నీవు ప్రపంచమందున్నావు. రెండువిధముల సంభాషణలున్నవి. తలతో మాట్లాడునది; హృదయముతో మాట్లాడునది; తలతో మాట్లాడు సంభాషణతో ఏ క్షణములోనైనా త్రాగవచ్చును. గాని, హృదయముతో మాట్లాడుసంభాషణతో కష్టము.

అనేకరకములైన బూరలున్నవి. కొన్ని నెమలికూత వలెను, కొన్నికోడికూతవలెను, మరికొన్ని పందికూతవలెను ఉండును. ఈబూరలలోగూడ ఊదినచో పంది అరచినట్లు, కోడికూసినట్లు, ధ్వనివచ్చును. కాని అసలు కోడినో, నెమలినో నీఇష్టమొచ్చినప్పుడు అరచునట్లుగాని, అరుపును ఆపునట్లుగాని చేయలేవు. అవి దిక్కాలములచే బంధితములు కావు. హిమా లయములలో సంగీతము ప్రవహించుచుండును. అది భావ

ములుగా మారి ఎచటికిపోవునో ఎవరూ ఎఱుగరు. అది నశించునా? లేదు. వృక్షములు దానిని సంరక్షించును. నదులు దానినిదాచును. భూమిదానిని కాపాడును. అది వాతావరణము గుండాపోయి ప్రపంచమంతా తగినవాడు దొరికినదాకా ప్రయాణముచేయును.

భావపరంపరఅంతా దేవునినుండే వచ్చును. అది ఈ క్షుద్రమైన అహంతనుండి రాదు. అహంకారము నశించినప్పుడే అదివచ్చును.

రాముని అభిప్రాయముప్రకారము బైబిల్ మాత్రమేగాక అన్నిపుస్తకములూ, ఎమర్సన్ పుస్తకములు, డార్విన్ పుస్తకములు షెక్స్పియర్ పుస్తకములు, అన్నియు వేదములవలెనే ఈశ్వరప్రేరితమైన పుస్తకములే, మనుష్యుని క్షుద్ర అహంకారము అవతలపెట్టబడినదాకా అపరాజాలవు

ప్రశ్న :- వివాహము చేసికొనినవాడు మోక్షము నందగల్గునా? ఆత్మను తెలిసికోగల్గునా?

ఉత్త :- సన్యాసులకంటే వివాహితులకే వేదాంత మెక్కువఅవసరము. హిమాలయములలో నుండువారికంటే వీరికే అది ఎక్కువఅవసరము.

ప్రతికుటుంబములోనూ భార్యను సంతోషపెట్టవలెనని భర్తా, భర్తను సంతోషపెట్టవలెనని భార్యా కోరుచునే యుందురు గాని, ఎన్నకోరికను నిష్ఫలితమేమిటి? వారిద్దరికి కలసి పరస్పరపోషణమో చివరకొప్పునది ఎవరిది దోషము? వారి

మంచికోరికలదేనా దోషము? కాదు. వారిఅజ్ఞానమునే దూషించవలసినది. ఒండొరులక్షేమ మెందులోనున్నదో వారికి తెలియదు. ఇదియే అన్నికష్టములకు విపత్తులకు మూలము.

ఒండొరుల క్షుద్రఇంద్రియవాసనలను తృప్తిపఱచుట వలన తమసంతోష మభివృద్ధి యగునని వారు తలతురు. ఒక రొకరి అతిశయమును తృప్తిపఱచుటవలన మంచికలుగునని తలతురు. వారు మంచిఅనిత లచునదంతయు అజ్ఞానమువలననే. అట్టిఅజ్ఞానము నిర్మూలించినప్పుడే, ప్రతిగృహము సుఖపడును.

మనము దేవునిగాని, ప్రకృతినిగాని మార్చలే మని జ్ఞాపకముంచుకొనుము. మనమాత్మచైతన్యము నొందవలెననే ప్రకృతియొక్కయు, విధియొక్కయు నియమము. ఈలోకములోని తెలివితక్కువతనము, మనుష్యులప్రపంచజ్ఞానము ఇదంతయు ప్రతివానిని తనదివ్యత్వము వైపునకే, దేవునితో తనకు గల ఏకత్వము వైపునకే తీసుకుపోవుచున్నవి. కత్తిసాముచేసి ప్రతివాడు వేదాంతి అగుట నేర్చుకోవలసినదే.

మిమ్ము నమ్మించుటకు వేదాంతము ఖడ్గమును, నిప్పును తీసుకు రా నక్కరలేదు. ప్రకృతి నియమము లన్నియు నిన్ను ఆత్మానుభూతివైపుకు తీసుకపోవు దేవుని సైనికభటులు. అందుచేత నీవు రావలసినదే. నీవు మరొక విధముగా చేయలేవు;

నీపొరుగువాని క్షేమ మెందున్నదో నీవెఱిగినచో నీ ప్రకృతి నియమముల అనుసారము పనులు చేసెదవు. ప్రతి ఇల్లు, ప్రతి మురికికొంప అతని ఇల్లుగా మార్చబడును.

ప్రకృతి నియమముల ప్రకారము మంచి యనునది దేవునితో గల నీ ఏకత్వమును గ్రహించుటలో నున్నది. నీవు స్వతంత్రుడ వగుటలోనే నీ మంచి గలదు. సర్వశక్తిమంతుడైన, అనంతుడైన దేవుడు నీవేనని గ్రహించినప్పుడే నీవు స్వతంత్రుడవు "నేను ఫలానివాని కొడుకును" అని అనుకొనినట్లే దేవునితో గల నీ ఏకత్వమును గ్రహించి ఇప్పటి పరిస్థితిని తారుమారు చేసి, దేవత్వము ననుభూతిలోనికి దెచ్చికొని, అది నీకు యథార్థమై, "నేను ఫలానివాని కొడుకును" అనునది కలగా భూతకాలపు వస్తువుగా అయినప్పుడే నీ వాత్మానుభూతి నందినట్లు.

నీవు దేవచైతన్యము నందవలె ననే ప్రకృతియొక్క ప్రణాళిక యని, నీకష్ట విపత్తు లన్నియు నిన్నామూలకే తీసుకపోవుచున్న వనియు, నీకు గణితశాస్త్రీయయాదార్థ్యముతో నిరూపించ వచ్చును. నీ వా ఆదర్శమును అందుకొనకపోవుటలోనే దుఃఖము కలుగుచున్నది. కావున, ఆ ఆదర్శము నందుకొనుము. నీకిక పాప ముండదు. నీవు ప్రతిదానికి అతీతుడ వయ్యెదవు; నీవు స్వయముగా సంపూర్ణుడవు; దివ్యుడవు.

అనుభూతి ఒక్క అంగలో రాదు. దానికి కాల మవసరము. ఉత్క్రాంతిలో ఈస్థితికి వచ్చుటకు ఈ దేహమున కెన్నో వేల ఏండ్లు పట్టినది.

గతమందు నీవొకప్పుడు చెట్టుగాను, ఒకప్పుడు ఆఫ్రికాలో నొక బానిసగాను, మరొకప్పుడు మరొక దేశములో మరొక జాతిగాను ఉంటివి,

ఒక ఇల్లు పడ ద్రోయుటకు కూడ కొంత సమయము పట్టును. కాని కట్టుట కెంత సమయము పట్టునో అది ద్రోయుట కంత పట్టదు. నీకు తగినంత తుపాకిమందో, లేదా నీకు వలసి నంతశక్తో ఉన్న నీవు పడ ద్రోయ గల్గెదవు కాని చాలమందికి దానిని పడగొట్టుటకు కావలసినంత తుపాకిమందుండదు.

ఈ తత్వమును మానవ బుద్ధితో నైనాసరే గ్రహించి భార్యాబిడ్డలతో నున్నవాడు స్వతంత్రుడు. వాడు జనన మరణచక్రమునకు లోనుకాడు; అని వేదాంత మనుచున్నది. ఈ జీవితములోనే జీవన్ముక్తిని అనుభవములోనికి తెచ్చుకొనుటకు, నీవు మార్గాంతరము నవలంబించ నక్కఱలేదు. మరణా నంతరము వారికి ప్రసాదింపబడునని చెప్పిన మోక్షము నిచ్చ టనే పొందుటకు, వేదాంతము బుద్ధికి గ్రాహ్యమైనట్లు అంగీకరించు వారందరు దానిని ధ్యానములోనికి, ఆచరణలోనికి తేవలెను. వారు దానిని చేయవలె; తెలుపవలె

ప్రాత నిబంధన గ్రంథములో మోక్షము కర్మవలన లభ్యమనియు, క్రొత్త నిబంధన గ్రంథములో మోక్షము శ్రద్ధవలన లభ్యమనియు, చెప్పబడినదని వారందురు. కాని అసలు ఆనంద ధామమగు మన స్వర్గము జ్ఞానమువలననే లభ్యము.

కర్మలోనుండే మోక్షము నియ్యలేవు; జీసస్ క్రైస్టులో శ్రద్ధ (విశ్వాసము) కూడ మోక్షమీయలేదు. మోక్షము నీ ఆత్మద్వారాగానే వచ్చును. నీ యాత్మనే నీవర్థము చేసికొనవలెను; ఆ క్షణముననే నీవు స్వతంత్రుడవు

తెలుసుకొనుట యనునది ద్విధము, మానసికము, హృదయపూర్వకము.

ఆత్మను హృదయపూర్వకముగా తెలిసికొనుటయే జ్ఞానము; మోక్షము జీవత్ శ్రద్ధవలనో జీవత్ జ్ఞానము వలనో వచ్చును. ఇది నీ కుండవలెను. దానినుండి నీవు దిగజారిపోయి నచో నీవు దుఃఖమందు మునిగెదవు; నీ కర్మ వుండవలసినదే.

మన మామూలు గృహాస్థ లో జరుగున దేమిటి? భార్యాభర్తలు ఒండొరుల మోక్షమును సాధించుటలోను, సంపూర్ణతను, నిజమైన ఆత్మజ్ఞానమును పొందుటలోను పరస్పర సహకారము చేసికొనవలెను. వారటులు చేయుచున్నచో భర్తకు జీవత్ శ్రద్ధకలుగునట్లుగా, ఆత్మజ్ఞానము కలుగునట్లుగా భార్యచేయుచో, ఆమె భర్తయెడల తృప్తి యున్నమాట. భర్త అటులచేసిన భార్యయెడల తృప్తి అగును. కాని మామూలుగా భార్య భర్తకు జుడాస్ ఇస్కేరియట్. భర్త భార్యకు జుడాస్ ఇస్కేరియట్ అగుచున్నాడు.

నిన్ను ఒగినాభిముఖుని చేయుచున్నది నీ అజ్ఞానమేగాని సంసారములోని ఏవిషయము కాదు. సంసారసంబధములను సద్వినియోగము చేయకపోవుటవలననే ఇటుల అగుచున్నది. ఇంటిలో భార్య జుడాస్ పాత్ర వహించుచున్నది భర్త తన ఆత్మను 30 వెండి నాణెముల కమ్ముకొనవలె నని ఆమె కోరుచున్నది. ఆమె తన ఆత్మను నగలకు, కూర్చొను గదిలోని అలంకారవస్తువులకు అమ్ముకొనుచున్నది. భర్త అంతే చేస్తు న్నాడు. భార్యాభర్తను తనమీద ఆధారపడక స్వతంత్రుని

గాను, భర్త భార్యనట్లే స్వతంత్రురాలనుగాను చేయవలెను. కాని భర్త భార్యను తనదానినిగా గుర్తించుకొమ్మనియుగా, భార్య భర్తను తనవానినిగా గుర్తించుకొమ్మనియు కోరుదురు. అప్పుడే కష్టమొచ్చునది. ఆమె వానిని, వాడామెను బానిసలుగా చేయకోరుదురు.

ఎద్దునొకదానిని నీవు త్రాటితో కట్టి దానినా త్రాటితో పట్టుకొన ప్రయత్నించుచో, నీవు ఎద్దును పట్టుకొనుటయేగాక ఎద్దుకూడ నిన్ను పట్టుకొనేయున్నదన్నమాట. ఆస్థియంతయు బంధనమే.

ఆస్థిని విలువజేసే ఈ బుద్ధిపోయి తీసికొనుటకుబదులుగా ఇచ్చుటయను బుద్ధివచ్చుచో ప్రతి ఇల్లు స్వర్గము కాగలదు.

భార్యా భర్తలిరువురు పరస్పర సహాయము చేసికొనుటకు తమ చేతనయినదంతా చేయవలెను. ఏమియు కోరకుము; ఏమియు ఆశింపకుము, ఇక నప్పుడు ప్రతిది నీకు వచ్చును. నీవు స్వర్గసుఖములతో నిండిపోదువు.

"నాకీవస్తువు నిమ్ము, నాకా వస్తువు నిమ్ము" అని నీవనెదవు. అది నీకు తేబడును. అది నీవద్దనుండి తీసివేయబడినచో, అదికావలెనని దిగులుతో బాధపడెదవు. వాంఛయనునది ఒక రోగము; అది నిన్ను ఎప్పుడు అయోమయస్థితిలో నుంచును.

కోరిన వస్తువు లభించినప్పుడు సంతోషమువచ్చునేమో కాని, దానికిముందు ఎంతోసేపు అయోమయస్థితిలో నుండ వలసివచ్చునుకదా !

ఒకరినుం డేమియు కోరిక ఇచ్చుచుండిన ఆ ఇచ్చుటలో సంతోషమును పొందెదవు. ఏవస్తువలో నున్నట్లు తలతువో అందులోనే సంతోష ముండును. ఇచ్చుటలోనే సంతోష ముండును. ఇచ్చుటలోనే సంతోషమున్నట్లు తలచుము. తీసు కొనుటలో వద్దు. ఒకరికి ఇచ్చుట ఎప్పుడు సంతోషమును తెచ్చును.

నీ చిప్పకొక 50 డాల ర్లిచ్చినప్పుడు అది నీ హృదయము నకు తృప్తి నిచ్చును.

దాతృస్థానములో నున్నవాని కెప్పుడూ సంతోషమే.

భార్యాభర్త లిరువురు దాతృస్థానమునువహించి, ఏమియు ఆశింపకుండ ఉండి నప్పుడే గృహములో ఆనందము తాండవించును. అప్పు డిరువురు సంతోష పడెదరు. అయితే ఇయ్యవలసిన దేమిటి? వానికి, ఆమెకు చేత నయినంతవరకు జ్ఞానమే. రెండవవారిని పవిత్రులుగా చేయుదానినిబట్టి నీవు సరైన భార్యవు; లేక భర్తవు. అది సూత్రము.

ఇండియాలో నొకప్పుడు శిఖధ్వజుడను విఖ్యాతుడైన చక్రవర్తి వుండెను. అతడు దేవచైతన్యము నందగోరి, అటుల చేయుటకై సంసారము నొదిలివేయవలె నని తలచెను.

అతని భార్య పేరు చుడాల. ఆమె అతనికి బోధింపగోరెను: కాని అతని కామెయున్న లెక్క లేదు; గాన అమె మాటలు వినడాయె.

అతడు సమస్తము, రాజ్యముత్యజించెను. అతని భార్యయే పరిపాలకు రాలయ్యెను. తరువా తాతడు హిమాలయముల కెళ్ళి అచట చాలా పాక ఏడాది ఉండెను.

ఈనడుమని ఆతని భార్యయగు సామ్రాజ్ఞి ఆతనికి వాస్తవమైన ఆనందమునిచ్చు నొక ఉపాయముచేసెను. ఒకనాడామె సన్యాసిని వేషము వేసికొని భర్త ఉంటుండిన ఆశ్రమము వద్ద కెళ్ళెను. ఆతడు ధ్యానావస్థలో నున్నందున, ఆమె ఆతని ప్రక్కనే, అతడు బాహ్యస్థితిలోని కొచ్చువరాక నిలుచుండెను. కళ్ళు తెఱచి అత డామెనుచూచి ఎంతో సంతోషపడి, ఆమె ఎవరో పెద్ద సన్యాసిని యని తలచి ఆమెపై పుష్పములను కురిపించెను.

ఆమె ఆనందస్థితిలో నుండెను. "నన్నుద్ధరించుటకు దేవుడు మీ రూపముగా అవతరించె నని తలతు"నని ఆతడనెను. ఆమె అవునననెను. ఆతనామెకు బోధింపగోరి బోధించెను. అమె ఇటుల అనెను. "ఓ రాజా! నీవు పూర్ణానందము ననుభవింవ గోరుదువేని నీవు సమస్తము త్యజించవలెను". ఆత డాశ్చర్యముతో ఇట్లనెను. "నేను నా సామ్రాజ్యమును, భార్యా బిడ్డలను వదిలినాను" "నీ వేమియు వదల లేదని" ఆమె అనెను,

ఆతన కర్థముకాక ఇట్లడిగెను, "నేను సన్యాసిని కానా? నేను సామ్రాజ్యమును, కుటుంబమును వదల లేదా?"

ఆమె జవాబిచ్చెను. "లేదు లేదు. నీ కింకను ఏమీ లేదా?" "అవును. ఈ ఆశ్రమము, ఈ దండము, ఈ కమండలము ఉన్నవ"ని అతడు బదులు చెప్పెను. ఆమె ఇట్లనెను. "అయితే నీవు సన్న్యాసివి కావు. నీ వేదైన వస్తువును కల్గియున్నంతవరకు ఆవస్తువ నిన్ను కల్గియున్నట్లే. (నీ వా వస్తువుకు బానిసవే) వ్యాపార ప్రతివ్యాపారములు వెనువెంటనే ఉండును గాన, దేనికి బానిసగాకుండ నీవు దేనిని కల్గియుండలేవు" వెంటనే అతడు ఆ ఆశ్రమమును తగులబెట్టి, దండమును నదిలో బారవేచి, కమండలమును తగులబెట్టి "ఇక నే నిప్పుడు సన్న్యసినేనా?" అని అడిగెను: "వీటిని త్యజించుటవలన సన్న్యాసము రాదు" అని ఆమె అనెను. "రాజా! నీవు ఆశ్రమమును తగులబెట్టినావు. కాని నీ కింకా ఈమట్టి—ఈభౌతిక దేహము—ఉన్నదికదా! నీ వా వస్తువులను పాడుచేయుట తప్పు. దాని వలన వచ్చున దేమీ లేదు. నీ కదివఱకున్న ఈ మట్టి ఇప్పుడూ ఉన్నది" అత డాలోచించి దేహమును కూడ కాల్చివేయ నిశ్చయించెను. కట్టెలనుపోగుచేసి, వానిని మండించి అందులో దూకబోవుచుండగానే భార్య వారించి ఇట్లడిగెను "ఓ రాజా, నీ శరీరము కాలిపోయినప్పుడు ఏమి మిగులును?" "బూడిద మిగులు నని" అతడు చెప్పెను. "ఎవరి బూడిద" అని ఆమె అడిగెను. "నా బూడిద" అని అతను చెప్పెను. "అయితే నీకు బూడిద ఉండవలసినదే. దేహమును కాల్చివేయుటవలన నీకు మోక్షమురాలేదే" అని ఆమె జవాబిచ్చెను. అత డాలోచించి ఇట్లనెను, "నే నెట్లు సన్న్యసింపవలెను? ఏమి సన్న్యసింప వలెను?"

ఆమె అడిగెను "ఇది ఎవరి దేహము?" "నా దేహము" అని ఆతడనెను. "అయితే దానిని సన్న్యసింపుము." "ఇది ఎవరి మనస్సు?" "నా మనస్సు" "అయితే దానిని త్యజించుము" రాజును ప్రశ్నలు వేయునట్లు చేసెను "అయితే నేను ఎవరు? నేను మనస్సుకాకపోయినచో, నేను పేరే ఏమిటో, నేను దేహముకూడ కాకపోయినచో మరేదో కావలసినదే" ఆతడాలోచించి, ఈ నిశ్చయమున కొచ్చెను; "నేను దేవులకు దేవుడను; ప్రభువులకు ప్రభువును; అనంతసత్తను, పరమ *శివుడను" ఆతడటుల గ్రహించి ఈ పరమశివత్వమును త్యజింపవీలులేదని అనెను.

అన్నిటికంటె ప్రియమైనవి సన్నిహితమైనవి ఏవో, ఆ వస్తువులనే ముందు త్యజించవలెను. నేనిది చేయుచున్నాను నేను కర్తను, నేను భోక్తను అను ఈ అసత్యవ్యక్తిత్వములో తోచుభావము, ఈ అహంకారమును నేను వదిలివేయవలె; "నా భార్య" "నా మనస్సు" "నా పిల్లలు" అను ఈ ఆలోచనలను త్యజించనిదే మోక్షము రాదు.

నీ వడివిలోనికి బోయినను, దీనినో దానినో నీకు చెందునట్లుగా చేసుకోవలెనను: భావము పోదు గాన నీవు సన్న్యాసివి కావు. ఆశ్రమవాసు లందరు ఈ భావములేకుండ ఉండరు. ఒక్కొక్కసారి కొందరు రాజు లీ భావమును పోగొట్టుకొందురు;

---

* శివం - Excellence.

ఈ అనాత్మను, ఈ అహంకారమును వదలువాడే సన్న్యాసి. "నే నిది చేయుచున్నాను; నేనది చేయుచున్నాను; ఇదినాది" అను భావముల నెప్పుడు మనస్సులో నుంచుకొను వాడు సన్న్యాసి యనవచ్చునా? లేదు; ఎప్పుడు వాడు సత్యమును తెలిసికొని, అనుభవ పూర్వకముగా "నేనే సత్యమును, నేనే అఖండత్వమును" అనగా ప్రపంచము నంతను ఏలుశక్తిని, ప్రభువును నేనే; అని గుర్తించునో అప్పుడు వాడే సూర్యచంద్రులు, నక్షత్ర ఆకాశములు, అప్ తేజస్సులు ఎందు కన ఇవన్ని అతని అంగభూతములు.

ఆ రాజుభార్య ఇంకా కొంతకాలముండెననియు, ఒక సారి ఆమె తన యోగినీవేషమును ఆవలబెట్టి రాజు నవమానించి మరొక ప్రియునితో నున్నట్లు అతనికి నమ్మకము కలుగునట్లు చేసెను.

ఆమె తరువాత రాజువద్దకొచ్చి క్షమింపమని యాచించెను. "రాజా, నన్ను క్షమింపుము; నేను దుష్టురాలను, నేను నిన్ను అవహేళన చేసితిని. క్షమింపమని ప్రార్థన" రాజామె వంకచూచి ఇట్లనెను, "అమ్మాయీ ఈ క్షమార్పణల కర్థమేమిటి? అజ్ఞానచోదితుడనై ఈదేహమునే నమ్మి ఈదేహము నాదని, నీవు నాదానవని నమ్మియున్నచో నీనడత నాకు బాధను కలుగజేసెడిది; వాంఛకులోనై అంతయు నాదను బుద్ధి కలిగియున్నట్లయితే నా కెంతో దుఃఖము కలిగెడిది. కాని నా కీ దేహములో భర్తయనున దేమీ కనుపడుటలేదు. నా చేతులలో ఎట్టి ప్రాదును లేదు; నా కేమియు నా దనునది లేదు,

నేనూ ఎవరిబానిసనూ కాను; నేనంతుడను. అమ్మాయీ, నీవు పవిత్రురాలవు కావచ్చు. అయితేనేమి? అపవిత్రులైన ఇతర స్త్రీలీ లోకములో నున్నారు; వారూ నావారే. విశ్వతేజస్సు నేనేగాన, నేనే లోకమునకంతకు యజమానిని; నేను దేనికి దుఃఖించవలసినది, దేనికి సంతోషింపవలసినది."

నీ పొరిగింటా బిడ ఏమైన తప్పుచేసిన నీకేమి దిగులు లేదు. నీ పెండ్లా మేమైన తప్పుచేసినచో నీ కపారదుఃఖము. ఇదంతయు మమత్వము వలెనే వచ్చునది.

రాణి తిరిగి రాజధానికి వెళ్ళి, తిరిగి వెంటనే రాజు వద్దకు వచ్చి ఇట్లనెను, "రాజా, నీవు నిజముగ దేవుడవు. నీ వెక్కడనుండిన నేమి? ఆరాచభవనములకంటె ఈ హిమాలయములు నీ కేమైన ఎక్కువ సొత్తా?" రాజు తాను సర్వవ్యాపుడనిన బదులుచెప్పెను "ఈ దేహము లన్నియు నావి. తక్కిన దేహములకంటె ఈ దేహము నా కేమీ ఎక్కువ స్వంతము కాదు. జ్ఞాని దృష్టిలో ఈ దేహము లేనే లేదు. పూర్ణ సత్యము నెరుగనివానికి మాత్రమే దీని అస్తిత్వము అని అతను చెప్పెను.

ఈ లోక మంతయు నీ భావముల వలననే సృష్టింపబడినది. గణితశాస్త్రీయసత్యమువలె ఇదియు అకుంఠితమైన సత్యము.

వారు రాజును తిరిగి సింహాసన మెక్కించిరి. అత నీ వైభవము లన్నిటి మధ్య ఇంద్రియదాసుడుగాక జీవించు

చుండెను. ఆతను 25 ఏండ్లు పాలించెను. ఆత నెవరు ? ఆతడు రాజు కాడు; సామ్రాట్టు కాడు; సాక్షాత్ భగవంతుడే. ఇదీ సన్న్యాసము.

ఆతనికి నాళ్లు మట్టిపెల్లలు, గులాబీలు కొత్తని దిండ్లు, పట్టుపరువులు రాచభవనములు – అన్నీ ఒకటే,

"దీని సంటకుము దాని సంటకుము" అని జను లందురు ఇండియాలో "ఆ సక్తిని వీడుము, వైషమ్యమును అసూయను వదలుము" అని చెప్పెదరు.

ఇండియాలో సన్న్యాస ఆశ్రమస్వీకారము సత్యాను భూతికి సోపానముగా ఎంచబడును. నీవు దేవత్వము ననుభ వించినప్పుడే సత్యానుభూతి కలిగినట్లు సాడంబరమైన బాహ్య సన్యాసము పనికిరాదు. తన భార్యద్వారా ఆ రారా జెట్లు తన లోని ఈశ్వరుని గాంచెనో చూచినావు కదా ! వివాహితులైన స్త్రీపురుష లుండవలసిన దట్లు; వారు పరస్పర్శము మోక్షము సాధించుటలో సాయము చేయవలసినది అట్లు ఇంటిని స్వర్గ ముగా చేసుకోవలసిన దట్లు.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !

## పునర్జన్మ : కుటుంబ బంధములు

ఎకేడెమి ఆఫ్ సైన్సెస్‌లో డిశెంబరు 27, 1902, న ఇచ్చిన ఉపన్యాసము

### స్త్రీపురుషుల రూపముగా నున్న నేనే !

ఇండియాలో నొక సారొక భాగ్యవంతుడైన వైశ్యుడు తన పట్టణములోని వారందరికి పెద్ద విందు చేయుచుండెను. పెద్దపెద్ద విందులకు భోగము మేళమును పిలచుట యలవాటు, ఇప్పుడీ ఆచారము ఇండియాలో విడనాడ బడుచున్నది. కాని కథాకాలమునాడు ఈ ఆచారము బాగా అమలులో నుండెను.

ఆ విందులో నొక వేశ్య పాడుట ఆడుట ప్రారంభించెను. చాలా ఎక్కువగా ఇంద్రియ వాసనల నుత్తేజింప చేయునట్టి అందరు అసహ్యించుకొనునట్టి చెడ్డపాట నొకదాని నది పాడెను; కాని ఆ సారి అందరి హృదయములలోను హత్తుకు పోయెను. ఏమిటి కారణము? ఇండియాలో చదువుకొన్నవారు సంస్కృతి గల యువకులు అట్టి పాటల నెన్నడు ఆమోదించరు. కాని ఆ నాడు వినినవా రందరికి బట్టలూడునంతటి ఆనందము కలిగెను. ఆ విందు జరిగి ఎన్నో నెలలకుగూడ ఆనాడా పాటను విన్న విద్వాంసులు వీధులగుండా దానిని మెల్లగా పాడుచు పోవుచుండిరి. పెద్దమనుష్యులు వుబుసుపోకకు పోవునప్పుడు దానినే పాడుకొనుచూ పోవుచుండిరి దానొక్క సారి వినినవారంతా దాని నెంతో ప్రేమించి హృదయములలో దాచుకొనుచుండిరి.

అయితే ఇందులో విశేష మెక్కడ నున్నది? ఆపాటవినిన వారి నెవరినైనా అడగండి; ఏమి టాపాటలో విశేషము,ఎందుకు మీా రాపాటనంతగా ప్రేమించటం అని. ఆపాట ఎంతో అంద ముగా నున్నదని, ఎంతో మధురముగా నున్నదని, ఎంతో హృదయరంజక మైనదని వారందరు చెప్పెదరు. కాని ఆపాటే ఆభోగంపడుచు పాడకముందు వారికెంతో అసహ్యముగ నుండెను. కాని ఇప్పుడు వారి కది ఇష్టము. ఇది పొరపాటు. అసలు విశేషం ఆ పడుచు ధ్వనిలోను, ముఖములోను, ఆకృతి లోను, పాడు పద్ధతిలోను ఉన్నది. అసలు ప్రత్యేకత ఆపిల్లలో వున్నది. అదే పాటకు మార్చబడింది.

ప్రపంచంలో జరుగున దది. మంచిముఖము, చక్కని కళ్ళు, ముక్కు, గల గురువొకడువచ్చును. అతని ధ్వని ఎంతో మధురముగా నుండును; మాట్లాడునప్పుడాత డివైపు ఆవైపు వయ్యారముగా వంగగల్గును. అతను చెప్పేదంతా ఎంతో ఆకర్ష కంగా సుందరంగా వుంటుంది. అది ప్రపంచంచేసే పొరపాటు. ఎవరూ సత్యమును పక్షపాతరహితంగా పరీక్షించరు; ఎవరూ పా టేమిటో చూడరు విషయాలను చెప్పే పద్ధతి, ఆ భంగిమ, బాహ్యవస్తువులలోని విశేషము – ఇవీ బోధలను మనోరంజక ముగా ఆకర్షకంగా చేసేవి.

నిన్నొక పెద్దమనుష్యుడు రామునితో ఒక స్వాముల వారినిగూర్చి – వివేకానందస్వామినిగూర్చి మాట్లాడుచుండెను. "అయనవి చక్కని ముక్కు, కండ్లుకదా" అను ప్రశ్న వేయ

బడెను. మీరు శ్రద్ధవహించునది ముఖ్యా, కండ్లను గూర్చా, లేక ఉపన్యాసములను గూర్చా?

అది ప్రపంచముయొక్క పద్ధతి. ఎక్కువమంది ఉపన్యాసకులలోని విశేషము వారు మాట్లాడు పద్ధతిలోను, వారి ధ్వనిలోను ఉండును; కాని వారి ప్రత్యేకత వారి ఉపన్యాసములో నున్నదందురు. వస్తువులను వాటి విలువనుబట్టి గ్రహించవలె. ఉపన్యాసకుని శరీరమువంక గాక, ఉపన్యాసకునివంక చూడకుము. ఈ మాటలు ఎంతో కఠినముగాను వికటముగాను కనపడునుగాని రాముడు వ్యక్తులనుగౌరవించడు. రాముడు మిమ్ములను గౌరవించును; మీరు సత్యము కాబట్టి సత్యమే మీ ఆత్మ; ఆ అర్థములోనే రాముడు మిమ్ము గౌరవించునది. చెప్పువిధము, పద్ధతి, మీకు బాగోకపోయినా స్త్రీ పురుష రూపముగానున్న నాకు రాముడు చెప్పునదేమన? మీకు రాముడు చెప్పునదేమన? మీకు నిజమైన ఆనందము కావలసియున్నచో, మీకు శాంతి కావలెనన్నచో మీరు రాముని ఉపన్యాసములకు రావలసినదే; వినిపలసినదే. అవి మీ కానందమ్ము నిచ్చును. వాటి విలువనుచూచేవానిని గ్రహించండి. వానినిగూర్చి మననం చేయుంబడి. మీరు వినేమాటలను ధ్యానం చేయండి; ఇంటికిపోయినతర్వాత వానిని జ్ఞప్తి తెచ్చుకొని అమలులో నుంచుకొన ప్రయత్నించండి.

రాముడు వేదాంతమతమును గూర్చి మాట్లాడదలచెను. కానిరామునికి సమాధానమిమ్మని ఎన్నో ప్రశ్నలు పంపబడెను. ఈ ప్రశ్నలకేగాక పృథ్విలో బుట్టిన వాడెవడైన వేయుగల ఏ

ప్రశ్నకైనా జవాబులు ఈ పట్టణమం దివ్వబడబోవు ఉపన్యాస ములలో నుండును. సకాలమున ఈ ప్రశ్నలకు తదితర ప్రశ్న లకుగూడ జవా బివ్వబడును; ఏప్రశ్నయూ వేయకపోయినా రాము డీవిషయముపై సమగ్ర వివేచన చేయును. ఈ ప్రశ్న లనన్నిటికిజవా బీయబడును; గాని కొందరు తమ ప్రశ్నలకు ముందుగా సమాధానము కావలెనని కోరుదురు.

ఈ ప్రశ్న లన్నిటిని ఈఒక్క రాత్రిలోగాని, లేక మరొక రాత్రిగాని జవా బీయ వలనుపడదు. ఒక్కొక్క రాత్రికి ఒక్క ప్రశ్నను చర్చించ వీలుపడును; ఆరాత్రి కా ప్రశ్నయే చర్చ నీయ విషయమగును. ఈ ప్రశ్న మొదటిదిగాన దీనిని తీసి కొందము.

ప్రారంభించుటకు ముందు బైబిల్‌ను గూర్చి, ఎల్ ఖురాన్‌ను గూర్చి, వేదములను, గీతనుగూర్చి కొన్ని మాటలు చెప్పవలెను. జను లీ పుస్తకములను తను ఇష్టము వచ్చినవాని యొక్కయో, వారియొక్కయో ప్రాతలుగాన, మెదలకుండ అంగీకరించెదరు; క్రైస్తుని చక్కని నడత, ఆతనిది సుందర ప్రభావము. సువార్తలలో చెప్పబడిన విషయములు ఆతను చెప్పినట్లు చెప్పబడినవి. అందుచేత మనము వాని నంగీకరించ వలెను కృష్ణుండి మంచి ఆదర్శప్రాయమైన నడత; గీత ఆయన నోటినుండి వచ్చినదిగాన, దాన్ని సంపూర్ణముగా మన మంగీక రించవలె; బుద్ధుడుకూడ చాల మంచివాడు; ఫలాని పుస్తకము ఆతనినుండి వచ్చినది; లేదా ఆతనినుండి వచ్చినదని చెప్పబడు చున్నది. అందుచేత మనము దానిని ఆలోచనలేకుండ నమ్మ

వలెను. మనము విచారణను మాని, ఆతనినుండి వచ్చినదిగాన మన మా సత్యమును గ్రహింపవలె. కొన్ని నిమిషములు క్రిందట చెప్పబడిన కథలోని వేశ్యపాటను మెచ్చుకొనిన వారు చేసిన పొరపా టిట్టిదేకదా! ఆతని బోధలోక విషయము, ఆతని నడత, ఆతని జీవితములోని సౌందర్యము — అది మరొక విషయము. తరచుగా బోధకుడు ఆకాలములో కెల్ల శ్రేష్ఠుడై యుండును. కాని ఆతని బోధలు అసంపూర్ణముగా నుండును. ప్రపంచమందలి సాంప్రదాయికాగ్రహమంతా ఈపొరపాటు పైననే ఆధారపడియుండును. మత కలహములన్నీ దీని ఫలితములే. ఆలివర్, గోల్డుస్మిత్ దేవతవలె వ్రాయువాడని, జాన్సన్ చెప్పినాడుకదా! గోల్డుస్మిత్ వైద్యములో అత్యుచ్ఛమగు పరీక్ష ప్యాసయినాడుకదా! మాట్లాడునప్పుడు తినునప్పుడు గోల్డుస్మిత్ మామూలుగానే ఆచరించువాడు, కాని తన తినునట్టి, మాట్లాడునట్టి విధమును వర్ణించునప్పుడు తానెప్పుడు క్రింది దవడను కదిలించి ఎఱుగనని చెప్పెడివాడు. కదలునది ఎప్పుడూ పైదవడేగాని, క్రిందిదవడ కాదనువాడు. ఈ విషయముపై ఆతడు జాన్సన్‌తో పెద్ద వివాద మొనర్చెను. తన తప్పుడు వాదనను సమర్థించుటలో ఆతడెంతో మొండితనమును చూపించెను. మాట్లాడునప్పుడు తినునప్పుడు కదలునది క్రింది దవడేగాని, పైదవడ కాదని ఇప్పుడు ప్రతివారు ఎఱుగుదురు కదా! తలనంతా ప్రక్కకు త్రిప్పినప్పుడు మాత్రమే పైదవడ కదలును. అయినాగూడ క్రిందిదవడ ఎప్పుడు కదలదని కదలున దెప్పుడు పైదవడేనని గోల్డుస్మిత్ వాదించెను.

అసలు జీవితమునకు సంబంధించినంతవరకు ఆతడు సరిగానే ఉండెను; కాని ఆతడు తనస్వంత అనుభవములను, స్వంత పనులను, స్వంత జీవితమును, వర్ణించలేడు. పని చేయుట ఒక విషయము; చేయువిధమును తాత్వికముగా విశ్లేషణ చేయుట మరొక విషయము. ఇంగ్లీషు ప్రతివాడు మాట్లాడును; గాని ఇంగ్లీషు వ్యాకరణము నెఱిగినది కొలదిమందే. ప్రతి వాడు ఏదోఒక విధముగా వాదించును. తర్కశాస్త్రమును చదివినది కొలదిమందే. అటులే ఆదర్శప్రాయముగా బ్రతుకుట యొక విషయము; దానిని తాత్వికముగా విశ్లేషణ జేయుట, దానికి కారణములు చెప్పగల్గుట మరొక విషయము. జనులీ పొరబాటు పడెదరు. గురువుల శరీరమును, వ్యక్తిత్వమును వారి ఉపదేశముల కాపాదించి వారి బానిసలయ్యెదరు. జాగ్రత్త జాగ్రత్త యని రాము డనుచున్నాడు.

క్రైస్తుకున్నవి కొలది పుస్తకములే; కాని యం. ఏ. లు డీ. డి. లు వ్యాసయిన వారు ఆయనచెప్పిన దేమో వ్యాఖ్యానించుటకు బుర్ర గోకికొనెదరు; మొహమ్మద్, సుందరములైన పలుకులు పలికెను. వారికీ ఆవేశము, ఈ జ్ఞానము ఎక్కడ నుండి వచ్చెను; నీలోగూడ నున్న ఒకానొక తావునుండియే వారు దానిని పొందిరి.

మనువుకు చాలా పుస్తకములు లేవు; అయినా ఆయన హిందువులకు చక్కని ధర్మశాస్త్రము నిచ్చెను. హోమర్‌కు కూడా ఎక్కువ పుస్తకములు లేవు; కాని ప్రతి భాషలోకి ఆయన కావ్యము లనువదింపబడుచున్నవి. అరిస్టోటిల్, ఎం. ఏ,

కాదు, డీ. డి; కాదు, అయినా ఎం. ఏ. లు అయిన పుస్తకాలు చదువవలసినదే.

క్రైస్తు, కృష్ణుడు తమ శక్తి నెచటనుండి పొందిరి. లోనుండియే. వీరు లోనుండి ఈ శక్తినంతా గ్రహించగలిగిన మీరు గ్రహించలేరా? తప్పక గ్రహించగలెదరు. వారు దేని నుండి తమ శక్త్యుత్సాహములను పొందిరో, ఆ వస్తువ ఆయాట మీలోనూ ఉన్నది. అందుచేత ఈ లోకములో ఎన్నో వేల ఏండ్లనుండి పారుచూ బురదైపోయిన నీటికొఱకు దేవులాడుట ఎందుకు? దానితో దప్పి తీర్చుకొనుట ఎందుకు? తిన్నగా మీలోపికే పోయి. అమృతమును త్రాగవచ్చును. అమృత సరస్సులు మీలోననే ఉన్నవి.

రాముడు చెప్పినకోమన "అన్నలారా, నా ఆత్మ, వారెన్నో ఏండ్లక్రితము ముండిరి; మీరు నేడున్నారు; ఎన్నో ఏండ్ల నాటివారికి దాసులుగాకుడు జీవద్వస్తువును మృతుల చేతులలో నిడకుడు. అమృతము మీలోననే నున్నది. ప్రాచీనుల గ్రంథము లను తీసికొనినప్పుడు వానిలోని ప్రతిమాటకు మీరు మీ మనోదేహముల నమ్మకోవలెనని తలపకుడు మీకు మీరాలోచించుడు; భావింపుడు. ఆ విషయము లేమిటో గ్రహించి వాటి నమలులో పెట్టి, అవి నిజమో కాదో, మీ జీవితములో ప్రయోగము చేసి చూచినగాని, మీరు క్రైస్తు చెప్పినదిగాని వేదములలోను భగవద్గీతలోను ఉన్నదిగాని అర్థము చేసుకో లేరు. సామెతె చెప్పినట్లు మిట్టను నర్థముచేసికొనుటకు మిట్టను కావలయును; క్రైస్తు నర్థముచేసికొనుటకు మీరు క్రైస్తు

కావలెను. అట్లే కృష్ణుని వర్ణముచేసికొనుటకు కృష్ణుడుగాను బుద్ధుని వర్ణముచేసికొనుటకు బుద్ధుడుగాను కావలెను. "కావలెను" అంటే అర్థమేమిటి? బుద్ధుడుగా కావలెను; అంటే ఇండియాలో పుట్టవలెనా? లేదు క్రైస్తుగా అవుటకు జూడియాలోను, మహమ్మద్‌గా అవుటకు అరేబియాలోను పుట్టవలెనా? లేదు. బుద్ధుడుగా, క్రైస్తుగా అవుట ఎట్లు? అది ఈ క్రింది కథతో దృష్టాంతీకరించెదము.

లైలా మజ్నూల ప్రేమను వర్ణించు గీతము నొకదాని నొకడు చదివి, మజ్నూనెంతో మెచ్చుకొని తానును అటుల కాగోరెను. మజ్నూగా అవుటకతడు లైలా చిత్రమని చెప్పిన ఒక చిత్రమును గ్రహించి, దాని నాలింగనము చేసుకొనుచు దానిపై కన్నీళ్లుగార్చుచు దానిని హృదయమునకు హత్తుకొనుచు దాన్నెప్పుడు వీడకయుండెను. కాని కృత్రిమ ప్రేమ చాలాకాలముండదని మీరెరుగుదురుకదా! ఇది కృత్రిమ ప్రేమాయెను. నిజమైన ప్రేమ నెవరూ అనుకరించలేరు.

అతనివద్దకొక మనుష్యుడొచ్చి "నాయనా నీవు చేసేదేమిటి? మజ్నూ అవుట కదిగాదు పద్ధతి. మజ్నూ అవుటకు నీ వాతని ప్రేయసినే తీసుకోనక్కరలేదు. నీకు మజ్నూ కున్న అంతరంగిక ప్రేమ కావలెను. నీకు కావలసినది ప్రేమకాస్పదమైన ఆపదార్థమే కాదు; కావలసినది గాఢమైన ప్రేమ. నీవు నీస్వంత ప్రేమపదార్థమునే ఏరుకొనవచ్చును; నీ స్వంత ప్రేయసినే ఏరుకొనవచ్చును, కాని మజ్నూకుండిన ప్రేమ ప్రగాఢత్వము కావలసినది, అది మజ్నూ అవుటకు మార్గము."

అటులనే క్రైస్తుగానో, బుద్ధునిగానో, కృష్ణుడుగానో కాదలచినవారు చేసినపనుల ననుకరించనక్కరలేదు; వారు బ్రతికినట్లు బ్రతికనక్కరలేదు; వారు నడచినపద్ధతికి బానిసవు కానక్కరలేదు; వారి చెయిద్యములకు మాటలకు నీ స్వాతంత్ర్యము నమ్ముకొనక్కరలేదు; వారి యోగ్యత నలవర్చుకో వలెను; వారి భావములను వారి అనుభూతియొక్క ప్రగాఢత్వమును వారికుండిన అసలు శక్తిని అలవర్చుకొవలెను; జీవితములో అదే ఉత్సాహమును కన్పరచి నీ పరిస్థితులను వాతావరణమును మార్చవలెను. నేడు పుట్టియున్నచో క్రైస్తు ఏమిచేయును? శిలువపై నెక్కింపబడుటకు సమ్మతించునా? లేదు. నీవు క్రైస్తువి కావచ్చును; అయినను జీవింపవచ్చును. తన అభిప్రాయములకై క్రైస్తు శూలమెక్కుటకై ఒప్పుకొనెను; తన అభిప్రాయములకై శోపెన్‌హోర్ బ్రతికెను అభిప్రాయములకై చచ్చుటకంటే బ్రతుకుట కష్టము.

ప్రతి విషయమును దాని విలువ చూచి గ్రహింపుము; ప్రవక్త వ్యక్తిత్వము చూచి భ్రమసిపోకుము. ప్రవక్త జీవితము బోధలు రెంటిని విడివిడిగా చూచికొమ్మని నేను చెప్పు సారాంశము.

"పునర్జన్మ సత్యమైనచో అది కుటుంబ బంధములను త్రెంచుట కదా!" ఇది మొదటిప్రశ్న "ఈ జీవితములో కలసి యున్నవారు ప్రేతజగత్తులో కలవరా?" అనునది ప్రశ్న యొక్క రెండవభాగము.

ఇది అందమైన ప్రశ్న; మొదటిభాగమును ముందుగా తీసికొందము.

ఈ లోకములో కుటుంబ బంధము లనునవి అసలున్నవా యని రాముడు తెలిసికో గోరుచున్నాడు. నీ కేమైన కుటుంబ బంధము లున్నవా? ఒక మనుష్యుని కొక కొడు కుండును. మైనర్గా నున్నంత వఱకు పిల్లవాడు తండ్రితో నుండును. పిల్లవాని కీడురాగానే వాడొక మంచి ఉద్యోగము చూచు కొని తండ్రికి దూరదూరము న నుండును. కొడుకు సంపాదించు జీతమువలన తండ్రేల లాభము పొందవలెను? వెంటనే బంధము తెగిపోవును. కొడుకుకు వాని స్వంత కుటుంట మొచ్చును; కొడు కిండియాలో, జర్మనీలో లేక మరొక దేశము నకో పోవును; తండ్రి మరో దేశమునకు పోవును. ఇక కుటుంబ బంధ మెక్కడ?

అవును. కుటుంబబంధ మనున దున్నది. గాని అది వట్టి పేరే. నేను జాన్స్మిత్ను; నా తండ్రి జార్జిస్మిత్; పట్టి పేరు పేరులో ఏ మున్నది? ఏమైన బంధమున్నదేమో చూచెదము.

ఒక మనుష్యు డిక్కడ పుట్టును. ఒక పిల్ల మరొక చోట బుట్టును. ఒక డమెరికన్ రెండవవాడు జెర్మన్ వారు పెండ్లి చేసికొనెదరు. పిల్ల కుటుంబబంధ మొకచో నుండును. పిల్ల వాని కుటుంబ బంధము మరియొకచో నెక్కడో నుండును. వారు పెండ్లాడెదరు. ఇప్పు డా ప్రాత బంధము లెక్కడ? ఇప్పు డొక క్రొత్తబంధ మొచ్చినది. వారు విడాకు లిచ్చు కొను సమయము గూడ వచ్చును. ఇరువురు తిరిగి పెండ్లాడె

దరు. బంధము లెక్కడ ? నీవు వానిని పూర్వొందకుండా ఉంచ గలవా ? ఒక పిల్లా పిల్లవాడు ఒకే తల్లిదండ్రులకు పుట్టి కలిసి పెరుగుతూ బాల్యమంతా ఒకే ఇంటిలో గడిపెదరు. వారిద్ద రికి ఒక కుటుంబబంధ ముండును. పిల్లవాడా ష్ట్రేలియాకు పోవును అక్కడ వానికి క్రొత్తబంధము లేర్పడును; పిల్ల ఫ్రాన్సుకు పోయి అక్కడ ఫ్రెంచి వనిత యగును. బంధము లెక్కడ ? "పునర్జన్మ నిజమైనచో అది కుటుంబ బంధములను త్రెంచుట కాదా ?" అను ప్రశ్నవచ్చును. ఈ లోకములో కుటుంబ బంధములను నవి లేవు. ఇక త్రెంచే దేమిటి ? కుటుంబ బంధము లనునవి లేవుగాన త్రెంచుట యను ప్రసక్తే లేదు.

కాని కుటుంబ బంధము లనునవి నిజముగానే ఉండునని ఈ జీవితములో కొంత కాలము వానిని ఉంచుకొనవచ్చు నని అనుకొనినను పునర్జన్మము వానిని త్రెంచదు. నీ కెందరో పిల్లలున్నారని నీ వనెదవు. అందులో ఒకడు చచ్చునను కొనుము. నీవు కుటుంబ బంధము లుంచగోరుదవు కాని ఒకడు పోయినాడు. ఈ లోకమునే బంధము త్రెగిపోయినది. కొందరు జనులీ బంధములు తిరిగి తగిలించబడు నని ఇక్కడ త్రెగిన త్రాళ్ళు స్వర్గములో బాగుచేయబడునని తలతరు. అవి స్వర్గ ములో బాగుచేయబడుటకు సాధ్యపడిన, అవి మరొక లోక ములో తగిలించుటకు వీలైన, అవి తిరిగి తగిలించ బడవలెనని నీవు కోరినచో భూగోళశాస్త్ర మంగీకరించనట్టి సైన్సు వొప్పు కొననట్టి స్వర్గలోక మొక టెక్కడో నున్నట్లు నీ వనుకో

నక్కర లేదు. నీ స్నేహితులతోటి నీ సంబంధము ఇంకా దీర్ఘ కాలమువఱకు ఉండవలె నని నీవు కోరినచో పునర్జన్మవాదము ప్రకారము అది మరణాంతరము సాగదు ఎందుకన ఆ వాదము ప్రకారము మనుష్యుడే తన విధికి నిర్మాత. నీ స్వంత బంధములు, నీ స్వంత చుట్టరికములు, స్నేహములు సృష్టించు కొనునది నీవే; నీవు చావబోవునప్పుడు ఎవరిపైన నీకు గాఢప్రేమ వుండునో వాడు మరొక శరీరము ధరించి ముందు జన్మలో నీకు సంబంధించిన వాడగును. నీ ప్రస్తుత జన్మలో ఏమనుష్యునినైనా చూచుటకే ఇష్టములేకపోయినచో వాడితో సంబంధము పెట్టుకొనడమే నీ కిష్టములేకపోయినచో పునర్జన్మవాదము ప్రకారము రానున్నజన్మలో వానితో నీకు సంబంధమే వుండదు; నీకిష్టమున్నవారు, లేనివారు, శత్రువులు, మిత్రులు అందరు రాబోవుజన్మలో నీకు సంబంధితులగుదురని పునర్జన్మవాదమనదు; ఎవరనినచో నీ కసహ్యమో, ఎవరుండుట నీకయిష్టమో వారితో రానున్నజన్మలో నీకుసంబంధముండదు. ఒక స్త్రీ తన భర్తనుండి విడాకులుపుచ్చుకొనినచో ఆమె కాతనిని చూచుట కిష్టమే లేకపోయినచో కర్మసిద్ధాంత ప్రకారమాభర్త ఇకెప్పుడూ ఆమెను బాధించడు. ఎవరినామె చూడగోరునో, ఎవరితో ఆమె సంబంధముంచుకోగోరునో వారినే ఆమె ముందు జన్మలో ఎరుగగలదు.

ఈవిషయముపై చాలమందికి దురభిప్రాయములున్నవి; అవన్నియు ఒకటితర్వాతొకటి తీసికోబడును; యూరోప్ అమె రికాలవారు అపార్థము చేసికొను స్వర్గమునుదానిసంగతి తీసికొం

దము; దాన్ని క్రైస్తవస్వర్గమందమా? వద్దు; దాన్ని చర్చి స్వర్గ మందము; స్వర్గమనుభావమున కసలర్థము లేదు. స్వర్గమనగా వారి అభిప్రాయములో వారంతా కలసి కూర్చుండునట్టి ఉండునట్టి తావు; దయచేసి కొంచెము సేపాలోచించుడు; సత్యముకొరకై కొంచెము సేపు యోచించుడు; అని రాముడు కోరుచున్నాడు. నీవు పరిచ్ఛిన్నుడవై యున్నచోట నీకు సంపూర్ణానందముండ గలదా? పరిచ్ఛిన్నతలో సంతోషముండగలదా? అసంభవము, అసంభవము. స్వర్గములో మీకెందరో ప్రతిస్పర్థులుండినచో ఇండియా ఆస్ట్రేలియా అమెరికాలలో ఈవరకు చచ్చినవారు, నేడు చచ్చువారు, ఇకముందు చావబోవువారు అందరు అక్కడే ఉండినచో మీకదేమి సంతోషమీయగలదు? అలెగ్జాండర్ సెల్కిర్క్ ఇలా పాడగలిగినాడని మీరెరుగుదురుకదా!

"నేను వీక్షించు దానికంతకు
నేనే ప్రభువును
నా అధికారమును కాదను
వారెవరూ లేరు."

మీరు కారులో కూర్చొనినప్పుడు, కారంతయు నీక్రింద నే యుండవలెనని కోరుదువు. ఇతరులు లోనికొచ్చినచో నీకు కష్టముగానే యుండునుకదా! నీవు నీగదిలో కూర్చొని యున్నప్పుడు పరాయివాడెవడైన నీకొరకొచ్చినచో ఇంటివద్ద లేనని వానితో చెప్పుమని నీ నౌకరుకు చెప్పుదువుకదా!

నీకొక యిల్లు కొంత ఆస్తియుండును; మరొకనికిని అట్టి ఇల్లు ఆస్తియుండును; వేదములలోను; బైబిలులోను ఏమిచెప్ప బడియుండినను వానికంటె నీకెక్కువ భాగ్యముండవలె నని కోరుదువుకదా! వాడు నీ ప్రతిస్పర్థిగా గాక నీ క్రిందివాడుగా యుంటవలయునని కోరుదువుగదా! కొందరు క్రైస్తవులు తాము ప్రయాణముచేయు ఓడలో ఒక బౌద్ధుడుగాని, మహ మ్మదీయుడుగాని, హిందువుగాని యున్నచో అసహ్యించు కొనెదరుకదా! అట్టివారు అసలు క్రైస్తవులుకారు! పేరుకు మాత్రమే క్రైస్తవులు. రాముడీమాట ననుభవముపై చెప్పు చున్నాడు. అట్టివారికి హిందువో, బౌద్ధుడో సమీపమున నుండుట అయిష్టము. వారి సంతోషమున కది భంగము చేయును. స్వర్గములో నీచుట్టూ అనేకమంది యుండినచో నీకంటె పెక్కురెట్లు శ్రేష్టులు; క్రీస్తు బుద్ధులవలె నీకంటే వేనోట్లరెట్లు శ్రేష్టులు. నీకంటే శ్రేష్ఠులైన ఋషులు – వీరంతా నీచుట్టూయున్నచో నీకు సంతోషము కల్గునా? కొంచెము నీ పాసంగతి ఆలోచించుము.

భేదమున్నచోటనల్లా, సంతోషముండజాలదు. అసం భవము, నీకు సుఖము లేకుండ చేయున దేమిటి? ఇతరు లుండుటయేకదా! ప్రతివాడూ తా నొక్కడే యుండ వలెనని కోరును. ప్రతివాడూ తనకు ప్రతిస్పర్ధి యనువాడు లేకుండ అద్వితీయుడుగా నుండవలెననే కోరును. ఎట్టి స్వర్గము మీకిచ్చెదనని బైబిల్ చెప్పినట్లు మీరప్రార్థముచేయుచున్నారో, అట్టిరకపు స్వర్గము మీ కానంద మీయజాలదు.

ఏవిధముగా అర్థముచేసిన బైబిలు చెప్పినది సమంజస మ్ముగా నుండును? "మనము స్వర్గములో కలిసెదము" అని బైబిలులో కలదు. మన మందరము స్వర్గములో కలిసికొనెదము; మన మిత్రులను మనము స్వర్గములో కలిసికొనెదము. దాని అసలర్థమేమిటి? దానిని సరిగా అర్థముచేసికొనుడు. మనమంద రము స్వర్గములో కలిసెదమని చెప్పబడిన బైబిలులోనే, ఆ క్రొత్తనిబంధన గ్రంథములోనే, "స్వర్గలోక రాజ్యము నీలో ననే గలదు. దేవరాజ్యము నీలోననే కలదు" అని చెప్పబడి యున్నది. దేవరాజ్యము అసలు స్వర్గము నీలోననే ఉన్నది; బయట లేదు. స్వర్గమెక్కడో బయటనున్నదని ఊహించకుము. అది ఆకాశములోనో, చుక్కలలోనో ఉన్నదని వెతకకుము. దేవునిపై కొంచెము సేపు దయచూపండి. దేవు డెక్కడో మబ్బులలో నుండినచో పాపము వానికి పడిసెము పట్టును. స్వర్గము మీలోనున్నది; దేవుడు మీలోనున్నాడు. కొంచెము చూడుడు.

మిమ్ములను మీరు దేవచైతన్యపు ఆనందావస్థలో వేసికొనుడు; దేవత్వముతో సంపూర్ణ ఏకత్వమునందుడు; నిర్వాణస్థితిలో ప్రవేశింపుడు; అప్పుడు మీరు స్వర్గములో నుండ పని లేదు. మీరే స్వర్గము. అచట మీరు సమస్తవిశ్వ ముతో ఏకత్వము నందెదరు; మృతులతోను, బ్రతికియున్న వారితోను, పుట్టబోవు వారితోను తాదాత్మ్యము నందెదవు. స్వర్గమున్నది మీలోనే; మనము స్వర్గములో కలసుకొనున దీవిధముగానే; జీవన్ముక్తుడు ఎప్పుడు స్వర్గములోనే ఉన్నాడు;

ఆతడు జీవించియున్నవారితోను, మృతులతోను తాదాత్మ్యము నందును. ఈ పృథ్విలో ఇకముందు పుట్టబోవువారితో గూడ ఏకత్వము నందును. నక్షత్రములన్నియు తన ఆత్మేననియు, పశువు లన్నియు తన ఆత్మేనని ఆతడు గ్రహించును. తానే నిజమైన దివ్యత్వము నని, శ్రీసత్యమునని, సద్వస్తువనని, ఆజ్ఞేయుడగు దేవుడనని అనుభవపూర్వకముగా ఎరుగును. సమస్తమూ ఆతడే; సమస్తమూ ఆతడే గావున ఆతడు స్వర్గములో నున్నాడు; స్వర్గములో ఆతడెల్లరిని కలసికొనును.

ఇప్పుడొక ముఖ్యమైన సంగతి చెప్పబడబోవుచున్నది. జనులీ లోకములో తాము కోరు వస్తువులను పొందగోరెదరు. వాటికోసమెంత ఆరాటపడినను వాటిని పొందరు. వారెందుకని వానిని పొందరు. వారు వానినెటుల పొందగలరు? జనులు గుండెలను వ్రక్కలుచేసికొనెదరు. దేనినైన ప్రేమించో కాంక్షించో, జీవితమునంతా వాటికోసమే దేవురులాడుచు బ్రతుకును వృధాచేసికొందురు. ఎందుకని? వారు స్వర్గములో కలవరు కాబట్టియే; అదొక్కటే కారణము. మీ మిత్రులు మీతో కలయవలెనని కోరుదురేని భాగ్యముకోసమై దేవురులాడు జనులారా! సౌభాగ్యము మిమ్ములను వెదకికొనుచు రావలెనని కోరెదరేని; ప్రియులకొరకు ప్రేయసులకొరకు శక్తినంతా వృధాచేసికొనువారలారా! మీ ప్రియులు మిమ్ములను మీరు ప్రేమించునంత గాఢముగా ప్రేమించవలెనని కోరుదురేని, ఉన్నతదశను అందుకోగోరి విఫలులైనవారలారా మీరంతా రాముని సలహా నవలంబించిన మీరుకోరిన వస్తు

వులు దొరకును. మీరంతా స్వర్గములో కలసికోవలెను, ప్రతిది మిమ్ములను వెతుకుకొనునట్లుగా మీరు చేసుకోవలెను. స్వర్గములో కలసికొనుట యనగేమి? నీవు నన్ను ప్రేమింతువా? యని ప్రేమ నర్థించుటలోను, అన్వేషించుటలోను, యాచించుటలోను దివ్యత్వమును నదేమీ లేకపోగా, నన్నొదిలివేసి, నన్ను పోగొట్టుకొని, మనిద్దరికంటె ఉన్నతమైన దానిపై ఆధారపడినప్పుడే నే నాకర్షింపబడి నీ ప్రక్క కొత్తును. నాపైన నీకళ్లుంచి ప్రేమను కోరినచో నా కేవగింపగును అది సూత్రము. దానికి మార్పులేదు. అపవాదములేదు. నీవేక్షణమున వాంఛ కతీతుడవయ్యెదవో, ఆ క్షణమున వాంఛనీయ వస్తువు నిన్ను అన్వేషించును. ఏక్షణమున నీవే సాగింపబడి యాచింతువో, అర్థింతువో, ప్రతిమాలెదవో ఆ క్షణమున నీ వసహ్యించుకోబడెదవు; అప్పుడిక నీకు నీవుకోరు వస్తువ దొఱకదు. వస్తువను దాటి దాని కతీతుడవుగమ్ము. అదే నిన్ను వెదకికొనుచు వచ్చును. అదీ నియమము. "వెదకుడు మీకీయబడును, తట్టుడు మీకు దెరువబడును" అని చెప్పబడినది. అది అపార్థము చేయబడుచున్నది. వెతకినచో మీకెప్పుడూ దొఱకదు; తట్టుడు; మీకెప్పుడూ తెరువబడదు; ఒక బిచ్చగాడు నీ వద్ద కొచ్చినప్పుడు నీవు వాని నసహ్యించుకొందువా? లేదా? బీదలు బజార్లలో నడువనీయబడ రనునది నిజముకాదా? వారు జైళ్ళకు పంపబడుటలేదా? రాముడు జైలును చూచినాడు అచట ఖైదీలలో ఎక్కువ మంది చేసిన తప్పు వారు బీదవారుగానుండుటయే. బిచ్చగాండ్రుగా నుండుటే

"అనాధగృహము (Poor house) నకు పొమ్ము; నీ వుండుట మాకసహ్య" మని జనులందరు కాదా ?

మీరు దేవుని వద్దకు పోగోరుచున్నారు; ఆ పోవునప్పుడు దీన భావముతో, బిచ్చగాని దుస్తులతో పోగోరుచున్నారు ? నిన్ను లోనికి రానిత్తురా ? లేదు. నీ వొక రాజువద్దకు పోవు నప్పుడు నీ కున్నవానిలోని కెల్ల మంచిదుస్తుల ధరించవలె; అట్లే దేవునివద్ద కెళ్ళినప్పుడు నీవు నిష్కామ మను దుస్తులను వేసుకోవలెను. నీకు దేవుని చూడ గోరికయున్న స్వర్గలోక రాజ్యములోనికి పోగోరిన నీవు వాంఛా రహితత్వ మను దుస్తుల వేసుకోవలెను. నీవు వాంఛల నతిక్రమించవలె.

"మొదట స్వర్గరాజ్యము నన్వేషింపుడు; తరువాత ప్రతిది మీ కీయబడును." అదీ నియమము.

కర్మ సిద్ధాంతము మనుష్యుడే తన విధికి కర్త యని చెప్పుచున్నది. మన వాతావరణమును; పరిస్థితులను చేసుకొను నది మనమే. ప్రతి బిడ్డ తన తండ్రికి తండ్రి; ప్రతి పిల్ల తన తల్లికి తల్లి; ఈ వాక్యములు విపరీతముగా కనపడును; గాని అవి సత్యములు.

కర్మ సిద్ధాంతము ప్రకారము మీరు వస్తువులను కోరి నంతవఱకు, వానికై ఆరాట పడినంతవఱకు అవి మీకు దొరక వు. కొంతకాల మిట్లు ఆరాటపడి కోరికోరి నీకు విసుకువచ్చిన పిదప నిరాశతో వాని నొదిలివేసెదవు. అప్పుడవి నీకు దొరకును. అది కర్మసిద్ధాంతము.

ఒక మనుష్యుడు నడవవలసి యున్నచో ఆత డొక అడుగు పైకెత్తవలెను; రెండవది క్రిందుంచవలెను. మరల రెండవదానిని క్రిందుంచవలెను; దీనిని పైకెత్తవలెను. అట్లే కర్మసిద్ధాంతము సాగుటకు, నీ కోరికలన్ని నెరవేరుటకు నీవు కోరికలన్నిటిని అతిక్రమించి వాని నొదలివేయు కాలము వచ్చును. అట్లు కోరిక నొదలివేయుటవలన కోరిక తీడేరును కర్మసిద్ధాంతమునుగూర్చి వ్రాసినవారంతా ఈ ప్రశ్నయొక్క ఒక ఫలకమును మాత్రమే చర్చించినారు. రెండవ ఫలకమును వదలినారు. మీకోరికలన్ని ఫలించవలెననే రాముడు చెప్పినది. మీరు కోరినవన్ని మీ ముందుకు తేబడవలసినదే. కాని ఒక మరతున్నది అది ఫలించుటకు ముందు నీవు కోర్కెను వదలి వేయు స్థితికి రావలెను. ఎప్పుడు నీవు నిష్కాముడ వగుదవో అప్పుడు కోరిక ఈడేరును. ఈ భాగము అందరికి అర్థము కాలేదని రాముడు తలచుచున్నాడు. రాముడు వెనుక వాన్ నెస్ ఎవెన్యులో హెర్మెటిక్ బ్రదర్ హుడ్ వారి కిచ్చిన ఉప న్యాసములను వినకపోవుటయే దీనికి కారణము. దాని నిప్పుడు అర్థము చేసికోకపోయిన మరొకసారి తీసికొందము.

ఇంకో సంగతి; ఎక్కువమంది జనులు తమ బంధముల నుంచుకోగోరెదరు. తమ సంబంధములను శాశ్వతముగా ఉంచుకోగోరెదరు. మీ ప్రాపంచిక బంధముల నెప్పటికి ఉంచుకోగోరుట పిచ్చియని పెద్దగా ఘోషించవలెను. నీ వట్లుంచుకో లేవు. అది అసంభవమైన ఆశ. నీ సాంసారిక బంధ ముల నెప్పటికి ఉంచుకో లేవు: ప్రాపంచికమైన దానిని దేనిని

ఎప్పటికి ఉంచుకోలేవు. లేవు. ప్రాపంచిక బంధముల నెప్పుడు అట్లే యుంచుకోవలెనని ప్రయత్నించుట పిచ్చియని మీ హృదయములలో నాటుకొనవలెను. నాయనా! నీ వట్లు చేయలేవని రాము డనుచున్నాడు. ఈ ప్రపంచమందేదీ శాశ్వతము కాదు. స్థిరము కాదు. నీలోనున్న దివ్యత్వమే దేవుడవైన యదార్థ వస్తువవైన నీవే శాశ్వతుడవు. ఈశరీరము ఈక్షుద్ర దేహము శాశ్వతముగా నుండదు. లక్షలవేండ్లు బ్రతికినను చావనునది ఉన్నది, సూర్యుడొకనాడు చచ్చును. పృధ్వి, నక్షత్రములు కూడ చచ్చును. అనగా మార్పన్నమాట. ఇవన్ని మార్పొందునవే; ప్రతిక్షణము నీశరీరము మారినట్లే అవీమారును. ఏడేండ్లకొకసారి అదిపూర్తిగామారి, క్రొత్తదేహ మగును.

అటులనే నీబంధములుకూడ మార్పొందవలసినదే. అవి ఖాయములు కావు. వానిపై ఆసక్తిఏమైన యున్నచో వదలుకొనుము.

నదులు కొండలపైకి ఎగబ్రాకవచ్చు
వాయువు క్రిందికి వీయగా వచ్చు
అగ్నిచల్లదనంబు పొందగావచ్చు
సూర్యుడు చీకటి విరజిమ్మవచ్చు,

కాని, ఈ ప్రాపంచిక సంబంధము లనిత్యము లను నియమమునకు అపవాదములేదు. నీవు మరొకవిధముగా తలచిన పొరపాటే. నదిలో, కొయ్యముక్కలు కొట్టుకుపోవుచు ఒకటొక చోటినుండి, మరొకటి మరొకచోటినుండి కొట్టుకొనివచ్చి ఒకక్షణము కలసితిరిగి వేరైపోవును. ఒకపెద్దతరంగ మొచ్చి

వానిని వేరుచేయును. ఈకొయ్యముక్కలు మరొకసారికూడ కలసికొనునేమోకాని, మరల వీడిపోవలసినదే. నీ నిత్యజీవితములో, అక్కచెల్లెళ్లు, అన్నదమ్ములు కలసియుండి ప్రతి 24 గంటలలోను వేరైనట్లు, అనేకసారులువారు కొన్నినిమషములు కలసికొనుచుందురు. తిరిగి వేరువేరు గదులలోనికో, ఆఫీసుల లోనికో పోవుదురు. ప్రతిగృహములోను కనబడువిషయమే. నీదూరపుస్నేహితులకు బంధువులకుకూడ వర్తించును. మీ రెప్పటికి కలిసియేయుండలేరు. అసలుస్థితి అదియైయుండ, పసిపిల్లవానివలె మోహపడుట ఎందుకు ? ఏదిఎప్పటికిఉండునో, ఏదిశాశ్వతమో, దానితో సంబంధ మేలపెట్టుకోరు? మీనుండి వేరుపడనట్టి శాశ్వతమైన సనాతనసత్యమునుగూర్చి ఎక్కువగా ఏల ఆలోచించరు. దానినిపొందుటకేల ప్రయత్నించరు ? ఆ సనాతనవస్తువనుత్యజించి, క్షణభంగుర బంధములకొఱ కారాటమెందులకు ?

ఇండియాలో ఒకకొత్త పెండ్లికూతురు తన అత్తతోను వదినెలతోనుకూర్చొని, మాట్లాడుచుండెను. అప్పు డక్కడ ఆమెభర్త లేడు. ఆపిల్లవదెనలు, ఆమెభర్తనుగూర్చి ఏదో తిరస్కారముగా మాట్లాడిరి రాము డక్కడనేఉండెను. ఆపిల్ల నోటినుండి రాము ఈక్రియ్యని పలుకులువినెను. "ఆతనితో ఒక వారమో, పదిరోజులోమాత్రమే గడుపుటకోసము, నాజీవితమంతా గడువవలసినభర్తతో నేను వైమనస్యము చెందను."

ఆపెండ్లికూతురు కున్నంతటి తెలివికలిగియుండుడు. ఈ ప్రాపంచిక బంధములెక్కువకాలముండవు. మీజీవితమంతయు

శాశ్వతమైన ఆత్మతో గడుపవలెను. దానినుండివిూరు వీడి పోలేరు. ఈక్షణభంగురమైన వర్తమానముకొఱకు, ఆత్మను విసనాడకుడు. మిమ్ముల మిూ రెందు కమ్ముకొనెదరు ? మిమ్ము లను నీచపఱచు జీవితము నేలగడిపెదరు ? మిూలోని దేవుని నేలగుర్తించరు ? ఆత్మనెందుకుత్యజించెదరు ? జ్ఞానముకలిగి యుండుడు.

బుద్ధుని వద్దకొక డొచ్చి ఆయనతండ్రిగది వద్దకువెళ్లమని ఆయనతో చెప్పెను. రాజకుమారుడైన బుద్ధుడే అంతయు త్యజించి భిక్షుకు డయ్యె నని మిూరెఱుగుదురుకదా! ఎవరినీ ఏమిూయాచించకుండా ఆతడుభిక్షుకుడై ఒకచోటనుండిఇంకొక చోటికి వెళ్లుచుండెను. ఆతనిచేతులోనున్న భిక్షాపాత్రలో ఎవరైన ఏమైన వేసినసరే, లేనిచో ఆతడీదేహముకొఱకై ఏమియు శ్రద్ధవహించెడివాడుకాదు. ఆతను తనతండ్రి రాజధానిలో ప్రవేశించి భిక్షుకునిదుస్తులలో వీధులవెంటతిరుగుచుండెను. ఆతనినిభిక్షుకు డనుటయేపొరపాటు. అదేవాస్తవిక రాచరికము. ఆతడు దేనినిఅన్వేషింపడు. దేనినియాచించడు. తానునశిం చినను, ఆయనకులెక్కలేదు. కూటికిగాని గుడ్డకుగాని, ఆయ నెవరిని యాచించడు.

ఆతడు వీధులవెంట ఆ దుస్తులలో పోవుచుండెనని, ఆతని తండ్రివిని దగ్గరకొచ్చి కన్నీళ్ళతో ఇట్లనెను, "నాయనా, నే నిది ఎన్నడూ చేయలేదు: నీవు ధరించు దుస్తులు నే నెన్నడు ధరించలేదు; మిూతాతగాని, ముత్తాతగాని ఇట్లు బిచ్చగాండ్రై) వీధులలో తిరుగలేదు. మేము రాజులము; నీవు రాజవంశము

నకు చెందినవాడవు; నీ వీనాడు యీ భిక్షావృత్తి గ్రహించి, వంశమునకంతకు అగౌరవము తెచ్చెదవేఁ? అటులచేయవద్దు. నా ప్రతిష్ఠను కాపాడుము"

బుద్ధుడు చిరునవ్వుతో ఇట్లుబదులుచెప్పెను, "అయ్యా, నే నేవంశమునకు చెందినవాడనో నేను నా వెనుక చూచుచునే యున్నాను. నా వెనుకటి జన్మలను చూచుచున్నాను. నావంశ మెప్పుడూ బిచ్చగాళ్లవంశమే. దీని కిది ఉదాహరణ.

ఇది యొక వీథి; అది మరొక వీథి. బుద్ధు డనున దేమన "అయ్యా, మీరు మీ జన్మలలో ఆ వీథిన వచ్చుచున్నారు; నే నీ వీధిన వచ్చుచున్నాను. ఈ జన్మలో ఈ రెండు వీధులూ కలయుచోట కలసినాము. నేను నా దారిన బోవలెను; మీరు మీ దారిన."

మ రెక్కడి బంధములు? నీకు నీ పిల్లలున్నా రనెదవు. ఈ దేశపు నాగరికత అసభ్యము లనుకొనునట్టి విషయములు చెప్పిన రాముని క్షమించవలెను. ఈ పిల్లలు నావారని ఇక్కడ నా కొడు కున్నా డని వీడు నా మాంసములోని; మాంసము నా నెత్తురులోని నెత్తురు; నా ఎముకలలో ఎముక; నా కండల లోని కొడుకు – అని అనెదవు. వీడు నా ఆత్మ, నా కొడుకు; నా చిట్టి; నా బిడ్డ అని వానిని నీ హృదయమునకు వొత్తు కొందువు. కాని నీ వను దానిని వివేచన చేసి చూడుము. ఆ పిల్లవాడు నీవా డని వానికీ నీకూ గల సంబంధము శాశ్వత ము గా నుండవలెనని కోరెదవు. ఆ పిల్లవాడు నీ శరీరమునుండి పుట్టినవా డను కారణముచేత వానికీ, నీకూ గల సంబంధ

ఎప్పటికి ఉండవలెనని కోరుదువేని, వేల సంగతి ఏమి? వేలు
నీ శరీరమునుండియే వచ్చినవిగదా! అవి నీ చెమటవలన పుట్టి
నవికావా? నీకు పుత్రులవంటివికావా? అవి నీ నెత్తురులోని
నెత్తురుకాదా? వాటి నెత్తురు నీ నెత్తురులోనుంచి కాదా
తీసుకోబడినది? వాటి ప్రాణమంతయు నీ ప్రాణముకాదా?
జవాబు చెప్పుము. ఒక రకపు పుత్రులను చంపి మరొక రకపు
వారిని ముద్దాడి వారిపై ప్రేమనంతయు చూపించుట ఎంతటి
అన్యాయము? నీ తర్క మెట్లున్నదో చూడుము.. నీ పిల్లల
పట్ల క్రూరుడుగా నుండమని రాముని అభిప్రాయము కాదు;
వారికి కావలసిన విద్య వద్దని రాముని అభిప్రాయము కాదు.
ప్రపంచమంతయు నీవుగానే చూచుకొమ్మని రాముని సలహా.
అటువంటప్పుడు నీ పిల్లలను వేరుగా చూడమని చెప్పునా?
రాముని అపార్థము చేయకుడు. "నీ కుటుంబ బంధములను నీ
ప్రగతి కడ్డము పడనీయకుము. అవి నీ మార్గమున కడ్డము
రాకూడదు. నీ ఉన్నతి నవి అభ్యంతర పెట్టకూడ" దని
మాత్రమే రాముడు చెప్పునది.

ఈ శరీరము, మీరు రాముడను ఈ మీ ఆత్మ సన్న్యా
సము తీసుకొనినప్పుడు కొందరొచ్చి ఇట్లనిరి. "అయ్యా మీరు
మీ భార్యాబిడ్డలయొక్క, బంధువులయొక్క మీపై ఆధార
పడిన విద్యార్థులయొక్క, బాధ్యతల నొదలివేసినా రేమి?"
రాము డడుగున దేమన; నీ అప్పుడెవరు? రాముని ఆ ప్రశ్న
వేసినది కాలేజీలో తోటి ప్రొఫెసరు; అతనికి రాము డిట్లు
చెప్పెను "నీవు ఆచార్యుడవు; నీవు కాలేజీలోను యూనివర్సిటి

లోను తత్త్వశాస్త్రముపై ఉపన్యసించెదవు; నీ భార్యాబిడ్డలకు గాని నీ అవ్వకు, పినతల్లికిగాని నీ కున్న పాండిత్యమున్నదా? నీ పినతండ్రి పెదతండ్రి కొడుకులకీ పాండిత్యమున్నదా?" "వారికి లేదు. నేను ఆచార్యుడ నాయె" అని ఆతను చెప్పెను. రాము డిటుల చెప్పెను" నీవు యూనివర్సిటీకొచ్చి ఉపన్యాసము లిచ్చెదవుగాని, నీ చిన్నపిల్లలకు నీ భార్యకు, నౌకర్లకు ఉపన్యాస మీయవేల? నీ ముత్తవకు నీ జ్ఞాతులకు నీ పినతల్లికి ఉపన్యాస మెందుకీయవు?" వారు తన ఉపన్యాసముల నర్థము చేసుకోలేరని ఆతడు బదులు చెప్పెను. అప్పుడాతనికిట్లు చెప్పసడెను. చూడు, ఈ నౌకర్లు, ఈ ముత్తవ, ఈ భార్యాబిడ్డలు, నీ కుక్క – వీరందరు నీ ఆప్తులుకారు. నీ కుక్క నీ వెంట ఎప్పుడూ ఉండినను అది నిన్నెప్పుడు వదలకుండినను, అజ్ఞానులు అది నీకు పెద్ద మిత్రుడని తలచినను, ఆ కుక్కగాని, నౌకర్లుగాని, నీ పినతల్లి ముత్తవగాని – నీ ఆప్తులు కారు. నీ వెవరవు? నీవు శరీరము కావు, నీ వాత్మవు; కాని నీవు యూరోపియన్ తత్త్వశాస్త్రము నభ్యసించిన వాడవు గాన నీవది వొప్పుకొనవు. నీవు మనస్సువు. నీ మనస్సు పనిచేయు సీమలోనే ఎవరి మనస్సు పనిచేయునో వారు నీ ఆప్తులు. ఈ విద్యార్థులు ఈ యం. ఏలు, ఈ బి. ఏలు. నీవు చదువు పుస్తకములనే తమ గదులలో ఎప్పుడు చదువుచుందురు. నీ మనస్సు వారి మన స్సాలోచించు విషయములనే ఆలోచించు చుందురు. అందుచే వారు నీ ఆప్తులు. నీవు నీ చదువుకొను గదిలో నున్నప్పుడు "అతడు చదువుకొన

గదిలో నున్నాడు'' అని జనులందరు. నీవు చదువుకొను గదిలో నున్నానని చెప్ప; లేక నీ ఆలోచనలలో నున్నానని చెప్పుము; కుక్క నీ వాడిలో నున్నను, నీ పిల్లలు నీ కొరకొచ్చుచుండినను, వారు నీకేమీ కారు; నీవు చదువుకొను గదిలో లేవు; నీవు తత్త్వశాస్త్రసీమలో విహరించుచున్నావు. ఆ విషయమునే తమ ఇండ్లలో అధ్యయనము చేయుచున్న విద్యార్థులు నీ కాసీమలో ఆప్తులు. నీ కాప్తులైనది వారు; వారే నీకు సన్నిహిత ఆప్తులు; అందుకనే నీ అవ్వ, నీ పినతల్లి నీ కుక్క నౌకర్లు మొదలగు వారికంటె వారి కెక్కువ సహాయము చేయుగల్గుచున్నావు మానసికముగా నీకు సన్నిహితుడైనవాడు, నీవు సంచరించు మానసిక పరిధిలోనే వర్తిల్లువాడు నీ కాప్తుడు నీతోపాటు నీ ఇంటిలోనుండు వాడు మాత్రమే నీ కాప్తుడు కాజాలడు; ఎలుకలు, ఈగలు, కుక్కలు పిల్లులు నీతోపాటు ఒకే ఇంటిలో ఉండుట లేదా? అవి నీ కాప్తులా?

ఆచార్యులుగారూ! నాకొక సంగతి చెప్పండి నీకు చేతనున్నచో నీ వెక్కడ పుట్టెదవు? అజ్ఞానులైన ఆ అవ్వ పినతల్లుల కుటుంబములోనే పుట్టెదవా? లేదు. లేదు. నీ మనస్సు వంటి మనస్సే గలిగి, నీకు అనువైన వాతావరణమును పరిసరములను ఈయగల్గిన వారుండు కుటుంబములో పుట్టెదవు. నీ కాప్తమైనట్టి కుటుంబములో పుట్టెదవు. ఇట్లు నీ విప్పుడు నీ కుటుంబ బంధములను మార్చుకొనుచునే యున్నావు ప్రేమ యననేమి? మరొకడు హృదయపూర్వకముగా తలచినట్లే నీవునూ తలచుటయే. అంతకన్న ఎక్కువ లేదు. ఆదర్శములు

సుఖదుఃఖములు ఒకటైనప్పుడే నీ వాతని ప్రేమించగలవు. నిన్ను బాధించు విషయములే ఆతనిని బాధించును. నిన్ను సంతోషపెట్టు విషయములే ఆతనిని సంతోష పెట్టును. అదే ప్రేమ. నీవు మరొకనిని వానికొఱకు ప్రేమింపవు. ఆతనిలోని నీ ఆత్మనే నీవు ప్రేమింతువు; మరొక దానిని కాదు నీవు నీ ఆత్మను మాత్రమే ప్రేమింపగలవు; 'క' 'ఖ' 'గ' అను మనుష్యులున్నారను కొనుము. అప్పుడు మనకు రసాయన శాస్త్రములోవలె ఇట్టి సూత్రమొచ్చును. 'క' కు 'ఖ' కు పరస్పరము సామాన్యమైనదేదో ఒకటుండును. 'క' కు 'గ' కు సామాన్యమైనదికూడ ఒకటుండును 'క' కు 'గ' కు పరస్పరము సామాన్యమైన విషయ మెక్కువగా నున్నచో, 'క' 'ఖ' కంటే 'గ' వద్ద కెక్కువగా ఆకర్షింపబడును.

కుటుంబ బంధము లిటుల తెగిపోవుచుండును. తిరిగి కలసి కొనుచుండును. కాన మరొకనిలో నీ ఆత్మవంటి దానినే గుర్తెరుగుటయే ప్రేమ. మరొకడు పూర్ణముగా నీ వంటివాడే అయినచో, నీవు ప్రేమసుయుడ వయ్యెదవు

దీనినుండి మరొక విషయము వచ్చును. దానిని రాము డీనాడు చర్చింపడు. అది చాలా ముఖ్యమైన విషయము. అది "అభయము." భయమేల కలుగుచున్నది, దానికి కారణ మేమిటి? ఈ ఆసక్తియే, నీ బంధములను శాశ్వతముగా నుంచు కోవలె నను ఈ కోరికయే; భయమునకు కారణము. భయపడ వద్దు; భయపడవద్దు; అని జనులందురు. వారెంతటి పిచ్చి వారలు? భయము నీశక్తిలోనున్నట్లు, నీపైన లేనట్లు: భయమున

గావథము చెప్పబడును; కాని రాముడీ విషయము నేడు వదిలి వేయును, అది మరలొకసారి తీసికోబడును.

ఉపనిషత్తులలోని ఒక శ్లోకమున కనువాదమును చదివి నేటికి విరమింతము.

## ఛంధస్సు గీతము

*"అణువు కంటెను అణువు, మహాత్తుకన్న
పెద్దదై యాత్మ, జీవహృదంతరముల
దాగియున్నది, ఎవడు నిష్కామము డౌచు
శోకము కుడా నతడు, చిత్తేంద్రియముల
పారిశుద్ధ్యంబుచే గను నాత్మమహిమ.
అతడు కూర్చుండియే దూర మరుగు చుండు
అతడు శయనించియే యెల్లచోటదిరుగు
ఎవ్వడానందపడుచు ఆనందపడడో
అట్టి దేవుని నావంటి యతడుగాక
తెలుసుకొనుటకు, యర్హత యెవని కుండు?
దేహములమధ్య దేహవిహీనముగను
నశ్వరపదార్థములలో ననశ్వరముగ
ఘనముగా, సర్వమందున్న దానిగాను
ఆత్మ నెఱుగు వివేకి శోకంబుగనడు"

(కఠోపనిషత్, 2 వల్లి, 20, 21, 22)

ఓం! ఓం!! ఓం!!!

---

* ఈ గీతానువాదం శ్రీ కేళపదీక్షులది.

# పాపసమస్య

డిశెంబరు 28, 1902 నాటి ఉపన్యాసము

వేదాంతబోధలపై కొన్ని పూర్వపక్షములు రాముని దృష్టికి తేబడినవి. హిందువుల దర్శన మిదేఅయినచో ఇండియా రాజకీయముగా ఎందుకు పతనమైనదో సులభముగా చూడ వచ్చును. హిందువుల మతమే, వేదాంతమే ప్రపంచములోకెల్ల సర్వశ్రేష్ఠ మతమైనచో ఇండియా అట్లంధకారములో నున్న దేల? క్రైస్తవదేశము లట్లు సౌభాగ్యము ననుభవించుచున్న వేల?

రాము డీ ప్రశ్నలను ఇప్పుడు దీసికోడు. ఈ ప్రశ్నలను తీసికొనినచో నేడు చెప్పెదనన్న విషయము వదలవలసివచ్చును. కాని ఈ ప్రశ్నలు రాబోవు ఉపన్యాసములలో చర్చించబడును. అందరికి ఆశ్చర్యము కలుగునట్లు సమాధానము లీయబడును. ఇండియా పతనమునకు వేదాంతమే కారణమనుకొనువారు, సమాధానములువిని ఆశ్చర్యపడెదరు ఇప్పు డీ విషయము లోనికి సమయము లేదు. ఉపన్యాసములు వినువా రందరిని తొందరపడి ఏదో ఒక నిర్ణయమునకు రావద్దని రాముడు కోరు చున్నాడు. కొంచెం మోపికపట్టి చెప్పునదంతయు వినమని రాముడు కోరుచున్నాడు.

మహమ్మదీయుల బైబులయిన ఎల్‌కొరాన్‌లో ఇట్లు న్నది:— అవినీతి, దుర్మార్గము చేయుడు; మీ జీవితమును త్రాగుడికి, వ్యభిచారమునకు వినియోగించుడు; అప్పు డిక మీ పతనమును మీరు తెచ్చుకొనినట్లే; మీరు అధోగతిలో

పడినట్లే" ఒక మహమ్మదీయ పెద్ద మనుష్యుడు ఎక్కువగా త్రాగుచూ వ్యభచరించుచూ ఉండెను మహమ్మదీయ పురోహితు డొక డొచ్చి అతని నిందించి అటుల చేయవద్దనియు, ప్రవక్త చెప్పినదానిని నుల్లంఘింపకు మనియు బోధించెను. అప్పుడా త్రాగుబోతు ఎల్ ఖురాన్‌లోనున్న పద్యములోని మొదటి భాగమును చదివెను. చూడు. ఖురాన్ ఏమని చెప్పుచున్నదో 'త్రాగండి, సంతోషపడండి, వ్యభిచరించండి' ఇది సాక్షాత్తు ఎల్ ఖురాన్ చెప్పిన వాక్యములు. పవిత్రగ్రంథమైన ఎల్ ఖురాన్ త్రాగమని వ్యభిచరించమని ఆజ్ఞాపించినది. అట్టిచో ఎందుకటుల చేయరాదు?

పురోహితు డిటులనెను. "నాయనా! నాయనా! ఎందుకు చెడిపోయెదవు? పద్యపు రెండవ భాగములో ఏమిచెప్పియున్నదో చూడుడు. "నీపతనమును నీవు తెచ్చిపెట్టికొన్నట్లే" అప్పుడా త్రాగుబోతు ఇటుల జవా బిచ్చెను. "ఎల్ ఖురాన్‌లో చెప్పిన యావత్తు అమలులో పెట్టగలవాడు ఈలోకములో లేడు. నన్నీ భాగము నమలులో పెట్టనిమ్ము. బైబిల్‌లోనివెల్ల అమలులో పెట్టుట అసాధ్యము. కొందరు కొంతవరకు పెట్టగల్గెదరు. మరి కొందరు మరికొంతవరకు. అంతను అమలులో పెట్టువారెవరూ లేరు. అందుచేత పద్యమునంతా అమలులో పెట్టమని అడిగెదవేల. నేను పెట్టగల్గినది పద్యపు మొదటిభాగముమాత్రమే"

ఆ మహమ్మదీయ త్రాగుబోతు చేసినటువంటి తర్కము చేయవద్దని రాముడు కోరుచున్నాడు. పద్యమంతయు చదివిన

పిమ్మటే దాని తాత్పర్యమేమో నిర్ణయించుకోవలెను; అంతకు ముందు కాదు.

ఒకప్పుడు రామునికొక బంగారు గడియార ముండెడిది. అగోలుసు కొక అటగడియారము, దిక్సూచి, తగిలించబడి యుండును. అదెప్పుడు నడిచెడిది కాదు; కాని అందులోని సూది నొక విధముగా త్రిప్పిన అది ఒకటి కొట్టుడెడిది. ఎప్పుడు ఒకటినే కొట్టెడిది.. రెండనునది—ద్వైతము— లేదు. ఆ ఒకటే నీవు; దిక్కాలకారణముల కతీతుడవు కమ్ము. ఇవన్నియు నీచేత పాలింపబడునవి. అవి నిన్ను నడుపునవికావు. అవి నీభావముల కానిసలు — రెండు మూడు అనునవి అసత్యములు —ఒకటే కాలబంధమునకు అలవికానిది.

ప్రశ్న:- వివాహము చేసికొనినవాడు మోక్షమున కాసింపవచ్చునా?

ఈ ప్రశ్న అవలనుండి, రాముడు ఏరుకొనిన విషయము పైననే నేడుపన్యాసము సాగవలెనని ఒకరు సూచింపగా ప్రతివిషయము రామునిదే దీనిని సాంతముగా చర్చించిన ఎంతో మేలు కలుగును. కాని వింతగా నుండును. ఈ దేశము వారికి విపరీతముగా నుండవచ్చును. కాని రామునకది లెక్క లేదు. రాముడుగా గౌరవించునది మిమ్ములనే.

వేదాంతము దీనికి చెప్పు జవాబిది:— "ఔషధ మివ్వబడునది రోగులకు గాని బాగున్నవారికి కాదు."

ఈ ప్రపంచమందు, దాని అపాయములలోను ఎక్కువగా చిక్కుకొనియున్నవారికే అది ఎక్కువ అవసరము.

వివాహము చేసికొని సంసారజీవితమును తిన్నగా నడుపుకొను వానియంతటి సులభముగా, అవివాహితునకు జ్ఞానము నందరాదు. భార్యాభర్తల సంబంధమునుగూర్చిన సరియైన జ్ఞానము లేకపోవుటే దుఃఖముల కంతకుమూలము. హృదయమున కంత సన్నిహితమైన ముఖ్యమైన విషయము నేల వదలవలెను? వివాహమునకు ముందేమి, ఎటుల తయారుకావలెనో, ముందుపన్యాసములలో చెప్పబడును; ఇప్పుడుకాదు.

రాముని వివాహానంతరము ఆతడు ఆతని భార్య రెండేండ్లు ఏకాంత జీవితము గడిపిరి; అది సత్యము; పిట్టకథ కాదు.

వివాహము ఆటంకకరము కాదు; అందులోని బలహీనతయే ఆటంకకరము. భయము, విషయములపై ఆసక్తి "నేను దేహమును నా సహవాసికూడ దేహము" అను అభిప్రాయము నాది యను తీవ్ర మమత్వము – ఇవి అపాయకరములు. వైవాహిక బంధనములను చూచుకొను పద్ధతి ఇదియైనచో, మనుష్యుని కెప్పుడు జ్ఞానము కలుగదు.

కుట్టుకొనుచు, కుట్లూడదీయుచు నుండు పెనలోప్ పని పూర్తి ఎటులగును? తాను లాభము పొందిన దంతయు పాడు చేసుకొనుచుండువాడు ముందుకెట్లు పోగల్గును? నీవు బలముతోను, ఉన్నతప్రేమతోను, నింపియుండవలెను తెలియక ప్రేమ యనబడు అవినీతినుండి, పతనమునుండి, దేహచైతన్యము నుండి పైకి లేవవలెను. ఇది కుట్టుపని నీ భార్యలోనో, భర్తలోనో దేహమును మాత్రమే గాంచిన అంతయు పాడైనట్లే.

నీవు ముందుకెట్లు పోగలవు? అందుకని జనులు పెండ్లి చేసుకో రాదా? పెండ్లి చేసుకోవచ్చును కాని, దానిని మరొకవిధముగా ఉపయోగించుకోవలెను. వేదాంతబోధను గ్రహించుము. పెండ్లిని నీ ఉన్నతికొరకు సాధనముగా చేసికొనుము. అప్పుడది నీకు చాల సహాయకారియగును. నీదారి కడ్డముగునదే నీకు సోపానభూతమగును. పెండ్లి కామమునకు బానిసవగానే, నీవు తృప్తిపడినప్పుడెల్ల నీదాస్య మధికమై నీవింకను అధోలోకమునకు బోయెదవు.

ప్రవక్తలు స్త్రీని నరకద్వారమనినారు. రాముని అభిప్రాయ మది కాదు. ఒక మనుష్యుడు జేబులో సారాబుడ్డి బయటకు కన్పడునట్లు పెట్టుకొని దారినబోవుచు మతగురువును కలసికొని జైలునకు దారేదని అతని నడుగును; పోయినవారము రాముడు చూచినట్లు జైలును చూడగోరును. గురువు చేతికర్రతో బుడ్డి నంటుకొని, "నాయనా ఇది దానికి దగ్గరిదారి; ఇది నిన్ను తప్పక తీసుకుపోవును," అనును. స్త్రీనికూడ ఇట్లే వర్ణింతురు. ప్రపంచమొక జైలు; నేటి వివాహములు నిన్ను తప్పక అచటికే తీసుకుపోవును. స్త్రీపురుషులు పరస్పర పతనమే చేసుకొనినచో, బైబిల్ వ్రాసిన దేవుడే, స్త్రీని పెతుకుకొమ్మని నరుని హృదయములో మరొక బైబిల్ వ్రాసినాడేమి? అది విరుద్ధము. ఈ వైవాహిక బంధములో ఒక రహస్యార్థమున్నది. దానిని నరకద్వారముగా చేయునది అజ్ఞానమే. నిందింపబడ వలసిన దజ్ఞానమే; వైవాహికబంధము కాదు. దానిని తొలగించు టెట్లు, అనే ప్రశ్న. ఒక సున్నానుగనుక డెసిమల్ పాయింట్‌కు

కుడివైపున పెట్టిన దానివిలువ తగ్గును; ఎడమవైపున పెట్టిన అది ఎక్కువగును. దాని స్థానమునుబట్టితప్ప సున్నాకసలు విలువ లేదు. అటులే ఈ విషయములో నీస్థితియే వైవాహిక బంధపు విలువను నిర్ణయించును; నీ దృక్కోణమునుబట్టియే అది యుండును.

మనుష్యుడు తనభార్యలో సంతోషము నేల పొందు చున్నాడు? ఇది విచారించినగాని, కష్టము తొలగదు ఈ సంతోషమే పురుషులను దాసులనుగాచేయునది. ట్రోజన్ యుద్ధము దీనినే వివరించుచున్నది. ఒక స్త్రీని నాయికగాను, మరొకదాసిని నాయికగా కాకుండాను చేయునదిదే ఈ సంతోషము వచ్చుచున్నది స్త్రీనుండియే అనుకొనట పొరపాటు. స్త్రీలోగాని, ఆమె శరీరములోగాని సంతోషమేమీ లేదు

సంతోషమంతయు ప్రేమ కాధారమైన వస్తువులోనే యున్నచో భార్యాభర్తలెప్పుడు ఒండొరులకు సంతోష కారణము లయ్యెదరు. ఇది నిజముకాదని మనమెరుగుదుము కదా! నీ సంతోషమును నీవు పొందినతిరువాత నీవేస్థితిలో నున్నావు? ఇక నేమిసంతోషము పొందకుండ యుండెదవు కదా! నీవు నపుంసకుడవుగా నున్నప్పుడు ఆమె నీకు సంతోషవస్తువ యగుచున్నదా? నీ సహవాసిని రోగిష్టిగా నున్నప్పుడో, ఆమె కురూపైనప్పుడో, నీకు రోగమొచ్చి నప్పుడో ఆమెలో నేమీ సంతోషముండదు కదా! ఇచట రెండు వేరువేరు విషయము లున్నవి. ఇవి లేనప్పుడు శరీరము యొక్కయోగాక మనోఆత్మలయొక్క పూర్ణ స్వాతంత్ర

మొచ్చును. అవర్ణనీయమైన స్థితి యొకటి వచ్చును. శరీరము శరీరముగాకుండను, ప్రపంచము ప్రపంచముగాకుండను పోవును; కలయిక, స్వర్గము, స్వాతంత్ర్యము, అభయము, ఏకత్వము ఉండును. ప్రపంచము నశించును. శరీరముకూడ లేకుండ బోవును. భ్రాంతి ఇక నుండదు. నేనూ శరీరము కాదు. ఆమె కాదు. శరీరమనో ప్రపంచములను దాటి స్వర్గము లభ్య మగును చరమస్థితి లభ్య మగును. అప్పుడు నీవే శక్తి, ఆనందము, ఆత్మ, అని వేదాంతము చెప్పుచున్నది. విచిత్ర కథనము ధనఋణ ధ్రువములు కలసినప్పుడు ఎలక్ట్రిక్ లైట్‌లో వలె వెలుతురొచ్చును. మీ శరీరములలోనే ఎలక్ట్రిక్ వర్తులము సంపూర్ణమై మామూలుస్థితి వచ్చును. ఆనందము, అభయము, నిర్మాణశక్తి, అది ఆత్మయొక్క మామూలుస్థితి. అది వచ్చినప్పుడు "వీడు దేవకుమారుడు" అని మనము చెప్ప వచ్చును. భార్యాభర్తలు అధిష్ఠానసత్తలో కలిసినప్పుడు అంతయు ఆగులోనే కరిగిపోవును. ప్రపంచమంతయు అదృశ్య మగును. కులమత జాతిభేదము లన్నియు ఆత్మవలన భక్షింపబడును. ఆత్మ నిర్మాణశక్తి (Creative power) గాన వీని నన్నిటిని గ్రహించును.

అజ్ఞాని తెలియక బాహ్యరూపమునే ప్రేమించి అసద్వస్తువులనే కాంక్షించి ఆత్మ నగౌరవము చేసి బాహ్య వస్తువులనే చింతించు చుండును.

అడవిలో నొక మనుష్యుడు నేలపై పుస్తక మొకటి పడియుండుట చూచుచు ఇంతలో మెరుపు వచ్చును. అతడు

అజ్ఞానమువలన పుస్తకమే మెరుపుకు కారణ మని తలచును. వేరే తీక్షమైన చెప్పిన వినడు. ఆ రెంటిని ఒకేసారి చూచినాడు. కాన అందులో నొకటి మరొదానికారణ మని తలచును. కాన మనుష్యుడు సంతోషము పొందునది స్త్రీపురుషుల కలయికలో కాదు. దేవుని సత్యములోనే.

ఈ సత్యము నుపయోగించున దెట్లు? ప్రకృతి నుండియు, విషయలాలసత్వము నుండియు, నీ మనస్సును తొలగించుకొనినప్పుడు కేవలము శక్తి ఆత్మ అయిన ఆనంద మునుగూర్చి మాత్రమే ఆలోచించినప్పుడు నిమ్న ప్రకృతి లోనికి దిగ నవసరము లేదు. దిక్కాలకారణముల కతీతమైన అనంతశక్తియే సూర్యచంద్రులు. అది యొక సముద్రము వంటిది. ప్రపంచమందలి వస్తువు లన్నియు అందులో తరంగ ములవంటివి: మీ దేహములుకూడ ఈ తరంగములే. భేద మున్నదెల్ల రూపమందు మాత్రమే. అన్నియు ఒకే అధిష్టాన సద్వస్తువయొక్క వికృతులు; నదివంక చూచు కుర్రవాడు "నాయనా! చూడు. తరంగ మొక టొచ్చుచున్నది" అనును ఇచట నీ ళ్ళిదివరకే ఉన్నవిగాని ఈ క్రొత్త ప్రక్రియకే వాడు ప్రాముఖ్యత నిచ్చును. అటులనే ఇక్కడను దేవు డొక్కడే అవిభాజ్యుడు సూర్యచంద్రులు, దేహములు, మానసముద్రము లోని తరంగములు. ఈ బహుత్వమునే మనుష్యుడు చూచునది ఈతరంగములే. ఒకదానికొకటి ఢీకొట్టుకొనునది. వస్తువులరాపిడి వలననే సంతోషమొచ్చుననుట పొరపాటు. తరంగములు రాసు కొనునప్పుడు ఆత్మయొక్క అస్తిత్వమే అవిర్భవించునది. పిల్ల

వానికి బంగారమన నేమో తెలుపదలచి వేదాంతివాని కొక ఉంగరమును చూపి చెప్పును "ఇది బంగార మని" "బంగార మనగా గుండ్రముగా నుండటమేనా" అని కుర్రవా డడుగును. కాదు. "ఆ రంగా? బంగారము" కాదు "నునుపా?" "కాదు" "బరువా?" కాదు. దానినిగూర్చి చెప్పాట ఎటుల? మరొక బంగారపు పదార్థముకూడ చూపించి ఆతనికి బంగారమన నేమో తెలుపబడును. గుణముల నన్నిటిని గుర్తించి వానిలో ప్రాణము బోయును.

గ్రుడ్డివా రెక్కువమందియా? కల్లున్నవా రెక్కువ మందియా? యని బీర్‌బల్ రాజు నడిగెను. దీనిపై వాదనజరి గెను; ఋజువు కావలెనని నిశ్చయించిరి. గ్రుడ్డివారే తక్కువ యని రాజు తలచెను. అందుచేత బీర్‌బల్ ఒక గుడ్డనుతెచ్చి తలకుచుట్టుకొని ఇది ఏమని జనుల నడిగెను. తలగుడ్డఅని వారు బదులు చెప్పిరి. ఆతను దానిని భుజముపై వేసుకొని ఇది ఏమని అడిగెను. ఉత్తరీయమని వారు చెప్పిరి. మూడవసారి ఆతడు దానిని నడుముకుకట్టుకొనిరాగా, వారు దానినిధోవతియనిరి. "గ్రుడ్డి, గ్రుడ్డి, అందరూ గ్రుడ్డే. ఇది మరేమియుకాదు. గుడ్డ నామరూపముల వలన గుడ్డదాగిపోయినది."

ఆత్మయననేమో గ్రహించుడు. బంగారమును చూచు టకు దానిని విరువనక్కరలేదు. స్త్రీపురుషులనుగూర్చి, తరం గములనుగూర్చి, ఆభరణములగూర్చి, ఘటపటములనుగూర్చి తలచునప్పుడు, వాని కధిష్టానమగు సద్వస్తువను గురించి తలపము.

వివాహము మతమునకు విరుద్ధమని చెప్పకుము. వాస్తవముగా ఆనందస్థితియేమో, అసలాత్మయేదో చూడుము. దాన్నిధ్యానించుము. ఆత్మయే నీవను అద్వైతమును మరచి నప్పుడు, మననముచేసి దాస్యశృంఖలములనుండి విముక్తుడవై, సత్పదార్థములో మునుగుము.

ఓమ్, సోహం. "అదినేనా ?" అదినేనైనచో, ప్రపంచ మొక బుద్బుదము. దానివెంట నే నేల పరుగులెత్తవలెను. దేహచైతన్యములో, కామక్రోధములలో నున్నప్పుడు శాంత ముగా నీతోనీవే వాదించుకొనుము. బహుత్వమునుండి ఇచ్ఛా శక్తి పైకిపైకిపోయి, మస్తిష్క మున్నతస్థాయికెళ్లి, కామము స్వాభావికముగానే తగ్గిపోవును. ఎందుకని? ప్రకాశమానమగు సూర్యుని వెలుగులో ఎలెక్ట్రిక్ దీపపు వెలుగెంత ? అది ప్రకా శించునది అంధకారములోనే. జ్ఞానమను సూర్యకాంతిలోనికి పోయినకొలది, ఇంద్రియవాసనలు క్రొవ్వువత్తివలె కాంతిహీన మగును. ఒకరినిదూషించుట నిందించుట అస్వాభావికము. దాని కతీతుడవై తేగాని దానినిజయించలేవు దానిసాధనముల నుపయోగించి పైకిలెమ్ము.

ప్రపంచమొక విచిత్రము. (Miracle) అందుచేత ఇతరవిచిత్రములు అవసరములేదు. ఆత్మజ్ఞానమువలననే నిర్మాల మగు పాపకారణమును చూచి భయపడుము. పవిత్రుడవై పరిశుద్ధుడవుకమ్ము. మరొకమతమును దేనినైన బోధించుట అస్వాభావికము.

*"రావచ్చు, లేకున్న రాకుండ బొమ్ము
నాలోన నీవు వసించుచున్నావు
దగ్గరేయుండుము, దూరాన నిలుము
ఎచ్చటైనను నిల్వు మెందైన నిలుము,
నాలోన నీవు వసించుచున్నావు
నాలోన నీవు చరించుచున్నావు,
కాదు నేనే నీవు నేను నీ వొకటె,
ఐక్యమై నాలో, ఆనందాబ్ధి వగుము
అంగత్వమును వీడి పూర్ణత గనుము
శాంతిస్వరూపివై వెలుగొందు మెపుడు."

ఇండియాలో అవలంబింపబడు స్వాభావికమైన, శాస్త్రీయమైన, సమంజసమైన పద్ధతి ఏమన, భార్యాభర్తకు సాయము చేయుననుగాని, అడ్డు తగులదు.

జ్ఞానము కలిగిన పిదప భార్యతో రాముడు రెండేళ్లుండెను. ఆతని భార్యకు వేదాంతము బోధింపబడెను. ఆమె పువ్వులు, దీపములు, తెచ్చి ఆత్మలో నిమగ్నయయ్యెను. ఆమె సాగిలపడి ఆరాధించును. రాముని శరీరము తనకొక ప్రతీకమైనదాని ఆతని వంక చూచును. ఓంకారము నుచ్చారణచేయును. రామునిలో ఆత్మను చూచును. తనలో దేవుని చూచును. ఈ భావములనే వ్యాపింపజేయును. ఇరువురు ఒకరిలోనొకరు దేవుని చూచుకొందురు. ఇటుల పరస్పర సాయము చేసుకొని అనుభూతి నందిరి. రాముడామె నున్నతికి తెచ్చుటకు సాయము చేసెను.

* ఈ గీతానువాదము శ్రీ కేశవతీర్థులది

ఇది కొంతకాలము సాగెను. తరువాత వారెన్నో నెలలు కలిసి యుండిరి. నిమ్నాలోచనలు, తుచ్ఛభావనలు వారికి తట్టనే లేదు. కామము జయింపబడెను. పరస్పరము చక్కగా అర్థము చేసి కొనిరి. ఇరువురు స్వతంత్రులైరి. భార్యాభర్తలను భావ మదృశ్యమాయెను. కానిసత్వము నిర్మూలమయ్యెను. ఆమె అతని నిక భర్తగా చూడదాయె. అతనూ ఆమెను భార్యగా చూడడాయె.

భావసంకుచితత్వమువలన మనుష్యాధిక్యతవలన గృహ కలహము లొచ్చును. అప్పుడీ భావసంగ్రామ మేర్పడి వివాహ మొక అడ్డంకగును. వేదాంతము నర్థము చేసుకొని స్వతంత్రులు కండు. బంధము లనునవి నామమాత్రములే. కాని వాని కసలస్తిత్వము లేదు. ప్రతివాడు స్వతంత్రుడగుటకే సృజింపబడినాడు. నీ పిల్లలను పూర్తిగా స్వతంత్రులుగా నుండ నిండు. అది మనుష్యు నెప్పుడును చెరుపదు. ప్రపంచమంతయు నొక స్వర్గము. దేవు డెప్పుడూ మోసగింపబడడు.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !

శ్రీ కృష్ణార్పణమస్తు

---

